# ప్రసన్నకథావిపంచి

నన్నయ భారతంలోని కొన్ని ఉపాఖ్యానాలకు
సరళ వ్యాఖ్యానం




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

**PRSANNA KATHA VIPANCHI;** A collection of eight Upakhyanams from NANNAYA'S ANDHRA MAHA BHARATHAM, with commentaries by Prof. Khandavalli Lakshmi Ranjanam, Prof. Divakarla Venkatavadhani, Sri Madhunapantula Satyanarayana Sasthry, Sri Indraganti Hanumath Sasthry, Dr. Dhulipala Sriramamurthy & Sri Jandhyala Papiah Sasthry(Karunasri).

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు - 500 004

ప్రచురణ : 341

ప్రథమ ముద్రణ : 1983

ప్రతులు : 1500

వెల : రూ. 13-00

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500 004

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు - 1

# తొలిపలుకు

సంస్కృతికి వచోరూపం సాహితి. సాహిత్య నిర్మాణానికి ప్రధాన సాధనం భాష.

వెయ్యేళ్ళ క్రితం 'గాసట బీసట'గా ఉన్న తెలుగు భాషకు కావ్య రచనా భియోగ్యతను కల్పించి తెలుగు సంస్కృతిని వినూత్నాదర్శాలతో సమలంక రించిన మనీషి నన్నయ్య.

నన్నయ్య భారతం తెలుగులో అవతరించిన కాలం నాటికి తెలుగునాడులో జ్ఞాన ప్రసరణానికీ, శాస్త్రాధ్యయనానికీ, సమున్నత భావప్రకటనకూ సంస్కృత భాషా సాహిత్యాలే శరణ్యాలుగా ఉండేవి.

భారతీయుల దైనందిన జీవిత వృత్తంతో విజ్ఞాన సర్వస్వంగా పెనవేసుకుని పోయిన మహా భారతాన్ని, సర్వలక్షణ లక్షిత మహా కావ్యంగా నన్నయ తెలుగులో రచించి అందించి తెలుగు ప్రజలకు ఒక వ్యక్తిత్వాన్ని ప్రసాదించినాడు.

ప్రసన్న కథాకథన కౌశలానికీ, శ్రవణసుభగమైన పదప్రయోగానికీ, అనుభవసిద్ధికీ మహనీయార్థగాంభీర్యానికీ మనికిపట్టులైన సూక్తులకూ నన్నయ భారతం కాణాచి. నాటికీ నేటికీ ఆదర్శ కావ్యం.

నన్నయ్య జయంత్యుత్సవ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ నన్నయ భారతంలోని కొన్ని ప్రసిద్ధ ఉపాఖ్యానాలను ఎన్నుకుని వాటికి సహృదయ విద్వాంసుల సరళ వ్యాఖ్యానాలు సమకూర్చి 'ప్రసన్న కథా విపంచి'గా ప్రకటిస్తున్నది.

వ్యాఖ్యానాలు రచించి సాహిత్య అకాదమీకి అందించి సహకరించిన సాహిత్యాచార్యులు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి, శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారలకు అకాడమీ పక్షాన కృతజ్ఞతాభివందనాలను సమర్పించుకుంటున్నాను. ముఖపత్రాలంకరణలో మాకు తోడ్పడిన కళాకారుడు శ్రీ సుదర్శన్ గారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు
8-4-1988

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి.

# విషయసూచిక

# నన్నయ విరచిత భారతాంతర్గత
# ఉదంకోపాఖ్యానము

'సారమతి' వ్యాఖ్యా సహితము

—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
(వ్యాఖ్యాత)

# కథాపరిచయం

ఈ ఉపాఖ్యానం మహాభారతం, ప్రారంభంలోనే జనమేజయవృత్తాంతంలో వస్తుంది.

అయోదధౌమ్యుడనే మహర్షికి ఉపమన్యువు, ఆరుణి, వేదుడు అని ముగ్గురు శిష్యులు. అందులో వేదుని ప్రియశిష్యుడు ఉత్తంకుడు. సంస్కృత భారతంలో ఉత్తంకుడనీ, తెలుగుభారతంలో ఉతంకుడు, ఉదంకుడు అనీ, ఇతని పేరు రెండు విధాలుగా కనిపిస్తుంది. ఇవి పాఠాంతరాలు కావచ్చు.

ఉదంకుడే కాక వేదునికి జనమేజయ పౌష్యులుకూడా శిష్యులే. ఈ ఉపాఖ్యానంలో ముగ్గురికీ సంబంధముంది. ఉదంకుని అపార గురుభక్తి, కృతజ్ఞతాసూచకంగా అతడు గురుదక్షిణ సమర్పించడంకోసం పడినపాట్లు, చేసిన సాహసం, పొందిన కృతార్థత ఇందు చూడదగ్గవి.

ఉదంకుడు గురుదక్షిణ చెల్లించిన తరువాత తన్ను వంచించిన తక్షకుని మీద పగబట్టి జనమేజయుని దగ్గరకు వెళ్ళి 'తక్షకుడు నన్ను వంచించాడు; నీ తండ్రిని చంపాడు. దానికి ప్రతీకారంగా సర్పయాగం చేసి ఆ పాపజాతిని నశింపజెయ్యి అని ప్రోత్సహించాడు. జనమేజయుడు సమ్మతించి సర్పయాగం చేశాడు. ఆ యాగంలో సర్పజాతి చాలావరకు నశించింది.

తుదకు ఆస్తీకుడనే ముని వచ్చి మంచి మాట లాడి ఆ యాగం మాన్పించాడు.

నన్నయభట్టారకులు ఈ ఉపాఖ్యానంలో కొన్ని మార్పులు చేశారు. ఉదంకుని గురువు పేరు 'పైలుడు' అన్నారు. ఆయన చూచిన ప్రతిలో అట్లా ఉంది ఉండవచ్చు.

అయోదధౌమ్యుని శిష్యులకథ అప్రస్తుతమని విడిచిపుచ్చి ఉదంకుని కథ నుంచే ఉపాఖ్యానం నిర్వహించారు.

చిత్ర మేమిటంటే- ఈ ఉపాఖ్యానం ఎక్కువ గద్యాలలోను తక్కువశ్లోకాల లోనూ ఉంది. అట్టి నీరస భాగాన్ని తీసుకొని భట్టారకులు సరసకథాకావ్యంగా దిద్దితీర్చిన తీరు చూడదగ్గది.

# ఉదంకోపాఖ్యానం

ప. పంకజభవ సన్నిభుఁ డఘ
పంక క్షాళన మహా తపస్సలిలు డనా
తంకమతి పైలశిష్యుఁ డు
తంకుం డను మునివరుండు తద్దయు భక్తిన్.

కఠిన పదములకు అర్థము: పంకజ భవ సన్నిభుడు=బ్రహ్మవంటివాడు, అఘ...సలిలుడు=(తన) గొప్ప తపస్సనే నీటితో పాపపంకమును కడిగినవాడు, అనాతంక మతి=శంకలేని మనసు గలవాడు.

ప. గురుకులమునందు గురులకుఁ
బరిచర్య లొనర్చి తా నపరిమిత నిష్ఠా
పరుఁడై జ్ఞానము వడసెను
గురుదయ నణిమాది కాష్ఠ గుణములతోడన్.

అర్థము: గురుకులమునందు=గురువునింట, పరిచర్య=సేవ, అణిమాదిక+అష్టగుణములు=అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, అను అష్టైశ్వర్యములు (శక్తులు).

భావం: ఉదంకుడనే ముని, విద్యావంతుడు, పాపరహితుడు, ఎట్టి శంకాలేని వాడును అయి భక్తితో గురువునింట సేవచేస్తూ మిక్కిలి నిష్ఠకలిగి గురు కృపవల్ల అణిమాది సిద్ధులతో కూడిన జ్ఞానం సంపాదించాడు.

విశేష అంశము:- ఇందులో బ్రహ్మతో సమానుడన్నప్పుడు ఉపమ - పాపమనే బురదను తపస్సనే నీటితో...అన్నప్పుడు రూపకాలంకారం.

భట్టారకుని కందపద్యం వింతపోకడలు పోతుంది. ఒకప్పుడు చదరంగంలో గుఱ్ఱంవలె దూకుతుంది. ఇందులో బిందుపూర్వక కకార ప్రాసవల్లనూ,

ఒక పాదం నుంచి వేరొక పాదంలోకి ప్రాకిన సమాసంవల్లనూ, తొలి పద్యం వస్తునిర్దేశంలోని ఎత్తుగడతో దూకి పరుగెత్తుతుంది. రెండవ పద్యం సేవాధర్మం సూచిస్తూ స్తిమితంగా నడుస్తుంది.

నన్నయగారి రచనలో ప్రాయశః కందపద్యా లెక్కువ. అవి భావాన్ని బట్టి విరుగుతూ పరుగు పెడుతూ వింతగమనం చూపుతాయి. ఈ పద్య విద్య తిక్కనార్యునకు కూడా త్రోవచూపింది. వివేకవంతుడు, పాప రహితుడు అనే విశేషణాలవల్ల అతడు తెలివిగా గురుదక్షిణను సాధించిన విధం పరిశుద్ధుడై పౌష్యనిరాణిని, నాగలోకాన్ని దర్శించిన విధం ధ్వనిస్తాయి.

వ. అయ్యుదంకుండు గురుహిత కార్యధురంధరుండై గురుపత్ని నియోగంబునం బౌష్యుండను రాజు దేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరం బూని వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుంగని వాని పన్నిన వృషభ గోమయ భక్షణంబుఁజేసి య మ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతి త్వరిత గతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీతసత్కారుండై యిట్లనియె.

అర్థము: తేరన్ + పూని = తేఁదలచి, మహత్ + ఉక్షము = గొప్ప ఎద్దు, వాని పన్నిన = అతఁడేర్పరచిన ( నిర్దేశించిన ), గోమయ భక్షణము = పేడ మెసవుట.

భావము: "ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేచ్ఛీః" ( గురువుకోరిన ధన మిచ్చి వంశాభివృద్ధికి తోడ్పడుము. ) అను ఉపనిషద్వచనమునుబట్టి ఉదంకుడు గురువును గురుదక్షిణ స్వీకరించ మని కోరినాడు. గురువు నిరాకరించి మీ గురుపత్నిని అడుగమన్నాడు. ఆమె పౌష్యుని భార్య కుండలాలు తెమ్మంది. ఉదంకుడు బయలుదేరాడు. ఒక నిర్జన వనంలో దివ్యపురుషు డొకడు ఎద్దునెక్కి వచ్చి ఈ ఎద్దుపేడ భుజింపు మన్నాడు. ఉదంకుడు అతని మాట ప్రకారమే ఆచరించి అతని

దయకు పాత్రుడై పౌష్యరాజు వద్దకు వెళ్ళి అతణ్ణి దీవించి అతని గౌరవ సత్కారాలు పొంది పౌష్యరాజుతో ఇట్లా అన్నాడు.

ప. ఏను గుర్వర్థమర్థినై మానవేశ !
కడగి వచ్చితి నిపుడు నీకడకు వేడ్క-
దండితారాతి ! నీ దేవికుండలమ్ము
లిమ్ము నా పూన్కి ఇది సఫలమ్ము గాగ.

అర్థము: గురు + అర్థము = గురుదక్షిణ, దండిత + అరాతి = శత్రువులను జయించినవాడా!, పూన్కి = ప్రయత్నము.

భావము: రాజా! గురుదక్షిణకోరి నీ వద్దకు వచ్చాను. నీ భార్య కుండలాలు ఇచ్చి నా ప్రయత్నం సఫలం చెయ్యి.

వి. ఇక్కడ 'గుర్వర్థమర్థి' అనేది కాళిదాసు వరతంతుమునిశిష్యుడు రఘు రాజును గురుదక్షిణ అడిగిన సందర్భంలో కూర్చినపదబంధం. భట్టా రకులు అదే సందర్భంలో దాన్ని ఉపయోగించడం కాళిదాసుమీది గౌరవం అనిపిస్తుంది!

వ. అనినం బౌష్యుం డిట్టి మహాత్మున కీఁగాంచితిఁ గృతార్థుండ నైతి నని మనంబున సంతసిల్లి యుదంకున కిట్లనియె. నయ్యా, మదీయ ధర్మపత్ని యకుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది. మద్వచనంబున వాని నిప్పించుకొమ్మనిన నుదంకుం డంతఃపురంబునకుం జని పౌష్య మహాదేవిం గానక క్రమ్మఱి పౌష్యుపాలికి వచ్చి నీ దేవి నెందును గానక యిటవచ్చితి నీవ యకుండలంబులు దెప్పించి యిమ్మనిన నుదంకునకుఁ బౌష్యుం డిట్లనియె.

అర్థము: ఇప్పించుకొమ్ము = అడిగి పుచ్చుకొనుము; క్రమ్మఱి = తిరిగివచ్చి.

వి. పుచ్చుకో అనడానికి ఇప్పించుకొమ్ము అన్నది ప్రాచీనాంధ్రప్రయోగం.

క. భూవినుత, నిన్నుఁ ద్రిభువన
పావను నశుచి వని యెట్లు వలుకగ నగు న
ద్దేవి పవిత్ర పతివ్రత
గావున నశుచులకుఁ గానగా దనవద్యా!

అర్థము: అ + అవద్యా! = దోషరహితుడా!; త్రిభువనపావనున్ = ముల్లోకము లందు పవిత్రుడైన వానిని, అశుచివి + అని = అపవిత్రుడ వని (మైల పడినవాడ వని).

భావము: నా భార్య పరిశుద్ధురాలు. అపవిత్రులకు కనబడదు. 'కాని' త్రిలోక పావనుడవైన నిన్ను అపవిత్రుడవని ఎట్లా అనగలను? (ఇందులో ఏదో వ్యత్యాసముంది).

వ. అనిన విని యుదంకుం డప్పుడు తలంచి యా వృషభగోమయ భక్షణం బున నైన యశుచిభావంబునఁ గాకేమి యప్పరమ పతివ్రత మదీయ దృష్టిగోచర గాకున్న దయ్యె నని పూర్వాభిముఖుండై శుద్ధోదకంబులం బ్రక్షాళిత పాణి పాద వదనుండయి యాచమించి పౌష్యానుమతంబున నద్దేవియొద్దకుం జనిన నదియును నమ్మహామునికి నమస్కరించి కుండ లంబు లిచ్చి యిట్లనియె.

అర్థము: వృషభ గోమయ భక్షణంబునన్ = ఎద్దుపేడ మేసవుటచే 'అయిన' అశుచిభావంబునన్ + కాకేమి = మైలపడుటచేతనేకాబోలు; పూర్వాభి ముఖుండై = తూర్పుగా తిరిగినవాడై, ప్రక్షాళిత పాణి పాద వదనుఁడు= చేతులు, కాళ్ళు, ముఖము కడుగుకొన్నవాడై; ఆచమించి = ఆచమనము చేసి, పౌష్యానుమతంబునన్ = పౌష్యుని అంగీకారముతో.

భావము: దివ్యపురుషుడు చెప్పిన గోమయభక్షణం చేసిన తరువాత ఉదంకుడు లేచి తొందరగా పోతూ జలస్పర్శనం చేశాడు. అది అశాస్త్రీయం, కనుక అతనికి ఆ అశుచిభావం వదలలేదు. ఆ తప్పుతెలుసుకొని అతడు స్థిమి తంగా కూర్చొని మూడుసార్లు పుడిసిలితో నీరు పుచ్చుకొని మార్జనం చేసుకొని వెళ్ళితే పౌష్యునిదేవి కనబడి నమస్కరించి కుండలాలు ఇచ్చి ఇట్లా అంది.

క. తక్షకుఁ డీ కుండలము ల
పేక్షించుచు నుండు వాఁ డభేద్యుఁడు మాయా
దక్షుండు వానివలన సు
రక్షితముగఁజేసి చనుము రవినిభ తేజా!

అర్థము: రవినిభతేజా = సూర్యునితో సమానమైన కాంతి కలవాడా!, అపేక్షించుచు నుండు = కోరుతూ ఉంటాడు, అభేద్యుఁడు = లొంగనివాడు, మాయా దక్షుండు = మాయలలో ఆరితేరినవాడు, సురక్షితముగఁజేసి = కాపాడు కొంటూ.

భావము: మాయలాడు తక్షకునికి ఈ కుండలాలమీద తగని కోరిక. వాడెవరికి లొంగడు. వాడికి అంతకుండా కాపాడుకొని తీసుకువెళ్ళు.

వ. అనిన నుదంకుం డట్ల చేయుదు నని యద్దేవి వీడ్కొని రాఁ బౌష్యుం డయ్యా నీ వతిథివి మా యింటఁ గృతభోజనుండవై పొమ్మని క్షణియించిన నొడంబడి యుదంకుండు గుడుచుచో నన్నంబుకేశదుష్టం బయిన రోసి కరం బలిగి యి ట్లపరీక్షితం బయిన యశుద్ధాన్నంబు వెట్టినాఁడ వంధుండ వగు మని శాపం బిచ్చిన నల్పదోషంబున నాకు శాపం బిచ్చిన వాడవు. నీ వనపత్యుండ వగు మని ప్రతిశాపం బిచ్చిన నుదంకుండు నే ననపత్యుండఁ గానోప దీనిం గ్రమ్మఱింపు మనినఁ బౌష్యుం డిట్లనియె.

అర్థము: వీడ్కొని = సెలవు తీసుకొని (పోయివత్తునని చెప్పి), అతిథి = తలవని తలంపుగా వచ్చినవాడు, కృతభోజనుండవై = భోజనము చేసినవాడవై, క్షణియించినన్ = నియంత్రణముచేయగా (భోజనమునకు ఆహ్వానించగా), కేశదుష్టము = తలవెంట్రుక పడి అశుచి అయినది, రోసి = అసహ్యించుకొని, అ + అపత్యుడు = సంతానహీనుడు, క్రమ్మఱింపుము = మరలింపుము.

భావము: కుండలాలు సంగ్రహించిన ఉందకుణ్ణి రాజు భోజనానికి ఆహ్వానించాడు. భోజనంలో తలవెంట్రుక కనబడితే ఉదంకుడు పరిశీలించని అన్నం

పెట్టావని కోపగించి గ్రుడ్డివాడవు కమ్మని శపించాడు. రాజు నీవు సంతానహీనుడవు అవుతా వని ప్రతిశాప మిచ్చాడు. ఉదంకుడు నేను సంతానహీనుణ్ణి కాలేను, శాపం ఉపసంహరించు అన్నాడు. అప్పుడు రాజు నా కది సాధ్యం కా దని ఇట్లా అన్నాడు.

చ. నిండుమనంబు నవ్య నవనీత సమానము; పల్కు దారుణా
ఖండల శస్త్ర తుల్యము జగన్నుత, విప్రులయందు నిక్క, మీ
రెండును రాజులందు విపరీతము: గావున విప్రుఁడోపు; నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపముఁ గ్రమ్మఱింపఁగన్.

అర్థము: నిండుమనంబు = మనస్సంతా, నవ్యనవనీత = అప్పుడు తీసిన వెన్న, దారుణ + అఖండల + శస్త్ర + తుల్యము = భయంకరమైన వజ్రాయుధము వంటిది, విపరీతము = పైె చెప్పినదానికి వ్యతిరేకము.

భావము: బ్రాహ్మణుని మనస్సు అప్పుడు తీసిన వెన్నవలె మిక్కిలి మెత్తనిది. మాటమాత్రం భీకర వజ్రాయుధం వంటిది. రాజు మనస్సు దీనికి సరిగ్గా వ్యతిరేకం. అందువల్ల బ్రాహ్మణుడు ఇట్టే శాపం ఉపసంహరించగలడు. రాజు ఎంత శాంతస్వభావుడైనా, లోపలి కరకుతనం తగ్గక శాపం మరల్చలేడు.

వి. భట్టారకుని కవితలో ఈ పద్యం అతి ప్రసిద్ధం. ఒకపాదం నుంచి వేరొక పాదానికి కొరడాకొసవలె మెలితిరిగి పరుగెత్తే శబ్దాల ధారాశుద్ధితోను, కూర్పుచిక్కదనములోను రుచిరమై ఇంపుగొల్పడమేగాక మూలభారత భావానికి ఒక వైశాల్యము ఔచిత్యవంతమైన ముగింపు వచ్చాయి. మూలంలోని నవనీతానికి నవ్యత చేరింది. మాటపదునుకు మూలంలోని మంగలికత్తి పోలిక కాక, గంభీరమైన వజ్రాయుధోపమానం నిండుదనం తెచ్చింది. బ్రాహ్మణ రాజ మనస్తత్వాల తారతమ్యం ఒప్పుగా వివరించ బడింది. తెలుగువారు ఎన్నడూ మరువని పద్యం ఇది.

వ. కావున నా కశక్యంబు; నీ యిచ్చిన శాపంబుఁ గ్రమ్మఱింపు మనిన నుదంకుం డట్లేని నీకు నల్పకాలంబున శాపమోక్షం బగు నని సౌమ్యన కు

నను గ్రహించి మగిడిపోవు నెడ గురుపత్నికిఁ గుండలంబు లీఁగంటి నని మనంబున సంతోషించి చనువాఁ డెదుర నొక్క జలాశయంబుఁ గని శుచిప్రదేశంబున దన చేతికుండలంబుల వెట్టి యాచమించుచున్నంత దన తోడన వచ్చి తక్షకుండు నగ్నవేషధరుండై యక్కుండలంబులం గొని పాఱిన నుదంకుండును వాని పిఱుందన పాఱి పట్టుకొనుడు-

అర్థము: మగడిపోవునెడన్ = తిరిగి పోవుచున్నప్పుడు; ఈన్ + కంటిని = ఇవ్వగలిగినాను, నగ్నవేషధరుండై = దిగంబరవేషధారి ఐ, పాఱినన్ = పరుగెత్తగా, పిఱుందన = వెనువెంటనే.

ప. విడిచి దిగంబరవేషము
విడువక మణికుండలములు విషధరపతి యే
ర్పడ నిజరూపముతో న
ప్పుడ యహిలోకమున కరిగె భూ వివరమునన్.

అర్థము: విషధరపతి = సర్పరాజు (తక్షకుడు), అహిలోకమునకున్ = నాగ లోకమునకు, భూవివరమునన్ = భూమియొక్క రంధ్రముద్వారా (పుట్ట లోపలనుండి).

భావము: ఆ తక్షకుడు వెన్నంటి వచ్చిన దిగంబరవేషం విడిచి, రత్నకుండలాలు మాత్రం గట్టిగా పట్టుకొని, నిజసర్పరూపం ధరించి పుట్టలోని కలుగు వెంబడినే నాగ లోకానికి పోయినాడు.

వ. ఉదంకుండును వానితోడన తగిలి యవ్వివరంబున నురగలోకంబున కరిగి నాగపతుల నెల్ల నిట్లని స్తుతియించె.

అర్థము: ఉరగలోకంబునకున్ = సర్పలోకంబునకు.

ప. బహువనపాద పాబ్ధి కులపర్వత పూర్ణసర స్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

అర్థము: బహువన........మహీభరము=అనేక అరణ్య వృక్షములతోడను, సముద్రములతోడను, సప్తకులపర్వతములతోడను, నిండైన సరస్సుల తోడను, నదులతోడను కూడిన మహా భూభారమును, అజస్ర సహస్ర ఫణాళిన్=స్థిరమైన వేయిపడగలతో, తాల్చి=ధరించి, దుస్సహతర మూర్తికిన్=భరించశక్యముకాని రూపముగల, జలధిశాయికిన్=విష్ణు మూర్తికి, పాయక=ఎడబాయక, శయ్యయైన=పాన్పైన, అహిపతి= సర్పరాజు, దుష్కృతాంతకుడు=పాపమును హరించువాడు అగు అనంతుడు=శేషుడు, మాకున్=నాకును, మా గురుకులమునకును, ప్రసన్నుడు+అయ్యెడున్=అనుగ్రహముగలవాడవుగాక!

భావము: యావత్ప్రపంచ భారమును తన వేయి పడగలతో భరించుచు, శ్రీ మహా విష్ణువునకు ఎల్లప్పుడును పాన్పై పాపరహితుడైన సర్పరాజు శేషుడు మమ్ములను అనుగ్రహించుగాక !

వి. ఇది నన్నయ కవితా సౌందర్యానికి లక్ష్యమైన రచన. ఈ క్రింది నాలుగు పద్యాలకు అచ్చపు మూలంలేదు. భట్టారకుల స్వతంత్ర భావనాశక్తికి, అక్షరరమ్యతకు, మలుపు తీసుకొనే పద్యశిల్పానికి ఈ నాగస్తుతి పద్యాలు తార్కాణాలు. వేయి పడగల సర్పరాజు ప్రపంచభారాన్ని మోస్తూన్న చిత్రం ఈ సమాసాల కూర్పులో భాసిస్తుంది. సర స్సరస్వతీ, మహా మహీ, అజస్ర సహస్ర, శాయికి పాయక, అంతకుడు, అనంతకుడు, ఇత్యాదులలోని నాదసౌందర్యం, పాద, పర్వత, పూర్ణ అనే పకార అక్షరా వృత్తి, పద్యార్థం తెలియకముందే శ్రుతిసుఖం కలిగిస్తాయి. మాకు అనే బహువచనం తన్నును, తనకు పూజ్యమైన గురుకులాన్ని వ్యక్తపరుస్తుంది.

ప. అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండగా
సురగుల నెల్లఁ గాంచిన మహోరగనాయకుఁ డా నమ త్సురా
సుర మకుటాగ్ర రత్నరుచి శోభిత పాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

అర్థము : అరిది తపోవిభూతిన్=అపురూపమైన తపస్సంపత్తితో, అమరారుల బాధలు=రాక్షసబాధలు, మహత్+ఉరగ+నాయకుడు=గొప్ప సర్ప

రాజు, ఆనమత్......పాదునకున్ = నమస్కరించుచున్న దేవాసురుల కిరీటములందలి రత్నకాంతులచే ప్రకాశించు పాదములు గలవాడు, అద్రి నందనా, ఈశ్వరునకున్ = శివునకు.

భావము : వాసుకి అను నాగరాజు అపూర్వమైన తపస్సు చేసి పాములకన్నింటికి రాక్షస భయంలేకుండా చేసినవాడు. దేవదానవుల పాదాభివందనాలను పొందినవాడు. శివునకు అలంకారమైనవాడు. అట్టివాడు మమ్ములను అనుగ్రహించుగాక!

ప. దేవ మనుష్య లోకములఁ ద్రిమ్మరుచున్ విపుల ప్రతాప సం
భావిత శక్తిశౌర్యులు నపార విషోత్కట కోప విస్ఫురత్
పావక తాపి తాఖిల విపక్షులు నైన మహానుభావులై
రావత కోటి ఘోర ఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్.

అర్థము: త్రిమ్మరుచున్=సంచరించుచు; విపుల......శౌర్యులు=విస్తారమైన పరాక్రమముచే గౌరవింపబడిన ప్రభావము,పౌరుషము కలవారు;అపార... విపక్షులు = మిక్కిలి విషముతో కూడిన అధిక కోపమనే కణకణ మండు అగ్నిచే తపింపచేయబడిన సర్వశత్రువులు కలవారు. మహత్ + అనుభావులు=గొప్ప మహిమఁ గలవారు. (అయిన ఐరావత...రాజులు= ఐరావత వర్గమునకు చెందిన భీకర సర్పరాజులు.

భావము: ఐరావతమను సర్పశ్రేణికి చెందిన భయంకర సర్పరాజులు స్వర్గమర్త్య లోకాల్లో సంచరిస్తూ గొప్ప పరాక్రమము ప్రభావ పౌరుషాలు కలిగి ఉన్నారు. విషము చిమ్మునట్టి తమ కోపాగ్నితో శత్రువులను తపింపచేయగలవారు మహిమ సంపన్నులు. అట్టివారు మా ఎడల ప్రసన్నులగుదురుగాక!

ప. గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్ప పరాక్రమదక్షుఁ దీక్షణ
శ్రోత్ర విభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

అర్థము: గోత్ర...నికుంజములన్ = సప్తకుల పర్వతాల పొదరిండ్లలో, విపినంబులన్ = అడవులలో ప్రకామగతి ఖేలనన్ = స్వేచ్ఛాగమనముతో సహాశ్వసేనుఁడై = అశ్వసేనుఁడను కుమారునితో గూడినవాడై, పరిభ్రమించు = తిరుగునట్టి, ఈక్షణ శ్రోత్రవిభుండు = సర్పనాయకుడు (అయిన) తక్షకుఁడు = (కుండలములను దొంగిలించిన) నాగరాజు.

భావము: సప్తకుల పర్వతాల పొదరిఁడ్లలో, అరణ్యాలలో కురుక్షేత్రంలో తన కొడుకు అశ్వసేనునితో కూడా స్వేచ్ఛగా భూమిపై తిరుగుతూ బలగర్వ పరాక్రమాలతో ప్రసిద్ధిచెందిన తక్షకుడు మమ్ములను అనుగ్రహించుగాక!

వి. మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము వింధ్యము, పారియాత్రము అనే ఏడును కులపర్వతాలు. దక్ష, ఈక్షణ శ్రోత్ర, తక్షక, అనే అక్షర రమ్యత ఇందులో దర్శనమిస్తుంది.

వ. అని యిట్లు నాగకులంబు నెల్ల స్తుతియించి యందు సితాసిత తంతు సంతానపటంబు ననువయించుచున్న వారి నిద్దఱ స్త్రీలను ద్వాదశార చక్రంబుం బరివర్తించుచున్నవారి నార్వురఁ గుమారుల నతిప్రమాణ తురంగంబు నెక్కిన వాని మహాతేజస్వి నొక్క దివ్య పురుషుంగని విపులార్థవంతంబులైన మంత్రంబుల నతిభక్తియుక్తుండయి స్తుతియించిన. ప్రసన్నుండై యద్దివ్య పురుషుండ య్యుదంకున కిట్లనియె.

అర్థము: సితాసిత...పటంబును = తెల్లని, నల్లని దారములుగల వస్త్రమును, అనువయించుచున్న = నేయుచున్న, ద్వాదశార చక్రంబున్ = పండ్రెండు రేకులుగల చక్రమును, పరివర్తించుచున్న = త్రిప్పుచున్న.

భావము: పై విధముగా నాగజాతి ముఖ్యులను స్తుతించి, అక్కడ తెలుపు నలుపు దారములతో ఒక వస్త్రాన్ని నేస్తూన్న ఇద్దరు స్త్రీలను, పన్నెండు రేకులు గల చక్రాన్ని తిప్పే ఆరుగురు కుమారులను, ఎత్తైన గుఱ్ఱము నెక్కి వచ్చిన ఒక తేజశ్శాలి అయిన దివ్య పురుషుణ్ణి, చూచి విశేషార్థాలతో కూడిన మంత్రములు చదవి ఉదంకుడు భక్తితో స్తోత్రం చేయగా ఆ దివ్యపురుషుడు ఉదంకునితో ఇట్లా అన్నాడు.

ప. హితవచన! నీ యధార్థ
స్తుతుల కతిప్రీత మానసుఁడ నైతి ననిం
దిత చరిత నీకు నభివాం
ఛిత మెయ్యది? దానిఁ జెప్పుమ చేయుదు నవినన్.

అర్థము: హితవచన=ప్రియముగా మాటలాడువాడా !, అనిందితచరిత=కళం కములేని చరిత్రగలవాడా !, అతిప్రీతమానసుడను = మిక్కిలి సంతోషించిన మనస్సు కలవాడను.

భావము: ప్రియభాషణా! సత్యమైన నీస్తుతులకు సంతోషించాను. నీ కోరిక ఏమో చెప్పు, నెరవేరుస్తాను అన్నాడు.

వ. ఉదంకుండు గరంబు సంతసిల్లి యిన్నాగకులం బెల్ల నాకు వశంబగు నట్టులుగా ననుగ్రహింపు మనిన నప్పురుషుం డట్లేని నీ యశ్వ కర్ణ రంధ్రధ్మానంబు సేయు మనిన వల్లె యని తద్వచనానుసారంబు సేయుడుఁ దత్క్షణంబ—

అర్థము: అశ్వ కర్ణ రంధ్ర ధ్మానంబు=గుఱ్ఱపు చెవిలోపల నూదుట.

ప. పాతాళైక నికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతో మార్గ వినిర్గ తోగ్ర దహనార్చుల్; పన్నగ వ్రాతముల్
భీతిల్లెన్, భుజ గాధినాథమనమున్ భేదిల్లెఁ గల్పాంత సం
జాత ప్రోద్ధత బాడబానల శిఖా శంకాధి కాతంకమై.

అర్థము: కల్పాంత......ఆతంకమై=ప్రళయకాలమునందు పుట్టి ఎగసిన బడ బానలజ్వాలలేమో అన్నంత భయముగొల్పుచు, పాతాళ+ఏక్+ నికేతన + అంతరమునన్ = పాతాళలోకమనే భవనమంతటిలోనూ, తదశ్వా...అర్చుల్=ఆ గుఱ్ఱముయొక్క సర్వేంద్రియమార్గాల నుండి బయలుదేరిన, తీవ్రాగ్ని జ్వాలలు, పర్వెన్=వ్యాపించెను. పన్నగవ్రాత ముల్ = సర్పసమూహములు, భుజగాధినాథమనమున్ = నాగరాజు మనస్సు, భేదిల్లెన్=బ్రద్దలయ్యెను.

భావము: ప్రళయకాలంలో లేచిన సముద్రాగ్నిజ్వాలలేమో అన్నంత భయంకరంగా పాతాళలోక మంతటా ఆ గుఱ్ఱపు అవయవాలనుండి పుట్టిన పెనుమంటలు వ్యాపించాయి. సర్పాలన్నీ భయంతో వణికిపోయాయి. నాగరాజు గుండె బద్దలయింది.

వి. ఒక భయంకర దృశ్యం వర్ణించడానికి శార్దూలవృత్తం తగినది. కవి వృత్త ఔచిత్యపరిజ్ఞానం ఇక్కడ కనిపిస్తుంది ఇందులో ఉన్నది భయానకరసం, అది మార్గ, వినిర్గత, అర్చి, వంటి ద్విత్వాక్షరాలతోను భకార ధకార ఖకారాది మహాప్రాణాక్షరాలతోను కూడిన సమాసాలవల్ల చక్కగా అభివ్యక్త మౌతున్నది. సమాసభూయిష్ఠమైన ఈ ఓజోగుణం ఇక్కడ మిక్కిలి రసపోషకమైంది. గుఱ్ఱంలోనుంచి బయలుదేరిన అగ్ని జ్వాలలను బడబానల జ్వాలలుగా ఊహించడం ఉత్ప్రేక్షాలంకారం.

క. శంకర నిభుఁడగు విప్రు భ
యంకర కోపాగ్నియొక్కొ యనుచున్ జాతా
తంకుఁడయి కుండలంబు లు
దంకునకును దెచ్చియిచ్చెఁ దక్షకుఁ డంతన్.

అర్థము: శంకరనిభుఁడు = శివునివంటి వాడు; జాత + అతంకుడు = భయము పుట్టినవాడు.

భావం: ఇది శివునివంటి బ్రాహ్మణుని కోపాగ్ని కాబోలు! అనుకొంటూ తక్షకుడు భయపడి అపహరించిన కుండలాలు అతనికి తెచ్చి ఇచ్చివేశాడు.

వి. ఇక్కడ శంకరోపమానం సాభిప్రాయం. అతనికి కోపం వస్తే శివునిలాగె మూడోకంటితో మాడ్చి వేస్తా డని వ్యంగ్యం.

వ. ఇట్లు నాగకులంబున కెల్ల మహాక్షోభంబు గావించి తక్షకుచేఁ గుండలంబులు కొని యుదంకు డాత్మగతంబున.

అర్థం: క్షోభము = అలజడి; ఆత్మగతంబునన్ = తనలో.

ప. కుండలంబులు వేగఁ గొనిరమ్ము నాలవ
నాఁటికి నని పూని నన్నుఁ బనిచె
గురుపత్ని; నేఁడ యక్కుండలంబులు దొడ్గు
దివస; మీ దివస మతిక్రమింప
కుండంగఁబోక యె ట్లొదఁగూడు ? నిన్నాగ
భవన మెప్పాట వెల్వడఁగఁబోలు;
నేఁడు వోవని నాఁడు నిష్ఫలం బిమ్మహా
యత్న మంతయు నని యధిక చింతఁ
దవిలియున్న యయ్యుదంకు నభిప్రాయ
మెఱిఁగి, దివ్యపురుషుఁ డిట్టు లనియె;
నీ హయంబు నెక్కి ఏగుమ, యిది వడి
గలదు మనసుకంటె గాడ్పుకంటె.

భావం: 'సుగమం' హయము, గుఱ్ఱము=వడిన్ + కలదు = వేగమును పొందును.

వి. ఇక్కడ 'కలుగు' ధాతువుకు పొందుట అని అర్థం. అప్పు డది సకర్మకం. దానికి కర్మ 'వడిని'.
భట్టారకులు సీసపద్యాన్ని వర్ణనకే కాకుండా కథాకథనానికి కూడా ఒకు పుగ ఉపయోగిస్తారు. దానివల్ల చెప్పే విషయానికి వింత ఊనిక వస్తుంది. ఇట్టి పద్యాలనే కొందరు గునుగు సీసా లన్నారు.

వ. అనవుడు నద్దివ్యపురుషు వచనంబున నత్తురంగంబు నెక్కి తత్క్షణంబ యయ్యుదంకుండు గురుగృహంబునకు వచ్చె; నిట గురుపత్నియు శుచి స్నాతయై నూతన పరిధానశోభితయై యక్కుండలంబులు దొడుగ నవసరంబైన, నుదంకాగమనంబు గోరుచున్నయప్పు డయ్యుదంకుం గని తద్దయు సంతసిల్లి తదానీత రత్నకుండల భూషితయై బ్రాహ్మ ణులం బూజించి నిజ సంకల్పిత మహోత్సవం బొనరించె; నట్లు గురు కార్యంబు నిర్వహించిన యుదంకుం జూచి గురుం డిట్లనియె.

అర్థము: స్నాత=స్నానము చేసినది, పరిధాన=వస్త్రము, ఆనీత=తేబడిన.

క. ఈ యున్న పౌష్యుప్రోలికిఁ
బోయి కడుం బెద్దదవ్వు వోయినయ ట్ల
త్యాయత విమల తపో మహి
మా! యిన్నిదినంబు లేల మసలితి చెపమా!

అర్థము: అతి + ఆయత + విమల + తపస్ + మహిమా! = నిర్మలమైన విస్తారమైన తపోమహిమ కలవాడా!, ఈ + ఉన్న = ఇంతదగ్గరగా ఉన్న, ప్రోలు = పట్టణము, మసలితి = ఆలస్యము చేసితివి.

భావము: అధికతపశ్శాలీ! ఇంతదగ్గరగా ఉన్న పౌష్యునివీటికి పోయి ఎంతో దూర మైనట్టు ఇంత ఆలస్యం చేశా వేమి?

వి. 'ఈయున్న' అనే మాట సంభాషణలోని సహజత్వం ఉట్టిపడేలా ఉంది. నన్నయగారి తెలుగు నుడికారపు అందం ఇట్టిచోట తెలుస్తుంది.

వ. అనిన నుదంకుం డిట్లనియె, నయ్యా మీ యానతిచ్చి నట్ల మసల వలవదు. తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నంబున నింత మసలవలసె. వినుడు మిమ్ము వీడ్కొని చనువాఁడ నెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని మహాతేజస్వి నొక్క దివ్యపురుషుం గని వానిపన్నిన వృషభ గోమయ భక్షణంబు సేసి చని పౌష్యమహాదేవికుండలంబులు ప్రతిగ్రహించి వచ్చి తక్షకుచేత నపహృతకుండలుండనై వానితోడన పాతాళలోకంబునకుం బోయి నాగపతుల నెల్ల స్తుతియించి యందు సితాసిత తంతు సంతాన పటంబు ననువయించుచున్నవారి నిద్దఱ స్త్రీలను ద్వాదశారచక్రంబుఁ బరివర్తింపించుచున్న వారి నార్వురఁ గుమారుల నతిప్రమాణ తురగారూఢుండైన యొక్క దివ్యపురుషుం గని తత్ప్రసాదంబునఁ గుండలంబులు వడసి తదాదేశంబున నత్తురంగంబు నెక్కి వచ్చితి: నిది యేమి? యంతయు నా కెఱింగింపుఁడనిన గురుం డిట్లనియె.

అర్థము: మసలన్ + వలవదు = ఆలస్యం చేయనక్కరలేదు. అపహృతకుండలుండను ఐ = కుండలాలు పోగొట్టుకొన్నవాడనై, ఆదేశంబునన్ = ఆజ్ఞచేత.

## ఉదంకుడు గురునివలన నాగలోకవృత్తాంతమును తెలియుట

ప. అప్పురుషుం డింద్రుఁ డయ్యుక్ష మైరావ
తంబు గోమయ మమృతంబు నాగ
భువనంబు లోఁగన్న పొలతు లిద్దఱు ధాత
యును విధాతయు వారి యనువయించు
సిత, కృష్ణ, తంతు రాజిత తంత్ర మది యహో
రాత్రంబు ద్వాదశారములు గలుగు
చక్రంబు మాసాత్మసంవత్సరంబు గు
మారు లయ్యార్వురు మఱియు ఋతువు

లత్తురంగ మగ్ని యప్పురుషుండు ప
ర్జన్యు డింద్రసఖుడు సన్మునీంద్ర!
యాది నింద్రుగాంచి యమృతాశి వగుట నీ
కభిమతార్థసిద్ధి యయ్యె నయ్య!

అర్థం:- సత్ + ముని + ఇంద్ర = ఉత్తమమునీ, పొలతులు = స్త్రీలు, అమృత + అశివి = అమృతము ను భుజించినవాడవు, అభిమత + అర్థసిద్ధి = కోరిన కోరిక నెరవేరుట.

భావము : ఉత్తమ మునీ, నీకు తొలుత కనబడినవాడు ఇంద్రుడు. ఆ ఎద్దు ఐరావతం.దాని గోమయం అమృతం.నాగలోకంలో కనబడ్డ స్త్రీ లిద్దరూ ధాత, విధాత అనేవాళ్ళు. వారు తెల్లని నల్లని దారాలతో నేస్తున్న మగ్గం రాత్రింబవళ్ళు. పన్నెండు రేకులు గలచక్రం 12 నెలలతో కూడిన సంవత్సరం. దాన్ని తిప్పుతున్న ఆర్గురు కుమారులు ఋతుపులు. ఆ గుఱ్ఱం ఇంద్ర మిత్రుడైన పర్జన్యుడు. తొలుత ఇంద్రుణ్ణి చూచి అమృత భక్షణం చేయడంవల్ల నీ కోరిక నెరవేరింది.

వి. ధాత, విధాత అనే శబ్దాలు రెండు అకారాంత స్త్రీ లింగాలు.

క. కరమిష్టముఁ జేసితి మా
కరిసూదన దీన నీకు నగు సత్ఫలముల్
గురుకార్య నిరతులగు స
త్పురుషుల కగు టరుదె యధిక పుణ్య ఫలంబుల్.

అర్థం:-అరిసూదనా= శత్రు సంహారకా, కరము=ఎంతయును, గురుకార్య నిరతులు=గురువుల పనులు శ్రద్ధతో చేయువారు.

భావము: శత్రువులను జయించి మా కోరిక సఫలం చేశావు. నీకు మేలు జరుగుతుంది. గురు కార్యాలు నెరవేర్చినవారికి మంచి ఫలితాలు దక్కడం అరుదు కాదు గదా!

వి. మొదటి వాక్యాన్ని రెండవ వాక్యంతో సమర్థించడంవల్ల ఇక్కడ అర్థాంతర న్యాసాలంకారం.

వ. నీవలనం బరమ సంప్రీత హృదయుండ నైతి; నీవును గుర్వర్థంబునందు ఋణ విముక్తుండ వైతివి, నిజేచ్ఛ నుండు. మనినఁదదనుజ్ఞ వడసి యుదంకుం డనేక కాలంబు తపంబు సేసె. నట్టి యుదంకుండు తక్షకు చేసిన యపకారంబునకుం బ్రతీకారంబు సేయం జింతించి యొక్కనాఁడు జనమేజయు పాలికిం బోయి యిట్లనియె.

అర్థం:-పరమ + సంప్రీత + హృదయుండను = మనసులో మిక్కిలి సంతోషించిన వాడను; నిజ + ఇచ్ఛన్=నీ ఇష్టము వచ్చినట్లు, ప్రతీకారము= ప్రతిక్రియ (పగ తీర్చుకొనుట).

చ. మితహిత సత్యవాక్య! జనమేజయ ! భూజనవంద్య యేను సు
స్థితి గురుదేవకార్యములు సేయఁగ బూను టెఱింగి వంచనో
న్నతమతియై యకారణము నా కపకారముఁజేసెఁ దక్షకుం
డతి కుటిల స్వభావుడు పరాత్మ విశేష వివేక శూన్యుఁడై-

అర్థం: మితహిత సత్యవాక్య=మితముగాను, ప్రియముగాను సత్యముగాను పలుకువాడా!; భూజన వంద్యా = జనులందరిచే నమస్కరింపదగినవాడా;

వంచన + ఉన్నత + మతియై = బాగుగా వంచించ దలచిన వాడై; పర + ఆత్మ + విశేష + వివేక + శూన్యుడై = తనయొక్కయు ఎదుటివారియొక్కయు తారతమ్య మెఱుగనివాడై.

భావము: దుష్ట బుద్ధిగల తక్షకుడు తన శక్తి, ఎదిరి శక్తి తెలియక నేను గురు దేవులకార్యం నెరవేరుస్తూ ఉంటే నిష్కారణంగా నన్ను మోసగించి మహాపకారం చేశాడు.

వ. మఱి యదియునుంగాక

భావము : నా కొక్కడికే అపకారం చెయ్యడంకాదు. (నీకును గొప్ప అపకారం చేసినవాడు)

ప. అనవర తార్థదాన యజనాభిరతున్ భరతాన్వయాభి వ
ర్ధను సకలప్రజాహిత విధాను ధనంజయ సన్నిభున్ భవ
జ్జనకుఁ బరీక్షితుంభుజగజాల్ముఁ డసహ్య విషోగ్రధూమకే
తన హతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంత నికేతనాతిథిన్.

అర్థం: అనవరత + అర్థదాన + యజన + అభిరతున్ = నిరంతర ధనదానాలతో కూడిన యజ్ఞములు చేయుట యందు ఆసక్తి గల వానిని; భరత ... వర్ధనున్ = భరతకుల వృద్ధికారకుని; ధనంజయ సన్నిభున్ = అగ్ని వంటి వానిని (తేజశ్శాలిని), అతిదాంతున్ = అధికమైన తపఃక్లేశమును సహించువానిని; భవత్ + జనకున్ = నీతండ్రిని, భుజగ + జాల్ముడు = సర్పాధముడు (క్రూరుడు), అసహ్య ...... హతిఁజేసి = సహింపరాని విషాగ్ని పీడతో, కృతాంత + నికేతన + అతిథిన్ = యమునింట అతిథి నిగా; చేసెన్ = చంపినాడు.

భావము: క్రూరమైన సర్పజాతికి చెందిన తక్షకుడు ఉత్తమగుణ భూషితుడైన నీ తండ్రిని దారుణ విషాగ్నితో హతమార్చినాడు.

ప. కాదన కిట్టిపాటి యపకారముఁదక్షకుఁ డేకవిప్ర సం
బోధనఁజేసి చేసె నృపపుంగవ నీవు సనేక భూసురా

పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కా
కోదర సంహతిం హుతవహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్.

**అర్థం.** నృపపుంగవా=రాజశ్రేష్ఠుడా!; ఏక+విప్ర+సంబోధనన్+చేసి= ఒక బ్రాహ్మణుని బోధనము చేత; కాదు+అనక = తగదనక; ఇట్టి పాటి=ఇంతటి; అనేక ... ... యాగమునన్=పలువురు బ్రాహ్మణులచే నిర్వర్తింపబడిన సర్పయజ్ఞమునందు; హుతవహ ....... చయంబులన్=అగ్నిహోత్రుని చెలరేగిన పెను మంటలలో.

**భావము:** రాజా ! ఒక బ్రాహ్మణుని ప్రేరణ చేత తక్షకుడు తగదనక ఇట్టి అపకారం చేశాడు. అనేక బ్రాహ్మణులు కూడి చేయించే సర్ప యజ్ఞంలో చెలరేగే పెనుమంటలలో నీవు ఈ తక్షకాది సర్పజాతిని భస్మం చెయ్యి.

**వి.** ఒక్క బ్రాహ్మణుని ప్రేరణతో తక్షకుడు నీ తండ్రిని సంహరించాడు. నీవు చాలా మంది బ్రాహ్మణుల సమర్థనంతో ఈ సర్ప జాతిని నాశనం చెయ్యి అనడంలో ఒక విశేషముంది. వాడు ఒక్క బ్రాహ్మణుని ప్రోత్సాహం మీదనే నీ తండ్రిని హింసించాడు. నీవు పలువురు బ్రాహ్మణుల ప్రోద్బలంతో అపకారులైన సర్పాలను వధించి ప్రతిహింస చేయవచ్చు అని చెప్పినట్టయింది.

**ప.** ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసిన దానఁ దత్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము? కావునన్ మహీ
వల్లభ తక్షకాధము నెపంబున సర్పములెల్ల నగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్పయాగ మతిధీయుత చేయుము విప్రసన్నిధిన్.

**అర్థం:** ప్రల్లదుడు=దుష్టుడు కులపాంసనుడు=కులదూషకుడు (అప్రతిష్ఠ తెచ్చువాడు), ఏమి యపూర్వము=ఏమి వింత? (వింతలేదు), నెపంబునన్= కారణముగా; త్రెళ్ళగన్=కూలగా.

**భావము:** భూపతీ ! కులకళంకమైన ఒక దుష్టుడు చేసిన పనికి ఆ కులమంతా నింద పొందడంలో ఆశ్చర్యం ఏముంది ? కాబట్టి తక్షకుడు కారణంగా

పాములన్నీ మంటల్లోపడి మ్రగ్గే విధంగా బ్రాహ్మణ సన్నిధిలో సర్పయాగం చెయ్యి.

వి ఈ పద్యానికి ఎంచుకొన్న లకార ద్విత్వప్రాసవల్ల తక్షకుని దుష్టత్వము వాని జాతి అంతా నశించడంలోని పూనిక పాములన్నీ వచ్చి హోమ గుండంలో పడుతూన్న స్ఫూర్తి కలుగుతుంది. భావాన్నిబట్టి పద్యగమనాన్ని నిర్దేశించడం ప్రతిభావంతుడైన కవి లక్షణం.

వ. అని యిట్లయ్యుదంకుండు జనమేజయునకు సర్పయాగ బుద్ధిఁ బుట్టించెను.

## వ్యాఖ్యాహృదయం

ఈ వ్యాఖ్య సామాన్య సాహిత్యాభిమానులకోసం ఉద్దేశించినది. నన్నయ కవిత మీద ఆప్యాయత ఉండి, ఆయన రచనా మాధుర్యాన్ని కొంతవరకైనా ఆస్వాదించదలచిన వారికి ఈ ఉదంకోపాఖ్యానం వాచవి అందిస్తుంది.

భాషా చమత్కారాలు, ఛందో వ్యాకరణాది లక్షణాంశాలు సాధారణ పాఠకులకు అందుబాటులోనివి కావని వాటి ప్రసక్తి అట్టే తేలేదు.

ఉపాఖ్యాన సారాంశం తెలియడం, అందులోని భట్టారకుని కథనచాతురి. పద్య రచనలోని నేర్పు, రసాభిముఖమైన పలుకుపొందిక సాధ్యమైనంతలో వివరించడమే దీని పరమార్థం.

కఠిన శబ్దాలకు అర్థం చెప్పడంలో, సమాసార్థం బోధించడంలో సంస్కృత మర్యాద విడిచి, తెలుగు నుడికారమే చాలవరకు అనుసరించడం జరిగింది.

''అథసే వా మనిచ్ఛంతం
గురు మర్థేన తోషయేత్ ।
గుర్వర్థే యతమానం తం
అనుగృహ్ణంతి దేవతాః''

సేవకు అంగీకరించని గురువును ధనంతో సంతోషపెట్టాలి. గురుదక్షిణ కోసం పాటుపడే శిష్యుని దేవతలు అనుగ్రహిస్తారు.

ఈ విషయాన్ని బోధించడానికే ఉదంకోపాఖ్యానం పుట్టింది అని సంస్కృత వ్యాఖ్యాతల వివరణం.

## భట్టారకుని ఆంధ్రీకరణం

నన్నయ భట్టారకుడు ఎంత పురాణజ్ఞుడూ, వేద శాస్త్రాభిమాని అయినా, వ్యాస భారతం తెనుగు చెయ్యడంలో ప్రధాన కథా సూత్రానికి భంగం లేకుండా కావ్యధర్మాన్ని అనుసరించినట్టు కనపడుతుంది. ఇతిహాసంలో ప్రసక్తానుప్రసక్తంగా అనేక అవాంతర విషయాలూ, ఉపాఖ్యానాలు ప్రధానేతివృత్తాన్ని కప్పివేసి, అరణ్యలతానికుంజాల్లా పెరిగిపోయి అసలు స్రోవను కనపడనియ్యవు. అప్పుడు వాటితో అక్కరలేని వాటిని ఖండించి కొన్నిటిని కావలసినట్టు వంచి ఒదిగించడం కావ్య నిర్మాతకు అవసరం. పురాణ ధోరణిలో అవి అన్నీ యథాతథంగా ఉన్నా - పురాణారాధకులు పుణ్యబుద్ధితో, ధార్మిక చింతనతో చదువు కుంటారు.

మహాకావ్య నిర్మాత ప్రముఖమైన ఇతివృత్తాన్ని పాటించాలి. ఔచిత్యం పాలించాలి. రసపోషణంతో రక్తి కట్టించాలి. కథా పాత్రలను చైతన్యంతో కదిలించాలి. ఇన్ని నిర్వహించవలసి వచ్చినప్పుడు మూలగ్రంథాన్ని అనువదించడం సాధ్యంకాని పని. కనుక భట్టారకుడు భారతాన్ని అనువదించలేదు. తెనిగించాడు. అనువదించడం వేరు; ఆంధ్రీకరించడం వేరు. సంస్కృత గ్రంథాన్ని తెలుగులోకి తెచ్చిన వారెవ్వరూ అనువాదమనే మాటను రానివ్వలేదు. ఆ ఉజ్జాయింపు మాట ఎలాగో వ్యవహారంలో ప్రవేశించింది, అంతే—

భట్టారకుని ఆంధ్రీకరణ లక్ష్యాన్ని ఉదంకోపాఖ్యానంలో స్థూలంగా పరికించవచ్చు.

మూల భారతంలో ఉన్న ఉదంకోపాఖ్యానాన్ని యథార్థంగా తెలుగులో నన్నపార్యుడు కుదించాడు. ఆయన పథకంలో ఆ కథకు అంతకన్న విస్తృతి అవసరం లేదు.

**క్లుప్తత :**

ఉదంకుని గురువు వేదుడు. ఆతని గురువు అయోదధౌమ్యుడు. ఈయన గాథ శిష్యుల కథలతోకూడా విస్తరించి ఉంది. ఈ ఉపాఖ్యానానికి ఆ కథలు బరువు. కనుక వాటిని తొలగించి సరాసరి ఉదంకునితో ప్రారంభించాడు.

పౌష్యజనమేజయులు వేదుని శిష్యులని చెప్పడం ముందుకథకు అవసరమైనా కవి క్లుప్తతలో ఊహించవలసిన విషయ మయింది.

అడవిలో, ఎద్దుమీద వచ్చిన పెద్దమనిషి గోమయభక్షణం చేయమంటే ఉదంకుడు మొదట అంగీకరించలేదు. అతడు, మీ గురువుకూడా ఈ భక్షణం చేసినాడంటే అప్పుడు ఉదంకుడు సమ్మతించాడు. ఈ సంగతి తెలుగులో లేక పోయినా విషయభంగం లేదని కవి విడిచిపుచ్చాడు.

మోసగించిన తక్షకుని తరిమి పట్టుకోడానికి ఉదంకుడు నేలను తవ్వి అలసిపోతే ఇంద్రుడు అతని తవ్వుగోలలో ప్రవేశించమని వజ్రాయుధం పంపాడు. ఆ బలంవల్ల ఉదంకుడు తవ్వి నాగలోకానికి పోయినాడని మూలం.

తొలుత, ఇంద్రదర్శన, అమృత భక్షణాదులవల్ల ఉదంకుని నాగలోక గమనం సుగమం అయిందని కవి సంక్షిప్తతకు అర్థం చేసుకోవాలి.

నాగలోకభవనాదుల వర్ణనం మూలంలో ఉన్నా అది అకించిత్కర మని కవి తలంపు.

**ఔచిత్యము :**

ఉదంకుడు గురుకులంలో ఉన్నప్పుడు - గురువు యాజ్ఞికం నిమిత్తం గ్రామాంతరం వెళ్లినప్పుడు గురుపత్ని ఋతుమతి అయింది. ఆమె చెలులు ఉదంకుణ్ణి ఋతువు సఫలం చెయ్యమన్నారు. అంటే సంగమమని అర్థం. అది అకార్యమని శిష్యుడు తిరస్కరించాడు. ఈ విషయం స్మరించడానికే అనుచిత మని కవి తెనుగులోకి రానివ్వలేదు.

నాగలోకంలో గుఱ్ఱంమీద కనపడిన దివ్యపురుషుడు, నాగులు వశం కావా లంటే ఈ గుర్రపు అపానస్థానంలో ఊదమన్నాడు ఉదంకుణ్ణి.

కవి అది జుగుప్సావహం అని గుర్రపు చెవిలో ఊదుమని మార్చాడు. (గోమయభక్షణం కథకు అనివార్యం కనక ఉంది)

**కవిత - రసం :**

ఉదంకుడు నాగలోకంలో సర్పరాజులను ప్రార్థించాడు. ఆ ప్రార్థనలోని భావాలకు తెనిగింపులోని భావాలకు సంబంధం లేదు.

భట్టారకుని కవిత ఇక్కడ పడగ విప్పుగుంది. ఆయన పద్యశిల్పానికి, భావనాశక్తికి, ఉపజ్ఞకుగా ఉదాహరణంగా నిలిచినవి ఆ నాలుగు పద్యాలు!

ముందు మూలంలో లేని అనంత, వాసుకులను అమోఘంగా వర్ణించాడు. తర్వాత ఐరావత కోటి ఘోర ఫణిరాజులు, సహాశ్వసేనుడు, తక్షకుడూ దర్శనమిస్తారు.

మొదటి పద్యంలో పెద్ద బరువు మోసే అనంతుడు తర్వాత సురాసుర కోటి కిరీటరత్న రంజిత పాదుడు, వాసుకి, అపారవిషాగ్ని వెడల్రగక్కే ఐరావతాదులు, ధాత్రి అంతా పరిభ్రమించే తక్షకుడు, ఆ పద్యపు నడకలో సమాసాల కూర్పులో ఎదుటికి వచ్చి నిలిచినట్టే ఉంటారు.

గుఱ్ఱం నుంచి వెల్వడిన మంటలతో నాగలోకం అంటుకు పోయేటప్పుడు వ్రాసిన "పాతాళైక నికేతన" అనే పద్యంలో భయానకరసం ఉట్టిపడుతూ ఉంటుంది.

ఈ ఎరుకతో నన్నయను చదవడం ఉచితమని భావిస్తాను.



# నన్నయ గరుడోపాఖ్యానము

(ఆంధ్ర మహాభారతాది పర్వము-ద్వితీయాశ్వాసము)

వివరణ కర్త

కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని
ఎం.ఏ. (ఆనర్సు) పి.హెచ్.డి.
పూర్వాంధ్ర శాఖాధ్యక్షుడు
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు.

# తొలిపలుకు

గరుడోపాఖ్యానము శ్రీమదాంధ్ర మహాభారతము నందలి ఆది పర్వము లోని ద్వితీయాశ్వాసమున నున్నది. దీనిని రచించిన మహాకవి నన్నయభట్టు. క్రీ.శ. 1019 నుండి 1060 వఱకును తూర్పు చాళుక్య (వేంగీ) రాజ్యమును పరిపాలించిన రాజరాజనరేంద్రునకితడు కుల బ్రాహ్మణుడును, మిత్రుడునై యుండెను. వారి రువురును కొంచె మించుమించుగా సమవయస్కులై యుందురు. తనకు ప్రభువు మిత్రుడునైన రాజరాజు కోరగా నన్నయ వ్యాసుడు సంస్కృతమున రచించిన మహాభారతము నాంధ్రీకరించుట కారంభించి యందలి ఆది సభా పర్వములను అరణ్యపర్వమున చతుర్థాశ్వాసము నందు 142 పద్యములను రచించి దివంగతు డయ్యెను. తరువాత 13 వ శతాబ్దిలో తిక్కన సోమయాజి విరాట పర్వమాదిగా పదునైదు పర్వములను ఆంధ్రీకరించెను. సిమ్మట రెడ్డి రాజుల యాస్థానమున కవీంద్రుడైన ఎఱ్ఱాప్రెగ్గడ క్రీ.శ. 14వ శతాబ్ది ఆరంభమున నన్నయ వ్రాయగా మిగిలిన అరణ్యపర్వ శేషమును నన్నయ పేరు మీదగనే పూరించి రాజరాజునకే అంకితము కావించెను. ఆంధ్రభారతమును రచించిన యీ ముప్వురు కవులకును కవిత్రయము వారని ప్రసిద్ధి.

నన్నయకు పూర్వము తెలుగు భాషకు స్థిరమైన రూపముకాని, కావ్యరచ నార్హమైన విస్తృతి కాని లేకుండెను. అతడు తనకు ముందున్న శాసనములలోని భాషను, జనవ్యవహారమునందున్న భాషను పరిశీలించి, దానికొక సుస్థిరమైన రూపము నొసంగి, సంస్కృతము నందలి పదములను తెలుగున వాడుటకు తగిన ప్రణాళిక నేర్పఱిచి సలక్షణమైన భాషలో మొట్టమొదటి కావ్యమైన మహాభారతమును రచింప సమకట్టెను. అంతకు ముందు శాసనములలో దేశిపద్ధతికి చెందిన కొన్ని పద్యములున్నను చంపకోత్పలమాలాది సంస్కృత వృత్తములతో కూడిన కావ్యములేవియు లేకుండెను. అందుచేతనే అతనికాది కవియని సార్థక మైన బిరుదము కలిగెను. ఇదికాక అతనికి శబ్దశాసనుడను మఱొక బిరుదము కూడ కలదు. అతడు అవిరళ జపహోమతత్పరుడు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు, ఉభయ భాషా కావ్య రచనాభిశోభితుడు, లోకజ్ఞుడు, మత్య

మరాధిపాచార్యుడు, నిత్య సత్యవచనుడు, ఋషితుల్యుడు. తిక్కన అతనిని విద్యాదయితుడనియు, ఆంధ్రకవిత్వ విశారదుడనియు స్తుతించెను. తరువాత కావ్యములు రచించిన ఆంధ్రకవులందఱును కవిత్రయము వారిని గురుప్రాయులుగా భావించిరి. నన్నయ ఆంధ్రభాషకు సుస్థిర రమణీయమైన రూపము నొసంగి, అందు మొదట కావ్యము రచింపనారంభించి ఆంధ్ర సరస్వతికి చేసిన సేవ అనన్య సామాన్యమైనది.

నన్నయ తన కవిత్వము ప్రసన్న కథా కలితార్థ యుక్తికిని, అక్షర రమ్యతకును, రుచిరార్థ సూక్తి నిధిత్వమునకును నిలయమై యుండునని అవతారికలో చెప్పి యుండెను. అందతిశయోక్తి యిసుమంతయు లేదు. అప్పటి పరిస్థితులను బట్టి అతడు తన రచనలో సంస్కృత పదములనే యెక్కువగా వాడవలసి వచ్చెను. అతని పద్యములు ధ్వని సౌందర్యమునకును ధారా శుద్ధికిని ఆటపట్టులై అత్యంత శ్రవణపేయములుగా నుండును. కథా కథనమున నత డందెవేసిన చేయి. యయాతిచరిత్ర, శకుంతలోపాఖ్యానము, నలోపాఖ్యానము, సౌగంధికాపహరణము, గరుడోపాఖ్యానము అతని కథా కథనకౌశలమునకు నిదర్శనములు. ఆంధ్రమున పద్య విద్యకు వలెనే గద్యరచనా విద్యకును అతడాద్యుడని చెప్పవచ్చును. అతడర్థాలంకారముల కొఱకు కాని శబ్దాలంకారము కొఱకు కాని యెచ్చటను ప్రయత్నించి యుండలేదు. ఎచ్చటనైన నవియున్నచో నప్రయత్న సిద్ధములైనట్టివే. గరుడోపాఖ్యానమందే అతడు శ్లేషాలంకారము వాడిన రెండు సన్నివేశములు కన్పించును. రసపాత్రపోషణమందును ఔచిత్య పాలనమునందును అతడప్రతిమానుడు.

ఆది పర్వాంతమున భృగువంశ కీర్తనము కలదు. భృగువునకు చ్యవనుడును, చ్యవనునకు ప్రమతియు, ప్రమతికి ఘృతాచియందు రురుడును ఉదయించిరి. రురుడు ప్రేమించిన ప్రమద్వరయను కన్య చెలులతో నాడుచు సర్పదష్టయై మరణించెను. రురుడు తన యాయువులో సగమిచ్చి యామెను బ్రతికించుకొనెను. అప్పటినుండియు నతడు పాములకు ప్రతీకారము చేయసమకట్టి పుట్టలందును పొదలందును గల పాములను వెదకి వెదకి చంపుచుండెను. అతడొకప్పుడు డుండుభమను పామును చంపుటకు దండమెత్త నది సహస్రపాదుడను మునిగా మాఱి, తన వృత్తాంతము తెల్పి, "అహింసాపరులైన బ్రాహ్మణులొరులు

చేయు హింసలను వారింతురు కాని తామే హింసకు కడంగుదురా? జనమేజయు డను రాజు చేయు సర్పయాగమున తల్లియైన కద్రువ యిచ్చిన శాపముచే సర్ప ములకు కలుగు ప్రళయమును నీ తండ్రికి మిత్రుడైన ఆస్తికుడే కదా యుడిగించె''నని చెప్పి అతనికి సర్పఘాతమున నుపశమన బుద్ధి పుట్టించెను. ఆ వృత్తాంతము విని శౌనకాది మహర్షులు కద్రువ తల్లియయ్యు సర్పములకేల శాపమిచ్చెనని యడుగ నుగ్రశ్రవసుడను కథకుడు వారికి గరుడోపాఖ్యానము వివరించెను. ఇది అసూయా కోప దుష్ఫలితములను, మాతృభక్తి మహత్త్వమును బోధించును.

ఆంధ్ర ప్రభుత్వము వారు 1988 వ సంవత్సరమును నన్నయ సంవత్స రముగా ప్రకటించిరి. ఈ సందర్భమున నన్నయ రచించిన కొన్ని ఉపాఖ్యానము లను టీకాతాత్పర్యములతో ప్రకటించవలెనని ప్రభుత్వము వారు తీర్మానించి యాకార్యమును ఆం.ప్ర. సాహిత్య అకాడమి వారి కప్పగించిరి. వారి నియోగము ననుసరించి నేను సౌపర్ణాఖ్యానమునకు టీకాతాత్పర్యములు వ్రాసితిని. ఇందు దోషములేవైన దొరలిన క్షమింతురని పెద్దలను ప్రార్థించుచు, పుణ్యప్రదమును ఉరగరక్షోభయని వారకమునైన యీ యుపాఖ్యానమునకు వివరణ వ్రాయు నవకాశము నాకొసగిన ప్రభుత్వము వారికిని, అకాడమి వారికిని నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని.

# గరుడోపాఖ్యానము

## (మహాభారతము ఆదిపర్వము-ద్వితీయాశ్వాసము)

శ్రీవనితా వల్లభ, వేం
గీవిషయాధీశ, కావ్యగీతప్రియ, నా
నావనినాథ కిరీటత
టీవిలసద్రత్న సంఘటిత పదకమలా 1

ప్ర.ప. శ్రీవనితా, వల్లభ= లక్ష్మియనెడి కాంతకు ప్రియుడా; వేంగీ, విషయ, అధీశ= వేగియను దేశమునకు ప్రభువా, కావ్య, గీత, ప్రియ= కావ్యములందును గీతములందును ఆసక్తిగలవాడా, నానా, అవనినాథ, కిరీట, తటీ, విలసత్, రత్న, సంఘటిత, పద, కమలా= పలువురు రాజులయొక్క కిరీటములప్రక్క ప్రకాశించుచున్న మణులచే కూర్పబడిన, పద్మములవంటి పాదములు గలవాడా!

ఇది కృతిభర్తయైన రాజరాజనరేంద్రునకు సంబోధనము.

తా: లక్ష్మియనెడి కాంతకు ప్రియుడా, (నావిష్ణుః పృథివీపతిః అను సూక్తి ననుసరించి రాజులందు విష్ణ్వంశ ముండును; ఇచ్చట శ్రీ యనగా రాజ్య లక్ష్మియనియు చెప్పవచ్చును) వేంగిదేశమునకు రాజా, కావ్యములందును గీతములందును ఆసక్తిగలవాడా, బహుదేశరాజుల కిరీట తటములందు ప్రకాశించు మణులచే కూర్పబడిన పద్మములవంటి పాదములు కలవాడా! రాజరాజ నరేంద్రా!

కద్రూవినతలు పుత్రులంగోరి పడయుట.

వ: అక్కథకుండు శౌనకాది మహామునులకుంజెప్పె, నాదియుగంబునంగశ్యప ప్రజాపతి భార్యలైన కద్రువయు వినతయు ననువారలు పుత్రార్థినులై

యనేక వర్షసహస్రంబులు కశ్యపు నారాధించినం, గశ్యపుండు ప్రసన్నుండై మీకోరిన వరంబులిచ్చెద వేఁడుండనిన, 2

ప్ర. ఆ+కథకుండు (త్రికసంధి) రోమహర్షణుడను సూతుని కుమారుడయిన ఉగ్రశ్రవసుడు, శౌనక, ఆది, మహత్మునులకున్ = శౌనకుడు మొదలయిన మహామునులకు; చెప్పెన్, ఆదియుగంబునన్ = కృతయుగమునందు; కశ్యప ప్రజాపతి, భార్యలు అయిన, = కశ్యపబ్రహ్మ భార్యలయిన కద్రువయు; వినతయున్ అనువారలు; పుత్ర అర్థినులు, ఐ = కొడుకులను కోరువారై; అనేక, సహస్రవర్షంబులు, = పెక్కువేల యేండ్లు, కశ్యపున్, ఆరాధించినన్ = సేవింపగా; కశ్యపుండును; ప్రసన్నుండు + ఐ = అనుగ్రహము కలవాడై; మీ, కోరినవరంబులు = మీరు కోరిన వరంబులు (కర్తృపద ప్రథమకు షష్ఠి) ఇచ్చెద, వేడుండు = కోరుడు అనిన = అనగా.

తరలము. అనలతేజులు, దీర్ఘదేహులు నైనయట్టి తనూజులన్
వినుత సత్త్వులఁ గోరెఁ గద్రువ వేవురం గడువేడ్కతో
వినతగోరె సుపుత్రులన్ భుజవీర్యవంతుల వారికం
టెను బలాధికులైనవారిఁగడింది వీరులనిద్దఱన్ 3

ప్ర. అనల, తేజులు = అగ్ని యొక్క ప్రతాశమువంటి ప్రకాశము గలవారు; దీర్ఘ, దేహులు = పొడవయిన శరీరము గలవారు; ఐన, అట్టి తనూజులన్ = కుమారులను; వినుత, సత్త్వులన్ = ప్రసిద్ధికెక్కిన బలము కలవారిని; వేవురన్ = వేయిమందిని; కద్రువ; కడు, వేడ్కతో = మిక్కిలి ఆనందముతో కోరెన్; వినత; భుజ, వీర్యవంతులన్ = బాహువుల యొక్క బలముగలవారిని; వారికంటెను = ఆ కద్రువ కొడుకుల కంటెను; బల, అధికులైన వారిన్ = బలమునందు గొప్పవారిని. కడింది వీరులన్ = ఇతరులకు జయింప శక్యముగాని అధి కవీరులను; సుపుత్రులన్ = మంచి కుమారులను; కోరెను.

తా: కద్రువ, అగ్నివలె ప్రకాశించు వారును, పొడవగు దేహమును కలవారును, ప్రసిద్ధిచెందిన బలముకలవారునైన వేయిమంది కుమారులను మిక్కిలి సంతోషముతో కోరెను. వినత, ఆ కద్రువ కుమారులకంటెను బలముచే

గొప్పవారును, చేతుల (బాహువులు) బలముగలవారును, ఇతరులకు జయింప శక్యముకాని వీరులునైన ఇద్దరు మంచి కుమారులను కోరెను.

వ. కశ్యప ప్రజాపతి తొల్లి పెద్దకాలంబు తపంబుసేసి, పుత్రకామేష్టి సేసెఁ గావున గద్రువకు వేవురఁ గొడుకులను వినతకు నిద్దఱఁ గొడుకులను వారికోరినయట్ల యిచ్చి గర్భంబు లిమ్మగా రక్షింపం బనిచిన నయ్యిద్దఱును దద్దయు సంతసిల్లి యున్నంత గర్భంబులు గొండొక కాలంబునకు నండంబులైన నయ్యండంబులు ఘృత కుండలంబులబెట్టి రక్షించు చున్నంత నే నూరేండ్లకుఁ గద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన నందు శేష వాసుక్యైరావత తక్షక కర్కోటక ధనంజయ కాళియ మణినాగాపూరణ పింజరకైలాపుత్ర వామననీలానీల కల్మాష శబలార్యకోగ్రక కలశపోతక సురాముఖ దధిముఖ విమలపిండ కాప్త కర్కోటక శంఖ వారిశిఖ నిష్ఠానక హేమగుహ నహుష పింగళ బాహ్యకర్ణ హస్తిపద ముద్గర పిండక కంబలాశ్వతర కాళీయక వృత్తసంవర్తక పద్మ శంకముఖ కూష్మాండక క్షేమక పిండారక కరవీర పుష్పదంష్ట్ర బిల్వక బిల్వ పాండర మూషకాద శంఖశిరః పూర్ణభద్ర హరిద్ర కాపరాజిత జ్యోతిక శ్రీవహ కౌరవ్య ధృతరాష్ట్ర శంఖపిండ వీర్యవ ద్విరజ స్సుబాహు శాలి పిండ హస్తిపిండ పిఠరక సుముఖ కౌణపాశన కుఠర కుంజర ప్రభాకర కుముద కుముదాక్ష తిత్తిరి హలిక కర్దమ బహుమూలక కర్కరా కర్కర కుండోదర మహోదరు లాదిగాగల వేవురు నాగముఖ్యులు పుట్టిన. 4

ప్ర. కశ్యప, ప్రజాపతి = కశ్యపబ్రహ్మ; తొలి = పూర్వము, పెద్ద కాలంబు తపంబు చేసి, పుత్ర, కామ, ఇష్టిన్. చేసెన్ = కుమారులు కలుగవలెనను కోరికతో చేయు యాగమును చేసెను, కావునన్ = అట్లు తపస్సు చేయుటవలన, కద్రువకు, వేవుఁరన్, కొడుకులను, వినతకున్ ఇద్దఱన్, కొడుకులన్, వారి, కోరిన, అట్లు + అ = వారు కోరుకొనిన విధముగనే, ఇచ్చి, గర్భంబులు = కడుపులోని పిండములను, ఇమ్ముగాన్ = ఉపాయముగా, రక్షింపన్ + పనిచినన్ = రక్షించుటకు నియమించగా, ఆ + ఇద్దఱును = ఆ కద్రూవినత లిద్దఱును, తద్దయు = మిక్కిలి, సంతసిల్లి, ఉన్నంత, గర్భంబులు = కడుపులోని పిండములు, కొండొక

కాలంబునకున్=కొంత కాలమునకు, అండంబులు, ఐనన్=గ్రుడ్డులుగా మారగా, ఆ+అండమ్ములు=ఆ గ్రుడ్లు, ఘృత, కుండంబులన్=నేతి కుండలయందు, పెట్టి, రక్షించుచున్నం అంతన్=రక్షించుచుండగా, ఏను+నూఱు+ఏండ్లకున్ = అయిదు వందల సంవత్సరములకు, కద్రూ, గర్భ,అండంబులు=కద్రువ యొక్క గర్భము నుండి పుట్టిన గ్రుడ్లు, తరతరంబు+ఆ=ఒకదాని తరువాత నొకటిగా, అవిసినన్= పగులగా, అందున్=ఆ గ్రుడ్లయందు; శేషుడు, వాసుకి, ఐరావతుడు, తక్షకుడు, కర్కోటకుడు, ధనంజయుడు, కాళియుడు, మణినాగుడు, ఆపూరణుడు, పింజరకుడు, ఏలాపుత్రుడు, వామనుడు, నీలుడు, అనీలుడు, కల్మాషుడు, శబలుడు, ఆర్యకుడు, ఉగ్రకుడు, కలశపోత కుడు, సురాముఖుడు, దధిముఖుడు, విమలపిండకుడు, ఆప్తుడు, కర్కోటకుడు, శంఖుడు, వాలిశిఖుడు, నిష్ఠానకుడు, హేమగుహుడు, నహుషుడు, పింగళుడు, బాహ్యకర్ణుడు, హస్తిపదుడు, ముద్గర పిండకుడు, కంబలుడు, అశ్వతరుడు, కాళీయకుడు, వృత్తుడు, సంవర్తకుడు, పద్ముడు, శంకముఖుడు, కూష్మాండకుడు, క్షేమకుడు, పిండారకుడు, కరవీరుడు, పుష్పదంష్ట్రుడు, బిల్వకుడు, బిల్వపాండరుడు, మూషకాదుడు, శంఖశిరుడు, పూర్ణభద్రుడు, హరిద్రకుడు, అపరాజితుడు, జ్యోతికుడు, శ్రీవహుడు, కౌరవ్యుడు, ధృతరాష్ట్రుడు, శంఖపిండుడు, వీర్యవంతుడు విరజుడు, సుబాహువు, శాలిపిండుడు, హస్తిపిండుడు, పిఠరకుడు, సుముఖుడు, కౌణపాశనుడు, కుఠరుడు, కుంజరుడు, ప్రభాకరుడు, కుముదుడు, కుముదాక్షుడు, తిత్తిరి, హాలికుడు, కర్దముడు, బహుమూల కుడు, అకర్కరుడు, కుండోదరుడు, మహోదరుడు, ఆదిగాన్, కల= మొదలుగా గల; వేవురు=వేయిమంది, నాగ, ముఖ్యులు=సర్పశ్రేష్ఠులు పుట్టిన=పుట్టగా.

కం. తన గర్భాండంబుల రెం
టను ప్రియనందనులు వెలువడమిన తిలజ్జా
వనతయయి వినతా పుత్రా
ర్థిని, యొక యండంబు విగతధృతి నవియించెన్

ప్ర. తన, గర్భ, అండంబుల=తన కడుపు నుండి పుట్టిన పిండరూపములైన గ్రుడ్ల, రెంటను=రెండింటియందును, ప్రియ, నందనులు = ప్రీతి పాత్రులయిన కుమారులు, వెలువడమిన్=బయట పడకుండుటచే, అతి, లజ్జా, అవనత, అయి=మిక్కిలి సిగ్గుచే క్రుంగినది అయి, పుత్ర - అర్థిని=కొడుకులను కోరునట్టి, వినత, ఒక అండంబున్=ఒక గ్రుడ్డును, విగత, ధృతిన్=పోయిన ధైర్యముతో, అవియించెన్=బ్రద్దలగునట్లు చేసెను.

తా: తన గర్భము నుండి పుట్టిన గ్రుడ్లు రెండింటి నుండియు ముద్దు కుమారులు బయల్పడని కారణమున, మిక్కిలి సిగ్గుచే క్రుంగినదై కొడుకులను కోరు వినత ఒక గ్రుడ్డును పోయిన ధైర్యముతో (ధైర్య విహీనయై) బ్రద్దలగు నట్లు చేసెను.

కం. దాన నపరార్ధ కాయ వి
హీనుడు, పూర్వార్థతను స హితుఁడరుణుడ నం
గా నుదయించె సుతుఁడు మ
హానీతియుతుండు తల్లి క ప్రియమెసఁగన్. 6

ప్ర. దానన్=బ్రద్దలు చేయబడిన గ్రుడ్డునుండి, అపర, అర్థ, కాయ, విహీనుడు = క్రింది సగము శరీరము లేనివాడు, పూర్వ, అర్థ, తను, సహితుడు=మీది సగము శరీరముతో కూడినవాడు, అరుణుడు, అనంగాన్= అరుణుడు అను పేరుతో, మహత్, నీతి యుతుండు = గొప్ప నీతితో కూడినట్టి, సుతుండు=కుమారుడు, తల్లికి, అప్రియము = అనిష్టము, ఎసగన్=అతిశయింపగా, ఉదయించె=పుట్టెను.

తా: ఆ గ్రుడ్డునుండి క్రింది సగము దేహము లేనివాడును, మీది సగము దేహముతో కూడినవాడు నగు కుమారుడు, అరుణుడను పేరుతో గొప్ప నీతితో కూడినవాడు, తల్లికి అనిష్ట మతిశయింపగా పుట్టెను.

### అనూరుడు వినతకు శాపమిచ్చుట

వ. ఇట్లు వికలాంగుండై పుట్టిన యనూరుడు, వినతకు నలిగి నన్ను సంపూర్ణ శరీరుం గానీక యండంబవియించిన యవినీతవు కావున నీవు

నీ సవతికి దాసివై యే నూఱేండ్లుండుమని శాపంబిచ్చి, యింక నీ రెండవ యండంబు దనకు దాన యవియునంతకు నుండనిమ్ము; దానం బుట్టెడు పుత్త్రుండు మహాబలపరాక్రమ సంపన్నుండు, నీ దాసీత్వంబు వాపునని సెప్పి, సూర్యరథసూతుండయి యరిగె, వినతయు నయ్యండం బతి ప్రయత్నంబున రక్షించుకొని యుండెనంత. 7

ప్ర. వికల అంగుండు-ఐ=సంపూర్ణముకాని శరీరముగలవాడై, అనూరుడు= తొడలులేనివాడు, ఇది అరుణుని నామాంతరము; వినతకున్ అలిగి= తల్లియైన వినతపై కోపించి, 'నన్నయ నాడు ఇట్టిచోట్ల షష్ఠీవిభక్తి వాడ బడుచుండెను, ఇది కారక భేదము); సంపూర్ణ శరీరున్, కానీక= సమగ్రమైన దేహము గలవానిని గానీయకుండ, అండంబు=గ్రుడ్డును, అవియించిన = పగులునట్లు చేసిన, అవినీతవు = నీతిలేనిదానవు, నీ సవతికి=నీ భర్త రెండవ భార్యయైన కద్రువకు, ఏనూఱు+ఏండ్లు= అయిదువందల సంవత్సరములు, రెండవ అండంబు=రెండవ గ్రుడ్డు, తనకున్-తాను+అ=తనంతటతానే, అవియు, అంతకున్=బద్దలగు నంతవరకు, మహత్ బల పరాక్రమ సంపన్నుండు = గొప్ప బలము తోడను, శౌర్యముతోడను కూడినవాడు; నీ దాసీత్వంబు = నీ దాసీ తనమును, పాపున్=పోగొట్టును, సూర్యరథ సూతుండు=సూర్యుని యొక్క రథమునకు సారథి, అరిగె=వెళ్ళెను, వినతయు; ఆ+ అండంబు=ఆ రెండవగ్రుడ్డు, అతిప్రయత్నంబున = మిక్కిలి ప్రయ త్నముతో (జాగరూకతతో), రక్షించుకొని, ఉండెన్= కాపాడుకొని యుండెను.

కం. అమరాసుర వీరులు ము
న్నమల పయోరాశిఁ ద్రచ్చి యమృతము వడయన్
సమగట్టి సురేంద్రపురో
గములై హరిహర హిరణ్యగర్భులతోడన్. 8

ప్ర. అమర,అసుర,వీరులు=వీరులయిన దేవరాక్షసులు; మున్ను=పూర్వము అమల, పయోరాశిన్=నిర్మలమయిన పాల సముద్రమును, త్రచ్చి= మథించి; అమృతము; పడయన్ = సమకట్టి = పూని; సుర, ఇంద్ర పురోగములు, ఐ=దేవతల రాజయిన యింద్రుడు ముందున్న వాడుగా గలవారై; హరి, హర, హిరణ్య గర్భులతోడన్=విష్ణువు, శివుడు బ్రహ్మ అనువారితో.

తా: పూర్వము వీరులయిన దేవతలును రాక్షసులును పాల సముద్రమును మథించి అమృతము పొందబూని, ఇంద్రుని ముందుంచుకొని, విష్ణుశంకర బ్రహ్మలతో.

ఉ. మేరు మహా మహీధరము మీఁదికి నందఱుఁబోయి యే క్రియన్
వారిధిఁ ద్రచ్చువారము, ధ్రువంబుగ దానికిఁ గవ్వమెద్ది యా
ధారము దానికెద్దియని తద్దయు వెన్నడి యున్న సచ్యుతాం
భోరుహగర్భులిద్దఱును బూనిరి సర్వము నిర్వహింపఁగన్. ౨

ప్ర. మేరు, మహత్, మహీధరము, మీదికి=మేరువను గొప్ప పర్వతముమీదికి, అందఱున్, పోయి=దేవతలును రాక్షసులు నందఱును వెళ్ళి; ఏక్రియన్=ఏ విధముగా, వారిధిన్ = సముద్రమును; త్రచ్చువారము= మథింతుము; ధ్రువంబుగ= స్థిరముగా; దానికిన్ =ఆ కార్యమునకు; కవ్వము; ఎద్ది=ఏది; దానికిక =ఆకవ్వమునకు, ఆధారము=అవలంబము; ఎద్ది=ఏది,అని;తద్దయు=మిక్కిలి వెన్నడి,యున్నన్ =చింతించుచుండగా; అచ్యుత, అంభోరుహ గర్భులు; ఇద్దఱున్ = విష్ణువును బ్రహ్మయు నిర్వురును; సర్వము=అంత కార్యమును, నిర్వహింపగన్=సాధించుటకు; పూనిరి=సమకట్టిరి.

తా: దేవాసురులందఱును మేరు పర్వతము మీదికిపోయి, ఏ విధముగా సముద్రమును మథింతుము? మథించుటకు స్థిరమగు కవ్వమేది? ఆ కవ్వమునకు క్రింద నాధారమేది? అని మిక్కిలి వెసుదీయుచుండగా, బ్రహ్మ విష్ణువులిద్దఱును అమథన కార్యమునంతను సాధించుటకు సమకట్టిరి.

చం. అరుదుగ సర్వశైలములయంత తనర్పును నార్జవంబు సు
స్థిరతయు నోషధీరస విశేషతయున్‌గల దుత్తమంబు మం
దరకు ధరంబు కవ్వమగు దానికి నంచును నిశ్చయించి, య
య్యిరువురు పంపగాఁ బెఱికి యెత్తె ననంతుఁడు తద్గిరీంద్రమున్. 10

ప్ర. అరుదుగన్=అపూర్వముగా· సర్వశైలముల, అంత, తనర్పును=అన్ని పర్వతముల యంత పొడవును; ఆర్జవంబు=సరళత్వమును; (వంకర లేని తనము), సుస్థిరతన్ = మంచి స్థిరత్వము; ఓషధీ, రస విశేషత యున్ = మూలికల యొక్క రసము యొక్క అతిశయము కలిగి యుండుటయు, కలది = కల్గియున్నది, ఉత్తమంబు = శ్రేష్ఠమైన, మంధర, కుధరంబు=మంథరపర్వతము; దానికి=ఆమథించు కార్యమునకు; కవ్వము అగున్ అంచును నిశ్చయించి = నిర్ణయించి; ఇరువురును=ఆ బ్రహ్మ విష్ణువు లిద్దరును, పంపగాన్=ఆజ్ఞాపింపగా; అనంతుడు=శేషుడు, తద్, గిరి, ఇంద్రమున్=ఆ పర్వత శ్రేష్ఠమును, పెఱికి=పెల్లగించి; ఎత్తెన్=ఎత్తెను.

తా. అపూర్వముగా నన్ని పర్వతములును కూడినచో ఎంత పొడవుండునో అంత పొడవును, వంకరలేని యెత్తును, మిక్కిలి స్థిరత్వమును, మూలికల రసముయొక్క అతిశయముతో కూడియుండుటయు గలదియు, శ్రేష్ఠమును, అగు మంథర పర్వతము, దానికి కవ్వమగునని నిర్ణయించి ఆ బ్రహ్మ విష్ణువు లిరువురు నాజ్ఞాపింపగా, శేషుడా పర్వత శ్రేష్ఠమును పెల్లగించి పైకెత్తెను.

వ. ఇట్లు పదునొకండు వేల యోజనంబుల తనర్పును నంతియపాతునుం గల మంథరనగం బనంతుం డనంతశక్తిం బెఱికి యెత్తిన నందఱును నప్పర్వతంబు తెచ్చి సముద్రంబులో వైచి, దానిక్రింద నాధారంబుగాఁ గూర్మరాజు నియమించి, యోక్త్రంబుగా వాసుకి నమర్చి. 11

ప్ర. ఇట్లు=ఈ విధముగా; పదునొకండు, వేల, యోజనంబుల, తనర్పును పదొకండువేల ఆమడల (4 క్రోసులు) పొడవును, అంతియపాతునున్= పదొకొండు వేల యోజనముల భూమి లోపలి భాగమును; మంథర

నగంబు=మంథర పర్వతము; అనంతశక్తిన్ = అధికమయిన శక్తితో; పెఱికి=పెల్లగించి ఆ + పర్వతంబు, ఆధారంబుగా=అవలంబముగా; కూర్మరాజు=ఆది కూర్మమును; తాఁబేటిని, నియమించి=నియోగించి, యోక్త్రంబుగా=కవ్వపు త్రాడుగా; వాసుకిన్ = వాసుకి యను సర్ప రాజును; అమర్చి=ఏర్పరిచి.

శా. క్షోణీచక్రభరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయఁగా నార్చి య
క్షీణోత్సాహ సమేతులై రయమునన్ గీర్వాణులున్, బూర్వగీ
ర్వాణ వ్రాతము నబ్ధిఁద్రచ్చునెడఁ దద్వ్యాకృష్ట నాగానన
శ్రేణీప్రోత్థ విషాగ్నిధూమ వితతుల్ సేసెన్, పయోదావళిన్. 12

ప్ర. క్షోణీ, చక్ర, భరంబు = భూమియొక్క భారము; గ్రక్కదలన్ = మిక్కిలి కదలగా, దిక్కుల్ =దిక్కులు; మ్రోయగా=ప్రతిధ్వనింపగా; ఆర్చి=బొబ్బలిడి; అక్షీణ, ఉత్సాహ, సమేతులు ఐ = అధికమయిన ఉత్సాహముతో కూడినవారై; రయమునన్ = వేగముతో; గీర్వాణులున్ = దేవతలును; పూర్వగీర్వాణ వ్రాతమున్ =రాక్షసుల యొక్క సమూహ మును; అబ్ధిన్ = సముద్రమును; త్రచ్చు, ఎడన్=మథించునపుడు; తత్, వ్యాకృష్ట, నాగ, ఆనన, శ్రేణీ, ప్రోత్థ, విష, అగ్ని, ధూమ, వితతుల్=వారిచేత లాగబడిన వాసుకియను సర్పముయొక్క ముఖముల వరుసనుండి బయల్వెడలిన విషమనెడి యగ్నియొక్క పొగల సముదాయ ములు; పయోద, ఆవళిన్=మేఘముల పంక్తిని, చేసెన్=సమకూర్చెను, కలిగించెను.

తా: గుంౘని భూమియొక్క భారము మిక్కిలి కదలగా, దెసలు మారు మ్రోయగా, కేకలిడి అధికమయిన యుత్సాహముతో కూడినవారై, వేగ ముతో దేవతలును, రాక్షసుల సముదాయమును సముద్రమును మథించు నపుడు వారిచే లాగబడిన వాసుకి సర్పము యొక్క ముఖముల వరుసల నుండి బయల్వెడలిన విషమనెడి అగ్ని యొక్క పొగల గములు మేఘ పంక్తిని కల్పించెను.

క. ఉరగపతి తలల వలను రు
తరజవమున నసురు లూది తత్పుచ్ఛము ని
ర్జర వరులూది మహామ
త్సరమున వడి ద్రచ్చి ద్రచ్చి జవ మఱియున్నన్. 13

ప్ర. ఉరగపతి, తలల, వలను = సర్పరాజయిన వాసుకి తలల వైపు, ఉరుతర, జవమునన్ = మిక్కిలి అధికమయిన శక్తితో (వడితో), అసురులు = రాక్షసులు, ఊది = పట్టుకొని, తత్, పుచ్ఛము = ఆ వాసుకి తోకను, నిర్జర, వరులు = దేవతా శ్రేష్ఠులు, ఊది, మహత్, మత్సరమునన్ = అధికమగు చలముతో, వడి = వేగముతో, త్రచ్చి, త్రచ్చి = మథించి మథించి, జవము, అఱి, ఉన్నన్ = శక్తి నశించియుండగా.

తా: రాక్షసులు సర్పరాజయిన వాసుకి తలల వైపును, అధికమయిన శక్తితో పట్టుకొని, దేవతలు దాని తోకను పట్టుకొని మిక్కిలి పట్టుదలతో మథించి మథించి శక్తి తగ్గియుండగా,

కం. నారాయణుండు వారిక
వారిత జవసత్త్వములు ధ్రువంబుగనిచ్చెన్
వారును తొల్లిటికంటె న
పార ప్రారంభులై రపరిమిత శక్తిన్. 14

ప్ర. నారాయణుండు = విష్ణువు, వారికి = ఆ దేవ రాక్షసులకు, అవారిత, జవ, సత్త్వములు = తగ్గని వేగమును శక్తిని, ధ్రువంబుగా = స్థిరముగా, ఇచ్చెను, వారును = ఆ దేవరాక్షసులును, అపరిమిత, శక్తిన్ = అధికమయిన శక్తితో, తొల్లిటికంటె = మునుపటికంటె, అపార, ప్రారంభులు, ఐరి = అంతములేని ప్రయత్నము గలవారయిరి.

తా: విష్ణువు, ఆ దేవరాక్షసులకు తగ్గని వేగమును శక్తిని స్థిరముగా నిచ్చెను. వారును అధికమయిన శక్తితో పూర్వముకంటె అంతములేని ప్రయత్నము గలవారయిరి.

చం. ఉడుగక యొండొరుంజఱచి యొక్కబలంబున దేవదానవుల్
వడిగొని వార్థినిట్లు దరువన్ దరువన్ విష ముద్భవిల్లి నల్
గడలును విస్ఫులింగములు గప్పగఁబర్విన, దాని (జెచ్చెరన్
మృడుడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబుననిల్పెఁ బొల్పుగన్. 15

ప్ర. ఉడుగక=మానక; ఒందు, ఒరున్=ఒక రొకరిని; చఱచి=ఆఱచేత కొట్టి; ఒక్క బలంబున=ఏకధాటిగా; దేవ, దానవుల్ = దేవతలును రాక్షసులును; వడి, కొని=వేగము వహించి; వార్ధిన్=సముద్రమును, ఇట్లు=ఈ విధముగా; తరువన్, తరువన్ = మథింపగా మథింపగా; విషము; ఉద్భవిల్లి=పుట్టి; నల్ గడలను=నాలుగు దిక్కుల యందును; విస్ఫులింగములు = నిప్పుకణములు; కప్పగా = ఆవరించునట్లుగా; పర్విన=వ్యాపింపగా, దానిన్ =ఆ విషమును; మృడుడు = శివుడు; కడంగి=పూని; పట్టుకొని; మ్రింగి; గళంబున=కంఠమునందు; పొల్పుగాన్ =అందముగా; నిల్పె=ఉంచెను.

తా: దేవాసురులు మానక ఉత్సాహమున నొండొరుల చేత చఱచి యేక ధాటితో వేగము వహించి సముద్రము నిట్లు మథింపగా, మథింపగా విషము పుట్టి నాలుగు దిక్కులను నిప్పుకణము లావరించునట్లు వ్యాపింప, దానిని వేగముతో శివుడు పూనిపట్టుకొని మ్రింగి అందమగునట్లుగా కంఠమునందు నిల్పెను.

వ. మఱియు నమృతంబును జ్యేష్ఠయు జంద్రుడును శ్రీయును నుచ్చైశ్శ్రవంబును గౌస్తుభంబును ధన్వంతరియు, నైరావత గజంబు నాదిగా ననేకంబు లుద్భవిల్లిన నందు త్రిభువన వంద్యయయిన శ్రీదేవియు నిజ ప్రభాపటల పర్యుదస్త ప్రభాకర గభస్తి విస్తరంబయిన కౌస్తుభంబును నారాయణు వక్షస్థలంబున విలసిల్లె నుచ్చైశ్శ్రవంబను యుగ్యంబు నైరావణ గజంబును సురరాజయోగ్యంబు లయ్యె నంత నయ్యమృతంబు నసురులుచే కొనిన.

ప్ర. జ్యేష్ఠయున్=జ్యేష్ఠాదేవియు; శ్రీయునున్=లక్ష్మీదేవియును; ఉచ్చైశ్శ్రవంబును ఆ పేరు గల తెల్లని గుఱ్ఱమును; కౌస్తుభంబును = కౌస్తుభ

మణియు; ధన్వంతరియు = దేవ వైద్యుడును, ఐరావణ గజంబును = ఐరావతమను పేరుగల ఏనుగును; ఆదిగా = మొదలుగా; అనేకంబులు పెక్కు, ఉద్భవిల్లినన్ = పుట్టగా; అందున్ = వానిలో; త్రిభువన, వంద్య అయిన = మూడు లోకములకు నమస్కరింప దగినదైన; శ్రీదేవియు = లక్ష్మీదేవియు; నిజ, ప్రభా, పటల పర్యుదస్త, ప్రభాకర, గభస్తి, విస్తరంబు, ఐన = తన కాంతి సముదాయముచే నిరసింపబడిన సూర్యుని కిరణముల సముదాయము గలదయిన; కౌస్తుభంబును; నారాయణు, వక్షః స్థలంబున = విష్ణువు యొక్క ఱొమ్మున; విలసిల్లె = ప్రకాశించెను; యుగ్యంబును = గుఱ్ఱమును; ఐరావణ గజంబును = ఐరావతమను నేనుగును; సురరాజ, యోగ్యంబులు = దేవేంద్రునికి, దగినవి; ఆ అమృతంబున్, అసురులు = రాక్షసులు; చేకొనినన్ = గ్రహింపగా;

కం. నారాయణుఁడు కృత్రిమ
నారీ రూపమునఁ దన్మనంబుల కతిమో
హారంభకారుఁడై యమ
రారులచేఁ గ్రమ్మఱంగ నమృతము గొనియెన్ 17

ప్ర. నారాయణుండు = విష్ణువు; కృత్రిమ, నారీ, రూపమునన్ = మాయాకాంతా రూపమున; తత్, మనంబులకు = ఆ రాక్షసుల మనస్సులకు; అతిమోహ, ఆరంభ కారుడు, ఐ = అధికమయిన మోహము యొక్క ఉదయము కలిగించువాడై; అమర, అరులచేన్ = దేవతలకు శత్రువులైన రాక్షసుల నుండి; క్రమ్మ ఱంగన్ = తిరుగ; అమృతము; కొనియెన్ = గ్రహించెను;

తా: విష్ణువు మాయాకాంతా రూపముతో రాక్షసుల మనస్సులకు అధికమయిన మోహముయొక్క యుదయము కలిగించువాడై వారినుండి తిరిగి అమృతము గ్రహించెను.

వ. ఇట్లుపాయంబున నసురుల వంచించి యమృతంబుగొని విష్ణుదేవుండు దేవతల కిచ్చిన నయ్యమృతంబు దేవత లుపయోగించుచో దేవరూపంబు దాల్చి రాహువు వేల్పుల బంతి నయ్యమృతం బుపయోగింపం బోయిన,

దత్సమీపంబున నున్న చంద్రాదిత్యులు వాని నెఱింగి నారాయణునకుం జెప్పిన, నయ్యమృతంబు వాని కంఠబిలంబు సొరకమున్న.

ప్ర. ఉపాయంబునన్ = నేర్పుతో; అసురుల = రాక్షసులను; వంచించి = మోసగించి; ఆ + అమృతంబు = ఆ అమృతమును; ఉపయోగించుచో = త్రాగునపుడు; దేవ, రూపంబు = దేవతయొక్క రూపము; తాల్చి = ధరించి; రాహువు = రాక్షసులలో నొకడు; నవగ్రహములలో నొకడు; వేల్పుల, బంతిన్ = దేవతల వరుసయందు; ఉపయోగింపన్-పోయినన్ = త్రాగుటకు వెళ్ళగా; తత్, సమీపంబునన్ = ఆతనిచెంత; చంద్ర, అదిత్యులు = చంద్రుడును సూర్యుడును; వానిన్ = రాహువును, వాని, కంఠబిలంబు = రాహువుయొక్క కంఠము యొక్క రంధ్రమును; చొరక, మున్న, అ = ప్రవేశించుటకు ముందే.

కం. అమరారి మర్దనుఁడు చ
క్రము గ్రక్కున నేయ రాహు కంఠముదెగి దే
హము ధరణిఁ బడియెఁ దన్ముఖ
మమృత స్పర్శమున నక్షయంబై నిలిచెన్. 19

ప్ర. అమర, అరి, మర్దనుడు = దేవతలకు శత్రువులైన రాక్షసులను సంహరించునట్టి విష్ణువు; చక్రము = తన ఆయుధమగు సుదర్శనమును; గ్రక్కునన్ = వేగముగా; ఏయ = ప్రయోగింపగా; రాహు, కంఠము = రాహువుయొక్క మెడతెగి; దేహము = శరీరము; ధరణిన్ = భూమియందు; పడియెన్ = పడెను; తత్ముఖము = ఆ రాహువుయొక్క ముఖము; అమృత, స్పర్శమునన్ = అమృతముయొక్క తాకుచే; అక్షయంబు ఐ = నాశములేనిదై; నిలిచెన్ = ఉండెను;

తా. రాక్షసాంతకుడయిన విష్ణువు తన చక్రమును వేగముగా ప్రయోగింపగా రాహువుయొక్క కంఠము తెగుటచే శరీరము భూమిపై పడెను. ఆతని ముఖము మాత్రము అమృతము యొక్క తాకుచే నాశము లేనిదై యుండెను.

ఇట తెగి యను క్త్వార్థకక్రియ హేత్వర్థమున వాడబడినది.

వ. నాఁటంగోలె రాహువునకుఁ జంద్రాదిత్యులతోడి విరోధంబు శాశ్వతంబై ప్రవర్తిల్లుచుండె; 20

నాఁటంగోలె = నాటినుండి, చంద్ర, ఆదిత్యులతోడి, విరోధంబు = చంద్రసూర్యులతో వైరము; (సమాసమున తోడకు ఇత్వమువచ్చినది) శాశ్వతంబు + ఐ = నిత్యమయి; ప్రవర్తిల్లుచుండె = జరుగుచుండెను;

## దేవ దానవుల యుద్ధము

సీ. అంత దేవాహితు లమృతంబుగానక యెంతయునలిగి బలీంద్రుఁగూడి
మంతనంబుండి యమర్త్యులతోడి పొత్తింతియ చాలు నింకేల యనుచు
సంతనకట్టి యుత్సాహసమేతులై యంతంబులేని రథాశ్వములను
దంతుల నమితపదాతుల నొడగూర్చి యంతకాకారులై యార్చియమర.

వారలఁదాఁకి యేసి రురుతర శరపక్ష
జాత వాతరయవిధూత మగుచు
చెదర జలదపంక్తి బెదర వజ్రాయుధు
హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము 21

ప్ర. అంత = పిమ్మట, దేవ, అహితులు = దేవతలకు శత్రువులయిన రాక్షసులు, అమృతంబు; కానక = పొందక, ఎంతయున్, అలిగి = మిక్కిలి కోపించి, బలి ఇంద్రున్ = తమకు రాజయిన బలిని, కూడి = కలసికొని, మంతనంబు ఉండి = మంత్రాలోచనము చేసి, అమర్త్యుల తోడిపొత్తు = దేవతలతో స్నేహము, ఇంతియ = ఇంతే, చాలున్ = ఇఁక, ఏలఅనుచు = ఇంకెందు కనుచు, సంతనకట్టి = గుమికూడి, ఉత్సాహ సమేతులు ఐ = ఉత్సాహముతో కూడినవారై, అంతంబులేని = అపారమయిన అధికములయిన, రథ + అశ్వములను = రథములను గుఱ్ఱములను, దంతులన్ = ఏనుగులను, అమిత పదాతులన్ = అధిక సంఖ్యగల కాల్బలమును; ఒడగూర్చి = సమకూర్చి, అంతక ఆకారులై = యమునియొక్క రూపమువంటి రూపము గలవారై, ఆర్చి = బొబ్బలిడి, ఉరుతర శర పక్ష జాత వాత రయ విధూతము అగుచున్ = మిక్కిలి అధికమయిన బాణములకు కట్టిన

ఎఱకలచే పుట్టిన గాలిచే నెగురగొట్టబడిన దగుచు; జలద పంక్తి=మేఘ ముల వరుస, చెదరన్=చెదరిపోగా, వజ్ర ఆయుధ హృదయము= వజ్రము ఆయుధముగా గల యింద్రుని హృదయము; బెదర = భయ పడగా, త్రిదశగణము=దేవతల సముదాయము; ఉదిలకొనగ=పరిత పింపగా, అమరవరులన్=దేవతాశ్రేష్ఠులను, తాఁకి=ఎదిరించి, ఏసిరి= బాణములు ప్రయోగించిరి.

తా: అపుడు రాక్షసు లమృతమును బొందక మిక్కిలి కోపించి, తమ రాజ యిన బలిచక్రవర్తిని కలసికొని ఆలోచనముచేసి, దేవతలతోడి పొందింతే చాలును, ఇంకెందుకనుచు గుమికూడి యుత్సాహముతో కూడినవారై అమితములయిన రథములను, గుఱ్ఱములను, ఏనుగులను అధిక సంఖ్య గల కాల్బలమును సమకూర్చుకొని యమునివలె భయంకరమయిన ఆకా రము గలవారై కేకలు వేయుచు, మిక్కిలి యధికములయిన బాణము లకు కట్టిన యీకల వలన పుట్టిన గాలి యొక్క వేగముచే నెగురగొట్ట బడినదై మేఘపంక్తి చెల్లాచెదరు కాగా, ఇంద్రుని హృదయము భయ పడ దేవతా సముదాయము పరితపింప, దేవతాశ్రేష్ఠుల నెదిరించి బాణాదు లగు నాయుధములను ప్రయోగించిరి.

మ.స్ర. అమరేంద్రారాతు లిట్లాహవ ముఖమున నేయంగఁ దత్తీక్ష్ణబాణౌ
ఘము ఘోరంబై సురానీకము పయిఁ బెలుచం గప్పినం జూచి దైత్యో
త్తములం గోదండ చక్రోద్యత భుజులు మహోదారుణుల్ వీరలక్ష్మీ
రమణుల్ దుర్వారవాత్యా రయమున నరనారాయణుల్ దాకిరల్కాన్. 22

ప్ర. అమర ఇంద్ర అరాతులు = దేవేంద్రునకు శత్రువులయిన రాక్షసులు, ఇట్లు=ఈ విధముగ, ఆహవ ముఖమునన్=యుద్ధరంగము ముందటి భాగమున, ఏయంగన్=బాణాదులను ప్రయోగింపగా, తత్ తీక్ష్ణ బాణ ఓఘము=వారి వాడియైన బాణములయొక్క సముదాయము, ఘోరంబు-ఐ=భయంకరమయి, సుర అనీకము పయిన్=దేవతల సైన్యముమీద, పెలుచన్=దట్టముగా, కప్పినన్ చూచి; దైత్య ఉత్తములన్=రాక్షస శ్రేష్ఠులను, కోదండ చక్ర ఉద్యతభుజులు=క్రమముగా గాండీవ ధనుస్సు

తోడను, చక్రముతోడను ఎత్తబడిన భుజములు గలవారును; మహాదారుణుల్=మిక్కిలి భయంకరులును, వీర లక్ష్మీ రమణుల్=శౌర్య లక్ష్మికి ప్రియులును; ఐన నరనారాయణుల్ = నరుడును నారాయణుడును; దుర్వార వాత్యా రయమున = వారింపశక్యము కాని పెనుగాలి యొక్క వేగమువంటి వేగముతో; అల్కన్=కోపముతో; తాకిరి = ముట్టడించిరి.

తా: రాక్షసు లీవిధముగా యుద్ధ రంగమున బాణములు ప్రయోగింపగా, వారి బాణముల సమూహము భయంకరమై దేవతల సేనమీద దట్టముగా కప్పగా చూచి, గాండీవ ధనుస్సుతోడను, చక్రముతోడను కూడినవారును మిక్కిలి భయంకరులును, శౌర్య లక్ష్మికి ప్రియులునైన నరుడును నారాయణుడు ననువారు, వారింపశక్యముగాని పెనుగాలి యొక్క వేగము వంటి వేగముతో రాక్షస శ్రేష్ఠులను ముట్టడించిరి.

మహాస్రగ్ధరకు ప్రతిపాదమునకు, స, త, త, న, స, ర, ర, గ- అను గణము లుండును. 1-8-16 అక్షరములు యతి స్థానములు.

మ. నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచ ధారల్ భయం
కరదైతేయ నికాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ, బం
ధుర ధాత్రీధర తుంగ శృంగతట సందోహంబుపైఁ గప్పు దు
ర్ధర ధారాధరముక్త సంతత పయో ధారావళిన్ బోలుచున్. 23

ప్ర. నర, చాప, ప్రవిముక్త, దారుణ, బృహత్, నారాచ, ధారల్ = నరుని ధనుస్సునుండి విడువబడిన, భయంకరమయిన పెద్ద బాణముల పరంపరలు, దిశల్ నిండ=దిక్కులు నిండగా, బంధుర, ధాత్రీధర, తుంగ, శృంగ, తట, సందోహంబుపై=అందమయిన పర్వతముల యొక్క ఎత్తైన శిఖరముల ప్రాంతముల సముదాయముపై, కప్పు=ఆవరించు, దుర్ధర, ధారాధర, ముక్త, సంతత, పయః, ధారా, ఆవళిన్, పోలుచున్ =ధరింప శక్యముగాని మేఘములనుండి విడువబడిన దట్టమయిన నీటి ధారల సముదాయమును, భయంకర, దైతేయ నికాయ, కాయములపైన్

భయమును కల్గించు రాక్షస సముదాయముల శరీరములపై, కప్పెన్ = ఆవరించెను.

తా: నరుని ధనస్సు నుండి విడువబడిన భయంకరములయిన పెద్ద బాణముల పరంపరలు దిక్కులు నిండగా అందమయిన పర్వతముల యొక్క యెత్తయిన శిఖర ప్రాంతముల సమూహముపై కప్పు ధరింప శక్యముగాని మేఘముల నుండి విడువబడిన దట్టమయిన నీటిధారల సముదాయమును పోలుచు, భీకరములయిన రాక్షసుల శరీరముల సముదాయములపై కప్పెను.

మ. పతదుర్వీధర ధాతు నిర్ఝర జలాభంబై మహాదేహ ని
ర్గత సాంద్రారుణ పూర మొక్కమొగి నొల్కంద్రెస్సి నారాయణో
న్నత దోర్దండ విముక్త చక్ర నిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోర రణంబునం బడియె భూభాగంబు కంపింపగన్. 24

ప్ర. పతత్, ఉర్వీధర, ధాతు, నిర్ఝర, జల, ఆభంబు + ఐ = క్రిందికి పడుచున్న పర్వతము యొక్క గైరికాది ధాతువులతో కూడిన సెలయేళ్ళ యందలి నీటియొక్క కాంతి వంటి కాంతి కలదై, మహత్, దేహ, నిర్గత, సాంద్ర, అరుణ, పూరము = పెద్ద శరీరముల నుండి బయల్వెడలిన దట్టమయిన రక్తప్రవాహము, ఒక్క మొగిన్ = ఒకే విధముగా 'ఎడ తెగకుండ' ఒల్కన్ = జారగా, నారాయణ, ఉన్నత, దోర్దండ, విముక్త చక్ర, నిహతిన్ = నారాయణుని యొక్క యెత్తయిన దండముల వంటి భుజముల నుండి విడువబడిన చక్రముయొక్క దెబ్బచే, త్రెస్సి = తెగి; నాక, ద్విషత్, మస్తక ప్రతతుల్ = స్వర్గమునకు శత్రువులయిన రాక్షసుల తలల సమూహములు, భూభాగంబు = భూతలము, కంపింపగన్ = చలింపగా. ఘోర రణంబునన్ = భయంకరమయిన యుద్ధమునందు, పడియెన్ = పడెను.

తా. పైనుండి క్రిందికి పడుచున్న గైరికాది ధాతువుతో గూడిన కొండ నదుల నీటియొక్క కాంతి వంటి కాంతి గలదై, పెద్ద దేహముల నుండి బయల్వెడలిన రక్తప్రవాహము, ఎడతెగకుండ, జారగా, నారాయణుని యొక్క

ఎత్తయిన దండముల వంటి భుజముల నుండి, విడువబడిన చక్రము యొక్క దెబ్బచే తెగి, రాక్షసుల తలల సముదాయములు, భూతలము చలింపగా, భయంకరమయిన యుద్ధరంగమున పడెను.

వ. ఇట్లు సముద్రతీరంబున నమరాసురులకు నతిఘోర యుద్ధంబయ్యె నందు నరనారాయణు లపార పరాక్రములై యసురవీరుల బెక్కండ్రం జంపిన నుక్కడంగి, దెసచెడి, యసురులా సముద్రంబు సొచ్చిన నమరులు సమరలబ్ధ విజయులై యమరపతి నమృత రక్షణార్థంబు ప్రార్థించి యథా స్థానంబున మంధరనగంబు ప్రతిష్ఠాపించి, తమ తమ నివాసంబులకుం జని సుఖంబుండిరంత.

ప్ర. సముద్రతీరంబునన్=సముద్రపుటొడ్డున; అమర, అసురులకున్=దేవతలకును రాక్షసులకును, అతిఘోర యుద్ధంబు=మిక్కిలి భయంకరమయిన యుద్ధము, అపార పరాక్రములు ఐ=అంతములేని విక్రమముగలవారై, అసుర వీరులన్, పెక్కండ్రన్=పలువురు వీరులయిన రాక్షసులను, ఉక్కు, అడంగి=గర్వము తగ్గి, దెసచెడి=దిక్కులేక, అసురులు=రాక్షసులు, చొచ్చినన్=ప్రవేశింపగా, అమరులు=దేవతలు, సమరలబ్ధ విజయులు, ఐ=యుద్ధమునందు పొందబడిన విజయము గలవారై, అమర పతిన్=దేవతలకు రాజయిన యింద్రుని; అమృత రక్షణ, అర్థంబు=అమృతమును రక్షించుట కొరకు, ప్రార్థించి=వేడి, మంధర నగంబున్=మంధర పర్వతమును, యథాస్థానంబున=పూర్వమున్న చోట, ప్రతిష్ఠాపించి=నిలిపి, తమ తమ నివాసంబులకున్=తమ తమ గృహములకు, చని=వెళ్ళి, సుఖంబు ఉండిరి=సుఖముతో నుండిరి.

## కద్రూవినతలు ఉచ్చైశ్శ్రవము జూచుట

క. అమృతముతో నుద్భవమై
యమరేశ్వర యోగ్యమయిన హయరత్నము త
ద్విమలోదధితీరంబునఁ
గొమరుగ నేకతమ యిచ్చఁ గ్రుమ్మరుచున్నన్.

ప్ర. అమృతముతోన్; ఉద్భవము + ఐ=పుట్టి; అమర-ఈశ్వర, యోగ్యము అయిన=దేవతల రాజయిన యింద్రునికి తగిన; హయ, రత్నము= అశ్వశ్రేష్ఠము; తత్, విమల, ఉదధి, తీరంబునన్ = ఆనిర్మలమయిన పాలసముద్రపు టొడ్డున; కొమరుగన్=అందముగా; ఏకతము, అ= ఒంటరిగా; ఇచ్చన్ = స్వేచ్ఛగా; క్రుమ్మరుచు, ఉన్నన్ = తిరుగుచుండగా.

తా. అమృతముతో పాటు పుట్టి దేవేంద్రునిచే గ్రహింపబడిన యుచ్చైశ్శ్రవమను నశ్వశ్రేష్ఠము, ఆ పాలసముద్రము ఒడ్డున అందముగా నొంటరిగా, స్వేచ్ఛగా తిరుగుచుండగా.

వ. అట్టియెడఁ గద్రువయు వినతయు వినోదార్థంబు విహరించువారు కరిమకర నికరాఘాత జాత వాతోద్ధూత తుంగ తరంగాగ్ర సముచ్ఛలజ్జలకణాసార చ్ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని, నుద్యాన వనంబునుంబోలె బహు విద్రుమలతాలంకృతంబయిన దాని, నాటకప్రయోగంబునుం బోలె, ఘనరసపాత్ర శోభితరంగ రమ్యంబయిన దాని దివంబునుంబోలె నహిమకర భరితంబయిన దాని మఱియు. 27

ప్ర. అట్టి-ఎడన్=ఆసమయమునంటు; కద్రువయు; వినతయు; వినోద + అర్థంబు=వినోదముకొఱకు; విహరించువారు=సంచరించువారు, కరి, మకర, నికర, ఆఘాత, జాత, వాత, ఉద్ధూత, తుంగ, తరంగ, సముచ్ఛలత్, జల, కణ, ఆసారఛటా, అచ్ఛాదిత, గగనతలంబు, అయిన దానిన్=నీటియేనుగుల యొక్కయు మొసళ్ళ యొక్కయు, సముదాయములయొక్క దెబ్బలచే పుట్టిన, గాలిచే ఎగురగొట్టబడిన, ఎత్తైన, కెరటముల పైభాగమున కదలాడు, నీటిబిందువుల జడివానల సముదాయముచే కప్పబడిన ఆకాశ భాగముగల దానిని; ఉద్యానవనంబునున్, పోలె = విహారవనమువలె; బహు, వి, ద్రుమ, లతా, అలంకృతంబు, అయిన దాని=పెక్కు పక్షులచేతను, చెట్లచేతను, లతలచేతను అలంకరింపబడిన దానిని (సముద్ర పక్షమున) బహు, విద్రుమలతా, అలంకృతంబు అయినదాని = పెక్కు పగడపు తీగలచే నలంకరింపబడిన దానిని,

నాటక, ప్రయోగంబునున్, పోలె=నాటకముయొక్క ప్రదర్శనమువలె, ఘన, రస, పాత్ర, శోభిత, రంగరమ్యంబు, అయినదానిన్ = గొప్ప శృంగారాది రసములతోడను, పాత్రలతోడను, ప్రకాశించు రంగముచే సుందరమయినదానిని, (సముద్రపక్షమున) ఘన, రస, పాత్ర, శోభి, తరంగ, రమ్యంబు, అయిన దాని=గొప్ప నీటికి నెలవులై ప్రకాశించు కెరటములచే సుందరమయినదానిని, ఇచ్చట ఘన=అనగా మేఘములనియు నర్థము చెప్పవచ్చును; (మేఘములందలి నీటికి నెలవులై); దివంబునున్-పోలె=ఆకాశమువలె; అహిమ, కరభరితంబు, అయినన్=వేడికిరణములుగల సూర్యునితో కూడిన దానిని, (సముద్ర పక్షమున) అహి, మకర, భరితంబు, అయినదానిని=పాములతోడను, మొసళ్ళతోడను కూడిన దానిని;

నన్నయ శ్లేషతో రచించిన కొలది భాగములలో నిదియొకటి.

చం. అలఘుఫణీంద్రలోక కుహరాంతర దీప్త మణిస్ఫురత్ప్రభా
వలిగలదాని శశ్వదుదవాస మహావ్రత శీత పీడితా
చలముని సౌఖ్యహేతు విలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిఁగెడి దానిఁగాంచి, రరవిందనిభానన లమ్మహోదధిన్. 28

ప్ర. అరవింద, నిభ. ఆననలు=పద్మముతో సమానమయిన ముఖములుగల కద్రూ వినతలు, అలఘు, ఫణి ఇంద్ర, లోక, కుహర, అంతర, దీప్త, మణి, స్ఫురత్, ప్రభా, ఆవలి, కలదాని, గొప్ప నాగరాజుల లోకమయిన పాతాళము యొక్క గుహలోపల ప్రకాశించు రత్నముల యొక్క వెలుగు చున్న కాంతుల సముదాయము గలదానిని, శశ్వత్. ఉదవాస, మహత్, వ్రత, శీత, పీడిత, అచల, ముని, సౌఖ్య, హేతు విలసత్, బడబా, అగ్ని, శిఖా, చయంబులన్ = ఎల్లప్పుడును నీటియందు నివసించుట యనెడి గొప్ప వ్రతముచే చలిచే బాధింపబడు, కదలని (పర్వతములనెడి) మునులకు సుఖమునకు కారణమయి, ప్రకాశించుచున్న ఔర్వాగ్నియొక్క జ్వాలల సముదాయములచే; వెలిగెడిదానిన్ = ప్రకాశిం దానికి, ఆ, మహత్, ఉదధిన్=ఆ గొప్ప సముద్రమును, కాంచిరి=చూచిరి.

తా. పద్మమువంటి ముఖములు గల కద్రూవినతలు గొప్ప నాగరాజుల లోకమయిన పాతాళ గుహలో ప్రకాశించు మణుల యొక్క వెలుగుచున్న కాంతుల సముదాయము గలదానిని, ఎల్లప్పుడును నీటియందు నివసించుట యను గొప్ప వ్రతముచే చలిచే బాధింపబడియు కదలకుండు, (పర్వతము లనెడి) మునుల సౌఖ్యమునకు కారణములయి ఒప్పు బడబానలముయొక్క జ్వాలల సముదాయముచే ప్రకాశించునట్టి యా పెద్ద సముద్రమును చూచిరి. మఱియును- 29

మ. వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలా వనేలా వళీ
లవలీలుంగ లవంగ సంగత లతా లాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచిరంత నెదురం ద త్తీరదేశంబునం
దవదాతాంబుజ ఫేన పుంజనిభు నయ్యశ్వోత్తముం దవ్వులన్.

ప్ర. అంత = పిమ్మట, ధవళ, అక్షుల్ = తెల్లని కన్నులు గల కద్రూవినతలు; చని = వెళ్ళి; ఎదురన్ = తమయెదుట; దవ్వులన్ = దూరమునందు; వివిధ, ఉత్తుంగ, తరంగ, ఘట్టన, చలత్‌వేలా, వన, ఏలా, ఆవళీ, లవలీ, లుంగ, లవంగ సంగత, లతా, లాస్యంబులు = పలు విధములయిన యెత్తయిన కెరటముల, దెబ్బలచే, కదలుచున్న వేలావన = సముద్రపుటొడ్డునందలి, వనములందలి, ఏలకీల తల సమూహములు, లవలి యను పేరుగల లతలు, మాదీలతలు, లవంగలతలు అను అందములయిన (ఒండొంటితో కలసిన) లతలయొక్క చలన రూపములైన నాట్యములు; ఈక్షించుచున్ = చూచుచు; తత్, తీర, దేశంబునన్ = ఆ సముద్రముయొక్క తీర ప్రదేశమునందు; అవదాత, అంబుజ, ఫేన పుంజ, నిభున్ = తెల్లని పద్మములతోడను, నురుగు సముదాయముతోడను సమానమైన; ఆ + అశ్వ + ఉత్తమున్ = ఆ శ్రేష్ఠమైన గుఱ్ఱమును; కాంచిరి = చూచిరి.

తా. పిమ్మట తెల్లని కన్నులుగల కద్రూవినతలు వెళ్ళి తమ యెదుట పలు విధములైన ఎత్తైన కెరటముల దెబ్బలచే కదలుచున్న సముద్రపుటొడ్డు

నందలి వనములందలి ఏలకీలతలు, లవలీలతలు, మాదీలతలు, లవంగ లతలు అను ఒండొంటితో కలసిన అందములైన లతల నాట్యములు చూచుచు తెల్లని పద్మములతోడను, నురుగు సమూహముతోడను సమాన మైన ఆ ఉచ్చైశ్శ్రవమను హయశ్రేష్ఠమును చూచిరి.

వ. కనికద్రువ వినతంజూచి చూడవె యల్ల యతిధవళంబైన యశ్వంబు నందు సంపూర్ణ చంద్రునందు నల్లయుంబోలె వాల ప్రదేశమునందు నల్లయై యున్నది యనిన విని వినత నగి నీవేకన్నులం జూచితే అక్క! యెక్కడిది నల్ల యీ యశ్వరాజుమూర్తి మహాపురుష కీర్తియుంబోలె నీతి నిర్మలంబై యొప్పుచున్నయది యనిన విని వినతకుఁ గద్రువ యిట్లనియె. 31

ప్ర. కని = ఆ గుఱ్ఱమునుచూచి; చూడవె = చూడుమా; అల్ల = ప్రసిద్ధమైన; అతి, ధవళంబు, ఐన = మిక్కిలి తెల్లనిదైన; అశ్వంబునందు = గుఱ్ఱము నందు; సంపూర్ణ, చంద్రు, అందు = నిండు చంద్రునియందు; నల్లయున్, పోలె = మచ్చవలె; వాల, ప్రదేశంబునందు = తోక భాగమునందు; నల్ల, ఐ = మచ్చయై; నగి = నవ్వి; నీవు, ఏ, కన్నులన్, చూచితి, ఏ = నీవే కన్నులతో చూచితివి (సరిగా చూడలేదని భావము), అక్క = కద్రువకు సంబోధనము; నల్ల = మచ్చ; ఎక్కడిది = ఎక్కడ ఉన్నది; ఈ, అశ్వ రాజు, మూర్తి = ఈ శ్రేష్ఠమైన గుఱ్ఱము రూపము; మహత్, పురుష, కీర్తియున్, పోలెన్ = మహాత్ముని కీర్తివలె; అతి, నిర్మలంబు, ఐ = మిక్కిలి తెల్లనిదై; ఒప్పుచున్నయది = ప్రకాశించుచున్నది; అనిన = అని వినత పల్కగా.

### కద్రూవినతలు ఒండొరులు పందెములు సఱచుట

తే. అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు
నల్లగలిగిన నీవిప్డు నాకు దాసి
వగుము మఱియందు నల్లలేదయ్యేనేని
నీకు నే దాసి నగుదు బన్నిదము సరము.

ప్ర. ఆ-మహత్-అశ్వము; ధవళదేహంబు, అందు=ఆ గొప్ప గుఱ్ఱము యొక్క తెల్లని శరీరమునందు, నల్ల=మచ్చ; కలిగిన=ఉన్నచో; నీవు, ఇప్డు, నాకు; దాసివి; అగుము; మఱి=అట్లుగాక; అందు=శరీరము నందు; నల్ల=మచ్చ; లేదు+అయ్యేన్+ఏని=నీకు; నే=నేను; దాసినే—అగుదున్; పన్నిదము=పందెము; చఱము (చఱచుదము)= అఱచేతిలో చేయివేసి పన్నిదము వేయుదము.

తా. ఆ గొప్ప గుఱ్ఱము యొక్క తెల్లని దేహమునందు నల్లని మచ్చయున్నచో నీవిపుడు నాకు దాసివగుము. అట్లుగాక ఆ శరీరమునందు మచ్చలేనిచో నేను నీకు దాసినగుదును. పందెము వేయుదము.

వ. అని యిట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి పన్నిదంబు చఱచిన వినత యయ్యశ్వంబు డాసి చూతము రమ్మనినఁ గద్రువయు నిపుడు ప్రొద్దులేదు పతి పరిచర్యాకాలంబునయ్యె రేపకడయ చూతమని యిద్దఱు మగుడి వచ్చి తమ నివాసంబులకుం బోయియున్నయపుడు.

ప్ర. అని, ఇట్లు+ఇద్దఱున్, ఒండు ఒరులకున్=ఒకరొకరికి, దాసీత్వము= దాసీతనము,పణంబుగా=పందెముగా,నొడివి=పలికి,పన్నిదంబు=పందెం, చఱచిన=చేయిచేతగొట్టివేయగా, ఆ-అశ్వంబు=ఆ గుఱ్ఱమును,డాసి= సమీపించి, చూతము=చూచుదము, రమ్ము-అనినన్, కద్రువయున్, ఇపుడు, ప్రొద్దులేదు=సమయములేదు,పతి, పరిచర్యాకాలంబున్=భర్తకు సేవచేయు కాలము కూడ, రేపకడ+అ=ఉదయమునందే, చూతము, మగుడివచ్చి=తిరిగివచ్చి, తమ నివాసంబులకున్=తమ గృహములకు, పోయి=వెళ్ళి.

సీ. కద్రువ కొడుకుల కడకేగి యేను
మిమ్మందఱ వేడెద నన్నలార
నా పంపు సేయుండు నన్ను రక్షింపుఁడు
కామచారులకు దుష్కరము గలదె

యుల్ల తెల్లని తురగోత్తము వాలంబు
నల్లసేసితిరేని నాకు దాసి
యగు మన వినత మీరట్లు సేయనినాఁడు
దానికి మఱి యేను దాసినగుదు

జంట పన్నిదంబు సఱచితి మిట్లుగా
ననిన పాములెల్ల ననయ మిదియుఁ
దల్లి పనిచె నని యధర్మవు సేయంగ
నగునె, యెఱుక గలరె మగువలెందు. 34

ప్ర. కద్రువ, కొడుకుల కడకు = కుమారుల యొద్దకు, ఏగి = వెళ్ళి, అన్నలారా = వత్సలారా!, మిమ్ము అందఱ వేడెదన్, నా పంపు సేయుఁడు = నా యాజ్ఞ చేయుఁడు, నన్ను రక్షింపుఁడు = కాపాడుఁడు, కామచారులకు = ఇచ్ఛ వచ్చినట్లు సంచరించువారికి, దుష్కరము = చేయ శక్యముగానిది, కలదు + ఎ = ఉన్నదే = లేదు, ఉల్ల = దూర సమీపములకు మధ్య ప్రదేశమునందున్న, తెల్లని, తురగ, ఉత్తము, వాలంబు = తెల్లని యశ్వ శ్రేష్ఠము యొక్క తోకను, నల్ల + చేసితిరి + ఏని = మచ్చ చేసినచో, మన, వినత, నాకు, దాసిఅగు, మీరు, అట్లు చేయనినాడు = చేయనిచో, దానికి = వినతకు, మఱి = ఇంక, ఏను = నేను, దాసిన్ అగుదు, ఇట్లుగాన్ = ఈ విధముగా, జంట. పన్నిదంబు = ఇద్దరు సమానముగా వేయు పందెము, చఱచితిమి = వేసితిమి, అనినన్ = అని చెప్పగా, పాములు + ఎల్లన్ = పాములన్నియు, ఇదియున్ = ఇది, అనయము = నీతి కానిది, తల్లి, పనిచెన్ + అని = ఆజ్ఞాపించెనని, అధర్మవు = అధర్మము, చేయంగన్, అగునె = చేయనగునా, ఎందున్ = ఎటనైనను, మగువలు = స్త్రీలు, ఎఱుక-కలరె = తెలివిగలవారా! (కారని భావము).

తా. కద్రువ కొడుకులయిన పాముల చెంతకు వెళ్ళి, వత్సలారా! నేను మిమ్మందరను ప్రార్థింతును. నా యాజ్ఞ చేయుఁడు, నన్ను కాపాడుఁడు. ఇచ్ఛ వచ్చినట్లు సంచరింపగల మీకు చేయ శక్యముకానిది గలదా! ఆ తెల్లని యశ్వ శ్రేష్ఠము తోకను మీరు మచ్చ చేసినచో, మన వినత నాకు దాసి యగును. మీరట్లు చేయనిచో నేనింక వినతకు దాసి నగుదును. ఈ విధ

ముగా నొండొరులము పందెము వేసితిమి అని పల్కఁగా పాములన్నియు ఇది నీతి రహితము. తల్లి యాజ్ఞాపించెనని యధర్మము చేయవచ్చునా ! ఎచ్చటనైన స్త్రీలు జ్ఞానము గలవారా !

వ. అని యందఱుఁదమలో విచారించి యధర్మారంభంబునకు సుముఖులుగాక యున్న, గద్రువ కోపోద్దీపితముఖియై 35

ప్ర. అందఱున్=పాములన్నియు, తమలో=తమలో తాము, విచారించి= ఆలోచించి, అధర్మ, ఆరంభంబునకు=అధర్మము చేయ మొదలిడుటకు, సుముఖులు=ఇష్టము గలవారు, కాక, ఉన్నన్=కాక యుండగా, కద్రువ, కోప=ఉద్దీపిత, ముఖియై=కోపముచే, ఎఱ్ఱపడిన ముఖము గలదై.

కం. అనుపమముగ జనమేజయుఁ
డను జనపతి సేయు సర్పయాగ నిమిత్తం
బునఁబాములు పంచత్వము
సనియెదుమని యురగములకు శాపంబిచ్చెన్. 36

ప్ర. అనుపముగ=సాటిలేకుండ, జనమేజయుడు = (పరీక్షిత్తు కుమారుడు) అను, జనపతి=అనురాజు, చేయు, సర్పయాగ, నిమిత్తంబునన్=సర్ప ములను హతము చేయు యజ్ఞమనెడి కారణముగా, పాములు, పంచ త్వము, చనియెడున్, అని=మరణము పొందుగాకయని, (ఎడు, తల ద్రుతమునకు, అచ్చు పరంబగునపుడు మకారమగును) ఉరగములకు= పాములకు, శాపంబు, ఇచ్చెన్.

తా. సాటిలేకుండునట్లుగా పరీక్షిత్కుమారుడయిన జనమేజయుడను రాజు చేయు సర్పయాగము కారణముగా పాములు మరణము పొందుగాకయని, వానికి శాపమిచ్చెను.

వ. అందు శాపానుభవభీత చిత్తుండై కర్కోటకుండనువాడు, తల్లి పంచిన ఘోటంబున నుచ్చైశ్శ్రవంబు వాలంబు నీలంబుగాఁబట్టి వ్రేలుచున్న

మఱునాడు తేపకడయ కద్రువయు వినతయుంజని, యత్తురంగంబు చూచి వినత యోటువడి కద్రువకు దాసియై నోసిపనులు చేయుచున్నంత పంచశత వర్షంబులు నిండి, రెండవ యండం బవిసిన నందు. 37

ప్ర. అందు = ఆ పాములయందు, శాప, అనుభవ, భీత చిత్తుండు + ఐ = శాపము ననుభవించుటకు భయపడిన మనస్సుగలవాడై, కర్కోటకుండు అనువాడు, పనిచిన రూపంబునన్ = ఆజ్ఞాపించిన రూపముతో, ఉచ్చైశ్శ్రవంబు, వాలంబు = ఆ పేరుగల అశ్వశ్రేష్ఠము యొక్క తోక, నీలంబుగా = నల్లయగునట్లుగా, పట్టి = పట్టుకొని, వ్రేలుచున్న = వ్రేలాడు చుండగా, మఱునాడు, తేపకడ-అ = ఉదయిమునందే, చని = వెళ్ళి, ఆ-తురంగంబున్ = ఆ గుఱ్ఱమును, ఓటు పడి = ఓడి, నోసి = నొచ్చి. పంచశత వర్షంబులు = ఐదువందల యేండ్లు, నిండి = పూర్తికాగా, రెండవ అండంబు = రెండవ గ్రుడ్డు, అవిసినన్ = పగులగా, అందు = ఆ గ్రుడ్డునందు.

## వినతకు గరుడుండు జనియించుట

ఉ. ఆతత పక్ష మారుత రయ ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాత మహార్ణవుండు, బలవన్నిజదేహ సముజ్జ్వల ప్రభా
ధూత పతంగతేజు డుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్ర వీథికిన్. 38

ప్ర. ఆతత, పక్షమారుత, రయ, ప్రవికంపిత, ఘూర్ణిత, అచల, వ్రాత, మహత్, అర్ణవుండు = విశాలమయిన, తెక్కల గాలియొక్క వేగముచే క్రమముగా చలింపఁజేయబడినట్టియు సంక్షోభింపఁజేయబడినట్టియు పర్వతముల సముదాయములును, గొప్ప సముద్రములును గలవాడును; బలవత్, నిజ, దేహ, సముజ్జ్వల, ప్రభా, ధూత, పతంగ, తేజుడు = బలముగల తన దేహముయొక్క ప్రకాశించు కాంతిచే తిరస్కరింపబడిన సూర్యుని యొక్క కాంతిగలవాడును, అగు తార్క్ష్యుడు = గరుత్మంతుడు, ఉదితుండు-అయి = పుట్టి, అభ్రవీథికిన్ = ఆకాశ మార్గమునకు, భీమ జవంబునన్ = భయంకరమయిన వేగముతో, నెగసెన్ = ఎగిరెను.

తా. విశాలములయిన ఱెక్కల గాలుల వేగముచే చలింపజేయబడిన పర్వత ములు సమూహమును, సంక్షోభింపజేయబడిన పెద్ద సముద్రములును గలవాడును, బలముగల తన శరీరముయొక్క ప్రకాశించు కాంతిచే తిరస్కరింపబడిన సూర్యుని తేజస్సు గలవాడునగు గరుత్మంతుడు పుట్టి, తల్లియైన వినతకు హృదయ ప్రియము చేయుచు, అధికమయిన వేగముతో నాకాశమార్గమున నెగిరెను.

క. దారుణ కల్పాంత మరుత్
ప్రేరిత హవ్యవహశిఖల పెల్లిదియని బృం
దారక ముని బృంద స్తుతి
బోరన దానగ్ని సూక్తములతో నెసఁగెన్. 39

ప్ర. దారుణ, కల్ప, అంత, మరుత్, ప్రేరిత, హవ్యవహ, శిఖల, పెల్లు, ఇది, అని=భయంకరమయిన ప్రళయ కాలమునందలి గాలిచే ప్రేరేపింపబడిన అగ్నియొక్క జ్వాలల సముదాయము, ఇదియని, బృందారకముని, బృంద, స్తుతి= దేవతల యొక్కయు, మునుల సమూహము యొక్కయు స్తోత్రము, తాన్=తాను, బోరనన్=శీఘ్రముగా, అగ్ని సూక్తములతో= అగ్నిని స్తుతించు వేదమంత్రములతో, ఎసగెన్ = అతిశయించెను (ఎగసెన్ పాఠాంతరము) బయల్వెడలెను.)

తా: భయంకరమయిన ప్రళయ కాలమునందలి గాలులచే ప్రేరేపింపబడిన అగ్ని యొక్క జ్వాలల సముదాయమిదియని, దేవతల యొక్కయు ముని సముదాయము యొక్కయు స్తోత్రము, తాను శీఘ్రముగా అగ్నిని స్తుతించు వేదమంత్రములతో నతిశయిల్లెను.

వ. అంత 40

కం. హరి కులిశక్షతి యెఱుఁగని
గురుతర పక్షముల తోడి కులగిరి వోలెన్
గరుడుండు గగన గతినురు
తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. 41

ప్ర. హరి, కులిశ, క్షతి=ఇంద్రుని వజ్రాయుధము యొక్క దెబ్బ; ఎఱు గని=తెలియని: గురుతర, పక్షములతోడి, కులగిరి, పోలెన్=మిక్కిలి పెద్ద ఱెక్కలతో కూడిన కుల పర్వతమువలె; గరుడుండు, గగన, గతిన్=ఆకాశగమనమున; ఉరుతర జవమునన్=అధికమైన వేగముతో, అరుగుదెంచి=వచ్చి; తల్లికి=వినతకు; మ్రొక్కెన్=నమస్కరించెను.

తా. పూర్వమింద్రుడు వజ్రాయుధముచే పర్వతముల ఱెక్కలు ఖండించెను. అట్లు వజ్రాయుధము యొక్క దెబ్బనెఱుగని పెద్ద ఱెక్కలతో కూడిన కుల పర్వతమువలె (సహసమున తోడకు ఇవర్ణము) గరుడుడు ఆకాశ గమనమున వచ్చి తల్లియైన వినతకు నమస్కరించెను. (మహేంద్రము, మలయము, సహ్యము, సుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము అనునవి ఏడును కులపర్వతములు).

వ. ఇట్లు నిజ జననికి మ్రొక్కి కద్రువ పాలికిం బోయి. 42

ప్ర. నిజ జననికి=తన తల్లియైన వినతకు, మ్రొక్కి=నమస్కరించి, కద్రువ పాలికిన్=సవతి తల్లియైన కద్రువ చెంతకు; పోయి=వెళ్లి.

చ. తడయక మ్రొక్కియున్న వినతాసుతునప్పుడు చూచి యాత్మలో
నిడు గడఁజేయుచున్ గడు సహింపక కద్రువ వానిఁబిల్చి నా
కొడుకుల నెల్ల నెత్తికొని క్రుమ్మరుచుండుమ యేమిపంచినన్
మడవక చేయు మీవని సమర్పణ సేసెఁ బ్రభుత్వమేర్పడన్. 43

ప్ర. తడయక = ఆలస్యము చేయక; మ్రొక్కి = నమస్కరించి ఉన్న= ఉన్నటువంటి వినతాసుతున్ = వినత యొక్క కుమారుడైన గరుడుని; అప్పుడు=ఆ సందర్భమున; చూచి=చూచి; ఆత్మలోన్=మనస్సులో, ఇడుగడ, చేయుచున్=అసూయ చూపుచు, కడు సహింపక=మిక్కిలి ఓర్వలేక; కద్రువ; వానిన్= గరుడుని; పిల్చి; నా, కొడుకులన్, ఎల్లన్= నా కుమారులైన పాములనన్నిటిని; ఎత్తికొని = మోసికొని, క్రుమ్మరుచు, ఉండుము+అ= తిరుగుచుండుమా; ఏమి, పంచినన్ = వారేమి ఆజ్ఞాపించినను; ఈవు=నీవు; మడవక=మరలక (అలక్ష్యము

చేయక); చేయుము × అని = అని పల్కి; ప్రభుత్వము, ఏర్పడన్ = అధికారము స్పష్టమగునట్లుగ; సమర్పణ, చేసెన్ గరుడునికి పాముల నప్పగించెను.

తా. ఆలస్యము చేయక తనకు నమస్కరించి యున్న వినత కుమారుడైన గరుడు నప్పుడు చూచి కద్రువ మనస్సులో నసూయ పొందుచు ఏమియు ఓర్వక వానిని పిల్చి నీవు నా కుమారులైన పాముల నెల్ల మోసికొని తిరుగుచుండుము. వారేమి ఆజ్ఞాపించినను అలక్ష్యము చేయక చేయుమని అధికార మేర్పడునట్లుగ వాని నతని కొప్పగించెను.

వ. గరుడండును గద్రువ పంచిన పనులెల్లను వినత యనుమతంబున నతి వినయ పరుండయి చేయుచు. 44

ప్ర. గరుడండును = గరుడుడు కూడ (గరుడడు అను రూపము కూడ కలదు), కద్రువ, పంచిన, పనులు, ఎల్లను = కద్రువ ఆజ్ఞాపించిన పనులన్నిటిని; వినత, అనుమతంబునన్ = తల్లియైన వినత అంగీకారముతో; అతి, వినయ, పరుండు; ఐ = మిక్కిలి నమ్రతతో కూడిన వాడై చేయుచు.

క. ఆ పన్నగ ముఖ్యులఁ దన
వీపునఁ బెట్టికొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు నఖిలది
క్పాల పురములుఁజూపెఁ జనవారలకున్. 45

ప్ర. ఆ పన్నగ, ముఖ్యులన్ = ఆ సర్పశ్రేష్ఠులను; తన వీపునన్ = తన వీపు మీద; పెట్టికొని; పఱచి = పరువెత్తి (ఎగిరి), వారలకున్ = ఆ పాములకు విపినములు = అడవులు మహత్ + ద్వీపములు = గొప్ప దీవులు; గిరులున్ = పర్వతములును; అఖిల, దిశా, పాల, పురములన్ = సకల దిక్పాలకుల నగరములును; చన = ఒప్పునట్లుగా, చూపెను.

తా. గరుడుడు ఆ సర్పముఖ్యులను తన వీపుమీద పెట్టుకొని ఎగిరి అడవులను, గొప్ప ద్వీపములను, పర్వతములను, అష్టదిక్పాలకుల నగరములను వారి కొప్పునట్లుగా చూపెను.

వ. ఒక్కనాఁడు సప్తమారుత జవంబున సప్తాశ్వమండలంబుదాఁక నెగసిన నమ్మార్తాండు చండ కిరణంబుల వేఁడిమి దాఁకి మాఁడి గరుడని వీఁపున నున్న యురగులు దొరఁగి నేలంబడి మూర్ఛవోయినంజూచి కద్రువ గడు నలిగి గరుడనిం బదరి యతిభక్తి నింద్రు నారాధించి. 46

ప్ర. ఒక్కనాడు; సప్తమారుత, జవంబున=ఏడు గాలుల శక్తితో, సప్తాశ్వ మండలంబుదాకన్ = సూర్యమండలము వరకు, ఎగసినన్=పైకి ఎగురగా, ఆ+మార్తాండు=ఆ సూర్యునియొక్క, చండ, కిరణంబుల వేడిమి=తీక్ష్ణమైన కిరణముల వేడి, తాకి=సోకి, మాడి=మాడిపోయి, గరుడని, వీపుననున్న; ఉరగులు=పాములు, తొరగి=జారి, నేలన్, పడి =నేలమీదపడి, మూర్ఛపోయినన్, చూచి, కద్రువ, కడున్, అలిగి= మిక్కిలి కోపించి, గరుడనిన్, పదరి=ఆక్షేపించి, ఇంద్రునిన్, అతి భక్తిన్=మిక్కిలి భక్తితో, ఆరాధించి=పూజించి.

చ. నరసురసిద్ధ కింపురుషనాగ నభశ్చరముఖ్యులెల్ల నీ
కరుణయ వేచి మంద్రు త్రిజగంబులు నీకు లిశాభిరక్షణ
స్ఫురణనచేసి సుస్థిరతఁ బొందుఁ బురందర! సర్వలోక సుం
దర! శరణంబు నాకగుము దానవసూదన! పాకశాసనా! 47

ప్ర. దానవసూదన=రాక్షసులను హతమార్చిన, పాకశాసనా=పాకుడను రాక్షసుని శిక్షించినవాడా, సర్వలోకసుందర=అన్ని లోకములకు నందమైనవాడా, పురందర=ఓ ఇంద్రుడా, నర,సుర,సిద్ధ,కింపురుష,నాగ, నభశ్చర, ముఖ్యులు, ఎల్ల=నరులు, దేవతలు, సిద్ధులు, కింపురుషులు, నాగులు, ఆకసమున తిరుగాడు ఇతరులు మొదలైన వారి యందలి ముఖ్యులందఱును, నీ, కరుణ, అ=నీ దయనే, వేచి=ఎదురు చూచి, మంద్రు =జీవింతురు, నీ, కులిశ, అభిరక్షణ, స్ఫురణన్+అ+చేసి=నీవజ్రాయుధముయొక్క రక్షణము యొక్క అతిశయము చేతనే, త్రిజగంబులు=

ముల్లోకములు, సుస్థిరతన్ పొందు = శాంతిని పొందును, నాకు శర ణంబు=రక్షణమవు, అగుము =కమ్ము.

తా. రాక్షస సంహారివైన ఓ ఇంద్రుడా! నరులు, దేవతలు, సిద్ధులు, కింపురుషులు, నాగులు, ఆకాశమార్గమున చరించు ఇతర ముఖ్యులెల్లరును నీ దయనే అపేక్షించి జీవింతురు. నీ వజ్రాయుధముయొక్క రక్షణము కలుగుటచేతనే ముల్లోకములు శాంతిని పొందును. ఓ ఇంద్రుడా! ఎల్ల లోకములకు సుందరమైన వాడా! నాకు రక్షకుడవగును.

వ. అని స్తుతియించి పరజన్య ప్రసాదంబున మహావృష్టి గొడుకుల పయిం గురియించి యయ్యురగుల విగతపరితాపులజేసి కద్రువ గర్వంబున నుఱక గరుడని వినతనుం బనులు గొనుచున్నంత నొక్కనాఁడు గరు డండు తల్లి కిట్లనియె. 48

ప్ర. స్తుతియించి=పొగడి, పర్జన్య, ప్రసాదంబున=ఇంద్రుని అనుగ్రహముచే మహత్,వృష్టి=గొప్పవాన, కొడుకులపయిన్=కుమారులైన పాముల మీద, కురియించి=కురియునట్లు చేసి, అ+ఉరగుల=ఆ పాములను, విగత, పరితాపులన్=పోయిన సంతాపము (వేడివలన కలిగిన బాధ) కలవారిని, ఉఱక=లక్ష్యముచేయక, పనులు, కొనుచు, ఉన్న, అంతన్= వారిచే పనులు చేయించుకొనుచుండగా (అని భావము), తల్లికి=వినతకు, ఇట్లు, అనియె=పలికెను.

ఉ. ఆయత పక్షతుండ హతి నక్కుల శైలములెల్ల నుగ్గుగాఁ
జేయు మహాబలంబును బ్రసిద్ధియునుం గల నాకు నీ పనిం
బాయక త్రొమ్మనం దవడుఁబాముల మోవను వారికింబనుల్
సేయను నేమి కారణము సెప్పుము దీనిఁ బయోరుహాననా! 49

ప్ర. పయోరుహ+ఆననా=పద్మమువంటి ముఖము గలదానా!, ఆయత, పక్ష, తుండ, హతిన్; ఆయత = పెద్దవయిన, పక్ష=ఱెక్కల యొక్కయు, తుండ=ముక్కుయొక్కయు, హతిన్=దెబ్బచేత, ఆ- కుల, శైలములు-ఎల్లన్=ఆ ప్రాచీన పర్వతము లేడింటిని, నుగ్గుగా=

పొడిగా, చేయు, మహత్, బలంబును=చేసెడి గొప్ప బలమును, ప్రసిద్ధి యున్=కల, నాకున్, ఈ పనిన్=ఈ పనిని, పాయక=క్రమము తప్పకుండ, విడువక, ఱొమ్మునందు=వక్షమునందు, (వీపుపయినని చెప్పుట యుక్తము) అవదు, పాముల = నీచములైన పాములను, మోవను=మోయుటకును, వారికిన్-పనుల్, చేయను=ఆ పాములకు సేవ చేయుటకును, ఏమి కారణము, చెప్పుము, (తల్లిని పయోరుహాననా అని సంబోధించుట ఉచితముగా లేదని కొందరందురు).

తా. పద్మము వంటి ముఖము గలదానా! కుల శైలములన్నింటిని పొడిగా చేయు గొప్ప బలమును, ప్రసిద్ధియుగల నాకు ఈ పనిని విడువక సదా నీచములయిన పాములను వీపుపయి మోయుటకును వానికి సేవ చేయుట కును కారణమేమి? చెప్పుము.

వ. అని యడిగిన వినత తనకుం గద్రువతోడి పన్నిదంబుననైన దాసీత్వం బును తత్కారణంబైన యనూరు శాపంబునుం గొడుకున కేర్పడం జెప్పి యిట్లనియె. 50

ప్ర. అని అడిగిన=అని గరుత్మంతుడు అడుగగా, వినత, తనకున్, కద్రువ తోడి పన్నిదంబునన్=కద్రువతో వేసిన పందెమువలన, ఐన, దాసీత్వం బును=ఏర్పడిన దాసి తనమును, తత్, కారణంబు, ఐన = దానికి కారణమయిన, అనూరు, శాపంబునున్=అనూరు డిచ్చిన శాపమును, కొడుకునకు, ఏర్పడన్, చెప్పి=వివరించి, (స్పష్టమగునట్లుగా చెప్పి) ఇట్లు-అనియె.

కం. నీ కతమున నా దాస్యము
ప్రాకటముగఁ బాయు ననిన పలుకెడ లోనం
జేకొని యూఅడి నిర్గత
శోకస్థితి నున్నదానఁ జూవె ఖగేంద్రా! 51

ప్ర. ఖగ-ఇంద్రా=ఓ పక్షి రాజా! నీ కతమున = నీ కారణముగా, నా దాస్యము=నా దాసితనము, ప్రాకటముగన్=ప్రసిద్ధముగా (అందరికి తెలియు నట్లుగా), పాయున్ = పోవును, అనిన = అని అనూరుడు

చెప్పిన, పలుకు=మాట, ఎడలోనన్=మనస్సులో, చేకొని=గ్రహించి, ఊఱడి=ఓదార్పు చెంది, నిర్గత, శోక, స్థితిన్=పోయిన దుఃఖము కల అవస్థతో, ఉన్నదానన్+చూవె=ఉన్నదానను చుమా.

తా. ఓ పక్షి శ్రేష్ఠుడా ! నీ కారణముగా నా దాసితనము పోవునని అనూరుడు చెప్పిన మాటను మనస్సులో నుంచుకొని, బాధ విడిచి, దుఃఖము పోయిన దాననై యుంటిని సుమా!

వ. కొడుకులు సమర్థులైనం దల్లి దండ్రుల యిడుమలు వాయుట యెందునుం గలయది గావున నీయట్టి సత్పుత్రుం బడసియు దాసినై యుండుదాననే యనిన విని వైనతేయుండు తద్దయు దుఃఖితుండై యొక్కనాడు కాద్రవేయుల కిట్లనియె. 52

ప్ర. కొడుకులు, సమర్థులు + ఐనన్=శక్తిగలవారయినచో, తల్లి తండ్రుల, ఇడుముఅు=కష్టములు, పాయుట=పోవుట, ఎందునున్ కలయది = ఎచ్చటనైన ఉన్నది, కావున నీ అట్టి సత్ పుత్రున్=నీ వంటి మంచి కుమారుని, పడసియు=పొందియు, అనిన=అని చెప్పగా, విని, వైనతేయుండు=వినత కొడుకైన గరుత్మంతుడు, తద్దయు = మిక్కిలి, దుఃఖితుండు + ఐ = దుఃఖము పొందినవాడై, కాద్రవేయులకు = కద్రువ కుమారులయిన పాములకు, ఇట్లు అనియె.

కం. మా యీ దాస్యము వాయును
పాయము సేయుండు నన్ను బనుపుం డిష్టం
బేయది దానిన తెత్తున
జేయుఁడనై యమరవరులఁ జేకొని యైనన్. 53

ప్ర. మా- ఈ - దాస్యము = తల్లియైన వినతకు నాకును గల దాసితనము, పాయు + ఉపాయము=పోవునట్టి ఆలోచనను, చేయుండు=చేయుడు, నన్ను, పనుపుండు=ఆజ్ఞాపింపుడు; ఇష్టంబు-ఏ-అది=కోరినది ఏదో, దానిన్ + అ=దానినే, అమర-వరులన్=దేవశ్రేష్ఠులను, చేకొని + ఐనన్=లోబరుచుకొనియైనను. అజేయుడను + ఐ = ఓడింపబడని వాడనై, విజయము పొందువాడనై, తెత్తున్=తెచ్చెదను.

తా. నా తల్లియొక్కయు, నా యొక్కయు దాసితనము పోవుటకు ఆలోచన చేయుడు. నన్ను ఆజ్ఞాపింపుడు. దేవశ్రేష్ఠులను లోబరుచుకొనియైనను మీ కిష్టమయిన దానిని విజయము పొంది తెత్తును.

వ. అనిన నయ్యురగులు కరుణించి గరుడని కిట్లనిరి. 54

ప్ర. అనినన్ = అని యడుగగా, ఆ + ఉరగులు = ఆ పాములు, కరుణించి = జాలిపడి, దయతలచి, గరుడనికి-ఇట్లు + అనిరి = గరుత్మంతునితో ఇట్లు చెప్పిరి.

చం. అమితపరాక్రమంబును రయంబును లావును గల్గు ఖేచరో
త్తము(డవు నీవు నీదయిన దాస్యము( బాచికొనంగ నీకు( జి
త్తము గలదేని భూరిభుజదర్పము శక్తియు నేర్పడంగ మా
కమృతము( దెచ్చియిమ్మనిన నవ్విహగేంద్రుడు సంతసంబునన్. 55

ప్ర. నీవు, అమిత, పరాక్రమంబును = అంతులేని విక్రమమును, రయంబును = వేగమును, లావును = బలమును కల్గు, ఖేచర, ఉత్తముడవు = పక్షులలో గొప్పవాడవు, నీది-అయిన, దాస్యమున్ = నీకు గల్గిన దాసితనమును, పాచికొనంగ = పోగొట్టుకొనుటకు, నీకు చిత్తము-కలదు-ఏని = కోరిక ఉన్నచో. భూరి,భుజ,దర్పము = అధికమైన భుజములయొక్క గర్వమును, శక్తియు = సామర్థ్యమును, ఏర్పడంగ = స్పష్టమగునట్లుగా, మాకు; అమృతము, తెచ్చి-ఇమ్ము; అనిన = అని పాములు చెప్పగా, ఆ-విహగ, ఇంద్రుడు = ఆ పక్షిశ్రేష్ఠుకు; సంతసంబునన్ = సంతోషముతో.

తా. నీవు అంతులేని విక్రమమును, వేగమును, బలమును గలిగిన పక్షిశ్రేష్ఠుడవు. నీకు గల్గిన దాస్యము పోగొట్టుకొనవలెనను నభిప్రాయమున్నచో, గొప్ప భుజముల గర్వముమ శక్తియు కల్గునట్లుగా మాకు అమృతమును తెచ్చి యిమ్మని పాములు చెప్పగా, ఆ పక్షిశ్రేష్ఠుడు సంతోషముతో.

గరుత్మంతు డమృతంబు( దెచ్చుటకు( దల్లియనుమతి( గొనుట

వ. అట్ల చేయుదు నమృతంబు దెచ్చి మీకిచ్చి యేనునుం దల్లియు దాస్యంబు వలన విముక్తులమగు వారమని నొడివి తద్వృత్తాంతంబంతయుం దల్లికిం

జెప్పి యమృతహరణార్థం బరిగెదనని మ్రొక్కిన వినత సంతసిల్లి కొడుకుం గౌగిలించుకొని.

ప్ర. అట్లు+అ=ఆవిధముగనే, విముక్తులము+అగువారము, విడువబడిన వారమగుదుము, నొడివి=చెప్పి, తత్-వృత్తాంతంబు=ఆ విషయము, తల్లికిన్=వినతకు, అమృత-హరణ, అర్థము=అమృతమును హరించు నిమిత్తము, అరిగెదన్=వెళ్ళెదను, మ్రొక్కిన = నమస్కరింపగా, సంతసిల్లి=సంతోషించి, కొడుకున్=కుమారుడయిన గరుడుని.

చం. అనిలుఁడు పక్షయుగ్మ మమృతాంశుఁడు వీపనలుండు, మస్తకం
బినుఁడు సమస్త దేహమును నెప్పుడుఁగాచుచు నీకభీష్టముల్
ఘనముగఁ జేయుచుండెడు జగన్నుత! యున్నతియున్ జయంబుఁజే
కొనుమని యిచ్చె దీవనలు గోరి ఖగేంద్రునకుం బ్రియంబునన్. 57

ప్ర. అనిలుడు=వాయువు, పక్షయుగ్మము=ఱెక్కల జంటను, అమృత, అంశుడు=చంద్రుడు, వీపు, అనలుండు = అగ్ని, మస్తకంబు = శిరస్సును, ఇనుఁడు = సూర్యుడు, సమస్త దేహమున్=సర్వ శరీరమును, ఎప్పుడున్=ఎల్లప్పుడును, కాచుచు=రక్షించుచు, నీకు అభీష్టముల్=కోరికలు, ఘనముగన్=గొప్పగ, చేయుచుఁడెడు = చేయుచుండుగాక, జగత్, నుత=లోకములచే స్తుతింపబడినవాడా, ఉన్నతియున్=గొప్పతనమును, జయంబున్= విజయమును, చేకొనుము= గ్రహింపుము, అని కోరి, దీవనలు=ఆశీస్సులు, ప్రియంబునన్ = ప్రీతితో, ఖగ+ఇంద్రునకున్=పక్షులకు రాజయిన గరుత్మంతునకు, ఇచ్చెన్.

తా. వాయువు ఱెక్కల జంటను, చంద్రుడు వీపును, అగ్ని తలను, సూర్యుడెల్ల శరీరమును సర్వదా రక్షించుచు, నీకు కోరికలు గొప్పగా చేయుచుందురుగాక, లోకములచే నుతింపబడువాడా! గొప్పతనమును విజయమును గ్రహింపుము అని వినత మనస్సున కోరి పక్షులకును రాజయిన గరుడునికి ప్రీతితో నాశీస్సు లిచ్చెను.

వ. గరుడండును దల్లి దీవనలు గైకొని గమనోన్ముఖుండై యమృతంబు దెచ్చు నపుడు, లావు గలుగవలయు. నాకాహారంబు ప్రసాదింపు మనిన వినత యిట్లనియె. 58

ప్ర. దీవనలు=ఆశీస్సులు, కైకొని=గ్రహించి, గమన+ఉన్ముఖుండు+ఐ=వెళ్ళుటకు సిద్ధుడై, లావు = బలము, కలుగవలయున్, నాకు, ఆహారంబు, తినుపదార్థము, ప్రసాదింపు=అనుగ్రహింపుము.

కం. విషనిధి కుక్షి నసంఖ్యము
నిషాదగణముండి ధారుణీ ప్రజకుఁ గడున్
విషమమును జేయు దానిని
మిషమున భక్షించి చనుమమిత్ర విఘాతీ. 59

ప్ర. అమిత్ర విఘాతీ=శత్రువులను సంహరించువాడా, విషనిధి, కుక్షిన్=సముద్రము యొక్క గర్భమున, అసంఖ్యము=లెక్కలేని, నిషాద గణము = బోయవారి సముదాయము, ఉండి, ధారుణీ, ప్రజనున్=భూమియందలి జనులకు, కడున్ =మిక్కిలి, విషమమును=కష్టమును, చేయున్, దాని=ఆ నిషాదగణమును, నిమిషమున=కనుతెప్ప కాలములో (తక్కువ కాలములో). భక్షించి=తిని, చనుము=వెళ్ళుము.

తా. ఓ శత్రువులను సంహరించు గరుడుడా! సముద్రముయొక్క గర్భమున లెక్కలేని బోయవారి సముదాయముండి భూమియందలి ప్రజలకు మిక్కిలి క్లేశము కల్గించుచున్నవి. ఆ నిషాద గణమును నిమేష కాలములో తిని వెళ్ళుము.

వ. భక్షణ విషయంబున బ్రాహ్మణునిం బరిహరించునది. యనిన గరుడుండు నాకు బ్రాహ్మణు నెఱుంగు తెఱంగెఱింగింపుమనిన వినత యిట్లనియె. 60

ప్ర. భక్షణ విషయంబున=తిను సందర్భమున, బ్రాహ్మణునిన్, పరిహరించునది=విడువ వలయును, ఎఱుంగు, తెఱంగు=తెలిసికొను విధము, ఎఱింగింపుము=తెలుపుము.

కం. రయమున మ్రింగుడు గాలము
క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁజనక
గ్నియ పోలె నేర్చుచుండును
భయరహితా! వాని నెఱుగు బ్రాహ్మణకులుఁగా 61

ప్ర. రయమున = వేగముతో, మ్రింగుడు = మ్రింగినయనంతరము, గాలము క్రియన్ = చేపలను పట్టు గాలమువలె, ఎవ్వఁడు, కంఠ, బిలము క్రిందికిన్ = కంఠ రంధ్రము క్రిందికి, చనక = వెళ్ళక, అగ్ని-ఆ-పోలెన్ = అగ్ని విధముగ, ఏర్చుచుండును = కాల్చుచుండునో, భయరహితా = భయములేనివాడా, వానిన్ = అట్టివానిని, బ్రాహ్మణ, కులఁగా = బ్రాహ్మణుని కులమునందు పుట్టిన వానిగా, ఎఱుగు = తెలిసికొనుము.

తా. భయములేని ఓ గరుత్మంతుడా, వేగముగా మ్రింగునపుడు, చేపలను పట్టు గాలమను సాధనమువలె నెవడు, కంఠ రంధ్రము క్రిందికి పోక, అగ్నివలె కాల్చుచుండునో, అట్టి వానిని బ్రాహ్మణ వంశము కలవానిగా తెలిసికొనుము.

తే. కోపితుండైన విప్రుండు ఘోరశస్త్ర
మగు మహావిషమగు నగ్నియగు నతండ
యర్చితుండైన జనులకు నభిమతార్థ
సిద్ధికరుఁడగు గురుఁడగుఁ జేయుఁ బ్రీతి 62

ప్ర. విప్రుండు = బ్రాహ్మణుడు, కోపితుండు + ఐనన్ = కోపము కల్గింపబడినవాడయినచో, ఘోర, శస్త్రము + అగు = భయంకరమయిన ఆయుధమగును, మహత్-విషము-అగు = గొప్ప విషమగును, అగ్ని అగును, అతండు + అ = ఆ బ్రాహ్మణుడే, అర్చితుండు + ఐన = సేవింపబడిన వాడయినచో; జనులకు = ప్రజలకు, అభిమత, అర్థ, సిద్ధికరుడు అగు = కోరబడిన ప్రయోజనముయొక్క సిద్ధిని కల్గించువాడగును = గురుడు, అగున్ = ఉపదేశకుడగును, ప్రీతిన్ + చేయు = ఇష్టము చేయును.

తా. బ్రాహ్మణుడు కోపింప జేయబడినచో భయంకరమయిన యాయుధమగును. గొప్ప విషమగును. అగ్నియగును. ఆ బ్రహ్మణుడే సేవింపబడినచో ప్రజలకు కోరబడిన ప్రయోజనము యొక్క సిద్ధిని కల్గించువాడగును. ఆచార్యుడగును. ఇష్టమొనరించును.

వ. అని బ్రాహ్మణ స్వరూపంబుఁ జెప్పిన నెఱింగి వినతకు మ్రొక్కి వీడ్కొని గరుడండతి త్వరిత గతింబఱచి సముద్రోదరంబున నున్న నిషాదుల ననేక శతసహస్ర సంఖ్యల వారిం బాతాళ వివరంబునుంబోని తన కంఠ బిలంబుదెఱచి యందఱ నొక్క పెట్ట మ్రింగిన నందొక్క విప్రుండుండి కుత్తుకకు డిగక నిప్పునుంబోలె నేర్చుచున్న నెఱింగి నాకంఠ బిలంబున విప్రుండున్న వాఁడేని వెలువడి వచ్చునది యనిన గరుడని కవ్విప్రుం డిట్లనియె. ౬౩

ప్ర. అని, బ్రాహ్మణ, స్వరూపంబున్ = బ్రాహ్మణుని యొక్క స్వరూపమును (లక్షణముగా), చెప్పినన్ = చెప్పగా; మ్రొక్కి; నమస్కరించి; వీడ్కొని= సెలవు పుచ్చుకొని, అతి, త్వరిత గతిన్ = మిక్కిలి వేగముగల గమనముతో, పఱచి = పరుగెత్తి (ఎగిరి), సముద్ర = ఉదరంబునన్ = సముద్రము యొక్క గర్భమునందు, అనేక, శత సహస్ర, సంఖ్యల వారిన్ = పెక్కు వందల వేల సంఖ్య గల వారిని, నిషాదులన్ = బోయలను, పాతాళవివరంబునున్, పోని = పాతాళ లోకము యొక్క రంధ్రము వంటి; తన కంఠ బిలంబున్ = తన కంఠము యొక్క రంధ్రమును; ఒక్కపెట్ట = ఒక్క మారుగా; మ్రింగినన్ = మ్రింగగా; అందు = ఆ కంఠ బిలమున; విప్రుండు = బ్రాహ్మణుడు, ఉండి, కుత్తుకకు, డిగక = కంఠము లోనికి దిగక, నిప్పునున్, పోలెన్ = నిప్పువలె, ఏర్చుచున్నన్ = కాల్చుచుండగా; నా కంఠ బిలంబున = నా కంఠముయొక్క రంధ్రమునందు; విప్రుండు = బ్రాహ్మణుడు; ఉన్నవాడు; ఏని = ఉన్నవాడయినచో; వెలువడి వచ్చునది = బయటికి రావలయును; ఆ+విప్రుండు ఆ బ్రాహ్మణుడు,

ఉ. విప్రుడ నున్నవాఁడ నపవిత్ర నిషాది మదీయభార్య కీ
ర్తిప్రియ దీనిఁబెట్టి చనుదెంచుట ధర్మువె నాకు నావుడున్

విప్రులఁబొంది యున్న యపవిత్రులుఁ బూజ్యులుగారె కావునన్
విప్రకులుండ ! వెల్వడుము, వేగమ నీవును నీ నిషాదియున్. 64

ప్ర. విప్రుడన్ = బ్రాహ్మణుడను, ఉన్నవాడన్, అపవిత్ర = పరిశుద్ధురాలు కానిది, నిషాది = బోయవనిత, మదీయ, భార్య = నా భార్య, కీర్తిప్రియ = కీర్తియందు నాసక్తిగలది, దీనిన్ = ఈ బోయతను, పెట్టి = విడిచి, చనుదెంచుట = వచ్చుట, నాకు, ధర్మవు = ధర్మమా, నావుడున్ = అనగా, విప్రకులుండ = బ్రాహ్మణకులుడా, విప్రులన్ = బ్రాహ్మణులను, పొందిఉన్న = చెందియున్న (చెట్టపట్టియున్న), అపవిత్రులున్ = అపరిశుద్ధులు కూడ, పూజ్యులు కారె = పూజింపదగిన వారుకారా, కావున = ఆ కారణమువలన, నీవును, నీ నిషాదియున్ = నీ బోయ భార్యయును, వేగము + అ = శీఘ్రముగా, వెల్వడుము = బయటకు రమ్ము.

ఇచ్చట నిషాదిశబ్దము సహార్థమున వాడబడినది, నిషాదియున్ అనగా నిషాదితో అని యర్థము.

తా. బ్రాహ్మణుడ నున్నవాడను కీర్తియందు నాసక్తిగల నా భార్య (కీర్తిప్రియ అనునది పేరయిన గావచ్చును) అపరిశుద్ధురాలయిన నిషాద వనిత, దీనిని విడిచివచ్చుట నాకు ధర్మమా, అనగా గరుడుండు, బ్రాహ్మణులను పొందియున్న అపరిశుద్ధులు కూడ పూజింపదగినవారు కారా, కావున ఓ బ్రాహ్మణకులమునకు చెందినవాడా నీవు, నీ నిషాద భార్యతో వెంటనే బయల్పడుము.

వ. అనిన నాగరుడని యనుగ్రహంబున బ్రాహ్మణుండు నిషాదీసహితుండై వెలుపడి వచ్చి గరుడని దీవించి యథేచ్ఛం జనియె. గరుడండును గగనపథంబునం బఱచి కశ్యపుంగని నమస్కరించి, యస్మజ్జననీదాస్య నిరాసార్థం బురగుల కమృతంబు తేర నరిగెద, నిషాద ఖాదనంబున నాఁకలి వోవకున్న యది నాకాహారంబు ప్రసాదింపుమనిన కొడుకు కడం కకు మెచ్చి కశ్యప ప్రజాపతి యిట్లనియె. 65

ప్ర. అనుగ్రహంబున=దయచే, నిషాదీసహితుండు+ఐ=బోయ వనితతో గూడినవాడయి, వెలువడివచ్చి=బయటికివచ్చి, దీవించి=ఆశీర్వదించి, యథా+ఇచ్ఛన్=ఇచ్ఛవచ్చినట్లు, చనియె=వెళ్ళెను, గగనపథంబునన్=ఆకాశమార్గమున, పఱచి=ఎగిరి, కశ్యపున్=తండ్రియగు కశ్యపుని, కని=చూచి, నమస్కరించి=మ్రొక్కి, అస్మత్, జననీ, దాస్య, నిరాస,అర్థంబు=మాతల్లియొక్క బానిసతనమును పోగొట్టుటకు, ఉరగులకు=పాములకు, అమృతంబు తేరన్=తెచ్చుటకు, అరిగెదన్=వెళ్ళెదను, నిషాద ఖాదనంబునన్=నిషాదులను తినుటచే, ఆకలి పోవక ఉన్న అది=తొలగకున్నది, నాకు ఆహారంబు=తినుపదార్థము, ప్రసాదింపుము=అనుగ్రహింపుము, కొడుకు కడంకకు=కొడుకయిన గరుడుని పూనికకు, మెచ్చి, కశ్యప ప్రజాపతి=కశ్యపబ్రహ్మ,ఇట్లు+అనియె.

కం. అనల నిభుండు విభావసు
దను విప్రుడు నియమవంతు డర్థాఢ్యుండై
తనరి సుఖమున్న నాతని
యనుజన్ముడు సుప్రతీకుడను వాడతనిన్ ౯౬

ప్ర. అనల, నిభుండు=అగ్నితో సమానుడయిన, విభావసుడు, అను విప్రుడు=విభావసుడు అను పేరుగల బ్రాహ్మణుడు, నియమ, వంతుడు=నియమము గలవాడు, అర్థ-ఆఢ్యుండు+ఐ=ధనసంపన్నుడయి, తనరి=ఒప్పి, సుఖము, ఉన్నన్=సుఖముతో నుండగా, (ఇట ప్రథమ, తృతీయార్థమున వాడబడినది), అతని యనుజన్ముడు=అతని తమ్ముడు, సుప్రతీకుడు, అనువాడు=సుప్రతీకుడను పేరు గలవాడు, అతనిన్=అన్నయైన విభావసుని.

తా. అగ్నితో సమానుడును, నియమముల ననుసరించువాడును, అగు విభావసుడను బ్రాహ్మణుడు, ధన సంపన్నుడై యొప్పి సుఖముతో నుండగా, అతని తమ్ముడయిన సుప్రతీకుడను పేరు గలవాడు, అతని.

కం. మన పితృవర్గము వడసిన
ధనము విభాగించి యిమ్ము ధర్మస్థితి నా
కని యడుగంబోయిన య
య్యనుజున విభావసుం డహంకారమునన్. 67

ప్ర. మన, పితృ, వర్గము=మన తల్లిదండ్రుల, తాత ముత్తాతల సమూహము, పడసిన=పొందియున్న, ధనము=సంపదను, విభాగించి=పాలుపంచి విభజించి, నాకు, ధర్మస్థితిన్=ధర్మము ప్రకారముగా, ఇమ్ము, అని అడుగన్-పోయిన = అని యడుగుటకు వెళ్ళిన, అ - అనుజునకు = ఆ తమ్ముడయిన సుప్రతీకునకు, విభావసుండు, అహంకారమునన్= గర్వముతో.

తా. మన తండ్రితాతలు పొందిన సంపదను ధర్మప్రకారముగా పాలుపంచి నాకిమ్మని యడుగుటకు వెళ్ళిన తమ్ముడయిన సుప్రతీకునకు, విభావసుడు గర్వముతో

కం. తానలిగి యిచ్చె శాపం
బేనుగవై యుండుమని సహింపక వాడున్
మానుగఁ గూర్మమ వగుమని
వానికిఁ బ్రతిశాపమిచ్చె వసులోభమునన్. 68

ప్ర. తాను=ఆ విభావసుడు, అలిగి=కోపించి, ఏనుగవు+ఐ, ఉండుము+ అని=ఏనుగవుగా నుండుమని, శాపంబు-ఇచ్చె=శాపమిచ్చెను, సహింపక=ఆ శాపమునకు ఓర్వక, వాడున్=తమ్ముడగు సుప్రతీకుడును, మానుగన్=ఒప్పుగా, కూర్మమవు-అగుము-అని=తాబేల వగుమని, వానికిన్=అన్నయైన విభావసునకు, వసులోభమునన్=సంపదయందలి యాశచే, ప్రతిశాపము-ఇచ్చెను=ఎదురు శాపమిచ్చెను.

తా: అన్నయగు విభావసుడు, ఏనుగవు కమ్మని తమ్ముని శపింపగా, ఆ శాపమునకు సహింపక, తమ్ముడగు సుప్రతీకుడు, సంపదపై గల మక్కువతో తాబేల వగుమని తిరిగి శపించెను.

వ. ఇట్లన్నయుం దమ్ముఁడును నవ్యోన్య శాపంబులంజేసి యోజన త్రయోత్సేధంబు గలిగి దశయోజన వృత్తంబైన కూర్మంబును షడ్యోజనోత్సేధంబు గలిగి ద్వాదశ యోజన విస్తృతంబైన గజంబునునై సరోవర విపినంబుల నుండి యర్థ నిమిత్తంబైన పూర్వవైరంబునఁ దమలో నిత్యంబు నొండొంటితోడం బెనంగి పోరుచుండు నవి నీకాహారంబు సుమ్మ రుగుము కార్యసిద్ధియయ్యెడు మనిన గరుడఁడును మనోవేగంబునం బఱచి యారెంటినిం గాంచి 69

ప్ర. ఇట్లు + అన్న యున్ + తమ్ముండునున్, అన్యోన్య, శాపంబులన్ + చేసి = ఒండొరుల కిచ్చుకొనిన శాపములచేత, యోజన, త్రయ, ఉత్సేధంబు, కలిగి = మూడు యోజనముల పొడవు (8 + 8 = 24 మైళ్ళు) గలిగి, దశ, యోజన, వృత్తంబు + ఐన = పది యోజనముల (ఆమడల) చుట్టు కొలత కలిగిన, కూర్మంబును = తాబేలును, షట్, యోజన-ఉత్సేధంబు-కలిగి = అరు యోజనముల పొడవు గలిగి, ద్వాదశ, విస్తృతంబు + ఐన = పన్నెండు యోజనముల వ్యాప్తికలిగిన (వెడల్పు గల్గిన) గజంబునున్ + ఐ = ఏనుగునై, సరోవర, విపినంబులన్ = క్రమముగా చెఱువు, నందును, అడవియందును, ఉండి = నివసించి, అర్థనిమిత్తంబు, ఐన = సంపద, కారణముగానైన, పూర్వ, వైరంబునన్ = పూర్వజన్మమందలి, పగతో, నిత్యంబు = ఎప్పుడును తమలోన్ = తమలో తాము, ఒండు + ఒంటితోడన్ = ఒకటింకొక దానితో, పెనంగి = కలయబడి, పోరుచుండున్ = పోటాడుచుండును, అవి = ఆ తాబేలును, ఏనుగును, నీకు, ఆహారంబు సుమ్ము = తినదగిన పదార్థములు సుమా, అరుగుము = వెళ్లుము, కార్యసిద్ధి = పని నెరవేరుట, అయ్యెడున్ + అనిన = అగునని చెప్పగా (ఆశీర్వచనమున ఎడు చివరి ద్రుతమునకు మకారము ఆదేశమయినది), గరుడండును, మనః-వేగంబునన్ = మనస్సుయొక్క వేగముతో, పఱచి = పరుగెత్తి (ఎగిరి), ఆ, రెంటినిన్ = ఆ తాబేటిని, ఏనుగును, కాంచి = చూచి.

కం. చఱచి యొకచేతఁ గూర్మము
బెఱచేత గజంబుఁబట్టి పెనఁచి ఖగేంద్రుం

డిఱికికొని గగనవీధిం
బఱచె వియచ్చర విమాన పంక్తులు దూలన్. 70

ప్ర. చఱచి=ఆక్రమించి, కొట్టి, ఒక, చేతన్=ఒక చేతితో, కూర్మమున్=తాబేటిని, పెఱ, చేతన్ = వేఱొకచేతితో, గజంబున్ = ఏనుగును, పట్టి=పట్టుకొని, పెనఁచి=చుట్టుకొనునట్లుచేసి, ఖగ+ఇంద్రుండు = పక్షిశ్రేష్ఠుడగు గరుత్మంతుడు, ఇఱికికొని=అదగునట్లు అదిమి, గగన, వీధిన్ = ఆకాశ మార్గమునందు, వియత్ చర, విమాన, పంక్తులు=ఆకాశమున సంచరించు దేవతల యొక్క విమానముల యొక్క వరుసలు, తూలన్=చలించునట్లుగా, పఱచె=ఎగిరెను.

తా. గరుత్మంతుడు పక్షియగుటవలన ఱెక్కలతో ఏనుగును, తాబేటిని ఆక్రమించి, ఒక చేతితో (పాదముతో) తాబేటిని, వేఱొకదానితో ఏనుగును పట్టుకొని, రెండును ఒక దాని నొకటి చుట్టుకొనునట్లు చేసి, ఒక దానితో వేఱొక దానిని నొక్కి పట్టుకొని, ఆకాశమున సంచరించు దేవతల విమానముల వరుసలు సంచలించునట్లుగా ఎగిరెను.

కం. కనక వ్రతతీ వితతుల
బెనఁగిన సురభూరుహములఁబెద్దయు బెడఁగై
తనరిన యలంబ తీర్థం
బునకరిగె నగంబు లొక్క మొగి గ్రక్కదలన్ 71

ప్ర. కనక, వ్రతతీ, వితతులన్=సంపంగితీగల సమూహములతో; పెనగిన=అల్లుకొనియున్న; సుర భూరుహములన్= దేవతా(కల్ప) వృక్షములతో, పెద్దయు=అధికముగా; బెడగు+ఐ=మనోహరమై; తనరిన=ప్రకాశించిన; అలంబ తీర్థంబునకు= అలంబమను పేరుగల తీర్థమునకు; నగంబులు= కొండలు; ఒక్కమొగి=ఒక్కసారిగా; గ్రక్కదలన్=(కదలఁగా ,కదలగా) మిక్కిలి కదలుచుండగా, అరిగెను=వెళ్ళెను.

తా. సంపంగి తీగల సమూహములతో అల్లుకొని యున్న దేవతావృక్షములతో ఎక్కువగా మనోహరమయి ప్రకాశించుచున్న అలంబమను పేరుగల తీర్థమునకు కొండలు మిక్కిలి కంపించు చుండగా వెళ్ళెను.

వ. అందు రోహణంబను పాదపోత్తమంబు గరుడనింగని సంభావించి శత యోజనాయతంబైన మదీయ శాఖపై నుండి యిగ్గజ కచ్ఛపంబుల భక్షించి పొమ్మనిన గరుడండు నట్ల చేయుదునని యమ్మహాశాఖపై నూఁద సమకట్టి యందు.

ప్ర. అందు=ఆ పర్వతమునందు; రోహణంబు, అను = రోహణమను పేరు గల; పాదప, ఉత్తమంబు=వృక్షశ్రేష్ఠము (పెద్దచెట్టు), గరుడనిన్= గరుత్మంతుని; కని=చూచి; సంభావించి=ఆదరించి, గౌరవించి; శత, యోజన, ఆయతంబు+ఐన=వంద యోజనముల పొడవుగల, మదీయ శాఖ పైన్=నా కొమ్మపై; ఉండి=కూర్చుండి; ఈ గజ, కచ్ఛపంబుల =ఈ ఏనుగును, తాబేటిని; భక్షించి, పొమ్ము=తిని వెళ్ళుము; అనిన అని చెప్పగా; గరుడండును=గరుత్మంతుడును; అట్లు+అ, చేయుదున్ అని=ఆ విధముగనే చేయుదునని; ఆ మహత్ శాఖపైన్=ఆ గొప్ప చెట్టుకొమ్మపై: ఊఁద, సమకట్టి=ఉంచుటకు (నిల్చుటకు) నిశ్చయించి; అందు=ఆ కొమ్మయందు.

పాదంబులు పెట్టుడుఁద  
త్పాదప ఘనశాఖ విఱిగి బల్లన నుచ్చై  
ర్నాదమున దిక్కు లద్రువగ  
భేదిల్లె విహంగ తతులు భీతిం బఱవన్. 73

ప్ర. పాదంబులు=కాళ్ళు, పెట్టుడున్=పెట్టినవెంటనే, తత్, పాదప, ఘన, శాఖ=ఆ రోహణమను చెట్టుయొక్క గొప్ప కొమ్మ, విఱిగి, బల్లనన్= బల్లుమనునట్లుగా, ఉచ్చైః, నాదమునన్ = పెద్దధ్వనితో, దిక్కులు, అద్రువగ=కంపించగా, విహంగ, తతులు=పక్షుల సమూహములు, భీతిన్=భయముతో, పఱవన్=పరుగెత్తగా (ఎగురగా), భేదిల్లె=చీలెను.

తా. ఆ గరుత్మంతుడు పాదములు పెట్టగనె ఆ రోహణ వృక్షముయొక్క గొప్ప కొమ్మ బల్లుమనునట్లుగా పెద్ద ధ్వనితో విఱిగి, దిక్కులు కంపించగా, పక్షుల సమూహములు భయముతో నెగిరిపోగా చీలెను.

వ. అమ్మహాశాఖ నవలంబించి తలక్రిందై యాదిత్య కిరణంబులు తమకాహా రంబుగాఁ దపంబు సేయుచున్న వాలఖిల్య మహాముని గణంబులం జూచి యిది భూమి పయిబడిన నిమ్మునులకు బాధయగునని దానిం గఱచికొని గజకచ్ఛపంబులం గరంబుల నిఱికికొని గరుడండు గగనంబునం బఱచి తనకు నూద నిమ్మగు ప్రదేశం బెందునుం గానక గంధమాదనంబునకుం జని యందుఁ దపంబు సేయుచున్న కశ్యపుం గనుంగొని ప్రమొక్కిన.

ప్ర. ఆ-మహాశాఖన్ = ఆ గొప్ప కొమ్మను, అవలంబించి = పట్టుకొని, తల, క్రిందు + ఐ = తలక్రిందు భాగమున నుండునట్లుగా, ఆదిత్య, కిరణంబులు = సూర్యునియొక్క కిరణములు, తమకు, ఆహారఁబు, కాన్ = భుజించు పదార్థము కాగా, తపంబు-చేయుచున్న, వాలఖిల్య, మహత్, ముని, గణంబులన్ = వాలఖిల్యులను పేరుగల గొప్ప మునుల సమూహములను, చూచి, ఇది = ఈ విఱిగిన కొమ్మ, భూమిపయిన్ + పడినన్ = భూమిమీద పడినచో, ఈ + మునులకు = వ్రేలాడుచు తపస్సు చేయు నీ మునులకు, బాధ + అగున్ + అని, దానిన్ = ఆ విఱిగినకొమ్మను, కఱచికొని = నోటితో పట్టుకొని, గజ, కచ్ఛపంబులన్ = ఏనుగును, తాబేటిని, కరంబులన్ = చేతులయందు, ఇఱికికొని = అడగునట్లుచేసి, అదిమి పట్టుకొని, గరుడండు, గగనంబునన్ = ఆకాశమునందు, పఱచి = ఎగురుచువెళ్ళి, తనకున్, ఊదన్ = నిల్చుటకు, ఇమ్ము + అగు, ప్రదేశంబు = తగినచోటును, ఎందునున్ + కానక = ఎక్కడను చూడక, గంధమాదనంబునకున్ = గంధమాదనమను పర్వతమునకు, చని = వెళ్ళి, అందున్ = ఆ పర్వతమునందు, తపంబు + చేయుచున్న, కశ్యపున్ = తండ్రియగు కశ్యపుని, కనుంగొని = చూచి, ప్రమొక్కిన = నమస్కరింపగా.

చం. కనక మహీధరప్రతిమకాయు మహాజవనిర్జిత ప్రభం
జను నవిచింత్య భూరిబలసత్త్వ సమన్వితు దీప్తహవ్య వా
హన సము వైనతేయునిఁ దదాస్యగ తద్రుమ శాఖనున్న య
త్యనఘుల వాలఖిల్యులను నమ్మునినాథుడు చూచి నెమ్మితోన్. 75

ప్ర. కనక, మహీధర, ప్రతిమ, కాయు=బంగారు కొండయగు మేరు పర్వత ముతో సమానమగు శరీరముగల, మహత్, జవ, నిర్జిత, ప్రభంజనున్= గొప్ప వేగముచే జయింపబడిన వాయువుగల, అవిచింత్య, భూరి, బల, సత్త్వ, సమన్వితు=ఊహింపరాని గొప్ప బలముతో, శక్తితో కూడిన వానిని, దీప్త, హవ్యవాహన, సము=వెలుగుచున్న అగ్నితో సమాను డయిన వానిని, వైనతేయునిన్ = వినత యొక్క కుమారుడగు గరు త్మంతుని, తత్, ఆస్య, గత, ద్రుమ, శాఖన్=ఆ గరుత్మంతునియొక్క నోటిలోగల చెట్టుకొమ్మయందు, ఉన్న అతి, అనఘుల=ఎట్టి పాపము లేనివారిని, మిక్కిలి గొప్పవారిని, వాలఖిల్యులను=వాలఖిల్యులను పేరు గల మునులను, ఆ, ముని, నాథుడు = ఆ మునులలో నాయకుడయిన కశ్యపుడు, నెమ్మితో=దయతో చూచి.

తా. మేరు పర్వతముతో సమానమయిన శరీరము గలవాడును, తనకు గల గొప్ప వేగముచే జయింపబడిన వాయువు గలవాడును, ఊహింపరాని గొప్ప బలముతోడను శక్తితోడను గూడిన వాడును, వెల్గుచున్న యగ్నితో సమానుడు నయిన వినత కుమారుడగు గరుత్మంతుని, అతని నోటిలో నున్న చెట్టుకొమ్మకు గల పాపరహితులైన వాలఖిల్యులను పేరుగల మునులను కశ్యపుడు దయతో చూచి,

వ. ఇగ్గరుడండు భువన హిత మహారంభుడు బలసమన్వితుండు మీకు బాధ యగునని యిత్తరుశాఖ విడువ నేరకున్నవాడు. వీనిం గరుణించి మీరొండు కడ కరుగుండనిన వాలఖిల్యులు కశ్యపు ప్రార్థనంజేసి దాని విడిచి హిమ వంతంబునకుం జనిరి. గరుడండును ముఖనిక్షిప్తశాఖాస్ఖలిత వచనుం డగుచు దండ్రి కిట్లనియె. 76

ప్ర. ఈ+గరుడండు=ఈ గరుత్మంతుడు, భువన, హిత, మహత్+ఆరం భుండు=లోకములకు మేలు కలిగించు గొప్ప ప్రయత్నము గలవాడు, బల, సమన్వితుండు=బలముతో గూడినవాడు, మీకు=చెట్టు కొమ్మకు తల క్రిందుగా వ్రేలాడి తపస్సు చేసికొనుచున్న మీకు, బాధ అగును+ అని, ఈ, తరు, శాఖన్=ఈ చెట్టుకొమ్మను, విడువనేరక ఉన్నవాడు

=విడిచిపెట్టలేక ఉన్నవాడు, వీనిన్ = కొమ్మతో పాటు మిమ్ములను ఇక్కడికి తెచ్చిన యీ గరుత్మంతుని, కరుణించి=దయతలచి, మీరు, ఒండుకడకు=వేఱొకచోటికి,అరుగుండు=వెళ్ళుడు,అనిన=అనిచెప్పగా, వాలఖిల్యులు=వాలఖిల్యు లనెడిమునులు, కశ్యపు ప్రార్థనన్-చేసి=కశ్యపునియొక్క కోరికచేత, దాని, విడిచి=ఆ కొమ్మను విడిచి,హిమవంతంబు నకున్=హిమవంతమను పర్వతమునకు, చనిరి=వెళ్ళిరి, గరుడండును, ముఖ, నిక్షిప్త, శాఖా, స్ఖలిత, వచనుండు, అగుచున్ = నోటియందు ఉంచబడిన కొమ్మవలన తొట్రుపాటుతో కూడిన మాటలు గలవాడగుచు, తండ్రికి + ఇట్లు + అనియె, తండ్రి అయిన కశ్యపునకు, ఇట్లనెను.

కం. ధరణీసుర విరహితమగు
నరణ్య దేశంబు నాకు నానతి యిండి
తరు శాఖ విడువ వలయును
కరము నిరోధమిది యనిన గశ్యపుఁడనియెన్. 77

ప్ర. ధరణీసుర, విరహితము+అగు= బ్రాహ్మణులు లేనిదగు, అరణ్య దేశంబు=అడవి ప్రదేశమును, నాకు, ఆనతి, ఇండు=తెలియఁ జేయుడు (ఆజ్ఞాపింపుడు), ఈ తరుశాఖన్ ఈ చెట్టు కొమ్మను, విడువవలయును, ఇది=ఈ కొమ్మ, కరము= మిక్కిలి, నిరోధము = ఆటంకకరము, అనినన్ అని చెప్పగా, కశ్యపుండు, అనియెన్=చెప్పెను.

తా. బ్రాహ్మణులు లేని అడవి ప్రాంతమును నాకు తెలియజేయుడు, ఈ కొమ్మను విడిచి పెట్టవలయును. ఇది మిక్కిలి ఆటంకకరము అని చెప్పగా, కశ్యపుడు చెప్పెను.

కం. హిమశైల కందరాభా
గముకడ నిష్పురుష నగము గలదచ్చో నీ
ద్రుమశాఖ విడువు మదిదా
నమానుష మగమ్య మీశ్వరాదులకైనన్. 78

ప్ర, హిమ, శైల, కందరా, భాగము, కడ=మంచుకొండ యొక్క గుహ యొక్క ప్రాంతము దగ్గఱ, నిష్పురుష, నగము=నిష్పురుష మనెడి

కొండ, కలదు, అచ్చోన్ = ఆ కొండమీద, ఈ, ద్రుమ, శాఖ = ఈ చెట్టు కొమ్మను, విడువుము, అది, తాను = ఆ కొండ, అమానుషము = మానవాతీతము, ఈశ్వర, ఆదులకు, ఐనన్ = ఈశ్వరుడు మొదలగు వారికి కూడ, అగమ్యము = పొందరానిది.

తా. హిమాలయ పర్వతము యొక్క గుహా ప్రాంతమందు నిష్పురుషమను కొండ కలదు అక్కడ ఈ చెట్టుకొమ్మను విడువుము. అది మానవాతీతము. ఈశ్వరుడు మొదలగు వారికి కూడ పొందరానిది.

వ. అది యిప్పటికి లక్షయోజనంబులు గల దరుగు మనిన గరుడండును
మనోవేగంబునం జని యానిష్పురుషనగంబునం దత్తరుశాఖ విడిచి
హిమవంతంబు మీఁదికింబోయి గజకచ్ఛపంబుల భక్షించి, మహాసత్త్వ
సంపన్నుండై నాకలోకంబున కెగయసమకట్టి పక్షవిక్షేపంబు జేసిన 79

ప. అది = ఆ కొండ, ఇప్పటికి = ఈ గంధమాదన పర్వతమునకు, లక్షయోజనంబులు-కలదు = లక్ష ఆమడల దూరము గలదు, అరుగుము = వెళ్లుము, అనిన = అని చెప్పగా, గరుడండును, మనః + వేగంబునన్ = మనస్సు యొక్క వేగమువంటి వేగముతో, చని = పరుగెత్తి (ఎగిరి), ఆ, నిష్పురుష, నగంబునన్ = ఆ నిష్పురుషమను కొండయందు, తత్, తరు శాఖన్ = ఆ రోహణ వృక్షము యొక్క కొమ్మను, విడిచి = వదిలిపెట్టి, హిమవంతంబు, మీఁదికిన్ = హిమాలయ పర్వతము పయికి, పోయి = వెళ్ళి, గజ, కచ్ఛపంబులన్ = ఏనుగును, తాబేటిని, భక్షించి = తిని, మహత్, సత్త్వసంపన్నుండు + ఐ = గొప్పబలముతో కూడినవాడయి, నాకలోకంబునకు = స్వర్గలోకమునకు, ఎగయన్ = ఎగురుటకు, సమకట్టి = నిశ్చయించి, పూని, పక్ష, విక్షేపంబున్ + చేసిన = రెక్కలు విదల్చుటను చేయగా;

కం. ఘనపక్షానిలచలితా
వని రుహముల వలనఁ దొరఁగు వరపుష్పచయం
బనిమిష జయార్థ మరిగెడు
వినతాసుతు మీఁదఁ బుష్పవృష్టియ పోలెన్

ప్ర. ఘన, పక్ష, అనిల, చలిత, అవనిరుహముల, వలనన్=గొప్పవైన
రెక్కలయొక్క గాలిచే కదలిన చెట్ల నుండి, తొరగు=పడు, వర,
పుష్ప, చయంబు=శ్రేష్ఠములైన పూలసముదాయము, అనిమిష, జయ,
అర్థము=దేవతలను జయించుట కొఱకు, అరిగెడు=వెళ్ళు, వినతా,
సుతు, మీదన్=వినత కొడుకగు గరుత్మంతుని మీద, పుష్ప, వృష్టి,
అ, పోలెన్=పూలవాన వలె, ఉండెను.

తా. గొప్పవయిన రెక్కల నుండి పుట్టిన గాలి వలన కదలిన చెట్ల నుండి, శ్రేష్ఠములగు పూల సమూహములు, దేవతలను జయించుటకు వెళ్ళు గరుత్మంతునిపై పూలవానవలె ఒప్పెను.

వ. ఇట్లమృతహరణార్థంబు గరుడండు గగనంబున కెగసిన నట దేవ
లోకంబునందు. 81

ప్ర. ఇట్లు=ఈ విధముగా, అమృత, హరణ-అర్థంబు=అమృతమును
తెచ్చుటకు. గరుడండు, గగనంబునకు=ఆకాశమునకు, ఎగసినన్=
ఎగురగా, అట దేవలోకంబునందు=ఆ దేవతలలోకమందు;

మాలిని. సురపతి సభఁజూడంజూడ నంగారవృష్టుల్
గురిసెఁ గులిశధారల్ గుంఠితంబయ్యె దిక్కుం
జరమదము లడంగెన్ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వేగంబునం సంచలించెన్. 82

ఇందు న,న,మ,య,య, అను గణములుండును. 9వ అక్షరమునకు యతి చెల్లును.

ప్ర. సుర,పతి, సభన్=దేవతల రాజగు ఇంద్రుని సభయందు, చూడన్+
చూడన్ = చూడగా, చూడగా, అంగార, వృష్టుల్ = నిప్పుకణముల
వర్షములు, కురిసెన్=కురిసెను, కులిశ, ధారల్ = వజ్రముయొక్క
అంచులు, కుంఠితంబు+అయ్యె=మొక్కవోయినవి (బండబారినవి),
దిక్, కుంజర, మదఁబులు=దిక్కులయందలి యేనుగుల గర్వములు,

అడంగెన్ = అణగారినవి, సర్వ, దిక్, పాలక, అంతఃకరణములు = అన్ని దిక్కుల యొక్క పాలకులయొక్క (అందఱు దిక్పాలుర) మనస్సులు, భయ + ఉద్వేగంబునన్ = భయముయొక్క ఆవేశముతో సంచలించెన్ = కంపించెను.

తా. చూడగా దేవేంద్రుని సభయందు నిప్పుకణముల వర్షములు కురిసెను. వజ్రము యొక్క యంచులు మొక్కవోయినవి. దిక్కులందలి యేనుగుల గర్వము అణగారినవి. అందఱు దిక్పాలకుల మనస్సులును భయము యొక్క ఆవేశముతో క్షోభించినవి.

వ. ఇట్టి మహోత్పాతంబులు పుట్టిన సురపతి, బృహస్పతిం జూచి, ఇది యేమి నిమిత్తంబని యడిగిన దాని నంతయు నెఱింగి బృహస్పతి సురపతి కిట్లనియె. 83

ప్ర. ఇట్టి, మహత్ + ఉత్పాతంబులు = గొప్ప చెడ్డ శకునములు, పుట్టిన = పుట్టగా, సురపతి = దేవేంద్రుడు, బృహస్పతిన్ + చూచి = బృహస్పతి చూచి, ఇది, ఏమి, నిమిత్తంబు = కారణము, అని, అడిగిన, దానిన్ + అంతయున్ = ఆ విషయమునంతటిని, ఎఱింగి = తెలిసికొని = బృహస్పతి, సురపతికి = ఇంద్రునికి ఇట్లు, అనియె.

సీ. బ్రహ్మణ్యుఁడగు కశ్యపబ్రహ్మవరమున వినతకుఁ బుట్టిన యనఘమూర్తి
వాలఖిల్యులదయ వరపక్షికులమున కింద్రుఁడై పరగిన యిద్ధతేజుఁ
డుదధిలోనున్న యత్యుగ్ర నిషాదుల నారంగ మ్రింగిన ఘోర వీరుఁ
డిభ కచ్ఛపముల రౌహిణ శాఖతో నెత్తికొని దివిఁ బఱచిన యనిలవేగి

వీఁగి తనతల్లి దాస్యంబు నీఁగఁ బూని
తదయకమృతంబు గొని పోవఁ గడఁగివచ్చెఁ
గామరూప సంపన్నుండు గామగమను
డతఁడు నీకు నసాధ్యుండు శతమఖుండ 84

ప్ర శతమఖుండ = ఇంద్రుడా! (వేద) బ్రహ్మణ్యుడు + అగు = బ్రహ్మ జ్ఞానము గలిగిన, కశ్యప, బ్రహ్మ, వరమున = కశ్యపుడను ప్రజాపతి

యొక్క, వరముచేత, వినతకున్, పుట్టిన, అనఘమూర్తి=పాపములేనట్టి వ్యక్తి, వాలఖిల్యుల, దయన్=వాలఖిల్యులనెడి మునుల దయచేత, వర, పక్షి, కులమునకు=శ్రేష్ఠమయిన పక్షులయొక్క కులమునకు, ఇంద్రుడు +ఐ=రాజై, పరఁగిన=ప్రసిద్ధిపొందిన, ఇద్ధతేజుడు=ప్రకాశించు ప్రతాపము గలవాడు, ఉదధిలోన్+ఉన్న=సముద్రములో ఉన్న, అతి, ఉగ్రనిషాదులన్=మిక్కిలి భయంకరులయిన బోయవారిని, అరంగ, మ్రింగిన=పూర్తిగా తినినట్టి, ఘోర, వీరుడు=భయంకరుడయిన వీరుడు, ఇభ, కచ్ఛపంబుల=ఏనుగును, తాబేటిని, రౌహిణశాఖతోన్=రోహణ వృక్షముయొక్క కొమ్మతోపాటుగా, ఎత్తుకొని = పైకెత్తి పట్టుకొని, దివిన్=ఆకాశమునందు, పఱచిన=(పరుగెత్తిన) ఎగిరిన, అనిల, వేగి =గాలియొక్క వేగము వంటి వేగము గలవాడు. వీఁగి=ఉత్సాహపడి, తన తల్లి దాస్యంబున్=తన తల్లియగు వినతయొక్క దాసితనమును, ఈఁగన్, పూని=తొలగించుటకు నిశ్చయించి, తడయక=ఆలస్యము చేయక, అమృతంబు, కొని, పోవన్=అమృతమును తీసికొని పోవుటకు కదఁగి, వచ్చెన్=పూని వచ్చెను, కామ, రూప సంపన్నుడు=కోరు కొన్న రూపము ధరింపగలవాడు, కామ, గమనుఁడు=కోరికకు తగి నట్లుగా వెళ్ళువాడు, నీకు, అతఁడు=ఆ వినత కొడుకు, అసాధ్యుండు= జయింపరానివాడు.

తా. బ్రహ్మజ్ఞానము గలిగిన కశ్యపుడను ప్రజాపతి వరమువలన వినతకు పుట్టిన పాపరహితుడు ఈ గరుత్మంతుడు. ఇతడు వాలఖిల్యులను మహర్షుల కృపచేత శ్రేష్ఠమయిన పక్షి కులమునకు రాజుగా ప్రసిద్ధిపొందిన గొప్ప ప్రభావము గలవాడు. సముద్రము లోపలనున్న మిక్కిలి భయంకరులయిన బోయవారిని పూర్తిగా తినివేసిన ఘోరమయిన వీరుడు. ఏనుగును, తాబేటిని రోహణ వృక్షపు కొమ్మతోపాటు పట్టుకొని ఆకాశమునందు ప్రయాణించిన వాయువేగము గలవాడు. ఉత్సాహపడి తన తల్లి యొక్క దాసితనమును పోగొట్టుటకు ఆలస్యము చేయకుండ అమృతము తీసికొనిపోవుటకు సాహసించి వచ్చెను. ఇచ్ఛవచ్చిన రూపము ధరింప గల్గినవాడు. ఇచ్ఛవచ్చినట్లుగా సంచరించువాడు, ఓ యింద్రుడా, ఈ గరుత్మంతుడు నీకు జయింపరానివాడు.

వ. అగ్గరుడని మాహాత్మ్యంబు నీవును నెఱుంగుదు వది యెట్లనిన, దొల్లి కశ్యప ప్రజాపతి పుత్త్రార్థియై భవత్ప్రభృతులైన దేవగణంబులను వాలఖిల్య ప్రముఖులైన మహాముని గణంబులను దనకు సహాయులనుగా బడసి పుత్త్రకామేష్టి సేయునాఁడు నీవు నీ బలంబునకుం దగిన యిధ్మ భారంబు మోచికొని యశ్రమంబున వచ్చువాడవై అల్పకుశపలాశేధ్మ భారంబుల మోచికొని వడవడ వడంకుచు వచ్చువారి నల్పసత్త్వుల నంగుష్ఠ ప్రమాణదేహుల ననవరతోపవాస కృశీభూత శరీరుల వాలఖిల్య మహామునులంజూచి నగిన నమ్మునులు సిగ్గువడి కడునలిగి ౭౮

ప్ర. ఆ గరుడని మాహాత్మ్యంబు = ఆ గరుత్మంతుని గొప్పతనమును, నీవునున్, ఎఱుంగుదువు = తెలిసియుందువు, అది ఎట్లు + అనిన్ = ఏ విధముగా నన్నచో, తొల్లి = పూర్వము, కశ్యప ప్రజాపతి = కశ్యప బ్రహ్మ, పుత్త్ర + అర్థి + ఐ = కొడుకులను కోరువాడయి, భవత్ ప్రభృతులు + ఐన = నీవు మొదలుగాగల, దేవగణంబులను = దేవతల సమూహములను, వాలఖిల్య ప్రముఖులు, ఐన = వాలఖిల్యులు మొదలుగా గల, తనకు = యజ్ఞము చేయబోవు తనకు (కశ్యపునకు), సహాయులను కాన్ = తోడ్పడువారుగా, పడసి = పొంది, పుత్త్ర, కామ, ఇష్టి, చేయునాఁడు = పుత్త్రకామేష్టిని చేయు సమయమునందు, నీవు, నీ బలంబునకున్ = నీ యొక్క లావునకు, తగిన = సరిపడిన, ఇధ్మభారంబు = కట్టెల బరువును, మోచికొని, అశ్రమంబున = శ్రమలేకుండ, వచ్చువాడవు + ఐ, అల్ప కుశ పలాశ ఇధ్మభారంబులు = తక్కువయిన దర్భల ఆకులు, కట్టెల బరువులను, మోచికొని, వడవడ వడంకుచు = (మిక్కిలి బరువును మోయ లేక) వణకిపోవుచు, వచ్చువారిన్ = వచ్చునట్టి, అల్పసత్త్వులన్ = తక్కువ బలముగలవారిని, అంగుష్ఠప్రమాణదేహులన్ = బొటనవ్రేలంత కొలతగల శరీరము గల్గినవారిని, అనవరత, ఉపవాస, కృశీభూత, శరీరుల = ఎల్లప్పుడును ఉపవాసములచేత (ఒక రోజంతయు భోజనము లేక మరునాటి యుదయము భుజించుట యుపవాస మనబడును) చిక్కిన శరీరము గల్గినవారిని, వాలఖిల్య, మహత్, మునులన్ = వాలఖిల్యులనెడి గొప్ప మునులను, చూచి, నగినన్ = నవ్వగా, ఆ + మునులు = ఆ వాలఖిల్య మునులు, సిగ్గుపడి, కడున్, అలిగి = మిక్కిలి కోపించి.

కం. రణ విజయుఁడనల తేజుం
డణిమాది గుణాఢ్యుఁడుదితుఁడయ్యెడు వీరా
గ్రణి శతమఖుకంటెను శత
గుణ వీర్యుండైన పుత్రకుండజితుండై 86

ప్ర. రణ, విజయుండు = యుద్ధమునందు విజయముగలవాడు. అనల, తేజుండు = అగ్నియొక్క ప్రకాశమువంటి ప్రకాశముగలవాడును, అణిమ, ఆది, గుణ, ఆఢ్యుడు = అణిమ మొదలగు గుణముల సంపద గల్గినవాడు, వీర, అగ్రణి = వీరులలో అగ్రేసరుడు, అగు శతమఖు కంటెను = ఇంద్రునికన్నను, శత, గుణ వీర్యుండు + ఐన = వందరెట్లు బలము గల్గిన, పుత్రకుఁడు = కొడుకు, అజితుండు + ఐ = ఓడింపబడని వాడయి, ఉదితుండు + అయ్యెడు = పుట్టినవాడు కాగలడు.

తా. యుద్ధమున విజయముగలవాడును, అగ్నియొక్క ప్రకాశము గలవాడును, అణిమాది గుణముల సంపదగలవాడును, వీరులలో అగ్రభాగమున నుండువాడును, ఇంద్రునికంటె వందరెట్లు బలము గలవాడు నయిన కుమారుడు జయింపరానివాడై పుట్టగలడు.

వ. వాడు రెండవ యింద్రుండయ్యెడు మని మహావీర్యవంతంబులైన మంత్రంబుల వ్రేల్చుచున్నంత నంతయు నెఱింగి నీవు కశ్యపు పాలికిం బోయి నాకుం గరుణింపుండని వారిం బ్రార్థించిన గశ్యప ప్రజాపతి యమ్మునుల కిట్లనియె. 87

ప్ర. వాడు = ఆ పుట్టినవాడు, రెండవ, ఇంద్రుండు, అయ్యెడున్ + అని = "కావలయుగాత" అని, మహత్, వీర్య, వంతంబులు + ఐన = గొప్ప శక్తితో, గూడిన, మంత్రంబుల = వేదమంత్రములతో, వ్రేల్చుచు + ఉన్న-అంతన్ = యజ్ఞ కుండములో హోమము చేయుచున్న సమయము నందు, అంతయున్ = విషయము నంతటిని, ఎఱెంగి = తెలిసికొని, నీవు, కశ్యపు, పాలికిన్ = యజ్ఞము చేయుచున్న కశ్యపుని సమీపమునకు,

పోయి = వెళ్ళి, నాకున్-కరుణింపుండు = నన్ను దయచూడుడు (ఇట ద్వితీయావిభక్తి అర్థమున, షష్ఠివాడబడినది) అని, వారిన్ = ఆ వాలఖిల్యు లను, ప్రార్థించినన్ = వేడుకొనగా, కశ్యప, ప్రజాపతి = కశ్యప బ్రహ్మ, ఆ మునులకు = ఆ వాలఖిల్య మునులకు, ఇట్లు-అనియె = ఇట్లు చెప్పెను.

ఉ. ఉండునితండు పద్మజుని యోగమునం త్రిజగంబులందు నిం
ద్రుండయి భూతరాశిఁ దన దోర్బలశక్తిఁ గడంగి కాచుచున్
రెండవ యింద్రుఁడైన విపరీతమగున్ భువన ప్రవృత్తి మీ
రొండు విధంబు సేయుటిది యుక్తమె బ్రహ్మ నియుక్తి యుండగన్. 88

ప్ర. ఇతండు = ఈ యింద్రుడు, పద్మజు నియోగమునన్ = బ్రహ్మయొక్క ఆజ్ఞచేత, త్రిజగంబులందు = మూడు లోకములందు, ఇంద్రుండు-అయి = ఇంద్రపదవి పొంది, భూత, రాశిన్ = ప్రాణుల సమూహమును, తన, దోః, బల, శక్తిన్ = తన భుజముల బలము యొక్క సామర్థ్యముతో, కడంగి = పూనుకొని, కాచుచున్ = రక్షించుచు, ఉండున్ = ఉండును, రెండవ ఇంద్రుడు, ఐన = ఏర్పడినచో, భువన, ప్రవృత్తి = లోకములయొక్క వర్తన విపరీతము-అగున్ = తారు మారగును బ్రహ్మ, నియుక్తి = బ్రహ్మయొక్క నియమము, ఉండగన్ = ఉండగ మీరు, ఒండు విధంబు = వేఱొక పద్ధతిని చేయుట = ఒనరించుట, ఇది యుక్తము-ఎ = ఇది తగునా ?

తా. ఇతడు బ్రహ్మయొక్క నియమమువలన మూడు లోకములందు నింద్రు డుగా నుండి జీవుల సమూహమును తన బాహువుల బలము యొక్క సామర్థ్యముతో కాపాడుచు నున్నవాడు రెండవ యింద్రుడు ఏర్పడినచో, లోకముల యొక్క వర్తన తారుమారగును. బ్రహ్మ యొక్క నియమ ముండగా మీరు వేరు విధము చేయుట తగునా? (తగదు)

వ. మీ వచనం బమోఘంబు గావున నిఁక నాకు నుద్భవిల్లెడు పుత్రుండు పక్షి కులంబున కెల్ల నింద్రుం డయ్యెడు మని కశ్యపుండు వారల

నొడంబఱిచి, నీ యింద్రత్వం బేకాధిష్ఠితంబు సేసె నట్టి కశ్యప ప్రజా
పతి యజ్ఞ మహిమను వాలఖిల్యుల తపో మహిమను వినతకుం బుట్టి
విహగేంద్రుండయిన యా గరుడం డిప్పు డమృత హరణార్థం బరుగు
దెంచుటం జేసి స్వర్గలోకంబున మహోత్పాతంబులు పుట్టెనని సురపతికి
బృహస్పతి చెప్పిన విని యింద్రుం డమృత రక్షకుల నెల్ల రావించి,
మీర లతి ప్రయత్నంబున నమృతంబు రక్షించుకొని యుండుండని
పంచిన వల్లెయని. ౮౯

ప్ర. మీ వచనంబు=మీ (వాలఖిల్యుల) యొక్క మాట, అమోఘంబు= వ్యర్థము కానిది, కావునన్=కాబట్టి, ఇంక=ఇటు తరువాత, నాకున్, ఉద్భవిల్లెడు, పుత్రుండు = పుట్టబోవు కొడుకు = పక్షి కులంబునకు, ఎల్లన్=పక్షుల యొక్క జాతి కంతటికిని, ఇంద్రుండు, అయ్యెడున్, అని=ఇంద్రుడు అగుగాక యని, కశ్యపుండు, వారలన్ = ఆ మును లను, ఒడంబఱిచి=ఒప్పించి, నీ ఇంద్రత్వంబు=నీ యింద్ర పదవిని ఏక, అధిష్ఠితంబు చేసెన్=ఒక్కనిచే నొందబడినదిగా (అధిష్ఠింపబడిన దానినిగా) నొనర్చెను, అట్టి, కశ్యప, ప్రజాపతి, యజ్ఞ మహిమను = అటువంటి కశ్యపబ్రహ్మ యొక్క యజ్ఞము యొక్క మహత్త్వముచేతను వాలఖిల్య, తపః, మహిమను = వాలఖిల్యు లనెడి మునుల యొక్క తపస్సు యొక్క గొప్పతనము చేతను, వినతకున్, పుట్టి, విహగ ఇంద్రుండు+అయిన=పక్షులకు ఇంద్రుడయిన, ఆ గరుడండు = ఆ గరత్మంతుడు, ఇప్పుడు, అమృత, హరణ, అర్థంబు=అమృతము నెత్తు కొని పోవుట కొఱకు, అరుగుదెంచుటంజేసి=వచ్చుట చేత, స్వర్గలోకం బున, మహత్ ఉత్పాతంబులు=గొప్ప చెడు శకునములు, పుట్టెను = ఏర్పడెను, అని, సురపతికి=దేవతల రాజగు ఇంద్రునకు, బృహస్పతి =దేవతల గురువగు బృహస్పతి, చెప్పిన=చెప్పగా విని, ఇంద్రుండు, అమృత, రక్షకులన్, ఎల్లన్ = అమృతమును కాపాడు వారందరిని, రావించి = రప్పించి (వచ్చు ధాతువునకు ప్రేరణ), మీరలు, అతి ప్రయత్నమునన్=మిక్కిలి ప్రయత్నముతో; అమృతంబు, రక్షించికొని, ఉండుండు; అని పంచిన=అని ఆజ్ఞాపించగా, వల్లె-అని = అట్లేయని (అంగీకరించి)

కం. వారలు బహు ప్రకారా
కారులు వీరులు నిశాతఖడ్గాది మహా
దారుణ శస్త్ర ధరులు కృ
ష్ణారుణ సితపీత ఘన తరాంగ త్రాణుల్ 90

ప్ర. వారలు = ఆ యమృతమును కాపాడువారు, బహు, ప్రకార, ఆకారులు = పెక్కు రకములయిన రూపములు గలవారు, వీరులు, నిశాత, ఖడ్గ, ఆది, మహత్, దారుణ, శస్త్ర, ధరులు = వాడియైన కత్తి మొదలగు గొప్ప భయంకరములయిన ఆయుధములను ధరించినవారు, కృష్ణ, అరుణ, సిత, పీత, ఘనతర, అంగత్రాణుల్ = నల్లని, ఎఱ్ఱని, తెల్లని, పచ్చని గొప్పవయిన కవచములు గలవారు.

తా. ఆ యమృతరక్షకులు పెక్కురకముల రూపములు గల్గినవారు, వీరులు, వాడియైన కత్తిమొదలగు భయంకరమయిన ఆయుధములు ధరించినవారు, నల్లని, ఎఱ్ఱని, తెల్లని, పచ్చని గొప్పవయిన కవచములుగలవారు.

క. సమకట్టి యొక్కమొగి న
ప్రమాదులై నిలిచి రేయుఁబవలును రక్షా
క్షములై యమృతము చుట్టును
నమేయబలు లుండిరంత నతి రభసమునన్. 91

ప్ర. సమకట్టి = పూని, ఒక్క మొగిన్ = ఒకేవిధముగా, అప్రమాదులు + ఐ = ఏమఱుపాటు పరాకు లేనివారయి, నిలిచి = నిలబడి, రేయున్ = రాత్రియు (రేయి రూపాంతరము, రే). పగలును = పగటి పూటయును, రక్షా, క్షములు + ఐ = రక్షణయందు సమర్థులై, అమృతముచుట్టునున్ = అమృతముయొక్క అన్నివైపుల, అమేయ, బలులు = ఊహింపరానట్టి బలము గలవారు, ఉండిరి, అంతన్ = ఆ సమయమునందు, అతి, రభసమునన్ = మిక్కిలి వేగముతో.

తా. అమృతమును రక్షించుటకు నిశ్చయించి ఒకే విధముగా, ఏమఱుపాటు లేనివారై, నిలబడి, రాత్రియు, పగలును రక్షించుటయందు సమర్థులై

ఊహింపరాని బలముగలవారు అమృతము చుట్టునుండిరి. 'అంత మిక్కిలి వేగముతో' అని రాబోవు పద్యముతో నన్వయము.

మ. వితతోల్కాశని పుంజ మొక్కొ యనగా విన్వీధి విక్షిప్త ప
క్షతివాతాహతిఁ దూలి తూలశకలాకారంబులై వారిద
ప్రతతుల్ సాల్పడి నల్గడల్ చెదరగాఁబాఱెన్ మనోవేగుఁడై
పతగేంద్రుం డమృతాంతికంబునకు, దత్పాలుర్ భయంబందఁగన్. 92

ప్ర. వితత, ఉల్కా, అశని, పుంజము, ఒక్కో=విరివిగా గల మండు నిప్పు కణముల యొక్కయు, పిడుగుల యొక్కయు సమూహమా, అనగా=అనునట్లుగా, విన్, వీధి=ఆకాశమార్గమునందు, విక్షిప్త, పక్షతి, వాత, ఆహతిన్=విదల్చబడిన ఱెక్కల యొక్క గాలియొక్క దెబ్బచే, తూలి=అటునిటు కదలి, వారిద, ప్రతతుల్=మబ్బుల యొక్క సముదాయములు, తూల, శకల, ఆకారంబులు+ఐ=దూది పింజెలయొక్క రూపములుగలవై, చాల్పడి=వరుసకట్టి, నల్, కడన్ = నాలుగువైపుల, చెదరగా=చెదరిపోగా, మనః+వేగుడు+ఐ=మనస్సుయొక్క వేగము వంటి వేగము గలవాడయి, పతగ, ఇంద్రుండు = పక్షులకు ఇంద్రుడయిన గరుత్మంతుడు, అమృత-అంతికంబునకున్=అమృతము దగ్గరకు, తత్, పాలుర్=ఆ యమృత రక్షకులు, (పాలురు అను ప్రథమా విభక్త్యంతమునందు బహువచనమున ఉకారము లోపించినది) భయంబు, అందగన్=భయపడగా, పాఱెన్=పరుగెత్తెను.

తా. విరివియైన నిప్పుకణముల పిడుగుల సమూహమా యనునట్లుగా ఆకాశ మార్గమునందు విదల్చబడిన ఱెక్కలనుండి పుట్టిన గాలియొక్క దెబ్బచే అటునిటు కదలి, మబ్బుల సముదాయములు దూది యాకృతి గలవై వరుస కట్టి నాలుగు దిక్కులకు చెదరిపోగా, అమృతమును రక్షించువారు భయపడగా, మనస్సుయొక్క వేగము గలవాడయి, గరుడుడు అమృతము దగ్గరకు ఎగిరి వెళ్ళెను.

వ. అంత 93

కం. కల్పాంతానల కీలా
కల్పాయత పక్షుఁ బక్షిగణ విభుశౌర్యా
కల్పుఁ గని యమృతరక్షుల
నల్పక్రోధులయి తాకిరార్చి కడంకన్. 94

ప్ర. కల్ప, అంత, అనల, కీలా, కల్ప, ఆయత, పక్షున్ = ప్రళయ కాల మందలి అగ్నియొక్క జ్వాలలతో సమానమయిన విశాలములైన రెక్కలుగలవానిని, పక్షి, గణ, విభు = పక్షుల సమూహములకు రాజ యిన వానిని, శౌర్య-ఆకల్పున్=పరాక్రమము అలంకారముగా గలిగిన వానిని, గరుత్మంతుని, కని=చూచి, అమృత, రక్షులు=అమృతమును కాపాడువారు, అనల్ప, క్రోధులు-అయి=అధికమైన కోపముగలవారయి, ఆర్చి=గర్జించి, కడంకన్=సాహసముతో, తాకిరి=ఎదుర్కొనిరి.

తా. ప్రళయకాలమందలి అగ్నిజ్వాలలతో సమానములై విశాలములయిన రెక్కలు గల్గినవాడును, పక్షిగణములకు రాజును, శౌర్యమలంకారముగా గలవాడునగు గరుత్మంతుని చూచి, అమృతమును కాపాడువారు అధిక మైన కోపము గలవారయి అరచి సాహసముతో నెదుర్కొనిరి.

కం. తరఁబడ నేసియు వైచియుఁ
బొడిచియు వివిధాస్త్ర శస్త్రముల నుద్ధతులై
కడుకొని యుద్ధము చేసిరి
కడిమి మెయిన్ విబుధవరులు గరుడని తోడన్. 95

ప్ర. తరఁ బడన్ = తొట్రుపాటు పడునట్లు, ఏసియు=బాణములు ప్రయో గించియు, వివిధ, అస్త్ర, శస్త్రములన్=పలు రకములయిన అస్త్రము లతో (మంత్రముచ్చరించి ప్రయోగింపబడు నాయుధములతో) శస్త్రము లతో (లోహాది నిర్మితములైన ఆయుధములతో) వైచియు=క్రమముగా పడవేసియు, పొడిచియు=క్రుమ్మియు, ఉద్ధతులు + ఐ=గర్వించిన వారై, కడుకొని=ఉత్సాహము పొంది, కడిమి, మెయిన్=పరాక్రమ ముతో, గరుడని, తోడన్=గరుత్మంతునితో, విబుధ, వరులు=దేవతా శ్రేష్ఠులు, యుద్ధము చేసిరి.

తా. తొట్రుపడునట్లుగా బాణములు ప్రయోగించియు, పలురకములగు శస్త్రాస్త్రములతో పడవేసియు క్రుమ్మియు గర్వించినవారయి ఉత్సాహము చెంది, పరాక్రమముతో దేవతాశ్రేష్ఠులు గరుత్మంతునితో యుద్ధము చేసిరి.

వ. గరుడండును నిజపక్ష విక్షిప్త రజోవృష్టి నమరవరుల దృష్టి పథంబు గప్పి స్వర్గలోకంబు నిరవలోకంబుగాఁ జేసిన నమరేంద్రు పనుపునం బవనుం డారజోవృష్టి చెదర వీచెనంత. 96

ప్ర. గరుడండును=గరుత్మంతుడును, నిజ, పక్ష, విక్షిప్త, రజ, వృష్టిన్=తనయొక్క ఱెక్కలచే విదల్పబడిన దుమ్ముయొక్క వర్షముతో, అమర, వరుల=దేవతా శ్రేష్ఠులయొక్క, దృష్టి, పథంబు=చూపు మార్గమును, కప్పి, స్వర్గలోకంబు=దేవతల లోకమగు స్వర్గలోకమును, నిరవలోకంబుకాన్=వెలుగులేనిది యగునట్లుగా, చేసినన్=చేయగా, అమర, ఇంద్రు, పనుపునన్=దేవతలరాజగు నింద్రుని యాజ్ఞచే, పవనుండు=గాలి, ఆ, రజః, వృష్టి=ఆ దుమ్ముయొక్క వర్షము, చెదరన్=చెదరునట్లుగా, వీచెన్=విసరెను, అంత=ఆ సమయమునందు.

మాలిని. పరశు కులిశ కుంతప్రాస బాణాసనోద్య
త్పరిఘ కణప, చక్ర, ప్రస్ఫురద్బాహు సేనా
పరివృతుడయి తాఁకెన్ భౌమనుం డన్మహాకిం
కరుడు సమరకేళీ గర్వితున్ వైనతేయున్. 97

ప్ర. పరశు, కులిశ, కుంత, ప్రాస, బాణాసన, ఉద్యత్, పరిఘ, కణప, చక్ర, ప్రస్ఫురత్, బాహు, సేనా, పరివృతుఁ డు, అయి = గొడ్డలి, వజ్రాయుధము, బల్లెములు, ఈటెలు, విండ్లు, పైకి నెత్తబడిన బాణములు (గుదియలు), కణపములు(ఒక రకపు ఆయుధములు) చక్రములు మున్నగు వానితో ప్రకాశించుచున్న భుజములు గల్గిన సైన్యముతో చుట్టబడినవాడయి, భౌమనుండు, అన్=భౌమనుడు అను పేరుగల (అను లోని ఉత్వము లోపించినది) మహత్, కింకరుడు=గొప్ప సేవకుడు, సమర, కేళీ, గర్వితున్=యుద్ధము అనెడి క్రీడ యందు మదించిన, వైనతేయున్=వినతకొడుకగు గరుత్మంతుని, తాఁకెన్=ఎదుర్కొనెను,

తా. భౌమసుడను గొప్పసేవకుడు, గొడ్డలి, వజ్రము, బల్లెము, ఈటె, విల్లు, ఎత్తబడిన బాణము, కణపము, చక్రము అనువానితో ప్రకాశించుచున్న చేతులు గల్గిన సైన్యముతో చుట్టబడినవాడయి యుద్ధమనెడి క్రీడయందు మదించిన గరుత్మంతుని ఎదుర్కొనెను.

కం. బలవత్ ఖగేంద్ర కోపా
నల భస్మీభూతుడై క్షణంబున వాఁడున్
బలమఱి క్రాగె నుదగ్ర
జ్వలన జ్వాలావలీఢ శలభము పోలెన్ 98

ప్ర. బలవత్, ఖగ ఇంద్ర, కోప, అనల, భస్మీభూతుడు, ఐ=బలవంతుడయిన పక్షులరాజయిన గరుత్మంతుని యొక్క కోపమనెడి అగ్నిచే బూడిదయిన వాడయి, క్షణంబున=క్షణకాలములో, వాడున్=ఆ భౌమనుడు కూడ, బలము, అఱి=బలము నశించి, ఉదగ్ర, జ్వలన, జ్వాలా, అవలీఢ, శలభము, అ, పోలెన్=పైకిలేచుచున్న జ్వాలలు కల అగ్నియొక్క మంటలచే కాల్చబడిన మిడుతవలె, క్రాగెన్=తపించెను.

తా. బలవంతుడయిన గరుత్మంతుని యొక్క కోపమనెడి అగ్నిచే బూడిదయిన వాడయి, క్షణకాలములో, ఆ భౌమనుడను వాడును బలము నశించి, పైకి లేచు అగ్నిమంటలచే తాకబడిన మిడుతవలె దగ్ధుడయ్యెను.

వ. మఱియును=ఇంకను. 99

సీ. పక్షతుండాగ్ర నఖక్షత దేహులై జోరన నవరక్తధార లొలుక
విహగేంద్రునకు నోడి నిహతులై సురవరుల్ సురరాజు మఱువుఁ
జొచ్చిరి కలంగి
సాధ్యులనాయాససాధ్యులై పాఱిరి పూర్వాభిముఖులయి గర్వమణఁగి
వసువులు రుద్రులు వసుహీనవిప్రులక్రియ దక్షిణాశ్రితులయిరి భీతి
వంది యపరదిక్కుఁ బొంది రాదిత్యు లా
శ్వినులు నుత్తరమున కొనరఁ బఱచి
రనల వరుణ పవన ధనద య మాసురుల్
పీకఁ దఱిగి కాందిశీకులయిరి 100

ప్ర. పక్ష తుండ అగ్ర, నఖ, క్షత, దేహులు, అయి=ఱెక్కలు ముక్కు యొక్క కొనభాగము, గోళ్ళు అనువానిచే, గాయపరుపబడిన శరీరములు గలవారయి, బోరన=శీఘ్రముగా, నవ, రక్త, ధారలు=కొత్త నెత్తురుల ధారలు, ఒలుకన్=కారగా, విహగ, ఇంద్రునకున్, ఓడి=గరుత్మంతునకు ఓడిపోయి, నిహతులు + ఐ = హింసింపబడినవారై, కలంగి = కలత నొంది, సుర, వరుల్ = దేవతాశ్రేష్ఠులు, సుర, రాజు, మఱువు = దేవతలకు రాజయిన ఇంద్రుని ఆశ్రయము, చొచ్చిరి=చేరిరి, సాధ్యులు=సాధ్యులనెడి దేవతలలో వొక తెగవారు, అనాయాస, సాధ్యులు, ఐ=శ్రమలేకయే జయింపబడిన వారయి, గర్వము, అడగి=గర్వము నశింప, పూర్వ, అభిముఖులు-అయి=తూర్పు ముఖముగా పోవు వారయి, పాఱిరి, పరుగెత్తిరి, భీతిన్=భయముతో, వసువులు = ఎనమండుగురు వసువులు, రుద్రులు = పదకొండుగురు రుద్రులు భీతిన్=భయముతో వసు, హీన, విప్రుల, క్రియ=సంపదలేని బ్రాహ్మణుల వలె, దక్షిణ, ఆశ్రితులు, అయిరి = దక్షిణ దిక్కును ఆశ్రయించిన వారయిరి, (బ్రాహ్మణ పక్షమున) దక్షిణా-ఆశ్రితులు-అయిరి=సంభావనను ఆశ్రయించిన వారయిరి, ఆదిత్యులు=పన్నెండుగురు సూర్యులును, భీతివంది=పరితపించి, అపర, దిక్కున్=పడమటి దిక్కును, పొందిరి=చేరిరి, (సూర్యాస్తమయము పశ్చిమ దిక్కున జరుగును). ఆశ్వినులు = అశ్వినీ దేవతలు, ఉత్తరమునకు = ఉత్తర దిక్కునకు, ఒనరన్=ఒప్పునట్లుగా, పఱచిరి = పారిపోయిరి, అనల, వరుణ, పవన, ధనద, యమ అసురుల్=అగ్ని, వరుణుడు, వాయువు, కుబేరుడు, యముడు, రాక్షసుడగు నైరృతి అను దిక్పాలురు, లేక, తఱిగి=పరాక్రమము తగ్గి, కాందిశీకులు, అయిరి = దిక్కు తెలియక పరుగెత్తిన వారయిరి.

తా. ఱెక్కలచే, ముక్కుకొనచే, గోళ్లచే దెబ్బతిన్న శరీరము గల వారయి బోరుమని నెత్తురుధారలుగా కారుచుండగా గరుత్మంతునిచే జయింపబడి, హింసింపబడి, దేవతా శ్రేష్ఠులు ఇంద్రుని చాటు చేరిరి. సాధ్యులను దేవతాగణము శ్రమలేకయే జయింపబడినవారై గర్వము విడిచి తూర్పు

దిక్కుగా పారిపోయిరి. వసువులును రుద్రులును సంపదలేని బ్రాహ్మణుల వలె దక్షిణ దిక్కును ఆశ్రయించిరి. 'సంభావన నాశ్రయించిరి'. పంద్రెండుగురు సూర్యులును కలతనొంది పడమటి దిక్కును పొందిరి. అశ్వినీ దేవతలు ఉత్తర దిక్కునకు పారిపోయిరి. అగ్ని, వరుణు, వాయువు, కుబేరుడు, యముడు, అసురుడగు నైరృతి అను దిక్పాలురు దిక్కు తెలియక పారిపోయిన వారయిరి.

కం. తలరఁగ రేణుక్రథన
ప్రలిహ ప్రరుజాశ్వక్రంత పద నఖులను ర
క్షులఁ గులిశనిశాత నఖా
వలిఁ బక్షీంద్రుండు వ్రచ్చి వందఱ లాడెన్. 101

ప్ర. పక్షి, ఇంద్రుడు=పక్షులకు రాజయిన గరుత్మంతుడు, రేణు, క్రథన, ప్రలిహ, ప్రరుజ, అశ్వక్రంత, పదనఖులు, అనరక్షులన్ = రేణువు క్రథనుడు, ప్రలిహుడు, ప్రరుజుడు, అశ్వక్రంతుడు, పదనఖుడు అను కావలి వారలను, తలరగ=సంభ్రమించునట్లుగా, కులిశ, నిశాత, నఖ, ఆవలిన్=వజ్రాయుధము వలె వాడియైన గోళ్ళ వరుసతో, వ్రచ్చి=చీల్చి, వందఱు ఆడెన్=ముక్కలు చేసెను.

తా. రేణువు క్రథనుడు, ప్రలిహుడు, ప్రరుజుడు, అశ్వక్రంతుడు, పదనఖుడు అను కావలి వారిని, సంభ్రమించునట్లుగా గరుడుడు వజ్రము వలె వాడియైన గోళ్ళ వరుసతో చీల్చి ముక్కలు చేసెను.

వ. ఇట్లు నిర్జరవరుల నెల్ల నిర్జించి యూర్జితుండై గరుడం డమృతస్థానంబున కలిగి దానిం బరివేష్టించి ఘోర సమీరప్రేరితంబై దుర్వారశిఖాజిహ్వాల నంబరంబు నాస్వాదించుచున్న యనలంబుంగని తత్క్షణంబ సకల నదీ జలంబులనెల్లఁ బుక్కిలించుకొని వచ్చి యయ్యనలంబు నాఱంజల్లి తీక్ష్ణ ధారంబై దేవ నిర్మితంబై పరిభ్రమించుచున్న యంత్ర చక్రంబు నరాంతరంబున సంక్షిప్తదేహుండై చొచ్చి యచ్చక్రంబు క్రింద. 102

ప్ర. ఇట్లు=ఈ విధముగా, నిర్జర, వరులన్, ఎల్ల=దేవతలందఱిని, నిర్జించి =జయించి, ఊర్జితుండు-ఐ = బలవంతుడై, గరుడండు, అమృత స్థానంబునకు=అమృతమున్న ప్రదేశమునకు, అరిగి=వెళ్ళి, దానిన్= ఆ అమృతమును, పరివేష్టించి=చుట్టుకొని, ఘోర, సమీర, ప్రేరితంబు -ఐ=భయంకరమగు వాయువుచే రగుల్కొల్పబడినదై, దుర్వార, శిఖా. జిహ్వాలన్=వారింపశక్యముగాని అగ్నిజ్వాల లనెడి నాలుకలతో, అంబ రంబున్=ఆకాశమును, అస్వాదించుచున్న=నాకుచున్న (తాకుచున్న), అనలంబున్-కని=అగ్నిని చూచి, తత్, క్షణంబు,ఆ=ఆ క్షణమునందే సకల. నదీజలంబులన్ ఎల్లన్=అన్ని నదులయొక్క నీటినంతటిని, పుక్కిలించుకొని=నోటిలోనుంచుకొని (గండూషించి) వచ్చి, ఆ-అన లంబున్=ఆ అగ్నిని, ఆఱన్, చల్లి=ఆరిపోవునట్లుగా చల్లి. తీక్ష్ణధారంబు, ఐ=పదునైన అంచుగలదై, దేవ, నిర్మితంబు, ఐ=దేవతలచే తయారు చేయబడిదై, పరిభ్రమించుచున్న=తిరుగుచున్న. యంత్ర, చక్రంబు అర, అంతరంబున=యంత్రమున చక్రముయొక్క ఆకులలోపలి భాగ మున, సంక్షిప్త, దేహుండు, ఐ=చిన్నదిగా చేయబడిన శరీరము గల వాడై, చొచ్చి=ప్రవేశించి, ఆ, చక్రంబు, క్రింద=ఆ చక్రముయొక్క క్రింది భాగమున.

ఉ. ఘోర వికార సన్నిహిత కోపముఖంబులు, దీప్తవిద్యుదు
ల్కారుణ దారుణాక్షములునై నిజదృష్టి విషాగ్ని నన్యులం
జేరఁగనీక యేర్చుచుఁబ్రసిద్ధముగా నమృతంబుచుట్టు ర
క్షారతినున్న యుగ్రభుజగంబుల రెంటినిగాంచి చెచ్చెరన్. 108

ప్ర. ఘోర, వికార, సన్నిహిత, కోప, ముఖంబులు=భయంకరములయిన, వికారముతో కూడిన, కోపముగల నోళ్ళుగలవియు, దీప్త, విద్యుత్ ఉల్కా, అరుణ, దారుణ. అక్షములును-ఐ=వెలుగుచున్న మెఱుపులు వలె నిప్పుకణములవలె ఎఱ్ఱనైన భయంకరములయిన కన్నులు గలవియై నిజ, దృష్టి. విష, అగ్నిన్=తమ చూపులనుండి ప్రసరించు విషమనెడి అగ్నితోడను, అన్యులన్ = ఇతరులను, చేరగన్+ఈక=దగ్గరకు రానీయకుండ, ఏర్చుచున్=దహించుచు, ప్రసిద్ధముగాన్=ప్రకటమగు

నట్లు, అమృతంబు చుట్టు=అమృతము చుట్టును, రక్షా, రతిన్=రక్షించుట యందలి యాసక్తితో, ఉన్న, ఉగ్ర, భుజగంబుల, రెంటిని=భయంకరమగు పాములను రెంటిని, కాంచి=చూచి, వెచ్చెరన్=వెంటనే.

తా. భయంకరములగు వికారముతో కూడిన కోపముగల ముఖములు గలవియు, వెలుగుచున్న మెఱుపులవలె, నిప్పుకణములవలె, నెఱ్ఱనైన, భయంకరము లయిన కన్నులుగలవియు, నయి, తమ కన్నులందలి విషమనెడి యగ్నితో ఇతరులను దగ్గరకు రానీయకుండ దహించుచు అమృతమునకు చుట్టును కాపాడుట యందాసక్తితోనున్న భయంకరములయిన పాములను రెంటిని చూచి, వెంటనే.

వ. అయ్యురగంబులం దన పక్ష రజోవృష్టి నంధంబులం జేసి వాని శిరంబులు ద్రొక్కి పరాక్రమం బెసంగ నమృతంబుకొని గరుడండు గగనంబున కెగసిన. 104

ప్ర. ఆ, ఉరగంబులన్=ఆ పాములను, తన, పక్ష, రజః, వృష్టిన్=తన తెక్కలవలన ఏర్పడిన దుమ్ముయొక్క వర్షముతో, అంధంబులన్ + చేసి= గ్రుడ్డి వానినిగా జేసి, వాని శిరంబులు, త్రొక్కి=వాని తలలు త్రొక్కి, పరాక్రమంబు, ఎసంగన్=పరాక్రమ మెక్కువ కాగా, అమృతంబు, కొని=అమృతమును తీసికొని, గరుడండు, గగనంబునకు=ఆకాశమునకు, ఎగసిన=ఎగిరిపోగా.

కం. కలహమున నిట్లు సురవీ
రుల బల్వుర నోర్చి యొక్కరుఁడ యమృతముఁదె
క్కలి కొని యాస్వాదింపక
యలోలుఁడగు వానిఁజూచి హరి యిట్లనియెన్ 105

ప్ర. కలహమునన్=యుద్ధమునందు, ఇట్లు= ఈ విధముగా, సురవీరులన్= వీరులైన దేవతలను, పల్వురన్=చాలమందిని, ఓర్చి = జయించి, ఒక్కరుడు-అ=ఒక్కడే, అమృతమున్=అమృతమును, తెక్కలికొని

=అపహరించి, ఆస్వాదింపక=రుచి చూడక, అలోలుడు-అగువానిన్ =ఆసక్తి లేకుండనున్న యా గరుత్మంతుని, చూచి, హరి=విష్ణువు ఇట్లు-అనియెన్=ఇట్లు చెప్పెను.

తా. ఈ విధముగా యుద్ధమునందు దేవతా వీరులను పెక్కుమందిని జయించి యొక్కడే అమృతమును దొంగిలించి రుచిచూడక అనాసక్తుడుగా నున్న గరుత్మంతుని చూచి విష్ణువు ఇట్లు చెప్పెను.

కం. నీ విజయోత్సాహమునకు
లావునకుఁ జవంబునకు నతౌల్యమునకు స
ద్భావమునకు మెచ్చి వరం
బీవచ్చితి వేడు యెద్ది యిష్టము నీకున్. 106

ప్ర. నీ, విజయ, ఉత్సాహమునకు=నీ విజయము నందలి ప్రయత్నమునకు, లావునకు=బలమునకు, జవంబునకున్=వేగమునకు, అతౌల్యమునకు= అనాసక్తికి, సత్ భావమునకు=మంచితనమునకు. మెచ్చి=సంతోషించి, వరంబు, ఈ, వచ్చితి=వరము నిచ్చుటకు వచ్చితిని, నీకున్ ఇష్టము, ఎద్ది=నీకు ఏది ప్రియమో, వేడుము=కోరుకొనుము.

తా. నీ విజయము కొరకయిన ప్రయత్నమునకు, బలమునకు, వేగమునకు, అనాసక్తికి, మంచితనమునకు, సంతోషించి నీకు వరమిచ్చుటకు వచ్చితిని, నీకేది యిష్టమో కోరుకొనుము.

వ. అని ప్రసన్నుండై యానతిచ్చిన యాది దేవుండగు శ్రీమన్నారాయణు నకు నమస్కరించి గరుడం డిట్లనియె 107

ప్ర. అని ప్రసన్నుండు + ఐ=అనుగ్రహించిన వాడయి, ఆనతి ఇచ్చిన = సెలవిచ్చిన యట్టి, ఆది, దేవుండు అగు=మొదటి వేల్పగు, శ్రీమత్, నారాయణునకు=శోభగల నారాయణునకు, సమస్కరించి=మ్రొక్కి, గరుడండు=గరుత్మంతుడు, ఇట్లు-అనియె

సీ. అమృతాశనంబు చేయకయును దేవ
నాక జరామరత్వంబు నందుటయును
అఖిల లోకంబుల కగ్రణివైన
నీయగ్రంబునందు నిన్నధిభక్తిఁ
గొలుచు నునికియుఁ గోరితిఁ గరుణతో
దయసేయు మున్నత దైత్యభేది
యనవుడు వానికి నభిమతంబులు
ప్రీతుఁడై యిచ్చి హరి యిట్టు లనియె నాకు
ననఘ వాహనంబవై మహాధ్వజమవై
యుండు మనిన పక్షియును ప్రసాద
మనుచు మ్రొక్కి పఱచె నంత నాతని మీఁద
వజ్రమెత్తి వైచె వాసవుండు. 108

ప్ర. దేవ = ఓ దేవుడా!, అమృత, అశనంబు = అమృతము తినుటను, చేయకయును = చేయకుండగనే, నాకు, అజర అమరత్వంబును = ముసలితనము, చావు అనునవి లేకుండుట, అందుటయును = కల్గుటయు, (పొందుటయు) అఖిల, లోకంబులకు = అన్ని లోకములకు, అగ్రణివి-ఐన = ముఖ్యుడవయిన, నీ అగ్రంబునందు = నీ యెదుట, నిన్ను, అధిక భక్తిన్ = మిక్కిలి భక్తితో, కొలుచుచున్, ఉనికియు = సేవించుచు ఉండుటయు, కోరితిన్ = వేడుకొంటిని, కరుణతో = దయతో, దయ చేయుము = అనుగ్రహింపుము (ఇమ్ము), అనవుడు = అనగా, వానికి = ఆ గరుత్మంతునకు, అభిమతంబులు = కోరికలను, ప్రీతుడు + ఐ = సంతోషించినవాడయి, ఇచ్చి, హరి = విష్ణువు, ఇట్టులు-అనియె = ఇట్లు చెప్పెను, అనఘ = పాపము లేనివాడా! నాకు = విష్ణువనగు నాకు, వాహనంబవు + ఐ = మోయు వాహనమవై, మహత్, ధ్వజమవు, ఐ = గొప్ప జెండావై, ఉండుము, అనినన్ = అని చెప్పగా, పక్షియును = పక్షియగు గరుత్మంతుడును, ప్రసాదము-అనుచు = అనుగ్రహమనుచు, మ్రొక్కి = నమస్కరించి, పఱచె = ఎగిరెను, అంత = అంతట, అతని మీద = ఆ గరుత్మంతుని మీద, వాసవుండు = ఇంద్రుడు, వజ్రము = వజ్రాయుధమును, ఎత్తివైచె = పైకెత్తి విసరెను.

తా. అమృతము తినకుండ ముసలి తనము, చావు రాకుండుటయు, అన్ని లోకములకు అధికుడవయిన నీ యెదుట మిక్కిలి భక్తితో నిన్ను సేవించు చుండుటయును కోరితిని. దయతో నిమ్ము అని గరుత్మంతుడు కోరగా అతనికి సంతోషించినవాడై కోరికలను తీర్చి విష్ణువు "నీవు వాహనముగా, మహాధ్వజముగా నాకు ఉండుము" అని చెప్పగా, పక్షియగు గరుత్మంతుడు ప్రసాదమనుచు నమస్కరించి ఎగిరిపోయెను. అప్పుడు ఇంద్రుడు అతనిపై వజ్రాయుధమును విసరివైచెను.

వ. అదియును నంబరంబున నగ్ని కణంబులు చెదరం బఱతెంచి పక్షిరాజు పక్షంబులు దాఁక వచ్చినం జూచి గరుడండు నగి, నీ చేయు వేదన నన్నుం దాక నోపదు. నీవు మహాముని సంభవం బగుటను దేవేంద్రు నాయుధంబ వగుటను నిన్ను నవమానింపం గాదు గావున మదీయైక పర్ణ శకలచ్ఛేదంబు సేయుము. నా యందు నీ శక్తి యింతియ యనిన సకల భూత సంఘంబెల్ల నాతని పర్ణంబుల సుస్థిరత్వంబునకు మెచ్చి సుపర్ణుండని పొగడిరి. సురేంద్రుండును నవ్విహగేంద్రు మహాత్మ్యంబునకు మెచ్చి యచ్చెరువంది యిట్లనియె. 109

ప్ర. అదియును = ఆ వజ్రాయుధమును, అంబరంబునన్ = ఆకాశమునందు, అగ్ని కణంబులు = నిప్పుకణములు, చెదరన్ = ఎగిరిపడు నట్లుగా, పఱతెంచి = వచ్చి, పక్షిరాజు, పక్షంబులు = పక్షులకు రాజయిన గరుత్మంతుని ఱెక్కలను, తాక వచ్చినన్ = తాకుటకు రాగా, చూచి, గరుడండు = గరుత్మంతుడు, నగి = నవ్వి, నీ చేయు వేదన = నీవు చేసెడి బాధ, నన్నున్ = నన్ను, (గరుత్మంతుని) తాకన్, ఓపదు = తాకఁ జాలదు, నీవు, మహత్ ముని, సంభవంబు, అగుటను = గొప్పముని నుండి పుట్టినదాన వగుటచేతను (వజ్రాయుధము దధీచి వెన్నెముక యని పురాణవచనము) దేవేంద్రు, ఆయుధంబవు, అగుటను = దేవేంద్రుని యొక్క ఆయుధమవగుట చేతను నిన్నున్, అవమానింపన్, కాదు = అవమానపరుపరాదు, కావునన్ = అందుచే, మదీయ, ఏక, పర్ణ, శకల, ఛేదంబు = నాదయిన ఒక యీక యొక్క ముక్కను త్రుంచుటను, చేయుము, నాయందు = నా మీద, నీ

శక్తి = నీయొక్క (వజ్రాయుధము) ప్రభావము, ఇంతి-అ=ఇంత మాత్రమే, అనిన=అని పల్కఁగా, సకల, భూత సంఘంబు, ఎల్లన్ = అన్ని ప్రాణుల యొక్క సమూహమంతయు, అతని, పర్ణంబుల ఆ గరుత్మంతుని ఱెక్కల యొక్క, సుస్థిరత్వంబునకు = గట్టితనమునకు మెచ్చి=పొగడి, సుపర్ణుఁడు-అని=సుపర్ణుడను పేరుతో, పొగడిరి= మెచ్చుకొనిరి.(సుపర్ణుడనగా మంచి బలమైన రెక్కలుకలవాడని వ్యుత్పత్తి) సుర-ఇంద్రుండును = దేవతలకు రాజగు ఇంద్రుడును, ఆ విహగ ఇంద్రు, మాహాత్మ్యంబునకు=ఆ పక్షులకు ఇంద్రుడయిన గరుత్మంతుని గొప్పతనమునకు, మెచ్చి, అచ్చెరువు-అంది=ఆశ్చర్యము పొంది, ఇట్లు-అనియె.

తే. నిరుపమాన శౌర్య నీతోడఁ జెలిమి సే
యంగ నాకభీష్టమైన యదియు
నిట్టి విక్రమంబు నిట్టి సామర్థ్యంబుఁ
గలదె యొరుల కిజ్జగంబునందు. 110

ప్ర. నిరుపమాన, శౌర్య=సాటిలేని పరాక్రమము కలవాడా!, నీ తోడన్= నీతో (గరుత్మంతునితో) చెలిమి, చేయంగ=స్నేహము చేయుటకు, నాకు, అభీష్టము ఐన, అది, యు=నాకు కోరిక గలిగినది కూడ, ఇట్టి విక్రమంబున్=ఇటువంటి పరాక్రమమును, ఇట్టి సామర్థ్యంబున్=ఇటు వంటి నేర్పును, ఒరులకు=ఇతరులకు, ఈ జగంబునందు=ఈ లోకము నందు, కలదు-ఎ=కలదా (లేదని భావము)

తా. ఓ సాటిలేని పరాక్రమము గలవాడా! నీతో స్నేహము చేయవలయునని నాకు కోరిక గలిగినది. ఇట్టి విక్రమమును, నేర్పును ఈ లోకమునందు ఇతరులకు గలదా? (లేదని భావము.)

కం. అమరుఁడ వజరుఁడ వజితుఁడ
వమేయుఁడవు నీకు నమృత మదియేల ఖగో
త్తమ! దీని నొరుల కిచ్చిన
నమరులకును వారసాధ్యులగుదురు పోరన్ 111

ప్ర. అమరుడవు=మరణము లేనివాడవు, అజరుడవు=ముసలితనము లేని వాడవు, అజితుడవు=ఓడింపబడని వాడవు, అమేయుడవు = కొలది చెప్పరానివాడవు, నీకున్, అమృతము, అది, ఏల=అమృతము ఎందులకు, ఖగ-ఉత్తమ=పక్షులలో శ్రేష్ఠుడా!, దీనిన్ = ఈ అమృతమును, ఒరులకు=దేవతలకంటె నితరులకు, ఇచ్చినన్=ఇచ్చినచో, వారు= ఆ అమృతము త్రావినవారు, పోరన్ = యుద్ధమునందు, అమరులకును= దేవతలకు, అసాధ్యులు అగుదురు=జయింపరాని వారగుదరు.

తా. నీవు మరణము, ముసలితనము, పరాజయము లేనివాడవు. ఇట్టివాడవని కొలది యిడరాని వాడవు. నీకు అమృత మెందులకు? ఓ పక్షిరాజా! ఈ యమృతమును దేవతల కంటె నితరుల కిచ్చినచో వారు దేవతలకు జయింపరాని వారయ్యెదరు.

కం. నీ వొరులకు నీయమృతం<br>బీవలవదు నాకు మగుడ నిచ్చిన నీకి<br>ష్టావాప్తి యగు విధంబేఁ<br>గావించెద ననిన హరికి గరుడం డనియెన్. 112

ప్ర. నీవు=(గరుత్మంతుడు), ఒరులకున్=ఇతరులకు, ఈ అమృతంబు= ఈ అమృతమును, ఈ వలవదు = ఈయవద్దు (ఇచ్చు ధాతువుయొక్క-తుమున్నర్థరూపము), నాకు, మగుడన్-ఇచ్చిన = తిరిగి యిచ్చినచో, నీకు, ఇష్ట-అవాప్తి=ఇష్టమయినదానిని పొందుట, అగు, విధంబు= అయ్యెడివిధానమును, ఏన్=నేను, కావించెదన్=చేసెదను, అనిన=అని చెప్పగా, హరికి=ఇంద్రునకు, గరుడండు=గరుత్మంతుడు=చెప్పెను.

తా. నీవు ఇతరులకు నమృతము నీయవద్దు. నాకు దానిని తిరిగి యిచ్చినచో నీ కిష్టమయినది జరుగు విధమును నేను చేసెదనని యింద్రుడు గరుత్మంతునితో చెప్పగా, అతనికి గరుత్మంతుడు చెప్పెను.

వ. ఏను మదీయ మాతృదాసీత్వ నిరాసార్థంబురగుల కమృతంబుఁ దెచ్చి యిత్తునని కాద్రవేయులతో నొడివి వచ్చినవాఁడ నీ యమృతంబు గొని

పోయి వారలకిచ్చి మదీయ జననీ దాస్యంబుఁ బాచికొనిన నురగు లీయమృతంబుపయోగింపకుండ ముందఱ నీవు గొని చనుమనిన నగ్గరుడని మహానుభావంబునకు మెచ్చి నీ బలపరాక్రమంబులు వినవలతుం జెప్పుమనిన నయ్యింద్రునకు గరుడండిట్లనియె.

ప్ర. ఏను=నేను, మదీయ, మాతృ, దాసీత్వ, నిరాస, అర్థంబు=నాదయిన తల్లియొక్క దాసితనమును పోగొట్టుటకు, ఉరగులకు=పాములకు, అమృతంబు, తెచ్చి, ఇత్తున్-అని=తీసికొనివచ్చి యిచ్చెదనని, కాద్రవేయులతో=కద్రువకుమారులగు పాములతో, నొడివి, వచ్చినవాడన్=చెప్పివచ్చినవాడను ఈ, అమృతంబు, కొనిపోయి = తీసికొనివెళ్ళి, వారలకు = ఆ పాములకు, ఇచ్చి, మదీయ, జననీ, దాస్యంబున్ = నాదగుతల్లి యొక్క దాసితనమును, పాచికొనినన్=పోగొట్టుకొనగా, ఉరగులు=పాములు, ఈ అమృతంబు=నేను తీసికొని వెళ్ళిన యమృతమును, ఉపయోగింపకుండ=వాడకుండ (భుజింపకుండ), ముందఱ= ముందుగా, నీవు, కొని=తీసికొని, చనుము=వెళ్ళుము, అనినన్=అని చెప్పగా, ఆ గరుడని, మహత్, అను భావంబునకు=ఆ గరుత్మంతుని మహత్త్వమునకు, మెచ్చి=మెచ్చుకొని, నీ, బల, పరాక్రమంబులు= నీ యొక్క బలమును, పరాక్రమమును, వినన్, వలతున్ = వినగోరెదను, చెప్పుము, అనినన్=అనగా, ఆ-ఇంద్రునకు=ఆ దేవేంద్రునకు, గరుడండు, ఇట్లు, అనియె.

కం. పరనిందయు నాత్మగుణో
త్కరపరికీర్తనముఁ జేయఁగా నుచితమె స
త్పురుషులకైనన్ను, నీక
చ్చెరువుగ నాకల తెలుంగుఁ జెప్పెదఁ బ్రీతిన్. 114

ప్ర. సత్పురుషులకు=సజ్జనులకు, పర, నింద యున్=ఇతరులను నిందించుట, ఆత్మ, గుణ, ఉత్కర, పరికీర్తనమున్=తనయొక్క గుణముల సముదాయమును పొగడుకొనుటను, చేయగాన్, ఉచితము-ఎ=చేయుట తగునా, ఐనను=అయినప్పటికిని, నీకు=ఇంద్రునకు, అచ్చెరువుగ=

ఆశ్చర్యమగునట్లుగా, నా, కల, తెఱఁగున్=నాయొక్క సత్యమయిన విధమును, ప్రీతిన్=ఇష్టముతో, చెప్పెదన్=చెప్పెదను.

తా. సజ్జనులకు ఇతరులను నిందించుటయు, తమ గుణముల సముదాయమును మెచ్చుకొనుటయు చేయుట తగునా (తగదు). అయినను నీకు ఆశ్చర్యమగునట్లుగా నాయొక్క సత్యమయిన విధమును ప్రీతితో చెప్పెదను.

ఉ. స్థావర, జంగమ ప్రవితతంబగు భూవలయంబునెల్ల నా
లావున, బూనితాల్తు నవిలంఘ్యపయోధి జలంబులెల్ల, ర
త్నావళితోన చల్లుదు, బృహన్నిజపక్ష సమీరణంబునన్
దేవగణేశ ! యీ క్షణమ త్రిమ్మరి వత్తుఁ ద్రివిష్టపంబులన్ 115

ప్ర. దేవ, గణ - ఈశ = దేవతల సమూహమునకు రాజా ! స్థావర, జంగమ, ప్రవితతంబు, అగు=అచరములు చరములు అగు వస్తువులతో నిండినట్టి, భూ, వలయంబున్-ఎల్ల = భూమండలము నంతటిని, నా లావునన్=నా బలముతో, పూని=వహించి, తాల్తున్ = మోసెదను, బృహత్, నిజ, పక్ష సమీరణంబునన్=పెద్దవగు నా ఱెక్కల గాలితో, అవిలంఘ్య, పయోధి, జలంబులు, ఎల్ల=దాటశక్యముగాని సముద్రము యొక్క నీళ్ళనన్నింటిని, రత్న-ఆవళి, తోన్-అ=రత్నముల వరుసతో పాటుగా, చల్లుదు = వెదజిమ్మెదను,. త్రి, విష్టపంబులన్ = మూడు లోకములను, ఈ, క్షణమునందే(ఒక క్షణములోనే) త్రిమ్మరి, వత్తున్= చుట్టు తిరిగి వచ్చెదను.

తా. ఓ దేవగణములకు రాజా! చరములు, అచరములగు పదార్థములతో నిండి నట్టి భూమండలము నంత టిని నా బలముతో వహించి మోసెదను. పెద్దవగు నా ఱెక్కల గాలితో దాట శక్యముగాని సముద్రపు నీళ్ళ నన్నింటిని రత్నముల వరుసతో పాటుగా వెదజిమ్మెదను. మూడు లోకములను క్షణములో తిరిగివచ్చెదను.

వ. అని చెప్పిన గరుడని జవసత్త్వ, సామర్థ్యంబులకు మెచ్చి సంతసిల్లి నీవు నాతో నెప్పుడు బద్ధ సఖ్యుండవై యుండవలయునని వెండియు దేవేంద్రుండు గరుడున కిట్లనియె. 116

ప్ర. అని, చెప్పగా=అని చెప్పగా, గరుడని=గరుత్మంతుని యొక్క, జవ సత్త్వ సామర్థ్యంబులకు=వేగమునకు, బలమునకు నేర్పునకు, మెచ్చి, సంతసిల్లి=సంతోషించి, నీవు=(గరుత్మంతుడు), నాతో (దేవేంద్రునితో) ఎప్పుడు=ఎల్లప్పుడును, బద్ధ, సఖ్యుండవు, అయి=కూర్పబడిన స్నేహము గలవాడవై, ఉండ, వలయున్, అని = ఉండవలెనని, వెండియు = మఱియును, దేవ + ఇంద్రుడు = దేవతలకు రాజగు నింద్రుడు, గరుడునకు, ఇట్లు అనియె.

కం. నా కభిమత మొనరించితి
నీ కిష్టము చెప్పికొను మనిన దుర్మదులై
మా కిట్లహితముఁ జేసిన
యా కద్రువ పుత్రు లశనమయ్యెడు నాకున్. 117

ప్ర. నాకు, (ఇంద్రునకు) అభిమతము=ఇష్టమయిన దానిని, ఒనరించితి = చేసితివి, నీకు = (గరుత్మంతునకు) ఇష్టము = ప్రియమైనది, చెప్పికొనుము=తెల్పుము, అనిన=అని చెప్పగా, దుర్మదులు, ఐ = చెడు గర్వముగలవారై, మాకు=నాకును, నా తల్లియగు వినతకును, అహితమున్=అపకారమును, చేసిన, ఆ, కద్రువ, పుత్రులు = ఆ కద్రువ యొక్క కొడుకులు, పాములు, నాకున్=నాకు, అశనము అయ్యెడు= ఆహారము అగుగాక!

తా. నాకు ఇష్టమయిన దానిని చేసితివి. నీ కిష్టమయిన దానిని చెప్పుమని ఇంద్రుడు గరుత్మంతునితో చెప్పగా, మదముగల వారయి నాకును, నా తల్లియగు వినతకును అపకారము చేసిన కద్రువ కొడుకులు నాకాహారము అగుగాక !

కం. భవదభిరక్ష్యములగు నీ
భువనంబుల యందు సర్పములు ద్రిమ్మరుటన్
దివిజాధిప! నీ కెఱిగిం
ప వలసె నీ యాజ్ఞ నాకుఁ బడయఁగ వలసెన్. 118

ప్ర. దివిజ-అధిప=దేవతలకు రాజా !, భవత్, అభిరక్ష్యంబులు-అగు = మీచే కాపాడదగినట్టి, ఈ భువనంబుల యందున్=ఈ లోకములందు, సర్పములు=పాములు, త్రిమ్మరుటన్ = తిరుగుచుండుట చేత, నీకు ఎఱిగింపవలసె=తెలియజేయవలసివచ్చెను, నీ యాజ్ఞన్=నీ యను జ్ఞను, నాకు, పడయగ వలసెన్=పొందవలసి వచ్చెను.

తా. ఓ దేవతలకు రాజా ! నీచే రక్షింపదగినట్టి యీ లోకములందు పాములు తిరుగుచుండుటచేత నీకు తెలియజేయవలసి వచ్చినది; నాకు నీ యాజ్ఞ పొందవలసి వచ్చినది.

వ. అని గరుడండు దనకు నురగ భోజనత్వంబు సురపతి చేతంబడసి, తదను గమ్యమానుండై యురగుల యొద్దకు వచ్చి మరకత హరితం బైన కుశాస్తరణంబున నమృత కలశంబు నిలిపి యురగులకుం జూపి యిట్లనియె. 119

ప్ర. అని, గరుడండు=గరుత్మంతుడు, తనకున్, ఉరగ, భోజనత్వంబు= పాములు భోజనముగా గల్గియుండుటను, సురపతి చేతన్ = దేవతలకు రాజయిన యింద్రునిచే, పడసి=పొంది, తత్, అనుగమ్యమానుండు-ఐ=ఆ ఇంద్రునిచే అనుసరింపబడు చున్నవాడయి, ఉరగుల, ఒద్దకు =పాముల సమీపమునకు, వచ్చి, మరకత, హరితంబు, ఐన = మర కత మణులవలె ఆకుపచ్చనయిన, కుశ, ఆస్తరణంబునన్ = దర్భల పరపు మీద, అమృత, కలశంబు=అమృతముగల పాత్రను, నిలిపి= ఉంచి, ఉరగులకున్=పాములకు, చూపి, ఇట్లు అనియె.

కం. అనిమిషనాథ సుగుప్తమ
యిన యమృతము దెచ్చి మీకు నిచ్చితి నస్మ
జ్జననీ దాస్యము వాసెను
దినకర పవనాగ్ని తుహినదీప్తుల కరిగాన్. 120

ప్ర. అనిమిష, నాథ, సు, గుప్తము-అయిన=దేవతలకు రాజయిన యింద్రు నిచే భాగుగా రక్షింపబడిన, అమృతము, తెచ్చి, మీకున్, ఇచ్చితిన్ =

అమృతమును తెచ్చి మీ కిచ్చితిని, అస్మత్, జననీ, దాస్యము = నా తల్లియగు వినత యొక్క దాసితనము, దినకర, పవన అగ్ని, తుహిన, దీప్తులు, ఆ,కరి. కాన్=సూర్యుడు, గాలి, అగ్ని, చంద్రుడు అను వారే సాక్షిగా, పాసెన్=తొలగెను.

తా. దేవేంద్రునిచే బాగుగా రక్షింపబడిన యమృతమును తెచ్చి మీకిచ్చితిని. సూర్యుడు, గాలి, అగ్ని, చంద్రుడు-వీరే సాక్ష్యముగా నా తల్లియగు వినత యొక్క దాసితనము పోయినది.

వ. మీరలు స్నాతాలంకృతులరై వచ్చి దీని నుపయోగింపుండని పంచి తల్లిం దన వీఁపెక్కించుకొని విహగేంద్రుండురగుల కదృశ్యుండై యున్న సురేంద్రు పీడ్కొని చనియె నిట యురగులును నమృతోపయోగ కుతూహలంబున నొండొరులం గడవఁ గృతస్నానాలంకృతులై చనుదెంచుటకు ముందఱ. 121

ప్ర. మీరలు=మీరు, స్నాత, అలంకృతులరు-ఐ = స్నానము చేసినవారు, అలంకరించుకొన్నవారునై, వచ్చి, దీనిన్=ఈ యమృతమును, ఉపయోగింపుఁడు అని=వాడుకొనుడు ( భుజింపుడు ) అని, పంచి=పంపి, తల్లిన్=తల్లియగు వినతను, తన వీఁపు, ఎక్కించికొని=తన వీపున ఎక్కించుకొని, విహగ-ఇంద్రుడు=పక్షులకు ఇంద్రుడయిన గరుత్మంతుడు, ఉరగులకు=పాములకు, అదృశ్యుండు, ఐ = కనబడనివాడై, ఉన్న, సుర, ఇంద్రు=దేవతలరాజగు నింద్రుని, పీడ్కొని = పోయి వచ్చెదనని చెప్పివిడిచి, చనియెన్=వెళ్ళెను. ఇట=అమృతమున్నచోట, ఉరగులునున్=పాములును, అమృత, ఉపయోగ, కుతూహలంబునన్=అమృతమును వాడుకొనుటయందలి యుత్సాహముతో, ఒండు, ఒరులన్=ఒకరొకరిని, కడవన్ = దాటి ముందునకు పోవునట్లు, కృత, స్నాన, అలంకృతులు-ఐ=చేయబడిన స్నానము, అలంకారములు గలవారయి, చనుదెంచుటకు=వచ్చుటకు, ముందఱ=ముందుగనే.

కం. అమరాధిపుఁడమృతముఁగొని
యమరావతి కరిగి తొంటి యట్టుల సుస్థా
నమున నవిచలితరక్షా
క్షముఁడై రక్షించికొని సుఖస్థితినుండెన్. 122

ప్ర. అమర-అధిపుడు = దేవతలకురాజయిన ఇంద్రుడు, అమృతము, కొని = అమృతమును తీసికొని, అమరావతికి = దేవతల పట్టణమగు అమరావతికి, అరిగి = వెళ్ళి, తొంటి, అట్టులు-అ = పూర్వము విధముగనే, సుస్థానమునన్ = మంచిచోట, అవిచలిత, రక్షా, క్షముడు-ఐ = చెదరని రక్షణయందు సమర్థుడయి, రక్షించుకొని, సుఖ, స్థితిన్ = సుఖమగు ఉనికితో, ఉండెన్ = ఉండెను.

తా. ఇంద్రుడు అమృతమును గ్రహించి, అమరావతీ నగరమునకేగి, పూర్వము వలెనే, ఆ యమృతమును మంచిచోట నుంచి, స్థిరమగు రక్షణమునందు సమర్థుడై రక్షించుకొని, సుఖముతోఁ గూడిన స్థితిలో నుండెను.

వ. అంత నయ్యురగులు నమృతం బుపయోగింపం గానక దాని యున్న స్థానంబని దర్భలు నాకిన నాలుకలు రెండుగా వ్రయ్యుటం జేసి, నాటం గోలె ద్విజిహ్వులునాఁ బరగిరి, యమృత స్థితిం జేసి దర్భలు పవిత్రంబు లయ్యె.

ప్ర. ఆ, ఉరగులు = ఆ పాములు; ఉపయోగింపన్, కానన్ = ఉపయోగింప లేక; (త్రాగనెంచి యు దానిని గాంచక) దాని, ఉన్న. స్థానంబు, అని = అది యున్న చోటని; (కర్తృపద ప్రథమకు షష్ఠి); వ్రయ్యుటన్-చేసి = చీలుటచే; నాటన్, కోలె = నాటినుండి; ద్వి, జిహ్వులు, నాన్ = రెండు నాలుకలు గల వారనగా; పరగిరి = ఒప్పిరి; అమృత, స్థితిన్-చేసి = అమృతముయొక్క యునికిచే: దర్భలు, పవిత్రంబులు-అయ్యె = పవిత్రములయ్యెను.

కం. ఈ సౌపర్ణాఖ్యానము
భాసురముగ వినిన పుణ్య పరులకు నధిక
శ్రీసంపదలగు దురితని
రాసంబగు, బాయు నురగ రక్షోభయముల్. 124

ప్ర. ఈ, సౌపర్ణ, ఆఖ్యానము=గరుత్మంతునికి సంబంధించిన యీ కథను; భాసురముగ=ప్రకాశమానముగా (ఒప్పుగా); వినిన=వినినట్టి; పుణ్య పరులకున్=పుణ్యమునందాసక్తి గలవారికి; అధిక, శ్రీ, సంపదలు= విస్తారమయిన సిరియు, సంపదయు; అగు = కలుగును; దురిత, నిరాసంబు=పాపములయొక్క తొలగుట; అగున్=అగును; ఉరగ, రక్షః, భయముల్=పాములవలనను, రాక్షసులవలనను భయములు, పాయున్=తొలగును.

తా. గరుత్మంతునికి సంబంధించిన యీ కథ నొప్పుగా వినిన పుణ్యాత్ములకు అధికమయిన సిరియు సంపదయు గలుగును. పాపక్షయమగును. పాముల నుండియు, రాక్షసులనుండియు భయములు తొలగును.

# యయాతి చరిత్ర

# వ్యాఖ్యానము

(ప్రజావ్యాఖ్య)

రచయిత :

— ఖండవల్లి లక్ష్మీరంజనం

'ఓం గణపతిగ్ం హవామహే'

# యయాతి చరిత్ర*

## (ప్రజా వ్యాఖ్య)

*94 వ. అట్టి నహుషునకు – లిలిచి యిట్లనియె.*

అర్థం: శుక్రపుత్రి = శుక్రాచార్యుని కుమార్తెయైన దేవయాని, వృషపర్వ పుత్రి యయిన = వృషపర్వుడను దానవ చక్రవర్తి కూతురైన శర్మిష్ఠ. ద్రుహ్యు, అను, పూరులు ముగ్గురు కొడుకులు. దేవయానికి ఇద్దరు కొడుకులు. యయాతికి ఇద్దరు భార్యలందును, ఏవురు = ఐదుగురు కుమారులు, శుక్ర శాపంబున = శుక్రాచార్యు డిచ్చిన శాపముచే. 'న' అనే ప్రత్యయము పూర్వ భాషలో తృతీయ, పంచమి, సప్తమి విభక్తుల్లో కనబడుతూంటుంది. జరాభారపీడితుండై = ముసలితనము అనే బరువుచే బాధింపబడినవాడై.

తా. యయాతి తండ్రియైన నహుషుని గురించి 93 పద్యంలో చెప్పబడింది. యయాతి దేవయానిని, శర్మిష్ఠను భార్యలుగా చేసుకొని ఐదుగురు కొడుకులను గనెను. శర్మిష్ఠతో యయాతికి జరిగినది గాంధర్వ వివాహము. పుత్రులు కలిగేదాకా అది బయటపడలేదు. దేవయాని కొన్నాళ్ళకు దానిని తెలుసుకొని సవతి మాత్సర్యమును సహింపక తండ్రియైన శుక్రాచార్యునకు చెప్పగా, ఆ మహర్షి యయాతిని అకాల వార్ధక్యమునకు గురి అయేటట్లు శపించాడు.

---

*. నన్నయభట్టు ఆంధ్రమహాభారతము. ఆదిపర్వం-మూడవ ఆశ్వాసం 94 సంఖ్యగల వచనాన్నుంచి అదే ఆశ్వాసం 225 వచనం వరకూ వ్యాపించి వున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ప్రకటించిన 'ఆంధ్ర మహాభారతము-సంశోధిత ముద్రణము' పాఠ్యముగా గ్రహింపబడినది.

విశే : ఏమైనను చివరకు శర్మిష్ఠ కడపటి కొడుకైన పూరుడను వాడే యయాతి సామ్రాజ్యమునకు వారసుడై పౌరవ వంశమునకు మూలకర్త అయాడు. కురు పాండవులు ఉభయులును పూరువంశ సంజాతులే.

భారతాది పూర్వ గ్రంథాల్లో వచనము మనకాలపు భాషలోవలె చిన్న చిన్న వాక్యములుగా ఉండదు. ఇంత పెద్ద వచనంలో రెండే సమాపక క్రియలు ఉన్నాయి. అసమాపక క్రియలతో వాక్యమును పెంచి వ్రాయుట ఆ కాలపు రచనా పద్ధతి. అయినప్పటికీ నన్నయభట్టు గద్య శైలి కూడా ప్రసన్నంగానే ఉంటుంది.

*95 సీ. విషయోపభోగ—భూరికీర్తి.*

అర్థం: అభిలషణము=అనుభవించవలెనను కోరిక, విషయము అనగా మనిషి పది ఇంద్రియములకు వస్తువులైనవి, జవ్వనము = యౌవనము, ఈ నోపును=ఇచ్చుటకు సమర్థుడగునో, ఇష్టపడునో అనుట. ఈన్ అను నది ఇచ్చు ధాతువు మీద వచ్చిన అన్నంత రూపము. ఇచ్చునకు సర్వం బునకు 'ఈ' యగు. బా. వ్యా. సద్వీప- యోగ్యుడగు=అన్ని ద్వీపము లతో కూడిన భూభారాన్ని వహించడానికి యోగ్యుడగును. పెద్ద కొడుకే తండ్రి యనంతరం రాజ్యభారం వహించాలి అనే నియమాన్ని యయాతి నిరాకరించాడన్నమాట. యదువుదొట్టి=యదువు మొదలైన. తొలిశబ్దం మీదనుంచి తొల్లిటి, తొట్టి ఈ విధంగా ఏర్పడియుండవచ్చును. ఓపక =ఇష్టపడక, తండ్రి పనుపు=తండ్రి ఆజ్ఞ, పంచు పనుచు ధాతువునుండి పనుపు వస్తుంది.

తా. యయాతి మహారాజు తన కొడుకుల్ని అందరినీ పిలిచి వారితో ఇట్లా అన్నాడు: "నాకు విషయ సుఖములు ఇంకా అనుభవించాలనే కోరిక తగ్గడం లేదు సరికదా ఇంకా పెరుగుతూంది. అందుచేత మీలో ఎవడు నా వార్థక్యాన్ని తాను వహించి, తన యవ్వనాన్ని నాకు ఇవ్వడానికి ఇష్టపడతాడో, వాడే నా విశాల సామ్రాజ్యానికి అధిపతి కాగలుగుతాడు." ఆ రాజు పెద్ద కొడుకైన యదువు మొదలైన నలుగురు దానికి ఇష్టపడక

అనంగీకార సూచకముగా తలలువంచి మౌనం వహించారు. కడసారపు తనయుడును బుద్ధిమంతుడును అయిన పూరువు అనువాడు మాత్రము తండ్రి కోరిక ప్రకారము తన యౌవ్వనాన్ని జనకునకు ఇచ్చి, ఆతని వార్ధక్యాన్ని తాను స్వీకరించి గొప్ప కీర్తి పొందాడు. ఎట్లాగంటే పూరుడే యయాతి అనంతరం వంశకర్త అయ్యాడు.

విశే: పెరుగుచున్నదియు అంటే పెరుగుతూంది కూడా అని సముచ్చయార్థం గ్రహించాలి చెప్పదలచినదంతా ఏమీ చిక్కులేకుండా పూసగ్రుచ్చినట్లు చెప్పడం నన్నయ కవితాలక్షణం. తన కవితాగుణాల్లో ఆయన పేర్కొన్న "ప్రసన్నకథా కలితార్థయుక్తి" ఇదే కావచ్చును.
ఈ సీసపద్యంలో ప్రాసయతి నియమం పాటించబడింది.

*96 వ. అనినవిని - ఇట్లనియె.*

తా. తేటతెల్లముగా ఉంది.

*97 తే. వర్ణధర్మ - దేవిచేసె.*

అర్థం: వర్ణధర్మముల్ గాచుచు=వర్ణాశ్రమ ధర్మపద్ధతిని ఖచ్చితముగా నిలబెట్టుచు, భార్గవపుత్రియైన=భృగువంశమువారు బ్రాహ్మణులు. శుక్రాచార్యుడు ఆ వర్ణానికి చెందినవాడు.

తా. వర్ణాశ్రమ ధర్మములను ప్రజలు మేరమీరక రక్షించేటట్లు భూమిని పాలించిన యయాతి, తానే ఆ ధర్మాన్ని అతిక్రమించి తాను క్షత్రియుడై, బ్రాహ్మణ కన్య అయిన దేవయానిని ఎట్లా పెళ్ళి చేసుకున్నాడు అని జనమేజయుడు అడుగుతున్నాడు. కంచెయే చేను మేసినట్లు అయిందిగదా అని ఆతని ప్రశ్నము. అనగా ఆ కాలమునకు విలోమ వివాహాలు నిషిద్ధములు అని తెలుస్తూంది. ఇటువంటి రాజును అనఘచరితుడు అనవచ్చునా అని వ్యంగ్యము.

విశే: జనమేజయుడు తమ వంశకర్త యయిన యయాతిని అధిక్షేపించాడని వక్రభాష్యం చెయ్యకూడదు. పెద్దలు చేసినది సామాన్య దృష్టికి ధర్మ

భిన్నంగా కనబడినప్పటికీ, దానిని తూలనాడక 'ఆర్షము' అని సమర్థించుకొనిపోయేవారు. ఉదాహరణకు వేదంలో చేయబడిన కొన్ని భాషా ప్రయోగాలు, లౌకిక సంస్కృతంద్వారా సాధింపబడవు. ఆ ప్రయోగం తప్పు అని మనవారు అనేవారు కాదు. అది ఛాందసము అనగా వేద ప్రయోగము. దానిని దిద్దడానికి మనకు అధికారము లేదు. ''భద్రం కర్ణేభిః'' అనుచోట లౌకిక సంస్కృతం ప్రకారం 'కర్ణైః' అని ఉండాలి, వేదము కర్ణేభిః అని చెప్పుతూంది. ఇది ఛాందసము అని వ్యాఖ్యాతలు పూజ్యభావంతో గ్రహిస్తారు.

*98 తే. విపులతేజంబునను–కావ్యుడిచ్చె.*

అర్థం: జగదనుగ్రహనిగ్రహశక్తియుక్తుడు = లోకాన్ని అనుగ్రహించడానికి, శిక్షించడానికి కూడా సామర్థ్యము కలవాడు. తిక్కన సోమయాజి తన తాతయైన మంత్రి భాస్కరుడు శాపానుగ్రహశక్తి యుక్తుడు అని పొగడినాడు. అలిగి=కోపించి, ఏమి కారణంబున =ఇప్పుడు మనము ఏ కారణంచేత అంటాము. కావ్యుడు=అసురగురువైన శుక్రాచార్యుడు. ఈయనకు కవి అనే వ్యవహారం కూడా ఉంది. 'ఉశనా భార్గవః కవిః'.

తా. గొప్ప తేజస్సుచేతను, తపోబలముచేతను, లోకాన్ని అనుగ్రహించడానికి శిక్షించడానికి కూడా సమర్థుడైన యయాతివంటి చక్రవర్తిని రాక్షస గురువైన శుక్రాచార్యుడు ఎందుకు శాపం పెట్టాడు ? అదేదో చిన్న నేరమై యుండదు అని సూచన. అయిన యయాతికి అంటే చాలి యుండగా అయిన యట్టి యయాతికి అనుట విశేషణ దార్ఢ్యం చూపడానికి యయాతి సులభంగా కొట్టి పారవేయదగిన వాడు కాదు అని జనమేజయ మహారాజు తన వంశ కర్తను సమర్థించాడు.

*99 వ. మఱియు–ఇట్లనియె.*

అర్థం: అస్మద్వంశకరుండయిన = భరత వంశమునకు మూల పురుషుడైన, అస్మత్ అనుటలో కొంత రాజసము ఇమిడి యున్నది, వినవలతు =

వినగోరుదును, వలచు ధాతువు మీద వలచుదును, వలతును అను నవి ఏర్పడతాయి. వలచు ధాతువు ఇప్పుడు అర్థమునందు బలపడి స్త్రీ పురుషులు ఒకరి నొకరు ప్రేమించుట అనే అర్థంలో స్థిరపడుతూంది. వలపు కృదంతము. చెప్పుమని = సన్మాన్యుడైన వైశంపాయనుణ్ణి చెప్పుడు అనక చెప్పుము అనుట ఇప్పటి మన వాడుకకు వింతగా ఉంటుంది. ప్రాచీనభాషలో గౌరవార్థక ప్రయోగాలు అరుదు. తెలంగాణా భాషలో నేడు కూడా ఈ మర్యాద చెల్లుతూంది.

తా. సులభము.

*100 క. మనుజాధిప–నయోపాయమునన్*

అర్థం: మనుజాధిప=ఓ రాజా, దానవపతికి=దానవులకు రాజైన వృషపర్వునకు దైత్యులు, దానవులు, రాక్షసులు మొదలైన వారంతా దేవతలకు ప్రత్యర్థులు అనిమిషవిరోధులకు=అనిమిషులనగా దేవతలు. దేవతలు రెప్పపాటులేనివారని ప్రసిద్ధి. నలోపాఖ్యానంలో ఈ లక్షణాన్ని బట్టి నలుని రూపంలో ఆసీనులైయున్న దేవతావిభులను దమయంతి కనిపెట్ట కలిగింది. వివిధ విధినయోపాయములన్=అనేకములైన కర్మలచేతను, నేర్పుతోగూడిన ఉపాయములచేతను శుక్రాచార్యుడు దేవతల విరోధులకు తోడ్పడుతుండేవాడట.

తా. జనమేజయమహారాజా, శుక్రుడు వృషపర్వుడను దానవరాజుకు గురువై, దేవతలకు ప్రత్యర్థులైన దానవులకు అనేకమైన ఉపయుక్త కార్యాలచేతను, నీతి ప్రయుక్తములైన ఉపాయములచేతను సహాయపడుతుండేవాడు, అతడు దేవతా విరోధి కాకపోయినా తనకాశ్రయమిచ్చిన దానవ ప్రభువునకు కుడి భుజంగా ఉండేవాడు. రాజపురోహితులు సాధారణంగా అథర్వ తంత్రజ్ఞులైయుండేవారు. శుక్రుని అధీనమందున్న 'మృతసంజీవని విద్య' అథర్వవేదప్రతిపాదితమై ఉండవచ్చును. ఇప్పటి పాశ్చాత్య యుద్ధ తంత్రజ్ఞులు తయారుచేసే ఒక ప్రత్యేక రహస్యోపాయమువంటిది శుక్రుని అధీనములో ఉన్న 'మృత సంజీవని విద్య'.

*101. క. దేవాసుర-జేయుచునుండెన్*

అర్థం: గత జీవితులగు = పోయిన ప్రాణము కలవారు, మరణించినవారు అనుట, చెచ్చెర = వెంటనే, పునర్జీవులగా=తిరిగి బ్రతికినవారిగా.

తా. దేవాసుర యుద్ధాల్లో మరణించిన దానవ వీరులను శుక్రాచార్యుడు తన యధీనంలో ఉన్న మృతసంజీవని అను విద్యను, లేదా ప్రక్రియను ప్రయోగించి వారిని తిరిగి బ్రతికినవారిగా ప్రతిదినము అప్పటికప్పుడు చేసేవాడు. దేవాసుర సంగ్రామముల ప్రసక్తి వేదంలో కూడా వినవస్తూంటుంది. దేవతలు ఆర్యజాతివారని, అసురులు ఆదిమవాసులనీ పరిశోధకులంటారు. వీరు ద్రావిడ వంశీయులని వీరి మతము. ఈ రెండు జాతిలకు మధ్య ఉండే ముఖ్య భేదము - ఆర్యులు యజ్ఞాలు చేసేవారు. వారి ప్రత్యర్థులు యజ్ఞతంత్రాన్ని ఒప్పుకోనివారు. ''దశరాజానో అయజ్యవః'' అని ఋగ్వేదంలోని దాశరాజ యుద్ధము అనే వీర గేయం చెప్తూంది.

విశే. పునర్జీవులు=తిరిగి పొందబడిన జీవము ఎవరికో వారు అని బహువ్రీహి సమాసంగా చెప్పుకోవలెను.

*102 వ. దానినెఱింగి-యిట్లనిరి.*

అర్థం: అసురుల నోర్వనోపక = అసురుల ధాటికి తట్టుకొనలేక, ఓర్చు - ఓర్వన్, ఓపు - వ్యతి-ఓపక = సమర్థులుకాక, ఇప్పుడు మనం వాడే ఓపిక శబ్దం దీనినుంచే పుట్టి యుండవచ్చును, శుక్రువలన=శుక్రాచార్యుని నుండి. 'అపాయ, భయ, జుగుప్సా' మొదలగు సందర్భాల్లో వలన వర్ణకము వచ్చునని చిన్నయసూరి తేనోపునట్టి=తెచ్చుసామర్థ్యముగల, మహాసత్త్వండు=గొప్పధీశాలి, సత్త్వస్వభావుడు. ఇక్కడ దేహబలంతో ప్రసక్తి యేమీలేదు. ఉపాయ సహితుడే కావలెను.

తా. మృత సంజీవని సహాయంతో శుక్రుడు యుద్ధంలో చచ్చిపోయిన దానవ వీరులను తిరిగి బ్రతికిస్తున్నాడని తెలుసుకొని దేవతా వర్గము చాలా భయపడెను. తమ వర్గము వారి సంఖ్య రోజు రోజుకి తగ్గిపోతూంది. దానవ

సైన్యం సంఖ్య తగ్గడంలేదు. అందుచేత ఏ విధంగానైనా శుక్రుని వద్ద నుండి మృతసంజీవిని రహస్యం తెలుసుకొనిరాగలిగిన ధీశాలి, సత్త్వగుణ సంపన్నుడు తమలో ఎవరని ఆలోచించి, దీనికి బృహస్పతి కుమారుడైన కచుడను వాడే తగినవాడని నిశ్చయించి ఆతని దగ్గరకుపోయి దేవతలు ఇట్లా అన్నారు.

విశే: సత్త్వగుణాన్ని భగవద్గీత చాలా ప్రశంసిస్తూంది. "తత్రసత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్.''

*103 క. పోరను-బలయుతులగుటన్.*

అర్థం : పోరను=యుద్ధమందు, పోరు+అన్. కారసురవరుల్=నిహతులు కారు, చంపబడడంలేదు, నిహతులయ్యు, నిహతులుకారు అని రెండు మార్లు చెప్పక విశేషణ వాచకమును ఒక్కమారే భావమునందును, వ్యతిరేకమునందును కూడ అన్వయించుట నన్నయ ప్రయోగవైచిత్రి. అతిభారము=మిక్కిలి కష్టము, దుర్వారవీర్యబలయుతులగుటన్=వారింపరానట్టియు, వీర్యముతో కూడిన బలము కలవారగుటచేత.

తా. రాక్షసవీరులు యుద్ధంలో మరణించినా మృతసంజీవని ప్రభావంచేత తిరిగి బ్రతికి వస్తున్నారు. ద్విగుణీకృతబలంతో వారు విజృంభించడంచేత వాళ్ళను ఎదుర్కోవడం మనకు సాధ్యం కాకుండా ఉంది.

విశే. పోరున అని సప్తమీ విభక్తిరూపం కావలసిఉండగా పోరన్ అనుట విశేషము. ''ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగానగు బా.వ్యా. ఆచ్ఛిక-38'' పోరు శబ్దము ఔపవిభక్తికమగునా?

*104 క. మనపక్షంబున – దర్పితులయ్యున్*

అర్థం : పక్షంబువారు అనుట చాలియుండగా పక్షంబునవారు అనుట విశేష ప్రయోగము, అనగా మనవైపు వారు. లేమిజేసి=మృతసంజీవని లేక

పోవడంచేత. చేసి తృతీయార్థక శబ్దము. కేవల ప్రత్యయముకాదు. యమ సదనమునకు=యమ మందిరమునకు. వీర్యదర్పితులయ్యున్=శౌర్యాధిక్యం కలవారైనప్పటికీ మరణానికి గురి అవుతున్నారు.

తా. మనవంక సైనికులు గొప్ప శౌర్యపరాక్రమాలు కలవారైనప్పటికిన్నీ, దానవులచేత యుద్ధంలో చంపబడి, మృతసంజీవని ప్రక్రియ మనవారికి తెలియకపోవడం చేత యమ మందిరానికి పోతున్నారు. అమరులు, అమర్త్యులు మొదలైన నిఘంటు శబ్దాలు నేతిబీరకాయలన్న మాట.

వి. ఈ పద్యంలో నిహతులయ్యు అనే ప్రయోగము చిత్రము. నిహతులయి అని ఉంటే చాలును. అందుచేత కొన్ని ప్రతులలో 'నిహతులగుచు దడయక' అనే పాఠం గ్రహించారు. మృత సంజీవని తెలిసి ఉంటే నిహతులయ్యు చావరు అని నన్నయ ఉద్దేశమై యుండును.

*105* క. కావున-నికాయ బలంబున్.

అర్థం. తేవలయును=తేన్ వలయును. ధృతిఁబడసి. శుక్రుణ్ణుండి మృత సంజీవని సాధించడానికి ఎంతో ధృతి (ధైర్యము,సాహసము, నేర్పు) కావలయును. ధృతి అనే గుణము సత్త్వరజస్తమో గుణాత్మకమని భగవద్గీత మోక్ష సన్యాస యోగం చెబుతూంది. తపశ్శ్రీ విభవ-కచునకు సంబోధనము. తపస్సంపదయే ఐశ్వర్యంగా కలవాడా అని ఆ యువకుని సంభావించారు. సురనికాయ బలంబున్=దేవతా సైన్యము యొక్క వీరులను అనుట.

తా. అందుచేత శుక్రాచార్యునివద్ద నుండి ధైర్య సాహసములతో మృతసంజీవని విద్యను సాధించి తేవలెను. ఆ విద్యా సహాయంతో దేవ సైనికులను రక్షించవలెను. తపస్సంపన్నుడవైన నీవే దీనికి సమర్థతముడవు అని ఆతనిని ప్రోత్సహించిరి. రూపకానుప్రాణిత బహువ్రీహి.

*106* క. బాలుండవు-అమ్మహాముని నీకున్.

అర్థం : బాలుండవు=వయస్సులో చిన్నవాడవడం చేత ఎవరికైనా అతనిమీద వాత్సల్యం ఏర్పడుతుంది. 'అని మహా పదార్థంబు వేడిన డింభకునివలె' తిక్కన సోమయాజి. నియమ వ్రతశీలుండవు=నియమముతో కూడిన వ్రతము స్వభావముగా గలవాడు. తద్విద్యాలలనా దానము=అమృత సంజీవని విద్య అనే స్త్రీని నీకు దానముగా ఇవ్వగలడు. విద్యాలలనా= రూపకము, కరుణాలయుడై = దయాస్వభావానికి నివాసమైనవాడై. నీ బాల్యము, నియమ శీలత్వము మొదలగు గుణాలు చూసి ఆ యాచార్యుడు మెత్తబడును అనుట.

తా. వయస్సులో చిన్నవాడవు, నియమ శీలత కలవాడవు అయిన నిన్ను చూసి శుక్రుడు సహజ కాఠిన్యమును సడలించి మృత సంజీవని విద్యను నీకు ప్రసాదింపగలడు.

వి. విద్యాలలనా అనే ప్రయోగము భావి సూచకముగా ఉన్నది. దేవయాని కచునకు తన్నర్పించుకొనుట భంగ్యంతరముగా ప్రసంగింపబడినది.

*107* వ. దుహితృ స్నేహంబునంజేసి-యిట్లనియె.

అర్థం : దుహితృ స్నేహంబునంజేసి = కుమార్తెయైన దేవయాని యందలి వాత్సల్యము చేత, చేసి=తృతీయార్థకము, అద్దేవయాని=ఆ దేవయాని మాటలు, త్రికసంధి. అతిక్రమింపండు=ఈ కాలపు భాషలో దాటడు. పూర్ణానుస్వార యుక్తరూపము వాడుకలో లేదు, నీ నేర్పు విధంబున= నీకు చేతనైనయట్లు. నన్నె పార్యునకు ఇట్టి ప్రయోగము ఇష్టము, 'నా నేర్చు విధంబున నిక్కావ్యంబు సంగతంబు సేసెద' - ప్రథమా విభక్తి స్థానంలో షష్ఠి ప్రయోగించడం విశేషము. పంచినం=పంపగా, పనుచు ధాతువునుండి. వేదాధ్యయనశీలుండయి=వేదం పఠించడం స్వభావంగా కలవాడయి. నిత్యం వేదాధ్యయనంచేస్తూ అనుట. సమస్త దైత్య దానవ సమూహములకు ఉపాధ్యాయుండయి ఉన్న. ఆ కాలంలోకూడా ఛాత్రులు గుంపులుగా చేరి తమ కిష్టమైన ఆచార్యునివద్ద విద్యాభ్యాసం చేసేవారని సూచితమవుతూంది.

తా. కచుణ్ణి శుక్రాచార్యుని వద్దకు పంపేముందు దేవతలు ఆతనికి కొన్ని మెలకువలు ఉపదేశించారు. శుక్రుడు తన కూతురుపై మిక్కిలి ప్రేమ కలవాడు. ఆమెకు తల్లి జీవించియున్న ప్రశంస కథలో లేదు. అందుచేత కూడా శుక్రుడు దేవయానిని మిక్కిలి గారాబంతో చూసుకొనేవాడు. ఆమె కోరినది కాదనడు. అందుచేత ఓ కచుడా! నీ చాకచక్యాన్ని బట్టి దేవయాని అనుగ్రహం సంపాదించుకొని, దాని ద్వారా శుక్రాచార్యుని అనుగ్రహం సంపాదించుకుంటే నీకు కార్యసిద్ధి అవుతుంది. కచుడు దేవతలకు హితము చేయగోరినవాడై వృషపర్వుని నగరానికి వెళ్ళి, అక్కడ నిరంతర వేదాధ్యయనం చేస్తూ దానవుల సదభిప్రాయం సంపాదించడం మొదలుపెట్టాడు. ఒకనాడు శుక్రాచార్యుని విద్యాస్థానానికి వెళ్ళి ఆయనతో ఇట్లు విన్నవించాడు.

వి. అనగా ఎదుటివారిని ఆకట్టుకోడం ఎట్లాగో కచుడికి బాగా తెలుసునన్న మాట. శత్రుస్కంధావారానికి బాహాటంగా వెళ్ళి, వారు ప్రాణపదంగా చూసుకొంటూన్న యుద్ధ రహస్యాన్ని సాధించడానికి పూనుకొన్నాడంటే కచుడు అసాధారణ ధైర్యశాలియనుట నిశ్చయము. అది ప్రాణాంతక మైన కార్యసాధనము అని తెలిసియే అతడు దానికి పూనుకొన్నాడు. ఇందులో ఆతనికి స్వార్థమేమియు లేదు. తన జాతివారిని గండంనుండి సంరక్షించడమే ఆతని ధ్యేయము కావున కచుడు సాటిలేని దేశభక్తుడని మనం అతనిని ప్రశంసించాలి.

*108 క. ఏను గచుండనువాఁడ - బనిసేయంగన్.*

అర్థం: ఏను = నేను, మహానియమసమన్వితుఁడ = కఠిన నియమములు పాటించు వాడను, భానునిభా = సూర్యునితో సమానమైనవాడా! అని శుక్రుని సంబోధించుట ఉచితము, కార్యసాధకము అయిన ప్రశంస. చుక్కల్లో చంద్రునివలె అన్నట్లు శిష్యగణ పరివేష్టితుడవై సూర్యునివలె ప్రకాశిస్తు న్నావు అనుట. నీకు శిష్యుడనై పరిచర్య చేసి తరింపదలచివచ్చితిని.

తా. నన్ను కచుడందురు. కఠిన నియమబద్ధమైన జీవనము గడుపుదును. బృహస్పతి కుమారుడను. మీరు దానవగురువులైనట్లే అస్మజ్జనకుడు

దేవగురువు. తన ఆభిజాత్యమును ప్రకటించుచున్నాడు. సూర్యుడు బ్రహ్మ స్వరూపుడు, వేదనిలయుడు అని చెప్పబడడం చేత శుక్రాచార్యుడు కూడ అంతవాడని వ్యంగ్య సూచన. కచుడు అసామాన్య శిష్యుడనుట కూడా వ్యంగ్యమే.

వి. నన్నయభట్టు కవిత్వము వాచ్యార్థ ప్రధానమనీ, తిక్కన సోమయాజి కవిత్వం వ్యంగ్య ప్రధానమైనదనీ విమర్శకులు అంటూంటారు. కాని అది ప్రత్యక్షర సత్యం కాదు. పూర్వ కాలంలో గురువు అనుగ్రహము నకు పాత్రుడైన వాడే విద్యా రహస్యము లన్నియు పొందగలిగేవాడు. శిష్యుడు ఎంత గొప్ప వంశానికి చెందినా ఆతడికి శుశ్రూషాక్లేశం తప్పేది కాదు. ఉదాహరణకు శ్రీకృష్ణు నంతవాడు ఎట్లు శుశ్రూష చేసెనో కుచేలోపాఖ్యానము వ్యక్తం చేస్తుంది. శిష్యుల మీద గురుని వాత్సల్యం ఎంత మృదువుగా ఉండేదో అక్కడే వ్యక్తమవుతుంది.

*109 వ. అనిన నమ్ముని—ఉన్నంత నక్కమండు.*

అర్థం: సుకుమారత్వంబును=బాలుడగుట చేత వ్యక్తమౌతూన్న దేహ కోమలత్వ మును, వినయము, హితముగా మాట్లాడు నేర్పు, మృదుమధురత్వం బును=ఎదుటి వారిని ఆకట్టుకొనగల మాట మెత్తన, ఇంపయిన ఆకా రము. అనవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబును=ఎడతెగని నియమములు, నిష్ఠలు మున్నగు వాటిచే తెలియ వచ్చే ప్రశాంత స్వభా వమును, బృహస్పతిం బూజించినయట్ల=కచుణ్ణి ఆదరిస్తే దేవగురువైన బృహస్పతిని మన్నించినట్లే అవుతుంది. అట్ల=అట్లే. మనము అవధార ణార్థకమునందు ఇప్పుడు 'ఏ' ప్రత్యయం వాడుతున్నాము. వాడే, వీడే, ఈ యర్థంలో నన్న యాదులు 'అ' మాత్రం వాడేవారు. వాడ, వీడ, నేన, ఈ విధంగా. అభ్యాగత పూజల=అభ్యాగతునికి చేసే మర్యాదలతో. అతిథి, అభ్యాగతుడు అనే శబ్దాల్లో కొంచెం భేదముంది. ఎప్పుడు వస్తాడో తెలియక ఆకస్మాత్తుగ ఇంటికి వచ్చువాడు అతిథి. తిథి నియమం లేని వాడనుట. అభ్యాగతుడు=ఇంటికి వచ్చినవాడు, విందు. మనువు అతిథి నిట్లు నిర్వచించాడు: ఏకరాత్రంతు నివసన్ అతిథిర్బ్రాహ్మణఃస్మృతః.

ఆ లెక్కన ఒక రాత్రికంటె ఎక్కువ కాలం ఉండడానికి వచ్చేవాడు 'అభ్యాగతుడు' కావచ్చును. కచుడు శుశ్రూష చెయ్యడానికి వచ్చాడు గనుక అభ్యాగతుడవుతున్నాడు. అతిథి దేవోభవ; అభ్యాగతః స్వయం విష్ణుః అన్నారు గనుక ఉభయులును ప్రాచీన కాలంలో గృహస్థులకు సమ్మాన్యులే. శిష్యుంగాఁజేకొని=శిష్యునిగా పరిగ్రహించి.

తా. కచుడు తనను పరిచయం చేసుకొనియున్న మీదట, వాని సుకుమారత్వ మును, వినయము, చక్కగా సంభాషింపగలుగుట, మృదుత్వము, ఎడ తెగక నియమముతో అనుష్ఠింపబడు వ్రత స్వభావంచేత వెల్లడి అవు తూన్న ప్రశాంత లక్షణమును గమనించి శుక్రాచార్యుడు సంతోషించాడు. కచుని మర్యాద చేసినట్లైతే దేవ గురువైన బృహస్పతిని గౌరవించినట్లే అవుతుందని తలచి, వానికి అభ్యాగత సత్కారములు చేసి కచుణ్ణి శిష్యు నిగా పరిగ్రహించియుండగా.

వి. ప్రాచీనకాలంలో శిష్యుని యోగ్యతను పరీక్షించి గురువు వానిని శిష్యు డుగా చేసుకోవడమో, నిరాకరించడమో చేసేవాడనే విషయం దీనివల్ల వ్యక్తమవుతూంది. అల్లసాని పెద్దన మనుచరిత్రలో కూడా ఇది కనబడు తుంది. ఒక ఆయుర్వేదాచార్యుడు అవిధేయుడుగా కనబడిన ఒక గంధర్వ విద్యార్థిని శిష్యునిగా పరిగ్రహించడానికి నిరాకరించాడు. దీనివల్ల ఒక గుణము, ఒక అవగుణమూ కూడా కనబడతాయి. ఇది సార్వజనిక విద్య కాదు. యోగ్యులై ఉండికూడ విద్యార్థులుగా గ్రహింపబడనివారు ఎందరో ఉండియుండవచ్చును. అంతవరకూ సంఘానికి నష్టమే. అనర్హులైన విద్యార్థులు బలవంతంగా చేరి విద్యాప్రమాణాలను నేలమట్టంచేసే దుస్థితి కూడా లేకపోలేదు.

## 110 సీ. పనియేమిపంచిన - నేర్పు పేర్మి

అర్థం: పనియేమిపంచిన=ఏ పని చెయ్యమని నియోగించినా. ఇప్పటి భాషలో ఏ పని చెప్పినా అంటాము. పదపడి=వెనుకచిక్కి, కొంతసేపైన తర్వాత. పదము+పడి, ఒక అడుగు ఆలస్యముగా అను రీతిని ఏర్పడి

యుండవచ్చును. అప్పుడు పద్వాదులు పరంబులగునపుడు అను బా.వ్యా. సంధి 46వ సూత్రంచే సాధించుకోవచ్చును. పదంపడి అను రూపమును కలదు. కొంచెం అర్థభేదం ఉంది. భృత్యులు ఇట్లా చెయ్యడం లోక పరిపాటి. కచుడట్లు చేయక తఱబంచిన యాజ్ఞణంబ=గురువు ఒకపని చెప్పగానే వెంటనే ఆ పని నెరవేర్చుచు గురువు మనస్సునకు అను కూలుడై యుండెను. వినయము, మనస్సులోను, చెయ్వుల=కార్యము లలోను, సంభాషణలోను ఏకాకారుడై యుండి=ఒకే రీతిలో ప్రవర్తించు కొంటూ, దీనినే మనమిప్పుడు త్రికరణశుద్ధిగా అంటున్నాము. కచుడు దేవయాని విషయంలో బహునేర్పరిగా నడుచుకున్నాడు, సువిధేయుడై = ఆమెకు విధేయుడై, ప్రియహితభాషణముల=ఆమెకు ఇష్టమైన, అను కూలమైన ప్రసంగాలు చేస్తూ, పుష్పఫల విశేషదానములను=అపురూప మైన పువ్వులు, పండ్లు మొదలైనవి తెచ్చియిస్తూ ఆమెను తనకు అను కూలురాలుగా చేసుకొనెను. ఈ విధంగా గురువును భక్తితోను, దేవయానిని మెరమెచ్చులతోను, పెక్కులేండ్లు=పెక్కు సంవత్సర ములు. విశేషణమైన పెక్కు అనుపదానికి బహువచనం అవసరంలేదు. మాటలు పెక్కేల, పెక్కులేల అని బా.వ్యా. అయ్యిరువుర=ఆ తండ్రి కూతుళ్ళ యొక్క, నెమ్మివడసె = ప్రీతిని సంపాదించెను. ఎట్లు? తనదు నేర్పు పేర్మి=తన నైపుణ్యము, కౌశలము యొక్క ఆధిక్యత చేత. దువర్ణములేకయు ప్రయోగింపవచ్చును. తన నేర్పు పేర్మి, పేరు+ ఇమ, పేరు=పెద్ద. పేరురము, పేర్వాదులకిమి వర్ణకంబగు బా. వ్యా. తద్ధి-౬.

తా. కచుడు శుక్రాచార్యుని, దేవయానిని తనకు ఎట్లు అభిముఖులుగా చేసు కొన్నాడో కవి యిందు వర్ణించాడు. చెప్పిన పని వెనువెంటనే చెయ్యడం చేతను, మనోవాక్కాయ కర్మలలో ఒక్క రూపుగా గురుని యెడ భక్తి ప్రదర్శిస్తూ; యువతియు, పొగడ్తలకు సులభముగా లొంగునదియు అగు దేవయానిని అపురూపమైన పుష్పఫలములు తెచ్చి యిచ్చుట చేతను, ఆమెకు మనోల్లాసం కలిగించే సంభాషణలచేతను వారు ఇరువురు తనకు అనుకూలం అయేటట్లు చేసుకొన్నాడు. కచుడు వేదాధ్యయన జడుడు కాడు. లోకవృత్తం తెలిసిన యువకుడు.

వి. నన్నయభట్టు తనను గూర్చి 'లోకజ్ఞు నుభయ భాషా కావ్యరచనాభి శోభితు' అది 1-9 లో చెప్పుకొన్నది వట్టి పొగడ్తకాదు. ఏ పాత్ర, ఏ సందర్భంలో ఎట్లా ప్రవర్తించాలో, ప్రవర్తిస్తాడో కచుని విషయంలో నేర్పుగా చిత్రించాడు. లోకస్వభావం చక్కగా ఎరుగని, ఉదయద్యౌవన ఆయిన దేవయానిని మంచి చేసుకోవడంలో కచుడు ఋజుమార్గమున ప్రవర్తించాడా? అంటే- అతడు కార్యసాధనకై వచ్చినవాడు. తన ప్రాణానికి అపాయం తెచ్చే లక్ష్యాన్ని సాధించడానికి ఒడబడి వచ్చాడు. అదీకాక దేవయాని వలన కథ అడ్డం తిరుగుతుందని అతడు మాత్రం కలగన్నాడా?

*111.* *వ - ఇట్లు గురు శుశ్రూషా - తంత్రీ కిట్లనియె.*

అర్థం. ఈ విధంగా కచుడు గురు శుశ్రూషయందలి నేర్పుచే శుక్రునకు ప్రీతి పాత్రుడైన శిష్యుడు అవడం గమనించి దానవులైన ఛాత్రులు అసూయా పరులయారు. వారిలో బాగా దూరదర్శులైనవారు కచుడు మృతసంజీవని కూడా నేర్చుకుపోతాడేమో అని శంకించి యుంటారు. ఋణశేషము, శత్రుశేషము ఉంచరాదనే వాక్యం మేరకు వారు కచుణ్ణి సంహరించి తమ మార్గం నిష్కంటకం చేసుకోడానికి పూనుకొన్నారు. పైగా, బృహస్పతితోడి యలుక = దేవగురువైన బృహస్పతి మీద వారికి కోపము ఉండడం సహజం. ఆయన కుమారుడు వారికి విశ్వాసపాత్రుడు ఎట్లా అవుతాడు. అక్కచున్ = ఆ కచుని, త్రికసంధి. హోమధేనువులు గాచుచు వనంబున నేకతంబ (ఒంటరిగా) ఉన్నవానిని. ఇప్పటి భాషలో విశేషణాలు ముందు చెప్పి, విశేష్యం చివరకు చెప్పడం పరిపాటి. నన్నయ దీనికి భిన్నంగా ఒక్కొక్కప్పుడు వ్రాస్తూ ఉంటాడు. రచనా వైవిధ్యం కోసం కావచ్చును. అదిన్నీ కాక ఆయన సంస్కృత భాషాభిమాని కనుక దేవ భాషా సంప్రదాయాల్ని రుచి చూపించడానికై విశేష్య విశేషణముల స్థానాలు తారుమారు చేస్తూంటాడు. ఆ కాలపు సంస్కృత పండితులు ఈ 'అక్షర రమ్యత'ను చూచి తలలూచి ఉంటారు. హోమధేనువులు = శుక్రాచార్యుని హోమకార్యములకై పాలిచ్చు ఆవులు వధించి, వధియించి = చంపి, ఇయుడాగమ విషయమై బా.వ్యా. క్రియ-60 చూచు

నది, విశాలసాలస్కంధంబున = పెద్ద సాలవృక్షము బోదెకు శవాన్ని కట్టి వెళ్ళిపోయారు. యువజన దౌర్జన్యము యుగయుగాలుగా ఉంటూనే ఉంది. అంత సూర్యుడు అస్తగిరి శిఖరగతుండగుడు = అస్తమించే పర్వతం మీద ఉండగా. ఆనంతరార్థకము. మగుడి = తిరిగి, హోమ ధేనువు లింటికిరాగా. పసులకాపరి లేకున్నా గృహజంతువులు తమంత తామే ఇల్లు చేరుతాయి. వాటికి అటువంటి సహజ ప్రకృతి జ్ఞానం ఉంటుంది. కచుండురాకున్న = గోవులతో ఆలకాపరి రాకపోవడం అనుమాన కారణం అవుతుంది. దేవయాని తన మనస్సులో మిక్కిలి బాధపడుచు మలమల అని ధ్వన్యనుకరణ శబ్దాన్ని ఇప్పుడు మనము భిన్నార్థంలో వాడుతున్నాము. ఎండలో మలమల మాడివచ్చాడు. మఱుంగుచు = సంతాపించుచు. నీళ్ళు మరుగుతున్నాయి తండ్రికిట్లనియె = శుక్రాచార్యునితో ఇట్లు విన్నవించెను.

తా. కచుడు శుక్రాచార్యునికి ప్రియశిష్యుడవడం గమనించి, దానవులైన ఛాత్రులు అతని పీడవదల్చుకొనుటకై నిశ్చయించుకొనిరి. అడవిలో గురువుగారి గోవులను మేపుతూన్న కచుడు ఒంటరిగా ఉండడం చూసి వానిని చంపి ఒక పెద్ద మద్దిచెట్టుకు అంటగట్టి నిష్క్రమించిరి. సూర్యాస్తమయ సమయానికి పసులకాపరి లేకుండానే గోవులు ఇంటికి వచ్చేశాయి. కచుడు రాలేదు. ఏమయాడో అని దేవయాని మిక్కిలి ఆందోళన చెందుచు తండ్రితో ఇట్లా నివేదించింది.

వి. ఉదయగిరి, అస్తగిరి (పొడుపు కొండ, క్రుంకుకొండ) భౌగోళిక సత్యాలు కాకపోయినా కవిత్వంలో రమణీయంగా ఉంటాయి. విశాలసాలి = అనుప్రాస. నన్నయ భట్టారకునకు ఇట్టి ప్రయోగాలు అప్రయత్నంగా వస్తాయి. ఆయన చెప్పిన కవితా లక్షణాలైన అక్షర రమ్యతలో దీనికి చాలా ప్రాధాన్యం ఉంది. "మదమాతంగ తురంగ- మాణిక్యగాణిక్య" సభాపర్వం.

***112.* ఉ - వారిమయూఖముల్ - బాధనొందెనో.**

అర్థం : ఇది చాలా సుందరమైన పద్యము. ఆశ్రమంలో సూర్యాస్తమయ సమయ దృశ్యాలు కంటికి కట్టినట్లు వర్ణిస్తుంది.

వాఁడిమయూఖముల్ గలుగువాఁడు=తీక్ష్ణమైన కిరణాలుగల సూర్యభగ వానుడు, అపరాంబుధిఁ గ్రుంకె=పశ్చిమ సముద్రంలో మునిగినాడు. అదృశ్యుడయాడు అనుట. నేడు మన ఆవులు పశువుల రక్షకుడైన కచుడు వెంటరాకుండా ఏకతమ=ఒంటరిగా వచ్చాయి. భవదగ్నిహోత్రముల్= మీ యగ్నిహోత్రములు చక్కగా ఆరాధింపబడినవి, అనగా హోమాది క్రియలు అందుకున్నాయి. ప్రొద్దునుబోయె=రాత్రి ఘనీభవించింది. కచుండు నేనియున్రాఁడు = కచుడు రాకపోవడము ఒక్కటే పెద్ద లోపము. అడవిలో మృగరాక్షస పన్నగ బాధనొందెనో=క్రూరజంతు వుల వాతపడ్డాడో, రాక్షసులేమైనా చేశారో, పాము గరిచిందో అని ఎన్నో ప్రాణాపాయ కారణాలు పేర్కొని బాధ వెలిబుచ్చింది స్వభావోక్తి అలం.

తా. సూర్యుడస్తమించాడు. ధేనువులు ఒంటరిగానే ఇల్లు చేరాయి. మీ అగ్ని హోత్రములు వేల్చు సమయంకూడా దాటిపోయింది, కచుడు రాలేదు. అడవిలో అతడు క్రూరమృగాలు, రాక్షసులు, పాములు మున్నగువాటికి గురిఅయాడేమో అన్నది. కచునకు రాక్షసుల వలన అపాయం రావచ్చు నని దేవయానికికూడా భయపడడం మొదలుపెట్టింది.

వి. ఈ పద్యంలో నన్నయ వాడిన "వాడి మయూఖముల్ గలుగువాడు" అనే సమాసం పండిత లోకంలో చాలా చర్చ రేపింది. కేవల ఆంధ్రపద మైన 'వాడి' అనునది కేవల సంస్కృత పదమయిన మయూఖములు అనే పదంతో నేరుగా సమసించదని వీరి సిద్ధాంతము, వాడి అయిన మయూఖములు అంటే పండితులంత గగ్గోలుపటిపోయేవారుకారు. అందులో ఆదికవి, వాగనుశాసనుడు అని బిరుదుగల నన్నయ ఇట్టి భాషా వ్యతి క్రమం చేస్తాడా అని ప్రశ్నించుకొని, తత్పరిహారానికై ఎన్నో పోకలు పోయారు. చివరకు 'ఆంధ్రం షడ్వర్ణపర్యంతం' అనియు, 'సంస్కృత పదేన పరిమితమాంధ్ర పదం కర్మధారయోభవతి' ఇత్యాదిగా సూత్రాలు నిర్మించుకొని నన్నయను అప్రయోగ ప్రమాదమునుండి కాపాడితిమని తృప్తివహించిరి. సంస్కృత వ్యాకరణంలో వలెనే ఇది 'ఆర్షప్రయోగము' అని సమర్థించుకుంటే సరిపోయి ఉండునని మనకు అనిపిస్తుంది. తన కాలంలో పెద్దలు వాడే భాషనే నన్నయ వాడి యుంటాడు

తెలుగులో కొన్ని స్వభావోక్తి ప్రధానములైన సంధ్యాకాల వర్ణనలు.

అ. అల్లసాని పెద్దన మనుచరిత్ర ''క్రేణుల్
గట్టి నభోంతరాళమున పాఱెన్ పక్షులు''

ఆ. శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదలో దేవాలయము నందు సంధ్యా సమయ వర్ణన ''సాయంకాలమునఙ్ఞదదీశము రజిత్ సద్మస్వనద్దుందుభి'' ఇత్యాది.

ఇ. జానపదవాఙ్మయం
'బీరాయి పువ్వుల్లు పూచేటివేళ
ఆవుల్లు గోవుల్లు వచ్చేటివేళ
కోడళ్ళు కడవల్లు ఎత్తేటివేళ
చాకింటి మడతల్లు తెచ్చేటివేళ
—కచుండు దానవహతుండై మృతసంజీవనిచే బ్రతుకుట-

*113 వ. అనినవిని శుక్రుండు-వెండియు నొక్కనాఁడు*

అ. దివ్యదృష్టి=మానవసామాన్యదృష్టికన్న భిన్నమైనది. తపస్సుచే సంపాదింపబడిన దర్శనశక్తి, "దివ్యందదామితేచక్షుః పశ్యమేయోగమైశ్వరం'' భగవద్గీత. అసురవ్యాపాదితుండైన=రాక్షసులచే చంపబడిన, తోడ్కొని తేర = తోడ్కొని తెచ్చుటకు, 'తేతేరులు తెచ్చునకగు'' బా. వ్యా. క్రియ—98, విగతజీవుండయిన = పోయిన ప్రాణము కలవాడైన, అప్పుడ=అప్పుడే, అవధారణార్థకమునందు 'అ', సంతసిల్లి=సంతోషించి. కొన్ని తెలుగు క్రియలకు ఇంచుకు బదులుగా 'ఇల్లు' ఆగమము. ఘటిల్లు, రంజిల్లు, కంపిల్లు మొదలైనవి. వెండియు నొక్కనాడు=తిరిగి మరియొక దినమున.

తా. కచుడు రాక్షసులచే సంహరింపబడెనని శుక్రాచార్యుడు తన దివ్యదృష్టిచే తెలుసుకొని, వానిని బ్రతికించి తెచ్చుటకై మృతసంజీవనిని పంపెను. ఆ విద్యాశక్తియు తత్క్షణమపోయి కచుని బ్రతికించితేగా తండ్రి కూతుళ్ళు సంతోషించిరి. కాని మరికొన్ని దినాలకు,

*114 క. అడవికి - ద్రావించిరొగిన్.*

అ. పువ్వులుతేరగ = పుష్పములు కోసితెచ్చుటకై, వారక = చంపుటతో ఆగక, పొదవుసెడఁగాల్చి = అతని శరీరమునంతను నిలువున కాల్చి, తడయక = దానితో కూడ ఆగక, కసితీరక, అబ్బూది త్రావించిరి = శుక్రుడు త్రాగు సురయందు ఆ బూడిదను కలిపి, ఆ యాచార్యునిచే త్రాగించిరి.

తా. గురువుగారి కోసం పువ్వులు తేవడానికి అడవికి వెళ్ళిన కచుని చంపి దానవ శిష్యగణము ఆతనిని నిలువున దహించి, చితాభస్మాన్ని కల్లులో కలిపి శుక్రాచార్యునిచే త్రాగించిరి.

వి. బ్రాహ్మణుడయ్యీ శుక్రాచార్యుడు సురను సేవించుచుండుట ఆ కాలపు ఆచారమును తెలుపుతూంది. ప్రాచీన కాలమున విప్రులు కొందరు మాంస భక్షణం చేసేవారనే సూచన భవభూతి ఉత్తర రామచరిత్రలో కలదు. కొందరు క్షత్రియులు, జనకుని వంటివారు మాంసాహారము వదలినట్లు అక్కడే సూచితమవుతూంది.

*115 వ. శుక్రుండును - ఇట్లనియె.*

అర్థం: శుక్రుడు సురాపానమోహితుడయి మొదట ఆ మోసమును తెలుసుకోలేక పోయెను. తొల్లింటి యట్ల = ముందటివలెనే, రాకమసలె = రాక తక్కెను. రాడాయెను. రాక్షసులచేత-నిహతుండయ్యె, గావలయు = చంపబడి యుండవచ్చును.

తా. దానవ శిష్యులు చేసిన మాయను శుక్రుడు మొదట గ్రహింపలేదు. కచుడు ఈనాడును రాత్రి ప్రొద్దుపోయిననూ రాలేదు గనుక శత్రువులచే చంపబడి యుండునని గ్రహించి దేవయాని మిక్కిలి శోకించుచుండ కల్లుమత్తు తగ్గిన తర్వాత తండ్రి యామెను ఓదార్ప యత్నించెను.

*116 క. వగవక సంజీవని-శోకింపఁగన్*

అర్థం : వగవక = ఇదికూడును, ఇది కూడదు అను విచక్షణలేక, సంజీవని పెంపగణిత గర్వమున=మృత సంజీవని విద్యయొక్క ఆధిక్యముచేత, ఇతరులను లెక్కచేయని గర్వము కలవారై, పగఁగొని=కచునిపై పగ వహించి, సుగతికి జనుగాక = దేవకార్యార్థమై వచ్చి ప్రాణములు కోల్పోయాడు గనుక అతనికి పుణ్యలోక ప్రాప్తి యవుతుంది. ఏల శోకింపగన్=పుణ్య లోకాలకు వెళ్ళినవానికోసమై దుఃఖించడం ఎందుకు అన్నాడు.

తా. మృత సంజీవని తమకు రక్షణగాగలదను గొప్ప గర్వంతో రాక్షసులు కచునిపై కక్ష వహించి వానిని చంపక మానరు. మనమెన్నిమార్లు వానిని బ్రతికించిననూ లాభములేదనుట. అదిన్నీ గాక అతడు దేవ కార్యార్థమై ప్రాణాలు పోగొట్టుకున్నాడు గనుక తప్పక ఉత్తమ లోకాలకు వెళ్ళ గలడు. ఇంక వానికొరకై దుఃఖించి లాభము లేదని శుక్రుడు కూతు నోదార్చెను.

వి. శుక్రుని సమాధానము చాలా పేలవంగా ఉంది. దానవ శిష్యులు మృత సంజీవని విషయమై కచునిపై శత్రుత్వం వహించారని ఆ యాచార్యునకు కూడ తోచింది. ఈ విషయమై వృషపర్వునితో కలహం పెట్టుకోవడం రాక్షస గురువునకు ఇష్టము లేదు. ఇది శుక్రునకంత ప్రతిష్ఠావహముగ లేదు. వృద్ధులైన తర్వాత ఆత్మ గౌరవ హానిని కొంత దిగమ్రింగి పరిస్థితులతో రాజీపడడం ఎంత వారికిని తప్పదన్నమాట.

*117 వ. అనిన దేవయాని యిట్లనియె.*

*118 మ. మతిలోకోత్తరుడైన-ఎట్లుండుదున్.*

అర్థం : మతిలోకోత్తరుడైన=బుద్ధి విశేషంచేత లోకంలో అందరికన్న అధికు డైన అట్టి యంగిరసునికి మన్మడు. అంగిరుడు, అంగిరసుడు రెండు రూపములు. బా.వా. తత్సమము 81 సూ. ఆశ్రితుడు=ఊర్జితుడు అని

పాఠాంతరము, సురూప బ్రహ్మచర్యాశ్రమ వ్రతసంపన్నుడు = అందమైన శరీరము, బ్రహ్మ చర్యాశ్రమ నిష్ఠా సంపన్నుడు అయిన వాడు. శరీరసౌందర్యము భౌతికమైనను ఉపేక్షింపదగినది కాద నుట. శ్రీరాముని గూర్చి వాల్మీకి నారదు నిట్లడిగెను "కశ్చైకప్రియ దర్శనః" కారణము లేకుండా రాక్షసులచే చంపబడగా, కచుకై శోకింప కెట్లుండుదున్ = కచునికోసం దుఃఖింపకుండా ఎట్లా ఉంటాను? అచ్యుత ధర్మజ్ఞ=ధర్మమార్గమును ఉపేక్షించని మీరు మాత్రం ఎట్లా సహిస్తారు అని దేవయాని ప్రశ్న.

తా. బుద్ధివిశేషంచేత లోకవంద్యుడైన అంగిరస మహర్షి మనుమడు, మీకు శిష్యుడు, బ్రహ్మచర్యాశ్రమాన్ని దీక్షతో నిర్వహిస్తూన్నవాడు అయిన కచుణ్ణి కారణం లేకుండా రాక్షసులు చంపగా, అతనికై నేను దుఃఖింప కుండా ఎట్లా ఉంటాను? ధర్మమార్గభంజనమును సహింపని మీరుమాత్రం ఎట్లు ఉపేక్షిస్తారు అన్నది దేవయాని.

*119 వ. వానిం జూచికాని—యపకారంబును నెఱింగి.*

అ. కుడువనొల్లను = అన్నము ముట్టను. ఒల్ల-చూడు బా. వ్యా. క్రియ-107. వలచు, ఇష్టపడు అను ధాతువు వ్యతిరేకరూపము. ఒల్లనివారు నవ్వ-తిక్క-న. పెద్దయుంబ్రొద్దునకు=చాలాసేపటికి, శుక్రుడు యోగదృష్టితో చూచి, లోకాలోకభువన మధ్యమున కచుని కానక, సురాసమ్మిశ్రిత భస్మ మయుండై =కల్లులో కలిపిన భస్మరూపంగా, తన యుదరంబుననున్న = తన కడుపులో ఉన్న.

తా. కచుణ్ణి చూసికాని అన్నం తినను అని పట్టుబట్టి ఏడుస్తూన్న కూతురిని చూసి, శుక్రాచార్యుడు చాలాసేపటికి ప్రసన్నుడై దివ్యదృష్టితో చూడగా కల్లులో కలిసిన బూడిద రూపంతో తన కడుపులో ఉన్న కచుణ్ణి చూసి, సురాపానమువలన గలిగిన దోషమును, దానవులు చేసిన అపకారమును తెలుసుకున్నాడు. దానితో ఆ యాచార్యుడు గాఢమైన పశ్చాత్తాపం చెందాడు.

వి శే. తరువాత సురాపానాన్ని నిషేధిస్తూ రాక్షస గురువు చేసిన అనుశాసము వలన దేవయాని ప్రయోగించిన "అచ్యుతధర్మజ్ఞ" అనే సంబోధన ఉచితమే అనిపిస్తూంది.

*120 ఆ. మొదలి పెక్కు జన్మముల — సేయనగునె.*

అ. మొదలి పెక్కు జన్మముల = పూర్వజన్మలు పెక్కింటిలో చేయబడిన పుణ్యకర్మలవలన సంచితమైన జ్ఞానమును, మద్యసేవ=కల్లు త్రాగుట, ఆ క్షణమాత్రన=ఆ క్షణంలోనే చెరుపును. అందుచేత జనులు మద్య పానము చేయరాదు అని అనుశాసించెను.

తా. పూర్వజన్మలలో అనేకం పుణ్యకర్మలు చేసి పొందిన జ్ఞానాన్ని జనులు సురాపానంచేత క్షణమాత్రంలో పోగొట్టుకుంటారు. కావున వారు మద్యము సేవించరాదు అని శుక్రాచార్యుడు ఉద్ఘోషించాడు.

వి. ఎఱుగు ధాతువునుండి పుట్టిన యెఱుక అనే పదానికి ఈ కాలంలో కొంత గౌరవం తగ్గింది. ఎఱుకలాళ్ళు, ఎఱుకలసాని మొదలైన పదాల్నిబట్టి సోదె చెప్పేవాళ్ళు అనే వాడుక వచ్చింది.

*121. క. భూసురులాదిగ-జనుల్.*

అర్థం. సుర=కల్లు, పాపాసక్తి = పాపసంగమం చేత, చేసితి మర్యాద = ఈ యనుశాసనమును నేను చేశాను, శాపము పెట్టాను అనుట.

తా. బ్రాహ్మణులు మొదలైన జనులు ఈనాడు మొదలుగ కల్లు సేవించిరేని పాపంతో కూడిన వారవుతారు. జాతి భ్రష్టులవుతారు. నేను చేసిన ఈ యాజ్ఞను జనులందరూ తల దాల్చుదురు గాక అని శుక్రాచార్యుడు వ్యవస్థ చేసెను.

వి. భూసురులు, బా.వ్యా. తత్స-59, 60 చూచునది. ఇక్కడ శుక్రాచార్యుని భావౌన్నత్యం ప్రకాశితమవుతూంది. ఒక కార్యము దుష్టము అని తెలిసి రాగానే దానిని నిస్సందేహంగా నిషేధిస్తూ శాపానుగ్రహ శక్తి యుక్తుడ

వడం చేత శాప రూపమైన శపథం చేశాడు. సాధారణంగా ఎంత నియమ వంతులైనా తమకు పరిపాటి అయిన చెడు అలవాట్లను మానలేరు.

*122.* *వ. అని శుక్రుండు–శుక్రున కిట్లనియె.*

అర్థం. సురాపానము = కల్లు త్రావడము, తన యుదరంబుననున్న = తన కడుపులో బూడిద రూపంలో ప్రవేశించిన, అప్పుడ=ఆ క్షణమే, అందయుండి=శుక్రుని యుదరములోనే యుండి.

తా. కల్లు త్రావుట మహాపాతకముగా ప్రకటించి, శుక్రాచార్యుడు సంజీవని బలముచే తన కడుపులో ఉన్న కచుణ్ణి పునరుజ్జీవితుని చేశాడు. అప్పుడు కచు డిట్లా అన్నాడు.

*123.* *క. తనువును - దయతోన్.*

అర్థం. శరీరమును, ప్రాణాన్ని, సత్త్వమును=బలమును, జీవ చైతన్యమును నీ దయచే పొందితిని, పడసితి=పొందితిని. యకుస వచ్చుటకు చూడు బా. వ్యా. క్రియ-54.

తా. బ్రాహ్మణోత్తమా, నీ యనుగ్రహం చేత శరీరాన్ని, ప్రాణాన్ని, చైతన్యాన్ని పొందాను. నీ కడుపులో నుండి బయటపడు ఉపాయమును చేయుము. అన్నాడు కచుడు.

అట్లు వెడలుటకై మృత సంజీవనిని తనకు బోధించడం తప్ప మార్గాంతరం లేదని కచుడు తెలివిగా ఊహించెనా? చెప్పలేము. దానిని కచునకే చెప్పనక్కర లేదు. ఎవరికి బోధించినా అది పని చేస్తుందని ఉత్తర కథలో తేల్తుంది.

*124.* *వ. అనిన నా యుదరంబు - ఉపదేశించిన.*

అర్థం. భేదిల్లినం గాని = పగిలిన గాని. భేదించు సకర్మకము. భేదిల్లు అకర్మకము. వెలువడ నేరండు=వెలుపలికి రాజాలడు, నేర్చు-నేరడు బా.వ్యా. క్రియ-97. (వ్యతి) బిందు పూర్వకడు వర్ణము వాడుట పూర్వ కవుల కిష్టము. నేరండు. ఉదర భేదనంబున=కడుపు చీల్చుకొని వచ్చుటచేత.

తా. కచుడు చెప్పిన దానిని బట్టి శుక్రుడిట్లు భావించెను. నా కడుపు చీల్చుకొని వచ్చిన గాని ఈ ముని కుమారుడు బ్రతకడు. అట్లు ఉదర భేదనముచే మూర్ఛితుడనైన నన్ను తిరిగి బ్రతికించవలసినదని చెప్పి శుక్రాచార్యుడు వానికి మృత సంజీవనిని ఉపదేశించెను.

*125. క. ఉ. దరభిదాముఖమున- మయూఖుడపోలెన్.*

అర్థం : బుధనుతుడై న=జ్ఞానవంతులైనవారి చేత పొగడబడిన కచుడు-అతని శుశ్రూషా స్థైర్యమును ప్రావీణ్యమును చూచి పెద్దలు హర్షించిరి. ఉదర భిదాముఖమున=గురువు కడుపు చీల్చుకొని, అభ్యుదయముతో వెడలి వచ్చెను. ఉదయాద్రిదరీముఖమున=ఉదయ పర్వతము యొక్క గుహాముఖము నుండి - దరీతుకందరో వాస్త్రీ-నిఘం. ఉదితుండగు=ఉదయించిన, పూర్ణహిమమయూఖుడపోలెన్=పూర్ణచంద్రునివలె= వెడలివచ్చెననుట 'అమరేంద్రాశకు పూర్ణచంద్రుడుదితుండైనట్లు' శ్రీరామచరిత్ర. ఉపమాలంకారము చీలినకడుపును-దరీముఖము అనుటయు యుక్తముగా ఉన్నది. ఉప సర్గ పూర్వకమైన గమ్ ధాతువునకే తెలుగులో ప్రయోగము ఒప్పును. బా. వ్యా. క్రియ-121.

తాత : విజ్ఞులచే పొగడబడెడు కచుడు గురువు చీలిన కడుపు మార్గమున, తూర్పు దిక్కునుండి నిండు పున్నమ చంద్రుడు ఉదయించునట్లు అభ్యుదయముతో వెడలి వచ్చెను.

వి : నన్నయ ఉపమా కౌశల్యము గుర్తించునది. భిదా-దరీ- జంట చక్కగా కుదిరింది. రెండునూ స్త్రీ లింగముల గూట విశేషము.

*126. వ. అంత.*

*127. తే. విగత జీవుడై -నట్లపోలె.*

అర్థం : వేదమూర్తి = మూర్తీభవించిన వేదము వంటివాడైన శుక్రాచార్యుడు, కచునిచేత సంజీవితుడై బ్రతికింపబడినవాడై ప్రకాశించెను. మనమిప్పుడు

వెలిగెను అంటున్నాము. వెలింగె ఇప్పటి రూపము. ఉచ్చారణదక్షుచేత = వాగుచ్చారణమునందు సమర్థుడైన వానిచేత, వర్ణములను స్వరములను వాటివాటి స్థానకరణ ప్రయత్నములను విస్పష్టముగా గుర్తింపగల వాగ్వేత్త చేత, అభిహితంబగు = ఉచ్చరింపబడు, శబ్దంబునట్లుపోలె = శబ్దమువలె రెండు ఉపమావాచకములు-అట్ల, పోలె-అనవసరము. అర్థ దార్ఢ్యమునకై కాబోలు నన్నయ అప్పుడప్పుడిట్లు ప్రయోగించును.

తా. సమర్థుడైన వాగ్వేత్తచే ప్రయోగింపబడు శబ్దము స్వచ్ఛమైన యర్థము నిచ్చునట్లే, రాక్షసమంత్రియు, వేదరాశియు అయిన శుక్రాచార్యుడు కచునిచేత బ్రతికింపబడినవాడై ప్రకాశించెను. తిరిగి జీవితుడయ్యెను.

వి. శబ్దానుశాసనుడైన నన్నయభట్టారకుడు వాగుచ్చారణము నందు మిక్కిలి నిష్ఠగలవాడగుట సహజము. ప్రాచీనులు సుశబ్దాపశబ్ద ప్రయోగము నందు కడుంగడు దీక్ష కలవారు. ఉచ్చారణ దక్షుడు కాని వ్యక్తిచే ప్రయోగింపబడు శబ్దము సరియైన అర్థము నీయలేకపోవుటయే కాక అపార్థమును కూడ ఇచ్చునని వారి మతము. అపశబ్ద ప్రయోగము పాప హేతువని వారు భావించి సుశబ్దప్రయోగమును బహుధా ప్రశంసించిరి. "సక్తు మివతితఉనాపునంతో యత్రధీరాః" ఇత్యాది మంత్రము ఇట్లు చెప్పుతూంది. మొరియలతో కూడిన పేలపిండిని జల్లెడతో జల్లించి మెత్తని పిండి, మొరియలు ఎట్లా వేరు చేసి లోకం వాడుకుంటుందో అట్లే వాగ్యోగ విదులైనవారు భాషను మనస్సు చేతనే జల్లించి సుశబ్ద స్వరూపము నెరిగి దానినే ప్రయోగింతురు. అట్టివారి వాక్కునందు లక్ష్మి అధివసించునని వారు ప్రశంసించిరి. "భద్రైషామ్ లక్ష్మీ ర్నిహితాధి వాచి" అని వారి సూక్తి. విపుల శబ్దశాసనుడైన నన్నపార్యుడు ఇట్టి యుపమానమును ప్రయోగించుట, యుక్తముగను, పూజార్హముగను ఉన్నది.

ఈ యంశమే మరొక ఋక్కునందు ఇట్లా వివరింపబడింది: "బ్రహ్మ దేవానామ్, పదవీః కవీనామ్" కవీనాం కావ్యనాటకాది కర్తౄణాం

పురుషాణాం మధ్యే పదవీః భూత్వా౽వతిష్ఠతే। వ్యాకరణే నిష్పన్నః సుశబ్ద విశేషఃపదమ్। తద్వేతి గచ్ఛతీతి పదవీః। శబ్ద సామర్థ్యాభిజ్ఞో వ్యాసవాల్మీక్యాది రూప ఇత్యర్థః'' సాయన భాష్యము.

*128.* వ. *ఇట్లు తిప్రయత్నంబున - కచునికిట్లనియె.*

అర్థం:- అతిప్రయత్నంబున = దీర్ఘకాలం శుశ్రూషాచరణ శ్రమ వహించి శుక్రుువలన=బా.వ్యా. కారక-9. పెద్దకాలంబుండి = చాలా కాలము ఉండి, పోవుచుండి=పోవుటకు సన్నద్ధుడై, దేవయాని సెలవు కూడ తీసుకొనగోరి ఆమెతో చెప్పగా, అదియును = ఇప్పుడు మనం ఆమెయు అంటాము. అది శబ్దం చిన్న వాళ్ళకు దాసీలకు పరిమితంగా ఉంది. తద్వియోగ దుఃఖితయై=కచునితో వియోగమునకు బాధపడి.

తా. కచుడు దీర్ఘకాలము పరిశ్రమించి శుశ్రూష చేసి మృతసంజీవని విద్యను సాధించి, కృతకృత్యుడై దేవలోకమునకు పోదలచి, శుక్రుని యనుమతి పొంది, దేవయానితో కూడ చెప్పి పోదలచెను. ఆమె కచునితో విరహాన్ని సహించలేక ఇట్లా అంటూంది.

వి. కచునకు దేవయానిపై సోదర స్నేహమే కాని మరొక భావం లేదని తెలుస్తూంది. దేవయాని వానిపై ప్రేమభావం పెంచుకుంటూన్నట్లు వ్యక్తమవుతూనే ఉంది. కథ క్రొత్త మలుపు తిరిగింది. సంఘర్షణ ఏర్పడినప్పుడే కథా విస్తృతికి అవకాశం కలుగుతూంది. రసాభాసము అని ఆలంకారికులు త్రోసి పుచ్చినను, అది లేనిచోట కథాచమత్కారమే లేదు. గర్భ సంధియందు ఏదో ఒక రూపమైన సంఘర్షణ లేకపోతే కథ ముందుకు సాగదు. ఆసక్తి పుట్టింపదు. మను చరిత్రలో అట్టి సంఘర్షణ బీజముండుట చేతను, వసు చరిత్రలో అది లేకపోవడం ఆ గ్రంథముల జనాదరణ, అనాదరణలకు సూత్రమవుతూంది.

*129* ఉ. *నీవును బ్రహ్మచారివి—నావుడున్.*

అర్థము. మన యిద్దరకును వివాహమగుటకు అభ్యంతరమేమీ లేదని దేవయాని ప్రతిపాదిస్తూంది. నీవు బ్రహ్మచారివి. వినీతుడవు=నియమవంతుడవు,

ఏనును=నేనును, కన్యకన్=వివాహ యోగ్యను, మహీదేవకులావతంస= బ్రాహ్మణవంశ విభూషణుడా. రవితేజ=సూర్యునివంటి వర్చస్సు కల వాడా. శుక్రుని 'భానునిభా' యని కచుడు సంబోధించుట చదివి యున్నాము. నీకును నాకును వివాహము యథా శాస్త్రీయముగా జరుగక పోయినా, భావజశక్తినైన యది = మన్మథ ప్రేరేపణచే జరిగియే యున్నది. 'కామోదాతా, కామః ప్రతిగ్రహీతా'' మొదలగు వివాహ మంత్రములు అనుసంధించుకోవలెను. శుక్రుని యనుగ్రహముతో అనగా నా జనకుని అనుమతితో సంజీవనితో పాటు నన్నును స్వీకరింపుము. నాకు మనః ప్రీతి చేయుము, అని యామె సస్పృహగా పలికింది.

తా. బ్రాహ్మణ కులాలంకారుడవైన ఓ కచుడా! మనమిద్దరము వధూవరులు కాదగిన వారము, నీవు బ్రహ్మచారివి. నేను కన్యకను. మన యిద్దరికిని మన్మథ అనుమతితో వివాహము ఇదివరకే అయింది. అందుచేత సంజీవని విద్యతోపాటు నన్ను నీ దానిని చేసుకొనుము అని దేవయాని ఆడపిల్ల అయినా మనసు విప్పి చెప్పింది. అందులో వక్రభాషణ మేమీలేదు.

వి. ప్రేమ భావమును వ్యంగ్యరీతిలో కాక ఆర్షపద్ధతిగా, అకలుషముగా చెప్పించుట నన్నయగారి ఋషితుల్యత్వమునకు తార్కాణము. దేవయాని వరూథిని కాదు. మునికన్యక. ఆమె అనుచితమును కోరలేదు. కాని కచుని మనో భావములను ఆమె ముందుగా సూచనగానైనా తెలుసుకోకపోవడం వలన ఆమె జీవితం నిమ్నోన్నతాలకు గురి అయింది. దేవయాని అధికార మనస్తత్వంగల యువతి.

*130 క. ఆ కచుడు—నా చిత్తమునన్.*

అర్థము. అత్యంత విషాదాకులుడై = పూర్వ రంగమేమీ లేకుండా తన్ను ఎదుర్కొన్న ఈ సమస్యపై కచుడు విచారముతో గూడినవాడై, లోక నింద్యమగు నర్థము=లోకంలో పెద్దలు హర్షింపని యిట్టి మాట, నీవా కునకు=నీ నోటివెంట రానియ్యవచ్చునా. వాక్కు, వాకు=చూడు, బా.వ్యా. తత్స-69. నా చిత్తమునన్=నా మనస్సులో నిన్ను నా సహోదరివిగా చూసుకుంటున్నాను. కాబోయే భార్యగా చూడడం లేదనుట.

తా. కచుడు ఆ మాట విని, నిర్ఘాంతపడి, మిక్కిలి విచారముతోను, సంశయానికి తావులేనట్లుగాను ఇట్లా చెప్పాడు. దేవ యానీ! నీవు అన్నమాట లోక నింద్యమైనది, పెద్దలు హర్షించేదికాదు. నిన్ను నేను నా మనస్సులో సహోదరిగా మాత్రమే చూసుకుంటున్నాను. శుక్రుని అనుగ్రహము సంపాదించడంలో దేవయానిని కూడా మచ్చిక చేసుకోమని దేవతలు బోధించి పంపడంచేత కచుడు తన పరిచర్యలచేత దేవయాని యందు యువతీ సంబంధమైన కొన్ని అపోహలు తను ఉద్దేశించకుండానే రేపి యుంటాడు. ఈ విషమ సన్నివేశంలో ఆతని బాధ్యత బొత్తిగా లేదని అనజాలము. కాని విధి విధానమట్లు పరిణమించింది యువతీ యువకుల సంబంధాల్లో అపోహలకు దారిలేకుండా ప్రవర్తించుకోవడం చాలా అవసరమని కచ దేవయాని వృత్తాంతం బోధిస్తుంది.

*131* క. గురులకు శిష్యులు-తగునే పలుకన్.

అర్థం: గురులకు = గురువులకు, ఉవర్ణ లోపమునకై చూ.బా.వ్యా. తత్స-49. పరమార్థము = ఇదియే పరమార్థము, వాచ్యముగా చెప్పబడక పోయిననూ ఇదే సదాచారము, ఇది లోకధర్మ పథము. లోకములో పెద్దల ఆచారము కూడా ఇదియే. శాస్త్రము, లోకాచారము రెండూ కూడా దీనినే నిర్దే శిస్తున్నాయి అనుట. పరికింపక = పరీక్షింపక, లెక్కచేయక. "తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే కార్యా కార్యవ్యవస్థితౌ" భగవద్గీత. పలికించు = తద్భవము, గురుపుత్రి = నీవు సామాన్య యువతివి కావు, ఆచార్యుడైన శుక్రుని కుమార్తెవు. అందుచేత ధర్మాధర్మ విచక్షణ చేయుటలో నీపై గురుతర బాధ్యత ఉంది. ఇట్లా అనవచ్చునా?

తా. కచుడు చెప్పుతున్నాడు. గురువులకు శిష్యులు కుమారులవంటి వారు. ఇది శాస్త్ర ధర్మము, లోకధర్మమూ కూడా అయి ఉంది. ఇది విచా రింపక ఆచార్యుని కుమార్తెవైన నీవు (అనగా విశేష ధర్మజ్ఞాన సంపన్నురాలవు కావలసిన నీవు) ఇట్లా మాట్లాడవచ్చునా, అనుచిత సంబంధమును అభిలషింప వచ్చునా ? ఇది తగదు అనుట.

వి. ఏ పద్యమునందు చూచినను నన్నయ భట్టు అన్వయ క్లేశం లేకుండా వ్రాయ గల్గడం అదొక తపః ఫలము అనుకోవాలి. ఆయన చిన్న చిన్న వచనాలు, చిన్న పద్యములైన కందము, ఆట వెలది, తేటగీతి - వీటినే విశేషంగా ఆదరించడం కూడా గమనింపదగినది. వీటి విషయంలో పాద పూర్ణ శబ్దాలకై కవి చాంద్రాయణ వ్రతం చెయ్యనక్కరలేదు, భావము తక్కువ, ఎత్తుబడి పద్యము శార్దూలము, మత్తేభము వంటి దీర్ఘ చ్ఛందమైతే సామాన్య కవి ఊపిరి తిరుగక నానా అవస్థలు పడి ముగించవలసిన వాడవును. పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు తమ కంఠాభరణ నాటకంలో రామన్న, లక్ష్మన్న అనే భట్రాజు కవుల ఆశు కవిత్వం ద్వారా క్షుద్ర కవుల అవస్థలను హాస్యపూరితంగా చిత్రించారు.

నన్నయ ప్రసన్న కథాకలితార్థ యుక్తికికూడా భావాన్నిబట్టి ఛందస్సును ఎన్నుకోవడం నిదానము కావచ్చును.

*132 వ. అనిన నా కచునకు - తక్షణంబ*

అర్థం : కరంబలిగి = మిక్కిలి కోపగించి, నా మనోరథంబు = నా కోరికను, చేసిన వాఁడవు = చేసినావు అని ఇప్పటివాడుక. చూడు, బా.వ్యా.కారక 33&34. పనిసేయకుండెడుమని = ఫలప్రదము కాకపోవుగాక, బా.వ్యా. క్రియ 28. ఇది శాపార్థము. ఏను = నేను, ధర్మపథంబు దప్పనివాడను = ధర్మమార్గమునుండి తొలగని వాడను, నీ వచనంబున = నీ శాపముచే. పనిసేయదయ్యెనేనియు = కార్యకారి కాకపోయినప్పటికీ, సేయదయ్యెన్ బా.వ్యా.క్రియ-114.ఇచ్చట లాడంతమును అనగా తద్ధర్మార్థకము కూడ ఉదాహరణ కాదగియున్నది. నన్నయది ఇట్టిదే మరియొక ప్రయోగము. అప్పులుకింక నమ్మ నేరనయ్యెదను. ఉపదేశంబు గొన్నవారికి = ఉప దేశము పొందినవారికి, నీవు ధర్మవిరోధంబు = ధర్మమార్గాతిక్రమణము, కాకుండెడుమని = కాకుండునుగాక, ప్రతిశాపంబిచ్చి = ఎదురు శాపమిచ్చి.

తా. కచుడు చెప్పిన దానికి దేవయాని మిక్కిలి ఆగ్రహించి, నా కోరికను వ్యర్థం చేశావు గనుక సంజీవని నీకు పనిచేయకపోవుగాక అని ఆమె యాతనికి శాపమిచ్చింది. కచుడును తీసిపోక, నీవు ధర్మవ్యతిరేకంగా

మాట్లాడినావు గనుక మృతసంజీవని నాకు ప్రత్యక్షంగా పని చెయ్యక పోయినా, నాచేత మంత్రోపదేశం పొందిన ఆతనికి పనిచేయుగాక. నీవు ధర్మవిరుద్ధంగా ఆలోచించావు గనుక బ్రాహ్మణుడు నిన్ను పెళ్ళి చేసుకో కుండా ఉండుగాక అని ప్రతిశాపం ఇచ్చి తక్షణమే స్వర్గానికి తరలి పోయాడు.

vi. రెండు భిన్నస్వరాలు, కలవనట్లే తీవ్ర వ్యక్తిత్వం గల ఇద్దరు యువతీ యువకుల ప్రణయం దురంత దుఃఖాంతంగా పరిణమించింది. దేవయాని తెలిసియో తెలియకయో తన హృదయమ్ముందు బయటపెట్టింది. గారాబు బిడ్డ అవడంచేత అమె తొందరపాటుతో ఆగ్రహించి శాపంకూడా ఇచ్చింది అయినప్పటికీ మనము కచుని ప్రతిశాపదాన సంరంభాన్ని హర్షించలేము. కన్యక, గురుపుత్రిక అనియైన ముందువెనుకలు చూడకుండా, తన ఉద్దిష్ట కార్యసాధన అయిందిగదా అని, నిర్లక్ష్యంతో తీవ్రకోపనుడై దేవయానిని నీచంగా శపించడం క్షంతవ్యంగా లేదు. "వనిత తనంతతా వలచివచ్చిన చుల్కనగాదె యేరికిన్" అని వరూధిని శోకించినది దేవయాని విషయంలో అన్వర్థమైంది. కాని దేవయాని అంత పేలపిండి స్వభావం మనిషికాదని ముందు ముందు మనకు తెలుస్తుంది. ఆమె పల్నాటి నాగమ్మగారి వలె దెబ్బ కొట్టగలదు, దెబ్బ తినగలదు.

*133 క. దేవగురు నందనుండు-దేవహితంబుల్.*

అ. దేవగురునందనుండు = బృహస్పతి కుమారుడైన కచుడు, అమరా వాసంబునకు=స్వర్గమునకు, దేవతలకు సంజీవని ఉపదేశించి, సుధీను తుడు = వివేకవంతులచే పొగడబడిన యాతడు, దేవహితముల్ = దేవత లకు మేలు చేకూర్చు పనులు.

తా. వివేకవంతుల ప్రశంసలకు పాత్రుడును, బృహస్పతి కుమారుడును అగు కచుడు దేవతల నివాసమైన స్వర్లోకమునకు వెళ్ళిపోయి, దేవతలకు మృతసంజీవని విద్యను బోధించి, దేవతలకు ప్రీతికరములైన కార్యములు చేయుచుండెను,

వి. దేవయాని శాపముచే ఆ విద్య తాను ప్రయోగించిన కార్యకారి కాదను భయముచే దేవతల కుపదేశించెను.

*134 వ ఇటు వృషపర్వుకూతురు-యిట్లనియె.*

అ. వృషపర్వుకూతురు=రాక్షసరాజైన వృషపర్వుకుమార్తె అయిన శర్మిష్ఠ, కన్యకాసహస్ర పరివృతయయి = వెయ్యి మంది చెలికత్తెలతో, దేవయానిని కూడ కలుపుకొని, సరోవరతీరంబున = చెరువు ఒడ్డున, పరిధానంబులు పెట్టి=కట్టు చీరలు విప్పి పెట్టి, సురకరువలిచేతం బ్రేరితంబులయి = సుడిగాలి చేత ఎగురగొట్టబడినవై, కలిసిన = కలిసిపోగా, ఒండొరులంగడవ = ఒకరికన్న ఒకరు ముందు ఒడ్డు ఎక్కి చీరలు ధరించుకొను, సంభ్రమంబున=తత్తరపాటులో. కొలను, కొలకు రెండు రూపాలు, బా. వ్యా, ఆచ్చి-18. అన్యోన్యపరిధానంబులు = ఒకరి చీర మరియొకా పె, వీడ్వడ=క్రమంతప్పి, కట్టునెడ=కట్టుకొను సమయము నందు, దేవయాని పుట్టంబు=దేవయాని చీరను శర్మిష్ఠకట్టుకొనగా, దేవయాని శర్మిష్ఠ చీరను కట్టుకొనుటకు, రోసి=అసహ్యించి, పరుషభాషణమునకు ఉపక్రమించెను.

తా. ఒకనాడు దానవ చక్రవర్తి వృషపర్వుని కూతురు శర్మిష్ఠయు, దేవయానియు పెక్కు కన్యకలతో కలిసి వనవిహారమునకు పోయిరి. అక్కడ ఒక చెరువులో జలకమాడ నుద్దేశించినవారై, చీరలు విప్పి యొడ్డున పెట్టి స్నానమాడు చుండగా సుడిగాలి వచ్చి వారి చీరలు చెల్లా చెదరై కలిసిపోయెను. వారు తిరిగి గట్టెక్కి తమ తమ వస్త్రములు ధరించు సంభ్రమములో ఒకతె చీరను మరియొకతె ధరించెను. పొరపాటున శర్మిష్ఠ దేవయాని చీరను చుట్టుకొనగా, శర్మిష్ఠ చీరను తాను కట్టుకొనుటకు దేవయాని అసహ్యించుకొని ఆమెతో పరుషముగా ఇట్లనెను.

వి. దేవయాని సులభ కోపపరురాలని కచుని కథయందే చూశాము. అసురాచార్యుని కుమార్తెనను అహంభావము ఆమెకు మిక్కుటముగా ఉండెను.

*135. క. లోకోత్తర చరితుడగు - నేర్తునె చెపుమా.*

అర్థం. లోకోత్తర చరితుడగు=లోకారాధ్యుడైన, ఆకావ్యతనూజ = కావ్యుడు-శుక్రుని యొక్క కుమార్తెను, నీకు నారాధితను=నీ చేత పూజింపబడ వలసిన దానను, నీ చేత అనుటకు 'నీకు' అనుట పూర్వ భాషా స్వభావము. నేను బ్రాహ్మణ కన్యను. నీ కట్టినమైల = నీవు కట్టి విడిచిన మడికాని చీరను తడిపి ఆరవేసినదైనచో అంతదూష్యము కాదని ఛాందసులు నాడునూ, నేడునూ కూడా అనుకుంటారు. నీ కట్టిన, నా నేర్చిన మొదలైన విశేష ప్రయోగాలు పాఠకునకు ఇదివరలోనే పరిచయమైనవి. ప్రథమా స్థానమున షష్ఠీ విభక్తి ప్రయోగము, కట్ట నేర్తునె చెపుమా= నేర్తు=బా. వ్యా. క్రియా-108. కట్టుటకు ఒప్పుకొన గలనా అనుట. దేవయాని పరుష భాషణ స్వభావము ప్రస్ఫుటంగా కనబడుతూంది.

తా. లోకారాధ్యుడైన శుక్రాచార్యుని కూతుర్ని. నీకు పూజనీయురాలను. బ్రాహ్మణ కన్యను. నీవు కట్టి విడిచిన మైల చీరను ధరిస్తానా అని దూకుడుగా పలికింది. అన్ని విధాలా రాచ కూతురైన శర్మిష్ఠను కించ పరుస్తూ సంభాషణ సాగించింది.

*136. వ. అనిన శర్మిష్ఠ యిట్లనియె.*

*137. క. మా యయ్యకు - నీకు నానయు లేదే.*

అర్థం. మా యయ్యకు=మా తండ్రియైన వృషపర్వ మహారాజునకు, మీయయ్య= పురోహిత మాత్రుడైన మీ తండ్రి శుక్రుడు, పనులు చేయుచు, ఆశీర్వచనాలిస్తూ, ఇష్ట సంభాషణలు చేస్తూ సేవిస్తాడు, నా యొద్ద మీ తండ్రి గొప్పదనాన్నిగూర్చి దంభోక్తులు పలకడానికి, నానయు=సిగ్గైనా లేదా?

తా. రాజకుమార్తె కావున శర్మిష్ఠ మరీ పరుషంగాను అధిక్షేప పూర్వకంగాను బదులు చెప్పింది. మీ తండ్రి శుక్రుడు రాజైన నా జనకునకు పురోహితుడై సేవిస్తూ, ఆశీర్వచనాలిస్తూ బ్రతుకుతాడు. తల్లి పుట్టింటి ప్రశంస

మేనమామల వద్ద చేసినట్లు మీ తండ్రి గొప్పతనం గూర్చి నా ముందర చెప్పడానికి నీకు సిగ్గు లేదా అన్నది.

వి. యౌవనంలో ఉన్నవారవడం చేత దేవయాని, శర్మిష్ఠ, ఇద్దరూ ఉద్ధత స్వభావలే.

*138. వ. నా కట్టిన పుట్టంబు - నిజ నివాసంబున కుండెనంత.*

అర్థం. నా కట్టిన పుట్టంబు = నేను కట్టుకొన్న చీర, నీకుంగట్టంగాదు గాకేమి = నీవు కట్టుకోడానికి పనికిరాదా, ఎగ్గులాడి = నిందా పూర్వక హేళన వాక్యములు పలికి, దేవయానిని ఒక నూతిలో ద్రోయించి, తన వేయి మంది స్నేహితురాండ్రతో ఇంటికి పోయి, ఈ వార్త పొక్కకుండ కట్టడి చేసెనని ఊహించవలెను.

తా. మా తండ్రికి పురోహితమాత్రుడైనవాని కూతురువు. నీకు నా చీర కట్ట రాదా అని నిందాగర్భముగా హేళనచేసి దేవయానిని ఒక నూతిలో త్రోయించి తన ప్రాసాదమునకు వెళ్ళిపోయెను.

వి. ఇక్కడ బ్రాహ్మణ కన్యక యొక్కయు, దానవ కన్యక యొక్కయు స్వభావ తారతమ్యము కొంత స్ఫుటంగానే ఉంది. 'నిండు మనంబు నవ నీత సమానము' అని నన్నయ వ్రాసినది ఇక్కడ కొంత అన్వయిస్తుంది. దేవయాని వాక్పారుష్యం కలదే. శర్మిష్ఠ వాక్పారుష్యంతో ఆగక హృదయ కాఠిన్యం కూడా కల దానవ కన్యక. మాటకు మాటతో సరిపుచ్చక, దేవయానికి ప్రాణాపాయం వస్తుందేమో అనే శంక కూడా లేకుండా నూతిలో పడత్రోయించింది.

## యయాతి నూతంబడిన దేవయాని నుద్ధరించుట

*139 ఉ. ఆ నహుషాత్మజుండు-తటంబునొద్దకున్.*

అర్థం. ఆనతశాత్రవుండగు = జయింపబడిన శత్రువులు కలవాడును, ఆ నహు షాత్మజుండగు యయాతి = నహుషుని కుమారుడైన యయాతి,

అధిజ్య ధనుస్సహాయుడై = ఎక్కుపెట్టబడిన ధనుస్సు సహాయముగా కలవాడై, (వెంట పరివారమేదియు లేదని సూచించుటకు కాబోలు) మృగయారసలోలనిబద్ధబుద్ధి = వేటయందలి మక్కువతో కూడిన మనస్సు కలవాడై, ఆ యడవి అంతా క్రుమ్మరి = తిరిగి, నికామధృతశ్రముండు = మిక్కిలి అలిసినవాడై, అనలినాక్షీ-కూపతటంబు = ఆ దేవయాని పడియున్న అడవిలోని నూతి ఒడ్డునకు, ఏఁగుదెంచె = వచ్చెను. చూ. బా. వ్యా. క్రియ-110-111.

తా. శత్రు విజేతయు, నహుషుని కుమారుడును అయిన ఆ యయాతి, ఎక్కిడిన ధనుస్సుమాత్రం సహాయంగా కలవాడై, వేటయందలి ప్రీతి చేత అరణ్యమంతయు కలయదిరిగి, మిక్కిలి అలిసినవాడై, దేవయాని పడియున్న నూతి ఒడ్డునకు వచ్చెను.

వి. శర్మిష్ఠ దేవయానిని అడవిలో ఎక్కడో మారుమూల ఉన్న నూతిలో పడ ద్రోయించినదను వ్యంగ్యము సూచితమవుతూంది. ఇది యామె నిష్ఠుర స్వభావమునకు తార్కాణము. నిబద్ధబుద్ధి-అనుప్రాస.

*140 - సీ - చనుదెంచి - దేవయానిగనియె.*

అర్థం : జలమపేక్షించి = వేటవలన అలసినవాడవడంచేత నీరు త్రాగగోరి, తత్కూపమున = ఆ బావి యందు, విలసత్కూల ఘనవల్లియన్నిష్ట సఖిన్ = ఆ బావిలో తట్టుగట్టున ఉన్న ఒక గట్టి తీగ యను ప్రియ సఖిని, ఊఁది యున్నదాని = ఆసరాగా చేసుకొని వ్రేలాడుచున్నదానిని. ఘనవల్లియన్నిష్ట సఖియనుచో రూపకా అన్నిష్ట సఖియనునది విశేష ప్రయోగము. అను + ఇష్టసఖి = అను నిష్ట సఖియని సంధికాలేదు. తత్ స్థానమున ద్విత్వము వచ్చినది. ఇట్టివి అపురూప ప్రయోగములు. అనంతర కవులు కొందరు సకృత్తుగా దీనిని అనుకరించిరి. సర్వమును + అతని దివ్య కళామయమంచును-అని యుండ బమ్మెర పోతరాజుగారు 'సర్వమున్నతని దివ్యకళామయమంచును.' అని ప్రహ్లాద చరిత్రలో ప్రయోగించుట ఇట్టిదే. దీనికి ద్రుతద్విత్వమని పేరు పెట్టారు. గురు

కుచయుగముపైఁ=ఎత్తైన వక్షోజముల మీద పరవడి, దొరగెడు= ఎడ తెగక స్రవించు కన్నీరు కార్చుచున్న దానిని, తన్ను రక్షించుటకై ఎవరైనా జనులు వస్తారా అని ఎదురు చూస్తూన్న దానిని-అట్టి దేవయానిని కవి ఇచ్చట సార్థకమైన ఉపమానం ప్రయోగిస్తున్నాడు. వరుణదేవునితో కరమలిగి=మిక్కిలి కోపించి, జలనివాసము విడిచి = వరుణుని దేవి నీటిలో ఉండవలసినది గదా అట్టి యామె భర్తపై రోషముచే భూ స్థల నివాసమునకు రాదలచినదో యట్లున్న దేవయానిని - ఉత్ప్రేక్ష ప్రధానము. ఉపమాన గర్భితము.

తా : యయాతి దప్పి గొన్నవాడై నీరు త్రావదలచి ఆ బావికడ విశ్రమించి నూతిలోనికి తొంగి చూడగా దేవయాని కనబడింది. ఆమె నూతి గట్టున ఉన్న తీగ అనే చెలికత్తెను ఆసరాగా చేసుకొని ఉన్నది. అవిరళముగా కారుచున్న కన్నీళ్ళతో పయ్యెద తడుపు చున్నది. పోల్చు - 'కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో !'' జనులెవ్వరైనా వచ్చి తన్ను రక్షిస్తారా అని ఆశతో ఎదురు చూస్తూన్నది. వరుణ దేవునితో కలహించి, జలనివాసము వీడి భూమిపై నివసించదానికి వస్తూన్న ఆ దేవుని భార్యవలె ఉన్నది దేవయాని. దేవయాని దైన్యము, ఆమె సౌందర్యము రమణీయముగా చిత్రింపబడినవి.

వి. చాలవరకు ప్రాసయతి పాటింప బడింది. ఉన్నది యున్నదాని, పూరించు చున్నదాని, కోరుచు నున్నదాని - ఈ విధముగా ఏ పాదమున కాపాదము సమాప్తము చేయుట అదొక శిల్ప విశేషము. నన్నయ తిక్కనాది ప్రాచీన కవులు దీనిని అరుదుగా చమత్కారం కోసం వ్రాస్తూంటారు. అనంతర కవులు దీనిని అతిగా వాడి విసుగు పుట్టిస్తూంటారు. తిక్కన ఈ శిల్పాన్ని పాదారంభంలో చూపెట్టాడు. ''ఎవ్వని వాకిట నిభమద పంకంబు'' విరాట పర్వము. భూస్థలంబు వలని కరుగు దేరనున్న = ఇంకా భూమికి రాలేదు. వచ్చే ప్రయత్నంలో ఉన్నది అని చమత్కారము.

*141.* వ. కని నీవెవ్వరిదానవు - యిట్లనియె.

అర్థం ; ఏకతంబ = ఒంటరిగా, దట్టమైన యడవిలో నూతిలో పడియున్నదానవు. తమ విహరించుచున్న = తాము విహారములు సల పు, మృగయా వినోదార్థంబు = వేట మీది వేడుక యయాతి వచ్చుట, తొల్లియు = పూర్వమును, ఇదివరలో అనుట.

తా. చూచి (యయాతి) నీవు ఎవరికి సంబంధించిన దానవు? ఒంటరిగా ఈ దుర్గమారణ్యమందలి నూతిలో ఎందుకు పడియున్నదానవు అని యడి గాడు. దేవయాని తాము విహరించే అడవుల్లోకి వేటకోసం వస్తున్న యయాతిని ఇదివరలో చూసి యుండడంచేత, ఆతనిని గుర్తించి యిట్లు చెప్పింది. అది శబ్దానికి దాన వచ్చును.

*142* తరలము–అమరసన్నిభ–కూతురన్.

అర్థం. నేను భార్గవు కూతురన్ = నేను భార్గవుడైన (భృగువంశీయుడైన) శుక్రా చార్యుని కుమార్తెను. ప్రాచీన ఋషులలో భృగువులు, అంగిరసులు. తపోధననిష్ఠులని ప్రతీతి. ''భృగూణామంగిరసామ్ తపసాతప్యధ్వమ్'', అమరసన్నిభ = దేవతలతో సమానుడవైన ఓ యయాతి మహారాజా! దేవయాని పొందికగాను, తన అభిజాత్యము విస్పష్టమయ్యేటట్లు వృత్తాం తము చెప్పింది. భార్గవుడెట్టివాడో ఎదుటివారికి కంటికి కట్టినట్లు వర్ణిస్తూంది. ఘోరసురాసురాహవభూమిన్ = భయంకరమైన దేవాసుర యుద్ధాలో, ఆ దేవవీరులచేత చితుకకొట్టబడి మూర్ఛితులైన దానవులన్ = రాక్షసు లను (వీరశబ్దం వాడలేదు. తన తృణీకారాన్ని చూపెట్టడానికి) తన విద్య పెంపున = తన వశమందున్న మృతసంజీవనీ విద్యాధిక్యతచేత, గతభ్రమములనుగా = (దానవులను) మూర్ఛనుంచి తేరుకొన్నవారినిగాచేసి, ప్రాప్తజీవుల = తిరిగి పొందబడిన ప్రాణాలు కలవారినిగాచేసి, అత్యమిత శక్తి మెయిన్ వెలుంగిన యట్టివాడు = దివ్యశక్తితో ప్రకాశించువాడు (శుక్రుడు). అటువంటి మహనీయుని తనూజను అని వాస్తవముగానే ప్రక టించుకొన్నది.

తా. దేవతలతో సమానుడవైన ఓ మహారాజా! దారుణములైన దేవాసుర సంగ్రామాల్లో అమరవీరులచేత మర్దింపబడి, మూర్ఛితులై, మరణించిన దానవులను తన విద్య (సంజీవని) ఆధిక్యముచే తిరిగి బ్రతికివచ్చువారి నిగాచేసి, అలోకసామాన్య ప్రభావముతో ప్రకాశించు శుక్రాచార్యుని కుమార్తెను నేను. మెయిన్ అనునది చేసివలెనే తృతీయార్థక శబ్దము.

వి. నన్నయ ప్రయోగించు సంబోధన శబ్దములు ప్రశంసాపూర్వకంగా ఉండడమేకాక, కార్యసాధకములుగా ఉంటూంటాయి. ఆయన లోకజ్ఞత ఇక్కడ బాగా కనబడుతుంది. ఎదుటివార్ని ఎట్లా సంబోధించాలి? వారి సౌమనస్యం మనవైపు మొగ్గేటట్లు చేసుకోడానికి ఎదుటివార్ని సముచిత ప్రశంసాపూర్వకంగా సంబోధిస్తాము. భానునిభా, అచ్యుతధర్మజ్ఞ, మహీదేవకులావతంస, రవితేజ, అమరసన్నిభ–మొదలైనవి ఎదుటివారి మనస్సును రంజింపజేసి మృదులీకరించుటకు ఉద్దేశింపబడినాయి. ఒక్కొక్కప్పుడు కర్తవ్యప్రబోధమునకై నన్నయ సంబోధన వాడుతాడు. ''మితహిత సత్యవాక్య, జనమేజయ'' వంటిది. కూతురన్ = మనము కూతుర్ని అంటున్నాము. చూ. బా వ్యా.కార-33,34.

*143.* వ. దేవయాని యనుదాన - దయాళుండై

అర్థం: దేవయాని యనుదాన = నన్ను దేవయాని అంటారు, ప్రమాదవశంబున = పొరపాటుచేత, ఇన్నూతన్ = ఈ + నూయి, ఔప విభక్తి, సప్తమ్యంతము = ఈ నూతిలో పడి, వెలువడనేరకున్నదానను = బయటికి రాలేకుండా ఉన్నాను. నన్నుద్ధరించి = నన్ను బయటకు తీసి, పైకి తీసి, వాచ్యార్థమును గ్రహించాలి. లద్దయు = మిక్కిలి, దయాళుడై = దయ గలవాడై.

తా. నా పేరు దేవయాని. పొరపాటున ఈ నూతిలోపడి బయటకు రాలేకుండా ఉన్నాను. నన్ను పైకి తీసి రక్షింపుము అని ఆమె చెప్పగా యయాతి దయా స్వభావుడై ''కోమలిం దిగిచె'' అనే పై పద్యంలోని క్రియతో అన్వయము.

వి. దేవయాని ఇక్కడ మిక్కిలి నేర్పుతో వ్యవహరించింది అని చెప్పాలి. అసలు కారణమును కప్పిపుచ్చి, 'ప్రమాదవశమున' నూతిలో పడ్డాను అన్నది. దీనికి రెండు కారణాలు ఊహించవచ్చు.

అ. శర్మిష్ఠతో తనకైన వివాదం చెప్పాలంటే అదొక దీర్ఘ కథనం అవుతుంది. ఆమె ఉన్న ప్రమాద సందర్భానికి కాల విలంబనము అపాయకరము. అందుచేత తప్పు తనమీదే పెట్టుకొంది.

ఆ. శర్మిష్ఠ ప్రసంగం తెస్తే దానవ రాజైన వృషపర్వుని మాట వస్తుంది. ఇటువంటి వివాదంలో మధ్యవర్తిత్వం చెయ్యడం యయాతికి నచ్చక పోవచ్చును. పైగా సాటి రాజైన వృషపర్వుని విషయంలో కలుగజేసుకోవడం యయాతికి సమ్మతం కాకపోవచ్చును.

ఇ. తన మీద కలగవలసిన జాలి ఆతని మనస్సులో పుట్టక పోవచ్చును. ఇవన్నీ బేరీజు వేసుకొని దేవయాని మాట్లాడిందనుకోడానికి వీలులేదు. ఆమె ప్రత్యుత్పన్నమతి అనడానికి సందేహం లేదు.

*144.* చ. *జలధివిలోల వీచి - యయాతి ప్రీతితోన్.*

అర్థం. విశ్రుతకీర్తి=పొగడబడే కీర్తిగల ఆ యయాతి మహారాజు, జలధి విలోల వీచి=సముద్రము యొక్క చంచలమైన తరంగములనే, విలసత్కాంచి=ఒప్పుచున్న ఒడ్డాణముతో, సమంచిత ఒప్పుచున్న, అవనీతల వహన క్షమంబయిన=భూతలమును వహించుట యందు అనగా భూభారము ధరించుట యందు, క్షమంబైన=సమర్థమైన, దక్షిణ హస్తమునం =కుడి చేతితో, తదున్నమత్= ఆ దేవయాని యొక్క ఎత్తబడుచున్నదియు, గళదురుఘర్మవారికణ = జారుచున్న చెమట నీటి కణములతో, క్రమకరాబ్జముపట్టి = మనోహరమైన చేతిని పట్టుకొని, నూతిలో వెలువడ=బావిలోనుంచి బయటకు వచ్చునట్లు, కోమలిందిగిచె=కోమలియైన దేవయానిని తీసెను. ఉద్ధరించెననుట.

తా. కీర్తిశాలియైన యయాతి భూభారవహన సమర్థమైన తన కుడిచేయి సాచి, చెమటతో తడిసిన దేవయాని మనోజ్ఞహస్తాన్ని పట్టుకొని నూతిలో నుంచి గట్టు మీదికి లాగెను.

వి. ఈ పద్యము అలంకార భూయిష్ఠముగా ఉన్నది. నన్నయ ప్రశస్త శైలికి ఉదాహరణము కాదగియున్నది. యయాతి సముద్ర పరివేష్టితమైన భూభారము నంతయు ఒక్కచేతితో వహించెననుట సూచిత మవుతూంది. సముద్రమే ఆ విశాల భూతలానికి ఒడ్డాణమనుట ఉత్ప్రేక్ష. ఒడ్డాణపు చిరుగజ్జె యలవలె సముద్ర తరంగములు నాదం చేస్తున్నాయని భావం కూడా అటువంటిదే. అవనీతలాన్ని స్త్రీగా సంభావించుకోవాలి. దేవ యాని విషయంలో కూడా ఇట్లాగే అలంకార సమన్వయం చేసుకోవాలి. ఆమె హస్తము చెమటతో తడియుట సాత్త్విక భావోదయము వలన కావచ్చును. పురుష హస్తము మొట్టమొదటిమాటు స్త్రీ హస్తమును స్పృశించినప్పుడు ఆమెలో ఇట్టి భావోదయం కలగడం సహజము. పైగా ఈ సన్నివేశము ఉత్తర కథకు అనగా యయాతి దేవయానుల వివాహమునకు భావి సూచకంగా ఉంది. నూతిలోంచి వస్తూంది కదా, అందుచేత ఆవిడ చెయ్యి తడిసింది అని వాచ్య పద్ధతిని ఆలోచించ కుండా ఉండడానికే నన్నయ "ఘర్మవారికణ" అని చమత్కారంగా వ్రాశాడు.

*145* *వ. ఇట్లు దేవయాని-యిట్లనియె.*

అర్థం : ఉద్ధరించి = నూతిలో నుండి వెలుపలికి తీసి, శరిష్ఠ చేసిన యెగ్గువలన విముక్తయయి = శర్మిష్ఠ చేసిన అపాయమునుండి రక్షింపబడినదై, చేసిన యెగ్గు = కర్మ ధారయము, బా.వ్యా. సమాస-5. రోయుచు వచ్చుదాని = వెతుకుచు వచ్చు దానిని, పురంబు సొరనొల్ల = వృషపర్వుని నగరంలో ప్రవేశించుటకు ఇష్టపడను. నాపడిన యవమానంబు = నేను చెందిన యవమానాన్ని. క్షణంబవచ్చి = వెంటనే వచ్చి. ఆ వృద్ధుడు ప్రాణాలన్నీ కూతురిమీదే పెట్టుకొని ఉన్నాడు. కోప ఘూర్ణిత బాష్ప పూరిత నయనయైయున్న = కోపంచేత కళవళమయి, కన్నీళ్ళతో నిండిన కన్నులుగల దేవయాని.

తా. యయాతి దేవయానిని నూతి బయటకు తీసి తన దారిని తాను వెళ్ళెను. ఆమెను వెతుకుకొనుచు ఘూర్ణిక అను పరిచారికరాగా, శర్మిష్ఠ వలన తనకు జరిగిన అవమానమును ప్రమాదమును దేవయానిదానికి చెప్పి, నేనింక వృషపర్వుని నగరానికి రానని తండ్రితో చెప్ప బంపెను. కుమార్తె వృత్తాంతము తెలియక సహజముగనే అలజడి పడుచున్న ఆ వృద్ధాచార్యుడు తక్షణమే వచ్చి, కోపంచేత ఎర్రబడిన కన్నులు కలదియు, గ్రుడ్ల నీరు నిండినదియు అయిన దేవయానిని చూచి ఇట్లా హితవు చెబుతున్నాడు.
కోపఘూర్ణిత-బాష్పపూరిత-విశేషణోభయ పద కర్మధారయము.

*146* క. అనుపమనియమాన్వి తులై-త త్త్వవిధిజ్ఞుల్.

అర్థం : త త్త్వవిధిజ్ఞుల్=త త్త్వవేత్తలైన మహనీయులు. అనుపమ నియమాన్వితులై=సాటిలేని యాగనియమములు పాటించుచున్నవారై, అనూన దక్షిణల=భూరి దక్షిణలిచ్చి- ''విధిహీనమ సృష్టాన్నం-మంత్ర హీనమ దక్షిణమ్, శ్రద్ధావిరహితంయజ్ఞం-తామ సంపరిచక్షతే" భగవద్గీత17-18. క్రతు సహస్రంబులు సేసినవారికంటె=వెయ్యి యజ్ఞాలు చేసిన శ్రోత్రియులకంటె, అక్రోధనుఁడ = క్రోధవిరహితుడైన పురుషుడు, కడుంబధికుడం డు=మిక్కిలి శ్రేష్ఠుడని అంటారు.

తా. అనేక నియమాలు పాటిస్తూ, విస్తారంగా దక్షిణలిచ్చి, వేలకొలది యజ్ఞాలు చేసిన యాతనికంటె క్రోధవిరహితుడై శాంతుడైన పురుషుడు ఎప్పుడు మిక్కిలి గొప్పవాడని త త్త్వవేత్తలు చెబుతారు. క్రోధరాహిత్యము అనూనధర్మమని చెప్పుట.

*147*. క. అలిగిన నలుగక—ధర్మజ్ఞుడిలన్.

అర్థము. అలిగిన నలుగక=ఎదుటివారు కోపగించినా తాను కోపము చెందక, యొగ్గులు పలికిన=నిందా వాక్యములు పలికినా, వాటిని విననట్లే యుండి పలిగా నిందా వాక్యములు పలుకక, బన్నమువడి = అవమానింప బడియు. ఎవ్వడలపక యున్నతఁడె=మనస్సులో పెట్టుకోని అతడే- ఆ

పురుషుడే. ఉండిన=ఉన్న. దీర్ఘము రాకుండుట విశేషము. ఇప్పుడు మనము ఉన్న యాతడే అంటాము. ఇలన్=భూమిపై, ధర్మజ్ఞుడు= ధర్మము తెలిసిన ఉత్తముడు. "తుల్యనిందాస్తుతిః" అని గీత.

తా. ఎదుటివారు తనపై కోపగించి మాట్లాడినా తాను కోపం చెందక, వారు నిందాగర్భంగా మాట్లాడినా విననట్లే ఉపేక్ష చేసి, అవమానము చెందినా మనస్సులో పెట్టుకొను శాంతాత్ముడే నిజంగా భూమిమీద ధర్మం తెలిసిన వ్యక్తి.

వి. నన్నయభట్టారకుడు సాత్త్విక స్వభావం కలవాడని పెక్కు సందర్భాల్లో కనబడుతూంది. వేములవాడ భీమకవిమీద నన్నయ అసూయాగ్రస్తుడని కందుకూరి వీరేశలింగం పంతులుగారు మొదట వ్రాసి, తరువాత లభించిన చారిత్రకాధారముల వలన తమ మొదటి యభిప్రాయము పొరబాటని అంగీకరించినారు. రాజరాజనరేంద్రుని సంపూర్ణ గౌరవాభిమానాలకు పాత్రుడైనా, నన్నయభట్టు తానేవీ అగ్రహారాలు ఆశించక, తన మిత్రుడైన నారాయణభట్టునకు నందంపూడి అగ్రహారం ఇప్పించడం నన్నయ గారి నిరీహా స్వభావానికి తార్కాణము.

*148* వ. *కావున బుద్ధిగలవారికి— దేవయాని యిట్లనియె.*

అర్థం. బుద్ధిగలవారికి=వివేకవంతులకు, కొనియాడందగదు=పెంచుకోరాదు. ఇప్పటి భాషలో కొనియాడుట అంటే ప్రశంసించుట అనే అర్థంలో వాడుతున్నాము. అనగా క్రోధాన్ని పెద్ద చేయరాదనుట. రాచకూతురు=రాజకుమార్తె యగుటచే సహజంగానే రాజస, తామస ప్రవృత్తి కలదియనుట. పైగా కొండుకయది = వయస్సులో చిన్నది, అనుభవము చాలనిది. దానితోడిదేమి రమ్మనిన = దానితో నీకు పోటీ యేమిటి, మన ఉద్యోగ స్థానాన్నిబట్టి సర్దుకుపోవలెను అనుట.

తా. వివేకవంతులైనవారు క్రోధాన్ని తీగలు సాగనీయరాదు. శర్మిష్ఠ రాచకూతురగుటచే తామస స్వభావం కలది. చిన్నది అవడంచేత అనుభవం

చాలనిది. దానితో నీవు పోటీ పెట్టుకోకూడదు, నగరానికి రమ్మని తండ్రి దేవయానికి హితవు బోధించాడు. వృషపర్వునిచే అనగా బాధ్యతాయుతుడైన వానిచే మనకేదైన అవజ్ఞ జరిగితే మనం పట్టించుకోవలెను.

*149. క కడునసురక్తియు - కష్టము గలదే.*

అర్థం: కడునసురక్తియు=మిక్కిలి అనురాగము, అనుబంధము, కడఁకయు=ప్రయత్నశీలతయు (వట్టి మాటలుగాక చేతలు అనుట). ఉఱక=ఊరకే, నిర్హేతుకముగ, వివేకశూన్యులకడ నుండెడు కంటె=వివేకంలేని వారి దగ్గర ఉండడంకన్న- తద్ధర్మార్థరూపాన్నే భావార్థకంగా గ్రహించి, ప్రత్యయ సంబంధము కల్పించుట, చేయుకంటె=చేయుట కంటె. అట్లే వచ్చుకంటే మొదలైనవి. కష్టము గలదే=హీనత్వ మేమున్నది, ప్రమాదకరము అనుట. ఉఱు=తగు, (ఇప్పుడు వాడుకలో లేదు). ఉఱకకడవగ=ఔచిత్యమును పాటింపక అని చెప్పవచ్చును.

తా. స్వామి భక్తియు, అనురాగమును, నేర్పును (కార్యసాధన శక్తి), ప్రయత్నశీలతయు కలవారిని ఊరకే నిందావాక్యములు పలికి అవమానించు వివేకహీనులకడ ఉండే దానికంటె ప్రమాదమేమున్నది· హైన్యమేమున్నది?

వి. ఉఱుధాతువు ప్రయోగ వైరళ్యము కలిగి కనబడుతూంది. నీయుఱు కడకు=నీ యిచ్చవచ్చిన చోటికి భార. ఉఱఁడు సురేంద్రుడైన వ్యతి. లెక్కసేయదు.

*150. వ ఈ వృషపర్వాపురంబు- యిట్లనియె.*

అర్థం: చొరనొల్ల=చొచ్చుటకు ఇష్టపడను. చొచ్చు=చొరు. బా.వ్యా. క్రియ. 91. ఎటయేనియుంబోదు=ఎక్కడికేనా వెళ్ళిపోతాను. పోదు=పోవుదు. నీవగతివి=నీవే ఆధారము. పట్టు పఱచుచున్నంత=సమాధాన పరచుచుండగా, నమస్కరించి=రాజయ్యును వృషపర్వుడు శుక్రుని మహత్వమును గుర్తించెననుట.

తా. దేవయాని ఇట్లు చెప్పెను. నేనీ వృషపర్వుని పట్టణము ప్రవేశించుట కిష్టపడను. ఎక్కడికేనా వెళ్ళిపోతాను. ఏకైక సంతానమైన దేవయానిని విడిచియుండలేక వృద్ధుడైన శుక్రుడు నాకు నీవే గలివి. నేనును నీతోనే వస్తాను, అని యామెను బ్రతిమిలాడుచుండెను. ఈ వృత్తాంతమును చారుల వలన విని వృషపర్వుడు స్వయముగా ఏతెంచి శుక్రునకు నమస్కరించి వినయము ప్రదర్శించి ఇట్లనెను.

శుక్రాచార్యుడు తమ రాజ్యమును విడిచి వెళ్ళిపోయినచో రాగల యనర్థములను వృషపర్వుడు ఊహింపగల్గెను.

*151 ఉ. దేవతలన్ జయించుచు - మహాయుధాహతిన్*

అర్థం: అతిస్థిర సంపదలన్ = అచంచలమైన సంపదలతో, త్వదీయ విద్యా విభవంబు పెంపునన = మీ యొక్క అమోఘమైన సంజీవనీ విద్యా ప్రభావం చేతనే, దానవులు = దను సంతతివారు, అనగా మా ప్రజలైన రాక్షసులు, ఉద్ధతులైరి = గర్వాధిక్యం కలవారు అయారు, విజృంభించారు, కాని నాడీవనరాశిలో. చొరరె = మీ విద్యాకవచరక్షణ లేనిచో వీరు దేవతల ధాటికి నిలువలేక సముద్రంలో ప్రవేశించ వలసిన వారే, అంతక కోపులైన = యమునివంటి క్రోధం కలవారైన, దేవపతాకినీపతుల = దేవసేనా నాయకుల యొక్క, దివ్యనిశాత మహాయుధాహతిన్ = అమోఘములు అయిన మహాయుధముల దెబ్బలకు నిలువలేక.

తా : ఆచార్య సత్తమా, మీ మృత సంజీవనీ విద్యా ప్రభావంచేతనే నా ప్రజలైన దానవులు దేవతలను జయిస్తూ, అచంచలమైన ఐశ్వర్యం అనుభవిస్తూ ఔద్ధత్యం కలవారు అయారు. మీ విద్యా కవచ రక్షణ లేకపోయినట్లయితే దానవులు యముని వంటి క్రోధం గల దేవ సేనా నాయకుల తీక్ష్ణమహాయుధముల తాకిడికి నిలువలేక సముద్రంలో ప్రవేశించవలసిన వారే కదా!

వి. వృషపర్వుడు వివేక శాలియైన ఏలిక. తన శక్తి మూలమేదో చక్కగా ఎరిగినవాడు. దేవతల పరాక్రమము నాతడు హీనముగా లెక్క వేయ

లేదు. పెంచు ధాతువు నుండి పెంపు. పెరుగు స్వార్థము. పెంచు ప్రేర తార్థకము.

*152. క. వారణ ఘోటక-వగవుము బుద్ధిన్.*

అర్థం : సూరినుత=వివేకవంతులచేత పొగడబడెడు ఓ యాచార్యా! వారణ= ఏనుగులు, ఘోటక= గుఱ్ఱములు, భాండాగారములు=ధనాగారములు మొదలైన ధనములతో, ఇందఱము = మేమందరము, నీ వారకములు గాక=నీ సొంత సొత్తుగా (వారకము-చూడు శ.ర) మమ్ము నీ బుద్ధిలో వగవుము=భావింపుము, వగచు=విచారించు, ఆలోచించు, దుఃఖించు మొదలైన యర్థములు కలది.

తా : విద్వాంసుల చేత స్తుతింపబడువాడా : ఏనుగులు, గుఱ్ఱములు, ధనాగారములు మొదలగు సంపదలతో మేమందరము నీ సొత్తుగా భావించుకొనుము అని వృషపర్వుడు వినయముతో విన్నవించెను. దానవ సంపద అంతా త్వన్మూలకము అనుట.
సూరి శబ్దము చాలా ప్రాచీనమైనది "తద్విష్ణోః వరమం పదగ్ం సదా పశ్యంతి సూరయంః."

శర్మిష్ఠ దాసియై దేవయానిం గొలుచుట

*153. వ. ఈ దేవయానికెద్ది-అంత నొక్కనాడు.*

అర్థం: దానినయిత్తు=ఈ దేవయానికేది యిష్టమో దాని నే ఇస్తాను. సంతసించు సంతసిల్లు. కన్యకా సహస్రముతో=వెయ్యిమంది పరిచారికలతో, శర్మిష్ఠ నాకు దాసి కావలయు, తనను బావిలో త్రోసిన వారిలో వీరును ఉండి యుందురు. దానిని రూఢి చేయుటకై దేవయాని ఒత్తి చెప్పుతూంది. ఇదియ నా కిష్టము=ఇదే నా కోరిక. దేనినైనను ఒత్తి చెప్పవలసి వచ్చినప్పుడు మూడు మాట్లు అనుట లోకాచారము. వనవాస సంవత్సరములు నిండెనాయని దుర్యోధనుడు ధర్మరాజునే అడుగబంచెనట. అంతట ఆయన నవ్వి "నిండె, నిండె, నిండె" అని ముమ్మారు పలికెనట. దీనిన యిచ్చునది=దీనినే ఇవ్వవలెను. ఇచ్చునది- బా. వ్యా. క్రియ-27.

కూఁతు=కుమార్తెను, కూతురు ఇప్పటి శబ్ద రూపమైనను పూర్వులు కూతు అనియే గ్రహించినట్లు కనబడును. కావుననే బా. వ్యా. ఆచ్చిక 9 లో రు విధింపబడినది. కూతుళ్ళు అసాధువని సూరి మతము శుక్రునకు మనః ప్రియంబు సేసిన=శుక్రాచార్యునకు ఇష్టమైన పని చేసి ఆయనను సంతోషపెట్టెను. అగ్గురు వచనంబున= తండ్రి యాదేశానుసారము శర్మిష్ఠ దేవయానికి దాసి అయ్యేను.

తా : ఈ దేవయానికేది యిష్టమో దానినే ఇప్పిస్తానని వృషపర్వుడు చెప్పగా దేవయాని సంతోషించి, వేయి మంది పరిచారికలతో శర్మిష్ఠ నాకు దాసి కావలెనని నిక్కచ్చిగా అడిగెను. వృషపర్వుడును శర్మిష్ఠను పిలిపించి దేవయానికి దాసిగా నిచ్చి శుక్రునకు మనః ప్రీతి చేసెను. శర్మిష్ఠ తండ్రి చెప్పినట్లే దాసీతనము చేయుచుండెను.

వి. దేవయాని మంకుపట్టుదలగల యువతిగా కనబడుతుంది. దానికి హేతువు లేకపోలేదు. అయినను ఆమె కొంత సౌజన్యము చూపినచో ఆమె పాత్రకు ఉదాత్తత వచ్చియుండెడిది. కాని ఆమె ప్రతీకారమునే వరించింది. శర్మిష్ఠ మొదట ధూర్తత్వంతో వర్తించినా ఇప్పుడు తండ్రి మాటకు ఏమీ వ్యతిరేకం చెప్పక రాజకుమార్తె అయియుండియు దాసీత్వము అంగీకరించడం ప్రశంసావహంగా ఉంది. అనగా ఆమె పట్టువిడుపులు గల యువతిగా భాసిస్తుంది. ఇంతేకాక శుక్రాచార్యుడు తన తండ్రి ఆస్థానం విడిచి వెళ్ళిపోతే దానవులకు రాగల కష్టాలు ఆమె ఊహించుకొని ఉంటుంది. తమ సజాతీయులకు వచ్చే ఆపదలను వారించడానికై ఆమె తన్నుతాను అర్పణ చేసుకుంది. స్వజనాభిమానంలో శర్మిష్ఠ కచునితో పోల్చదగియున్నది.

*154 క. వనకేళీ కౌతుకమున - తద్వనమునకున్*

అర్థం : శర్మిష్ఠదొట్టి = శర్మిష్ఠ మొదలైన చెలికత్తెలందరూ సంతోషంతో, కొలిచిరాగ=పరిచారికలవలె వెంటరాగా, విభవము దనకమరగ=వైభవము, దర్పమూ ప్రకటిస్తూ, దేవయాని, వనకేళీకౌతుకమున = వనక్రీడలయందలి మక్కువతో తద్వనమునకున్ జనియెను,

తా. వనక్రీడల కోసమై దేవయాని శర్మిష్ఠ మొదలైన వారు పరిచారకు రాండ్రుగా సంతోషంతో వెంటరాగా, తన వైభవము ప్రకటిస్తూ ఆ యర ణ్యమున కేగెను. (ఏ యదవియందు తాను పాడునూతిలో త్రోయబడిందో ఆ వనమునకు కావచ్చును. 'ఓడల బండ్లును వచ్చును' అను అవస్థా వ్యత్యాసము శర్మిష్ఠ-దేవయానుల నడుమ సార్థకమైనది.

వి. చనియెను=ఇయుడాగమము, శర్మిష్ఠ దొట్టి తొట్టి=తొలిస్థానము నందు న్నది అనే భావం వస్తుంది. మొదలైన యనుట.

*155 వ. ఇట్లరిగి - వినోదంబుల నున్న యవసరంబున*

అర్థం : దేవయాని (అధ్యాహారము) పుష్పాపచయంబు సేయుచు=పూవులు సేక రించడం చేస్తూ, స్వచ్ఛమైన జల ప్రవాహంతో ఒప్పుతూండే ఒక్క సెల యేటి కెలన=సెలయేటి ఒడ్డున - ఏరు ఔపవిభక్తికము. కెలన= కెలను-చూ.బా.వ్యా. ఆచ్చి-18. నవవికచకుసుమ=క్రొత్తగా వికసించిన పుష్పములు, సుకుమార కోరకనికర=మృదువైన మొగ్గల సమూహ ముతో నిండిన, సహకార=తియ్యమామిడి, కురవక=గోరంట, వకుళ= బొగడ, అశోకము, తమాల=చీకటిమ్రాను, సాల=సాలవృక్షముల నీడచేత చల్లనైన, సికతాతలంబున = ఇసుక తిన్నెలమీద, ఇష్టవినో దంబుల=ఇష్టమైన ఆటలలో మరగియుండగా.

తా. దేవయానియు చెలికత్తెలును ఆ వనములో చల్లని నీరుగల ఒక సెలయేటి యొడ్డున విడిసి, అక్కడి వివిధ పుష్ప ఫలవృక్షములచేత చల్లనైన ఇసుక తిన్నెలపై కూర్చుండి పుష్పాపచయ ఖేలనమునందు నిమగ్నలై యుండగా.

నన్నయకు ఇష్టమైన అనుప్రాస రచనను అచ్చటచ్చట చూచుకొనునది.

*156 సీ. అంగనాజనుల - యయాతినంత*

అర్థం : అనిలుడను దూత దేవయాని కడకు యయాతిని తోడ్కొనుచు వచ్చె. యయాతి ఎట్టివాడు? మృగతృష్ణఁజేసి=ఎండమావులవెంట త్రాగేటందుకు

నీటిని వెతుక్కుంటూ వస్తున్నవాడు, పరిశ్రాంతుడు=మిక్కిలి అలసిన, వీరుడు. అనిలుడనే దూత = రూపకము, యయాతిని దేవయాని పాలికి అనగా దగ్గరకు ఎట్లు తేగలిగెను ? ఆ యువతుల ధరించిన పుష్పాదుల సౌరభావలులు=పరిమళ సమూహములు, తాల్చి=మోసు కొనివచ్చి, ఆ సౌరభముల వివరణము.

అంగనాజనుల=ఆ యువతుల, ఉత్తుంగసంగత కుచ కుంకుమ చందన పంకములయు=ఎత్తైన కుచప్రదేశములందు పూసుకొనబడిన కుంకుమ (పువ్వు, బొట్టు కుంకుమ కాదు)మంచి గంధముల లేపనములయొక్కయు, వారివ = ఆ యువతీ సమాజమునకే చెందిన, కచభారములయందు తురుముకొన్న, ప్రశస్త పరిమళము లీనుపూదండలయొక్క, పూల దండల భారముచే వారి సిగలు వంగినవనుట విశేషము, వారివ=వారివే అయిన నోటియందు బిగించిన సకర్పూర తాంబూలాది=పచ్చకర్పూరము కలిపిన తాంబూలములచేత సువాసితమైన నిట్టూర్పు వాయువులయొక్కయు, వారివ=వారివే అయిన, పరిధాన=కట్టుచీరలకు పట్టించిన పరిమళవంత మైన ధూపములయు, వస్త్రములు సువాసనగా ఉండుటకై పరిమళ ద్రవ్య ధూపములు వాటికి పట్టించుచుండిరనుట. ఈయన్ని సుగంధముల సంక లిత పరిమళమును దాల్చి, అనిలుడను దూత వచ్చె – అను దానితో అన్వయము.

తా. అట్లు వనకేళీ మహోత్సవములో ఉన్న యువతుల నుండి వెలువడు వివిధ సౌరభములను మోసుకొని వచ్చినవాడై మందమారుతము అను దూత, వేటశ్రమచే నీటిని వెదకుకొనుచు వస్తూన్న యయాతిని ఆ యువతీ జనమున్నవంకకు ఆకర్షించి తెచ్చెను.

వి. ఈ పద్యమునందు 140 పద్యము నందు వలెనే సర్వనామ పదముల ప్రయోగ శిల్పమును నన్నయ అవలంబించెను. 140 పద్యమందు 'దాని, దాని' అని ద్వితీయాంత సర్వనామమును పాదాంతమున వాడినట్లే ఇక్కడ 'వారివ, వారివ' అను షష్ఠ్యంత సర్వనామమును పాదారంభము నందే వాడి చమత్కారశైలిని ప్రదర్శించెను. తిక్కన సోమయాజి

''ఎవ్వని వాకిట నిభమదపంకంబు'' అను పద్యములో ఈ రీతినే వరవడిగా గ్రహించియుండవచ్చును. 'పంకములయు' అను నడకలో 'యు' సముచ్చయార్థకము. అదియు అక్షర రమ్యతను పోషిస్తూంది. షష్ఠీప్రత్యయమైన 'యొక్క'కు లోపము.

ఆ యువతుల సకర్పూరతాంబూల నిశ్వాసములు అను భావాన్ని అల్లసాని పెద్దన మనుచరిత్రలో వాడుకొనెను. వరూధిని తాంబూల సువాసనను బట్టియే ప్రవరుడు ఆ స్థలము జన సంచారము కలదని యూహించెను.

**157** *క. తరళనయనాబ్జదళముల-కాంతలు ప్రీతిన్.*

అ. ఆచటి కాంతలు ( యువతులు ) నృపసుతు బూజించిరి = యయాతిని బహూకరించిరి. ఎట్లు ? తరళనయనాబ్జదళములు = చంచలములైన నేత్రములు అను తామరపూరేకులు, రూపకము, నెరయగ = చక్కగా, మున్నపైజల్లి=ముందుగా ఆ యయాతిపై చల్లి,(తరువాత అధ్యాహారము) నవ కుసుమ యాలంకరణ విశేషముల=నూతనములైన పూలు మొదలగు పూజా ద్రవ్యములతో పూజించిరి అని అన్వయము. వారి నేత్రములు తామర రేకులవలె ఉన్నవను వ్యంగ్యము సూచితము. ప్రకృతి భావములు కాని నయనాబ్జదళములు ముందు, భావములైన కుసుమములు అనంతరము పూజా ద్రవ్యములగుట కవితా చమత్కారము.

—యయాతి మహారాజు దేవయానిని వివాహంబగుట—

**158** *వ. అయ్యా యాతియు—యిట్లనియె.*

అర్థం. తత్ప్రదేశంబున సుఖోపవిష్టుండై = ఆ యిసుకతిన్నెలమీద సుఖముగా కూర్చుండి, అతిశయరూప లావణ్యగుణసుందరి=అత్యధికమైన అవయవ సౌందర్యము, మెరసెడు దేహకాంతి మొదలగు వాటిచే సుందరియైన శర్మిష్ఠను తెలుసుకొనగోరి, కులగోత్ర నామంబులు =వంశము, గోత్రము, పేరు మొదలైనవి, ఎఱుంగవలతు=కోరుదును, దేవయాని చెలికత్తెలకు మాట్లాడు స్వేచ్ఛనీయక తానే సమాధానము చెప్పినది. తన పెద్దరికమును స్థాపించుకోవలెనని యామె ఆరాటముగా కన్పిస్తుంది.

తా. యయాతి ఆ యిసుక తిన్నెలపై సుఖముగా కూర్చుండి, వారిని గురించి తెలుసుకొనదలచెను. దేవయానిని ఆతడింతకుముందే యెరుగును. రూప లావణ్యములచేత అతిశయవతిగా కనబడుచున్న శర్మిష్ఠను గూర్చి తెలుసు కొనగోరి మీ కులగోత్ర నామములు చెప్పమని అడుగగా, దేవయాని తానే అందుకొని ఇట్లు చెప్పెను.

*159. తే. నన్ను మున్న-శర్మిష్ఠయంద్రు జనులు.*

అర్థం. మున్న = మున్ను+అ (అవధారణార్థకము) ఇదివరకే ఎరుగుదువు. యయాతిదృష్టి శర్మిష్ఠపై పడినదని గుర్తించి, ఆ రాజకుమార్తెను కించ పరచుటకై కాబోలు— ఈమె నా దాసి, నా యొద్దనెప్పుడు కదలక ఉంటుంది. నా యాజ్ఞ జవదాటదు అని చెప్పదలచి యుండును.

తా. యయాతి మహారాజా! నీవు నన్ను ఇంతకుముందే ఎరుగుదువు. (శర్మి ష్ఠను చూపుచు) ఈమె వృషపర్వుడను దానవ చక్రవర్తి కూతురు. నాకు దాసి అని సగర్వముగ చెప్పెను దేవయాని.

*160. ఉ. నిగ్రహమేఁది—పొందపాడియే.*

అర్థము. నిగ్రహమేఁద (ఈ పాఠము మంచి యర్థాన్ని ఇచ్చేటట్లు కనబడింది) నా చెరపాయునట్లు, ఆమె పాడు నూతిలో త్రోయబడి చెర పెట్టబడినట్లయినది. తరణిప్రభ=సూర్యునివంటి కాంతి గలవాడా, భూపాగ్రణి = భూప శ్రేష్ఠుడా! యయాతికి సంబోధనలు, కూపము వెల్వరించునాడు=పాడు నూతిలో నుండి నన్ను పైకి తీయునపుడు, ఉగ్రమయూఖ సాక్ష్యముగ= తీక్ష్ణకిరణుడైన సూర్యుడు సాక్షిగా, దక్షిణపాణి=నీ కుడిచేతితో నా కుడి చేతిని, పట్టితి=పట్టితివి కావున. వకారలోపమునకు, బా.వ్యా. క్రియ— 24. మున్న పాణిగ్రహణంబు సేసితి=ఇదివరకే నన్ను పెండ్లి యాడి నావు. ఇది నీవు విస్మరించుట తగునా, న్యాయమా అని దేవయాని అతి చాకచక్యముగా మాట్లాడినది.

తా. నన్ను పాడు నూతి చెరనుండి విడిపించునప్పుడు, ఓ మహారాజా! సూర్యుడు సాక్షిగా నన్ను పాణిగ్రహణం చేశావు. అది నీవు మరిచి పోవచ్చునా అని దేవయాని చిక్కు ప్రశ్న లేవదీసింది.

వి. దేవయాని దయనీయురాలుగా కనబడుతూంది. ఏ యువకుడూ ఆమెను పెండ్లి చేసుకొనుటకు కోరలేదు. ఆమెయే తనను తాను వివాహ విపణిలో ప్రదర్శించుకోవలసి వచ్చింది. "నరత్న మన్విష్యతి మృగ్యతేహి తత్" అని కాళిదాసు చెప్పినది దేవయాని యెడ విపరీతమైనది. దీనికి కారణ మేమై యుండును? ఆమె కురూపి కాదని 140 పద్యం వలన తెలుస్తూంది. ఆమె వరుణేంద్రు దేవియపోని (పోలిన) దాని. దేవయాని అదృష్ట శూన్యత, అహంకార స్వభావము, వాక్పారుష్యము కలిసి ఆమెను యువ కులకు దూరం చేసి ఉంటాయి. అందుచేత నన్ను పెళ్ళి చేసికొండని యువకులను ఆమెయే యాచించవలసి వచ్చింది.

*161.* ఉ. నన్ను వివాహమై - నీవు నావుడున్

అర్థం : నృపోత్తమ, నహుషనందన=నహుష చక్రవర్తి కుమారుడా, నన్ను పెండ్లి చేసుకొని, ఈ లలితాంగిదొట్టి= ఈ శర్మిష్ఠ మొదలైనవారు, దివిజకన్యలతో=దేవకన్యకలతో, ఎనయైనవార=సాటియైనవారు, నీకు సేవలు చేయుచుండగా, వాసవు బోలి=ఇంద్రుని బోలి, ఇన్నరలోక భోగము లందుము=భూలోక దేవేంద్రుడువలె భోగము లనుభవింపుము, నావుడున్=ఇట్లనగా.

తా. నహుష చక్రవర్తి కుమారుడా, నన్ను వివాహమై శర్మిష్ఠ మొదలైన కన్యలు, దేవకన్యలతో సమానమైనవారు పరిచర్యలు చేయగా దేవేంద్రుడు స్వర్గసుఖములను వలె, నీవు భూలోక దేవేంద్రుడవు వలె సౌఖ్యములందు మని దేవయాని యుద్బోధించెను.

వి. నహుషుడు గొప్ప రాజైననూ సప్త మహర్షుల యాగ్రహమునకు గురి యయ్యెనను కథ కలదు.

*162. వ. క్షత్రియ కన్యకల - దేవయాని ఇట్లనియె.*

అర్థం: వివాహంబగుదురుగాక=పెండ్లి యాడు నాచారము ఉండవచ్చుగాక, అధర్మోత్తరంబుగా=ధర్మ విరుద్ధముగా, వివాహంబగుదురే=పెండ్లి యాడవచ్చునా. సర్వవర్ణాశ్రమ ధర్మంబులు సంకరంబులుగాకుండ= ఆయా వర్ణాశ్రమ ధర్మములు హద్దులు మీరి సంకీర్ణము గాకుండా, ఏన యిట్టి=నేనే ఇట్టి వర్ణసంకర వివాహమునకు, ఒడంబడితినేని=అంగీక రించి ఆచరించితినేని, జగత్ప్రవృత్తి=జగజ్జనులనడత విపరీతమగును. అనిన యయాతికి.

తా. బ్రాహ్మణులు క్షత్రియ కన్యల వివాహమగు నాచారమున్నది కాని, తద్విరుద్ధముగా క్షత్రియుడు బ్రాహ్మణకన్యను ఉద్వాహమగుట అధర్మము నకు పరాకాష్ఠయగును. వర్ణాశ్రమ ధర్మసాంకర్యమేర్పడకుండ ప్రజా పాలన చేయుచున్న నేనే ఇట్టి ధర్మ విరుద్ధ కార్యమునకు పూనుకొన్నచో లోకుల నడత అపమార్గమున పడును అని పలుకగా దేవయాని దానికి పరిహారము చెప్పుతూంది.

వి. అగుదురు=తద్ధర్మార్థక్రియ, తద్ధర్మప్రయోజనము లకై చూడు బా.వ్యా. క్రియ 5.

*163. క. వెలయఁగ - వివాహమగుదే యనినన్.*

అర్థం: అంఘుభుజా=బలశాలియైనవాడా!, వెలయగ = లోకప్రసిద్ధముగా నిఖిలలోక పూజ్యుడై=అన్ని లోకములందును పూజనీయుడైన, నిర్మ లుడు=అకుటిలుడు అయిన శుక్రాచార్యుడు, పంచిన=ఇది యధర్మము కాదని నియోగించిన, ఆజ్ఞాపించిన, వివాహమగుదే=పెండ్లియాడుదువా?

తా. ధర్మాధర్మ సూక్ష్మములు చక్కగా తెలిసి, ఆచరించుచు, సకలలోక పూజ నీయుడైన శుక్రాచార్యుడు తానే నిన్ను నియోగించినచో నన్ను పెండ్లి చేసుకొందువా యని దేవయాని యయాతిని అడిగెను.

వి. సురాపానము పాపమని నిషేధించి గొప్ప ఆత్మ సంయమనము ప్రదర్శించిన శుక్రాచార్యుడు లోకవంద్యుడు అనడంలో సందేహం లేదు. అట్టి నిగ్రహ సమర్థుడు కేవలము తన కుమార్తె యభీష్టమునకు లొంగి విలోమ వివాహమున కంగీకరించెననుట నిరాకరింపదగినది. విలోమ వివాహములు ఆ కాలములో సర్వసాధారణములు కాకపోయినా, సకృత్తుగా జరుగుచుండెడివని తోస్తుంది.

*164. వ. అమ్మహాముని వచ్చి - శుక్రురావించిన.*

అర్థం. ఒడంబడిక = అంగీకరింపగా, రావించిన = రప్పించిన- బా. వ్యా. క్రియ-77.

తా. శుక్ర మహర్షి (స్వయముగ) వచ్చి, ఈ వివాహము ధర్మ విరుద్ధంబు కాదని చెప్పినట్లయితే, నిన్ను పెళ్ళి చేసుకుంటానని యయాతి ఒప్పుకొనగా దేవయాని వెంటనే తండ్రిని రమ్మని పంపించింది.

*165. క. తన దివ్య తేజమున - ప్రీతిన్.*

అర్థం. భృగునందనుడు=భార్గవుడైన శుక్రాచార్యుడు, తేజోవంతమైన శరీర కాంతితో ఆ యడవి యంతయు కాంతివంతమగునట్లు చేయుచు, నిజనందనకు, ఇష్టము చేయదలచి ప్రీతితో వచ్చెను.

తా. స్పష్టము. ఆయన దుర్బల శరీరకాంతిచే ఆరణ్యమంతా కాంతివంతమయ్యెను అనుట అతిశయోక్తి అయిననూ, ఆ మహర్షి తేజస్సును సూచించుటాకికి చెప్పబడినదగుటచే సహ్యముగా ఉన్నది.

*166. క. అతి సంభ్రమమున - ఉత్తమాంగుడయ్యెన్.*

అర్థం. అవనీపతి=రాజైన యయాతియు, అతిసంభ్రమమున=తత్తరపాటుతో, విహితోత్థానుడై=చేయబడిన లేచుటకలవాడై, అనగా లేచి నిలబడినవాడై, (ఇక్కడ తైత్తిరీయోపనిషత్తు ప్రవచించిన వాక్యము "యేకే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః। తేషామ్ త్వయాసనేన ప్రశ్వసి

తవ్యమ్'' అనుసంధింపదగి యున్నది. శృంగార నైషధమునందు దేవ దూతగా నలుడు తన వద్దకు వచ్చినప్పుడు దమయంతి రాజకుమార్తె తీవితో ఆసీనురాలయియే మాట్లాడినది. అక్కడ అదియు అందముగానే ఉన్నది.) తపశ్శక్తి = తపో మహాత్వంచేత, ప్రజాపతి నిభుడగు = బ్రహ్మతో సమానుడైన, భార్గవునకు, భక్తితో ప్రణమితోత్తమాంగుం డయ్యెన్ = వంచబడిన శిరస్సు కలవాడాయెను.

తా. భూపాలుడైన యయాతియు తత్తరముతో లేచి నిలబడి, తపశ్శక్తి యందు బ్రహ్మదేవునితో సమానుడైన శుక్రాచార్యునకు తలవంచి నమస్కరించెను.

వి. ''తపోబ్రహ్మేతి'' తైత్తిరీయము. ఈ కాలమునందు తపస్సు అపహాస్యము పాలైనను పూర్వులు దానినొక గొప్పశక్తిగా భావించిరి. తపః స్వరూపమునుగూర్చి భగవద్గీతాది గ్రంథములను అవధానముతో పరిశీలించి అనుష్ఠింపదగును.

*167 వ. మఱియు దేవయానియు - శుక్రున కిట్లనియె*

అర్థం : యయాతియే కాక అక్కడ ఉన్న కన్యకా జనమంతయు, దేవయాని, శర్మిష్ఠ మొదలైన వారందరునూ మిక్కిలి భక్తితో క్రమముగ ఆ మహర్షికి నమస్కరించిరి. దేవయాని తండ్రితో ఇట్లా విన్నవించింది.

తా. స్పష్టము.

*168 ఆ. ఇన్నరేంద్రు - పరమమూర్తి*

అర్థం : పరమమూర్తి = ధర్మమూర్తీ!, ఇన్నరేంద్రుచేత = ఈ రాజన్యుని చేత, మున్న = ఇదివరలో, గృహీతమైయున్న = పట్టుకొనబడిన నా చేయి, పరిణయ విషయమై = వివాహము నిమిత్తము, పరిగ్రహింప = పట్టుకొనుట, ఇంక నొరునకు = మరొక పురుషునకు, అర్హమగునె = తగునా ?

తా. బ్రహ్మజ్ఞ్యుడవైన ఓ శుక్రమహర్షీ ! ఈ రాజుచేత ఇదివరలో పట్టుకొన బడిన నా దక్షిణ హస్తము, వివాహము నిమిత్తము మరొక పురుషుడు పరిగ్రహింపవచ్చునా అని దేవయాని ధర్మసందేహము లేపినది.

వి. దేవయాని లేవదీసిన ప్రశ్న చాలా దూరాన్వయంగా ఉంది. ప్రాణ రక్షణము చేయుటకై యయాతి ఆమె కుడిచేతిని పట్టుకొనెనుగాని, పరిణయ బుద్ధితో కరగ్రహణము చేయలేదు. ఆ సన్నివేశాన్ని తన కనుకూలముగా ఆమె యిప్పుడు అన్వయించుట ఉచితముగా లేదు. పెండ్లి విషయమై ఆమె పడుచున్న తాపత్రయాన్నే సూచిస్తూంది కాని దీనిలో ధర్మసూక్ష్మత మృగ్యము.

*169 వ. కావున నాకు - ఆత్మగతంబున*

అర్థం: ఈ జన్మలో నాకు యయాతియ పతి = యయాతియే భర్త, భవద్వచనంబున=మీ యనుమతి లభించినచో, ధర్మ విరోధంబు లేకుండునట్లు అనుగ్రహింపవలయు, అపక్రమదోషంబు=క్రమభంగము వలన కలుగు పాపము, లేకుండెడుమని=లేకుండుగాక అని శుక్రుడు వరమిచ్చెను. ఎడుమ=బా.వ్యా. క్రియ-28. శుక్రుడే స్వయముగా ఉత్సాహముతో వారి పరిణయము జరిగించి, యయాతికి ఒక హెచ్చరిక చేసెను, అన్నపాన భూషణాచ్ఛాదన మాల్యానులేపనాదుల = అన్నపానములందు, అలంకారములు, వస్త్రములు, దండలు, మైపూత వస్తువులలో దీనికి= శర్మిష్ఠకు, ప్రీతిని చేయునది. శయన విషయంబున బరిహరించునది= భార్యా సందర్భముగా దూరముంచవలెను, అని కట్టడి చేసెను. కూతు నల్లునిం బూజించిన = సారె మొదలైన వాటితో సత్కరించెను. నిజపురంబునకుంజని=యయాతి స్వంత పట్టణమునకు పోయి, దేవయానిని అంతఃపుర సంబంధమైన రమ్యమగు మేడలో విడియించి, దేవయాని యనుమతితోనే, వేయిమంది చెలికత్తెలతోపాటు శర్మిష్ఠను అశోక వనము =ఉద్యాన వన సమీపమున ఒక ఇంటిలో నిలిపెను. దేవయాని పట్టపురాణియై అంతఃపురమందును, శర్మిష్ఠ దాసీజన స్థానమైన ఉద్యాన వన సమీపమునను నివసించుచుండిరి. కొండొక కాలంబునకు=కొంత కాలము

నకు దేవయానికి యదుతుర్వసులను కొడుకులు పుట్టిరి. సంప్రాప్తయౌవ
నయై=యౌవనమునంది, నెల వరుస స్త్రీ ధర్మమునకు వశమయ్యెను.

తా. దేవయాని తండ్రితో ఇట్లు చెప్పెను: నాకు ఈ జన్మమునకు యయాతియే భర్త. మీ యనుజ్ఞ లభించినచో నన్ను పెండ్లియాడుటకు అంగీకరించి నాడు. ఇది యధర్మము కానట్లు తాము అనుగ్రహింపవలెనని కోరగా శుక్రుడు ఆమె కోరిన వరమిచ్చి వారిద్దరికిని తానే సంతోషముతో పెళ్ళి చేసెను. ఆ సందర్భములోనే శర్మిష్ఠను చూపి, ఈమె రాజకుమార్తె. ఈమెకు భోజన వస్త్రాదులలో ఎట్టి లోటును రాకుండా చూచుకొనునది. కామ విషయమున మాత్రం పరిహరించవలెననెను. ఇట్లేర్పాటుచేసి అల్లుని కూతురుని సాగనంపెను. యయాతి తన నగరానికి వెళ్ళి దేవయానిని పట్టపుదేవిగా అంతఃపురములోను, శర్మిష్ఠను, ఆమె పరివారమును అశోకవన సమీపముననుప్రతిష్ఠించెను. కొంతకాలమునకు దేవయానికి యదుతుర్వసులను కొడుకులు పుట్టిరి. శర్మిష్ఠయు ప్రాప్తయౌవనయై తన భవిష్యత్తు విషయమై చింతలో పడెను.

*170* చ. అసదృశయౌవనంబిది-కాంచెనో.

అర్థం. అసదృశయౌవనంబు=సాటిలేని ఈ యౌవనము, సాటిలేనిదనగా తిరిగి తిరిగి వచ్చునదికాదని భావము గ్రహించవలెను. పతిలాభములేమి= భర్త లభింపకపోవుటచే, నాథ=నాధయిన ఈ యౌవనము, అనన్య ధనంబగునొక్కొ=యౌవనమును సార్థకము చేయగల భర్త లేకపోవు టచే, ఎవరి ధనమున్నూ కాకుండా పోవునేమో, ఇక్కుసుమసముద్గమం బును = ఈ ఋతుప్రాప్తియు, అగోచరదుర్గమ దుర్గవల్లరీకుసుమ సముద్గమంబగునొకో=నరులకంటబడని దుర్గమారణ్యమందు పెరిగిన తీగపై పూసిన పూవు వికాసమగునేమో - కుసుమ, కుసుమ=అభంగ శ్లేష. రెండర్థములుగల శబ్దము. ఈ ప్రయోగమందలి నన్నయ శ్లేష వైచిత్రి గమనింపదగినది. అట్లే కద్రూవినతల వృత్తాంతమున చేయ బడిన సముద్ర వర్ణనమునందు కూడ నన్నయ తన శ్లేషరచనా నైపుణిని కొంచెము రుచి చూపించినాడు. ఏమైనను ఉపమ, రూపకము మొదలైన

పాఠకజన సులభగ్రాహ్యములైన అలంకారములనే ఈ మహాకవి వాడును. కేవల పాండిత్య స్ఫోరకమైన ఆలంకారిక రచన ఆయనకు సమ్మతము కానట్లే భాసించును. అడవి కాచిన వెన్నెల అనే సామెత కూడ ఇట్టిదే.

తా. ప్రాప్తయౌవనయైన శర్మిష్ఠ తన భవిష్యత్తు విషయమై సంతాప పడడం మొదలుపెట్టింది. భర్త లేకపోవడంచేత, సంతానప్రాప్తి లేక తన యౌవనము, తన సౌందర్యమూ అడవి కాచిన వెన్నెల అవుతాయని ఆమె బాధ పడుతూంది. దేవయాని ఏమి తపస్సుచేసి ఇష్టమైన భర్తను పొంది సంతానవతియైనదో అని చింతింపజొచ్చెను.

స్త్రీకి భర్త లాభము ఆవశ్యకమని ప్రకృతి చెప్పకయే చెప్పుతూంది. "నజానే భోక్తారమ్ కమిహ సమువస్థాస్యతి విధిః" అని శకుంతలను గూర్చి దుష్యంత ముఖమున కాళిదాసు పలుకుట సాభిప్రాయంగా ఉంది.

*171 క. పతిఁబడసి–భాగ్య సంపద నెనయే.*

అర్థం. అతివలు = స్త్రీలు, పతిఁబడసి = భర్తృవతులై సుతులఁ బడయగ గోరుదురు-సంతాన వతులు కావలెనని కోరుకుంటారు. కోరినట్టుల తన యభీష్టము ప్రకారము భర్తను పొంది సంతానవతి యైనది. సతులు=ఇతర స్త్రీలు, ఈ భార్గవికి=భార్గవుని కుమార్తెయైన ఈ దేవయానికి, భాగ్యసంపద = అదృష్ట శాలిత్వములో, ఎనయే = సాటియా ? సాటికారనుట.

తా. లోకంలో స్త్రీలు భర్త లాభము పొంది, సంతానవతులు కావాలని కోరుకుంటారు. తన కిష్టుడైన పురుషుని భర్తగా పొంది భార్గవియైన దేవయాని కుమారులను గన్నది. నా బోటి స్త్రీలు ఈమెకు సాటియా?

వి. నన్నయార్యుని అక్లిష్ట రచనకు, అన్వయ సౌలభ్యానికి ఉదాహరణలు కాగల పద్యములు ఇటువంటివి అడుగడుగునకు తగులుచునే యుండును. తెలుగులో మనకు తెలిసినంతవరకు మొట్టమొదట మహాకావ్య రచన

చేసిన నన్నపార్యుడు సంస్కృతములో ఆదికవియైన వాల్మీకి రచనా శిల్పముకు పుణికిపుచ్చుకున్నాడా అనిపించును. కవులు తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శించుటకుగాక రసదృష్టితో వ్రాయవలెనని శబ్దచింతామణి చెబుతూంది. "సాధ్వోహిరసోయథాయథమ్కవిభిః". ఒక యువతియొక్క హృదయాందోళనను కవి చక్కగా వెలార్చుచున్నాడు. విచికిత్సతో కూడిన శృంగారము.

*172 తరువోజ. ఈ రాజునంద నా హృదయంబు-పతిఁజేసికొందు.*

**అర్థం.** నా హృదయంబు ఈ రాజునంద (దే) యెప్పుడు దవిలియుండు= ఎప్పుడును ఆసక్తి కలిగియున్నది, తగులు=తవులు గకారము వకార మగుటకు చూ. బా. వ్యా. అచ్చి-27. ప్రధాన క్రియకును అనుబంధ క్రియకును మధ్య మరియొక పదము వ్యవధానముగ వచ్చుట పూర్వ కావ్యశైలిలో విశేషము. తవిలి యెప్పుడు నుండు, నన్నీతడు మిక్కిలి దయతో ప్రీతిగల యట్లు చూచును, ఇచ్చట కారుణ్యమునకు తావేమి ?, పెండ్లి అయి భర్తతో ముచ్చటగా నుండవలసిన సుందరాంగి అట్టి సౌభాగ్యము లేకుండుట యయాతి కారుణ్యమునకు కారణము కావచ్చును. పరగత సుఖదుఃఖాదులను తెలుసుకొనగలుగుట సాత్త్విక భావము. కమలముల వంటి కన్నులుగల భార్గవి తాను ఎట్లు కోరి యీతనిని భర్తగా పొందగలిగెనో నేనును అట్లే, లోకైక భారధురంధరుడు=లోకభారము వహించువాడును, పరహితుడు = ఇతరుల హితము కోరువాడు, ధర్మ పరుడు=ధర్మబుద్ధికలవాడును అయిన నహుషాత్మజుని = నహుషుని కొడుకైన యయాతిని నేనును కోరి భర్తను చేసుకొంటాను. శర్మిష్ఠ బ్రాహ్మణకన్య కాదు గనుక ఆమెను చేసుకొనుటలో యయాతికి క్రమ భంగ దోషముండదు.

**టా.** శర్మిష్ఠ తనలో అనుకుంటూంది. నా హృదయం ఈ యయాతిపై తగిలి ఉంది. అతడును నా యందు ప్రేమ ఉన్నట్లే సాభిప్రాయనేత్రాల్తో చూస్తూంటాడు. దేవయాని ఏ విధంగా ఇతణ్ణి కాంక్షించి తనవాణ్ణి చేసు

కొన్నదో నేను కూడా ఆ విధంగానే లోకభారధురంధరుడును నహుషాత్మ జుడును అయిన యయాతిని భర్తగా చేసుకుంటాను.

యయాతి ఏకపత్నీవ్రతనిష్ఠుడు కాడనియు, బహుయువతీవల్లభుడనియూ తెలుస్తూనే ఉంది. శుక్రునిచే ఆతడు శాపము నొందుటకును ఇదియే కారణము.

## యయాతి శర్మిష్ఠకుఁ బుత్రదానంబు చేయుట

*173 వ. అని విచారించుచున్న - మొగిచి యిట్లనియె.*

అర్థం : అవసరంబున = సమయమున, పుణ్యస్వరూపంబు సన్నిహితమైనట్లు = ఆమె పుణ్యం పండి సమీపించినట్లు, అశోక వనికాలోకన తత్పరుండై = అశోకవనం చూచే అభిలాషతో, వచ్చువాడు = వచ్చుచున్న యయాతి, ఏకతంబయున్న శర్మిష్ఠంగనిన = ఒంటరిగా ఉన్న శర్మిష్ఠను చూడగా, సంభ్రమ వినయావనతయై = తత్తరపాటుతో (రాజుగారు రావడంచేత) వినయంతో తలవాల్చి, తనవలన = తనయెడ, ప్రసన్న చిత్తుండగుట యెఱింగి = అనుకూల (అనురాగముతో కూడిన అనుట) మనస్సుకల వాడగుట తెలుసుకొని, కరకమలంబులు మొగిచి = మృదువైన చేతులు జోడించి, మొగుడు = ముడుచుకొను స్వార్థము, మొగుచు = ప్రేరణము.

తా. శర్మిష్ఠ ఇట్లా ఆలోచించుకొనుచుండగా దాని పుణ్యము మూర్తీభవించి ప్రత్యక్షమైనట్లు, ఒకనాడు యయాతి అశోక వనము చూడడానికై వస్తూ శర్మిష్ఠ ఒంటరిగా ఉండడం చూశాడు, ఆమెయు వినయముతోను తత్తరపాటుతోను తలవాల్చి, ఆ రాజు తనయెడ అనుకూల చిత్తవృత్తి కలిగియుండడం గ్రహించి, చేతులు మోడ్చి యాతనితో ఇట్లు విన్న వించెను.

వి. పూర్వ కావ్య శైలిలో వచనము దీర్ఘముగా ఏకవాక్యంగా దిద్దడం సంప్ర దాయము. ఎక్కడికక్కడ సమాపక క్రియలు వాడి చిన్నచిన్న వాక్యాలు

వ్రాయడం నేటి కాలపు శైలీ పద్ధతి. అశోకవనికాలోకన తత్పరుడై వచ్చెను అనుట ఇప్పటి పద్ధతి. నన్నయ అట్లు కాక 'వచ్చువాడు' అను తద్ధర్మార్థ కవి శేషణం ప్రయోగించి వాక్యాన్ని పొడిగించాడు. ఇట్లే అసమాపక క్రియలు మొదలైనవి వాడి వాక్యాన్ని పొడిగించి, ఏకైక సమాపక క్రియతో వాక్యం ముగించడం అదొక అందముగా పూర్వులు భావించారు. ఈ దీర్ఘ వాక్యంలోని అసమాపక క్రియా ప్రయుక్త వాక్య భాగాలు సినిమాలో రీళ్ళ లాగ ఒకటి తరువాత ఒకటి వస్తుంటాయి.

*174 ఉ. నీలగళోపమాన-ధర్మముల్ మహిన్.*

అర్థం : నీలగళోపమాన = ఈశ్వరునివంటివాడా, (చాలా గొప్ప పొగడ్త, నిగ్ర హానుగ్రహ సమర్థుడా అనుట. ఉద్యోగ పర్వంలో సంజయుడు ధర్మ రాజును ఇట్లే పొగిడాడు. కోపమును వశమునందుంచుకొనడంలో 'నీల గళునెన్న, నిన్నెన్నబోలు' అని ఎదుటివాడు పొంగిపోయేటట్లు స్తుతించాడు, నరేశ్వర = యయాతి మహారాజా! కమనీయ గుణోన్నతిఁ జెప్పఁజాలు = మనోహరమైన గుణాల్లో ప్రశంసనీయురాలు, నన్నేలిన దేవయానికి = నా యేలికయైన దేవయానికి నువ్వు భర్తవు! కావున పోలగ = చక్కగా నాకును నీవ భర్తవు = నాకుకూడా నీవే భర్తవు, భూనుత = భూజనులచే పొగడబడు వాడా, ఇది ధర్మపథంబు = ఇది ధర్మేతరమైన మార్గముకాదు, నిక్కువంబు = నిజము, ఆలును, దాసియు, సుతుడును = భార్య, దాసి, తన సంతానము-వీరందరు యజమానికి వశవర్తులనుట లోకధర్మము. అనగా గృహస్థునకు వీరందరిపై తుల్యాధి పత్యము కలదు అనుట. భార్య, దాసి ఒక శ్రేణిలోకే వస్తారేమోకాని సుతుని చేర్చుట వింతగా ఉన్నది.

తా. ఈశ్వరునితో పోల్చ దగినవాడ! ఓ యయాతిమహారాజ! సద్గుణపుంజమైన నా యేలికయైన దేవయానికి నీవు భర్తవు. కావున నాకును నీవే భర్త కాదగినవాడవు. ఇదియే తప్పక ధర్మపథము. భార్య, దాసి, కుమారుడు వీరందరు గృహస్తుని సొత్తులు. లోకంలో అంతా ఇట్లాగే వ్యవహరిస్తారు. అనగా నన్ను నీ సొంత స్త్రీగా వాడుకొనుము అనుట.

వి. నీలగళోపమాన అనడం సాభిప్రాయంగా ఉంది. పరమేశ్వరునకు ఇద్దరు దేవేరులు, పార్వతి, గంగ. అట్లే దేవయానియు, నేను అను నీ భార్యలము కాదగిన వారము అని సూచన. పార్వతీ పరిణయము ప్రసిద్ధము పరమ శివుడు గంగను ఎప్పుడు చేపట్టెనో తెలియదు.

*175. వ. అద్దేవయానిం—అయ్యయాతి ఇట్లనియె.*

అర్థం : ఆ దేవయానికీ పాణిగ్రహణం చేసినపుడే, ఆమె ధన మవడం చేత, నేనుసు, భవత్పరిగ్రహంబ=నీచే స్వీకరింపబడినదాననే, పెండ్లి యాడబడినట్లే అనుకోవాలి. నాకు ఋతుకాలోచితంబు ప్రసాదింపవలయును=భర్త సాంగత్యమును అనుగ్రహింపవలయును. అనగా సంతాన ప్రాప్తి మార్గమును కల్పించవలెను.

తా. సుగమము. ఇంటి దాసీలు అభిమానవతులయ్యీ పురుష కామమునకు బలి అయిన ఉదంతములు మధ్య యుగములలోను, మధ్య యుగ వ్యవస్థయే సాగుతూ వచ్చిన కొన్ని ఆధునిక ప్రాంతాల్లోను కూడా హృదయ విదారకములై వినవస్తాయి.

*176. క. లలితాంగి—శుక్రుడు పంచెన్*

అర్థం : సుకుమారవతివైన ఓ శర్మిష్ఠా ! శయన మెుక్కటడు వెలిగా = ఏక శయ్యాగతత్వము ఒక్కదానిని పరిహరించి, రుచిరాన్న పాన వివిధాభరణాదుల=రుచ్యములైన ఆహారములు, పానీయములు అనేక విధములైన అలంకారములు మొదలైన వాటిలో శర్మిష్ఠకు, సొలయక = వెనుదీయక ఇష్టము చేయమని శుక్రాచార్యుడు నన్నాజ్ఞాపించాడు.

తా. ఓ కోమలాంగీ, భార్యగా స్వీకరించుట ఒక్కటి మినహాగా శర్మిష్ఠకు రుచ్యములైన ఆహార పానీయములు, ఆభరణాదులు వెనుదీయకుండా ఏర్పాటు చేయమని శుక్రుడు నన్ను విధించెను. దానికి భిన్నముగా ఎట్లు చేయుదును అన్నాడు యయాతి.

అమహద్వాచకమగు శయనము అను దానికి ఒక్కడు అను మహ ద్వాచక విశేషణము వేయుట అదొక చమత్కృతి. ఈ కాలపు భాషలో ఇది వాడుకలో లేదు.

*177 వ. ఏనమ్మహాముని - శర్మిష్ఠ యిట్లనియె.*

అర్థం : ఏను=నేను, అప్పుడొడంబడితిని=దేవయాని వివాహ సందర్భమున నేను ఆ మహాముని మాటలకు అంగీకరించాను. బొంక నేర్తును=అబద్ధ మాడగలను.

తా. దేవయాని పెళ్ళి సందర్భంలో శుక్రాచార్యునికి ఇచ్చినమాట ఇప్పుడెట్లా జవదాటగలుగుతాను? అసత్యతాదోషము నన్నంటుకొంటుంది. అని యయాతి చెప్పెను. దాని మీద ఆతని భయాన్ని ప్రత్యాఖ్యానం చేస్తూ శర్మిష్ఠ ఇట్లా అంది.

*178. క. చనుబొంకగ - సమయములందున్ -*

అర్థం: ప్రాణాత్యయమున (ఆత్మ) ప్రాణము అపాయగతిలో పడినప్పుడును, సర్వధనా=సమస్త ధనము చోరాదులచే అపహరింపబడే స్థితిలోను, వధఁగా వచ్చిన విప్రార్థమున=విప్రుడు చంపబడ బోతూన్నప్పుడు, వధూజన సంగమమున=స్త్రీతో కూడునప్పుడు, వివాహ సమయము లందున్=పెళ్ళిళ్ళు కుదిర్చేటప్పుడు, నిర్వహించేటప్పుడూ, బొంక వచ్చు=అబద్ధమాడవచ్చును. అది పాపహేతువు కాబోదు అనుట.

తా. తన ప్రాణముగాని ఇతరుల ప్రాణముగాని ప్రమాద దశలో పడబోతూన్న ప్పుడు, సమస్త ధనము చోరగతమయే సందర్భంలోను, బ్రాహ్మణుడు చంపబడబోతూఁడగా, రతిక్రీడలయందు, వివాహము లందు అబద్ధమాడి ననూ అసత్యతా దోషము రాదని శర్మిష్ఠ యయాతికి ధైర్యము చెప్పెను.

వి. ఇటువంటిదే మరియొక పద్యం ఉంది.

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు
చకిత గోకులాగ్ర జన్మ రక్షణ మందు
బొంకవచ్చు నఘము పొందదధిప!

(ఆకరము జ్ఞాపకము లేదు)

నూరు అబద్ధాలాడి అయినా ఒక ఇల్లు నిలుపవలెను అనే సామెత వాడుకలో ఇప్పుడూ వుంది. ఆంగ్లంలో ఇట్లాంటిదే ఒక వాక్యము "All is fair in love and war."

శర్మిష్ఠ చాలా చురుకైన యువతి అని చెప్పక తప్పదు. "ప్రత్యుత్పన్న మతిఃస్త్రైణమ్" అని దుష్యంతుడు అన్నది ఆమె యెడ చక్కగా అన్వయిస్తుంది. యయాతి అంతవానిని మాట చమత్కారంచే బోల్తా కొట్టించింది.

*179*. వ. ఈ యేనింటి యందు- వచ్చి యిట్లనియె.

అర్థం: ఈ యేనింటియందు=ఈ యైదింటియందును, అసత్య దోషంబు లేదని మునివచన ప్రమాణంబు గలదు=మునులు చెప్పిన వాక్యములు కలవు. (ఆ ముని యెవ్వరో చెప్పక ఆమె తెలివిగా తప్పించుకొంది) పెళ్ళి సమయంలో నీవు ఆ వాగ్దానం చేశావు. పై ప్రమాణాన్ని బట్టి నిన్ను దోషము అంటదు. అసత్య దోషంబునం బొందవు=ద్వితీయకు బదులు సప్తమీ విభక్తి ప్రయోగము పూర్వ కవి ప్రయోగ వైశిష్ట్యము. ఇది వైషయిక సప్తమి. చూ.బా.వ్యా. కార-17. శర్మిష్ఠ కోరిన దానిని ప్రసాదించెను. కొడుకుంగనిన=ఆమెకు కొడుకు పుట్టగా, విస్మయపడి=ఆశ్చర్యపడి, దేవయాని శర్మిష్ఠ వద్దకు వచ్చి ఇట్లా అడిగింది.

వి. ముని వచన ప్రమాణమును శర్మిష్ఠ చెప్పకపోయినను మహాభారతంలోనే ఒకటి రెండు ఉదాహరణలు ఉన్నాయి. సత్యము గొప్పదియా, అహింస గొప్పదియా అని విచికిత్స ఏర్పడినప్పుడు మహర్షులు అహింసకే అగ్ర

స్థానం ఇచ్చారు, ప్రాణాపాయానికి దారితీసే సత్యము కూడ పాపహేతు వని వారి మతము.

*180. తే. బాలవయ్యు - చోద్యమయ్యె.*

అర్థం: సన్నుతాంగి = అందమైన శరీరం కలదానా!, బాలవయ్యు = చిన్నదాన వైనప్పటికీ, అత్యుత్తమ శీల, వినయ గౌరవాన్వితవై = ప్రశంసనీయ మైన శీలము కలిగి, వినయాధిక్యత కలిగి, నిర్వికారవృత్తినున్న నీకు = కామాది వికారములు లేక స్థిరచిత్తురాలవుగా కనబడుచున్న నీకు, ఉన్న యునికిన = ఉన్నట్లుండి అకాత్తుగా, వేవిళ్ళు మొదలైన వ్యక్త చిహ్నము లేవీ లేకుండానే, సుతుడు పుట్టుట = కొడుకు పుట్టడం మిక్కిలి చోద్యంగా ఉంది.

తా. దేవయాని ఇట్లా అన్నది: ఓ కోమలాంగీ, చిన్నదానవయ్యూ నీవు ఉత్తమశీలం కలదానవు. వినయ గౌరవమున మిన్నవు. కామాది వికార ములకు దూరంగా ఉన్నట్లు కనబడతావు. అటువంటి నీకు ఉన్నట్లుండి హఠాత్తుగా కుమారుడు జన్మించడం చాలా విడ్డూరంగా ఉంది.

వి. శర్మిష్ఠ సంతానోత్పత్తి రహస్యాన్ని నిపుణంగా బైటకులాగుటకై దేవ యాని ఆమెను విశేషంగా పొగిడింది. శర్మిష్ఠ ఉత్తమ శీలవతియని ఆమె నిజంగా నమ్మి యుండవచ్చు కూడ. భర్తృలాభమునకై తానంతగా ఆరాటపడిన దేవయాని, వృషపర్వుని కూతురికి కూడా అటువంటి కాంక్షలు ఉంటాయని అనుకోకపోవడం పెద్ద చోద్యము.

*181. వ. అది యెట్లని అడిగిన - ఉన్నంత నొక్కనాడు*

అర్థం. లజ్జావనత వదనయయి = సిగ్గుచే వాల్చబడిన ముఖము కలదై, శర్మిష్ఠ యిట్లనును = అనగా అనెను, తద్ధర్మమునందు భూతార్థము చెప్పబడలేదు. బా. వ్యా. క్రియ-5. అయినను మహాకవి వాడుటచే గ్రాహ్యమగు చున్నది. ఎందేనినుండి = ఎచ్చట నుండియో, నిఖిల వేదవేదాంగపార గుడు = సమస్త వేదవేదాంగములు చదివిన వాడు (అనగా ధర్మా ధర్మ

నిర్ణయం చేయగల మహానుభావుడు) ఒక్క మహాముని వచ్చి, ఋతు మతినై యున్న నన్ను చూచి=రజస్వలనైన నన్ను చూచి నాకు పుత్రో త్పత్తిని ప్రసాదించెను. ప్రాచీన సంఘము నందిది దోషముగా పరిగ ణింపబడి యుండదు. స్త్రీ పురుష సంబంధములందు విధి నిషేధములు అనంతర కాలముననే యెక్కువ కఠినము చేయబడెను. దేవయాని దీని కేమియు ఆక్షేపణ తెలుపక పోవుట గమనింపదగి యున్నది. ద్రుహ్వ్యాను పూరులు=ద్రుహ్యు, అను, పూరు అను ముగ్గురు కుమారులను కనెను.

తా. శర్మిష్ఠ సిగ్గుతో తలవంచి ఇట్లు చెప్పెను: నేను ఋతుమతినై యుండగా ఒక వేద వేదాంగపారగుడైన మునివచ్చి నాకు పుత్రదానము చేసెను. దేవయాని దానిని కాదనలేక వెళ్ళిపోయెను. ఆ విధమైన రహస్య సాంగ త్యముచే శర్మిష్ఠకు యయాతివలన ద్రుహ్యు, అను, పూరు అను ముగ్గురు కొడుకులు పుట్టిరి.

*182. సీ. కరువలిచేఁ దూలు - విభూతి మెఱసి.*

అర్థం. దేవయాని అయ్యుర్వీశేని కడకు=రాజైన యయాతి దగ్గరకు, ఏగుదెంచె= వచ్చెను, దేవయాని యెట్లున్నది? దేవేంద్రు దేవియబోలె = శచీదేవివలె ఎంతో వైభవముతో మెరుస్తూంది, ఆమె వెంట, కన్యలు = పరిచారికలు కావచ్చును, దనుజాధిరాజ సుతయు=దానవపతి వృషపర్వుని కూతురు శర్మిష్ఠయు ఉండిరి. యయాతి ఎట్లున్నాడు? తనముందు శర్మిష్ఠ కుమా రులు ఆడుకొనుచుండగా ప్రీతితో చూస్తున్నాడు. శర్మిష్ఠ తనయు లెట్లు న్నారు? మూడగ్నులు ప్రత్యక్షమైనట్లున్నారు=త్రేతాగ్నులవలె వెలుగు తున్నారు, త్రేతాగ్నులకును వారికిని సామ్యము. కరువలిచే దూలు కపిల జటాలి = గాలిచే ఎగురుచున్న ఎఱ్ఱజుత్తులు అగ్ని శిఖల్లా ఉన్నాయి. కనకరత్న మయజాల భూషణామల దేహదీప్తుల = బంగారంతోను రత్నాలతోను కూడిన అలంకారములచేత ప్రకాశించు దేహకాంతులే ఆ త్రేతాగ్నుల తేజస్సుగా భాసిస్తున్నాయి. ఇంకను ఆ పిల్ల లెట్లున్నారు ? ప్రవిదీప్యమానయాగ శతంబుల=దేదీప్యమానమైన నూరు యాగములచే ఆరాధింపబడిన త్రేతాగ్నులు ప్రత్యక్షమైనట్లున్నారు. అనగా మిక్కిలి

శోభాదీప్తులు కలిగి యున్నారనుట. ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని ఇవి యజమానుల ఇండ్ల యందుండు మూడగ్నులు.

తా. పట్టపుదేవియైన దేవయాని శచీదేవిని పోలి పెద్ద వైభవముతో, పరిచారికలును, శర్మిష్ఠయు వెంటరాగా యయాతి దగ్గరకు వచ్చెను. అతడు శర్మిష్ఠ ముగ్గురు కొడుకులు తనముందు ఆడుకొనుచుండగా చూచుచుండెను. ఆ పిల్లలు త్రేతాగ్నులవలె ఉండిరి. గాలిచే కదలు ఎర్రజుత్తులు అగ్ని శిఖలుగా ఉన్నాయి. బంగారము, రత్నములతో కూడిన భూషణములు ధరించిన వారి దేహకాంతులు అగ్నుల తేజస్సులుగా కనబడుతున్నాయి. దీప్తిమంతములై నూరు యాగాలచే వేల్చబడిన మూడగ్నుల్లా ప్రకాశిస్తున్నారు ఆ బాలకులు.

వి. అయ్యుర్వీశేని = మిశ్రసమాసమగుటచే 'ఉర్వీ' శబ్దము దీర్ఘమును పోగొట్టుకొన్నది. ఉర్వీపతి వంటి తత్సమ సమాసములలో దీర్ఘం నిలుస్తుంది. నన్నయభట్టారకుడు వేదజ్ఞుడగుటచే అగ్నివర్ణన సందర్భమున 'రత్నమయజాల' అని స్మరించినాడు. 'అగ్నిమీడే పురోహితమ్' అనే ఋక్కులోని 'రత్నధాతమమ్' అను ఉపమానము ఆయన మనోనేత్రం ముందు ప్రత్యక్షమై యుంటుంది.

*183. వ. ఇట్లరుగుదెంచి-యక్కుమారుల నడిగిన.*

అర్థం. అరుగుదెంచి=వచ్చి, బా. వ్యా. క్రియ-111. అధిక తేజస్వులయి= మిక్కిలి దీప్తికలవారై, ప్రతిబింబంబులు బోని = ప్రతిబింబాలుగా కనబడుతున్న, ప్రతిరూపాలుగా ఉన్న, ఎక్కడివారు = ఈ పిల్లలెవరి సంతానము, అలబ్ధప్రతివచనయై-సమాధానమునుపొందలేక-బహుబ్రీహి.

తా. దేవయాని అట్లు వైభవంతో వచ్చి, మిక్కిలి తేజస్సుకలవారై యయాతి ప్రతిరూపాలుగా ఉన్న ఆ బాలకులను చూచి, వీరెవరి కుమారులు, ఇక్కడికి ఎట్లు వచ్చినారు అని యయాతిని నిలదీసి అడిగింది. కాని ప్రతి సమాధానం పొందలేకపోయింది. చివరకు మీ తల్లిదండ్రు లెవరని ఆ పిల్లవాండ్రనే ప్రశ్నించింది.

పోని=పోలి, నకారలకారములు కొన్నిచోట్ల వ్యత్యయం పొందుతుం టాయి, మునగ=ములగ, శనగ=సెలగ.

*184. క. తరుణ ప్రదేశినులు–కన్యకానివహంబున్.*

అర్థం. తరుణప్రదేశినులు=లేతవైన చూపుడువ్రేళ్ళు, మాసరముగ=పొడుగు చేసి. ఆ బాలకులు, తల్లియు, తండ్రియు అని యయాతి శర్మిష్ఠలను చూపెట్టిరి. కన్యకానివహంబును=పరిచారికలందరును, అనురాగిల్లె=అనురాగము నొందిరి, సంబరపడిరి, అనురాగము + ఇల్లు=అనురాగిల్లు, అకర్మకము. బా. వ్యా. క్రియ-71.

తా. ఆ చిన్నపిల్లలు తమ లేత చూపుడువ్రేళ్ల చాచి యయాతి, శర్మిష్ఠ తమ తండ్రి, తల్లి అని చూపెట్టిరి. వెంటఉన్న కన్యకాజనమంతా చాలా సంతోషించారు. అనురాగంతో చూశారు.

*185. వ. ఇట్లు దన్నెఱుంగకుండ–యప్పుడెఱింగె.*

అర్థం. తన్నెఱుంగకుండ–తానెఱుంగకుండ అని యున్న బాగుండెడిది. మూల పాఠమునుబట్టి తన శక్తిసామర్థ్యములు (అనగా తాను శుక్రాచార్యునంత వాని కుమార్తె యగుట ఉపేక్షించి యను అర్థము రావచ్చును.) ఇంతే కాక తనకు సంతానము లేదను లోపమును లేదు. తాను ఇద్దరు కుమారుల తల్లి. అందుచేత తాను సంతానార్థియయి ఇట్లు చేసితిననుటయు చెల్లదు. లబ్ధసంతానుండగుట=పొందబడిన కుమారులు కలవాడగుట. అప్పు డెఱింగి=అప్పుడే మొదటిమాటు నిశ్చితముగ తెలుసుకొని.

తా. సుగమము. శర్మిష్ఠ యయాతుల రహస్య ప్రణయము ఇంతకాలము తెలియ రాకుండ సాగుటకు కన్యకా సహస్రంబును తోడ్పడి యుండవలెను. వారికి దేవయాని మీద స్వామిని యను సానుభూతి లేదనుట తెల్లము.

*186. వ. పతివిహితానురాగమున—పదాబ్జయుగ్మమున్.*

అర్థం. భార్గవ పుత్త్రి=శుక్రుని కుమార్తె అయిన దేవయాని, పతివిహితాను రాగమున = భర్తయైన వ్యక్తి ధర్మపత్నియందు ఉంచవలసిన ప్రేమ

విషయమై (లేదా భర్త అన్యస్త్రీయందు చూపిన ప్రణయం చేత) యయాతి చేతవంచింపబడినదై, వాఁడు=యయాతి, దానవికి చేసిన నెయ్యమెఱింగి= వృషపర్వుని కుమార్తెతో జరిపిన రహస్య ప్రణయము తెలుసుకొని, ఈ కాలపు భాషలో షష్ఠి కాక తృతీయా ప్రత్యయం వాడుతాము. దానవికి=దానవితో, కోపదుఃఖితయయి=కోపము దుఃఖము పెనవేసిబాధింపగా, తండ్రి పాలికతిఖేదము నంజని = మిక్కిలి దుఃఖముతో తండ్రియైన శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి, తదీయ పదాబ్జ యుగ్మమున్=అతని పాద కమలములను, దీర్ఘ నేత్రనిర్గత జలధారలం గడిగె=వాల్గన్నులనుండి వెడలు కన్నీటితో కడిగెను. అనగా రోదించెను.

తా. దేవయాని తన భర్తయైన యయాతిచేత భార్యానురాగం విషయంలో మోసగింపబడినదై, అతడు దానవరాజ కుమార్తెతో చేసిన రహస్య ప్రణయం తెలుసుకొని కోపంతోను, దుఃఖంతోను తండ్రి వద్దకు వెళ్ళి అయన పాదయుగ్మమును తన కన్నీటిధారతో కడిగింది.

## శుక్రుడు యయాతికి శాపంబిచ్చుట

*187. వ. అయ్యయాతియు—శుక్రునకిట్లనియె.*

అర్థ.ం దానింబట్టుపఱచుచు = సమాధానపరుస్తూ, బ్రతిమాలుతూ అనుట, తోడన చని=దేవయానితోనే పోయి, గద్గదవచనయై=దుఃఖజలంతో నిండిన మాటలుకలదై, అధర్మంబున ధర్మంబు గీడ్పఱిచి = అధర్మ ప్రవర్తనచే ధర్మహాని కలిగించి, ఆసురంబున నాసురియందను రక్తుండై = రాక్షస ప్రవృత్తితో దానవ సుందరియందు (శర్మిష్ఠ యందు) అధర్మకామము అసురప్రవృత్తి యనుట. చూడు దైవాసుర సంపద్విభాగయోగము- భగవద్గీత. పుత్ర త్రయంబు=ముగ్గురు కుమారులను పొంది, యయాతికలిగి=యయాతిపై కోపించి, పంచమీ స్థానమున షష్ఠి. రాగాంధుడవై =కామముచేత గ్రుడ్డివాడవై, నా కూఁతునకు అప్రియంబు=నా కుమార్తెకు అన్యాయం చేశావు. జరాభారపీడితుండవు కమ్మని=ముసలితనం చేత క్రుంగిపోయిన వాడవు అగుమని. శాపంబిచ్చిన=శాపమివ్వగా.

తా. యయాతి దేవయానిని సమాధానపరుస్తూ బ్రతిమాలుతూ, దానివెంటవెళ్ళి శుక్రాచార్యునకు నమస్కారం చేశాడు. దేవయాని ఏడుపు గొంతుతో ఈ రాజు అసురప్రవృత్తికి లొంగి దానవియైన శర్మిష్ఠయందు అనురాగముకలవాడై ఆమెయందు ముగ్గురు కొడుకులను పడసి నాకవమానం చేశాడని ఫిర్యాదు చేసింది. ఆ మునియు యయాతిపై కోపించి, యౌవన గర్వంచేత నా కుమార్తెకు అహితం చేశావు గనుక అకాలంగా ముసలితనముచేత బాధితుడవు అవుదువు గాక అని శాపం ఇచ్చాడు. అంత యయాతి శుక్రునితో ఇట్లన్నాడు.

వి. ఆసురంబు - ఆసురి - యమక స్ఫురణ. యౌవన గర్వంబున అనుటచే యయాతి వయసు మళ్ళినవాడు కాడని తెలుస్తూంది.

*188 క. ఋతుమతియై - అగునంద్రు బుధుల్*

అర్థం : ఋతుమతియై=రజస్వలయై, పుత్రార్థము=సంతానవాంఛతో, భర్తను కోరిన భార్యయందు, ప్రతికూలుడై = విముఖుడై ఆమెకు సంతాన యోగము లేకుండా చేసిన పురుషునకు, గర్భస్థ శిశువును చంపిన పాపం కలుగుతుందని విజ్ఞులైన పెద్దలంటారు.

తా. నెలవరుసకాని, మరొకలాకాని రజస్వలయై భర్త సమాగమాన్ని కాంక్షించే స్త్రీకి ప్రతికూలుడై, ఆమె సంతాన ప్రాప్తియోగ్యతను వ్యర్థంచేసిన పురుషునకు గర్భస్థ పిండాన్ని నిర్మూలించిన పాపం వస్తుందని విజ్ఞులైన పెద్దలు చెబుతారు అని యయాతి తన చర్యను సమర్థించుకున్నాడు.

వి. శర్మిష్ఠను యయాతి భార్యగా చెప్పడం ఋజువుగాలేదు. ఆమె తన భార్య పరిచారికయే కాని ప్రత్యక్షంగా భార్యకాదు. క్షత్రియులకు గాంధర్వ వివాహ పద్ధతి శాస్త్రసమ్మతం గనుక దీనిని గాంధర్వంగా సమర్థించుకోవాలి. ఆలు, దాసి, తనయుడు ఒక శ్రేణి వారని శర్మిష్ఠ (174 పద్యంలో) సమర్థించింది. ఋతుమతియైన భార్య విషయంలో భర్త బాధ్యతను గూర్చి రఘువంశంలో భంగ్యంతరంగా ప్రస్తావింపబడింది. దిలీప మహారాజుకు సంతానం ఎందుకు లేకపోయిందని ప్రస్తావన రాగా, కుల

గురువైన వసిష్ఠులవారు ఇట్లా అన్నారట: నీవు ఒకనాడు స్వర్గాన్నించివస్తూ సుదక్షిణాదేవి ఋతుస్నాతయని తొందరపడుతూ, సమీపంలో ఉన్న కామధేనువును ఆరాధించకుండా వచ్చావు. ఇది పూజ్య పూజావ్యతిక్రమం గనుక, కామధేనువు కినుక వహించింది. దానిచే మీకు సంతానం కలుగడం లేదు. కామధేనువును సంతుష్ట పరచడానికై దాని కూతురైన నందినీ ధేనువును ఆరాధించుము అని వసిష్ఠ మహర్షి చెప్పెనట. అందుచేతనే దిలీపమహారాజు నందినీ ధేనువును సేవించాడు. ఇవన్నీ బూజుపట్టిన పాతపురాణాలని ఆధునికులు కొందరుత్రోసిపుచ్చుతారు, లైంగిక సమస్య లను కూడా రాగరహితముగా, మన స్తత్వ శాస్త్రపద్ధతిపై ఆలోచించవలసిన అవసరం లేకపోలేదు.

భ్రూణహత్య (Destruction of Embryo Abortion గర్భ స్రావము) కేవల కామ సంతృప్తికై కొందరు ఆధునికులు సమర్థిస్తున్నారు. మహర్షిణీ సదృశురాలైన Mother Theresa గారు గర్భస్రావము పాపమని ఉద్ఘోషిస్తూంది. ఆమెను వడిలిపోయిన ముసలి వనిత అని కొట్టి పారవేయగలమా! యయాతి చెప్పిన దానిలో కొంత సత్యము లేకపోలేదు. అతడు యౌవనంలో ఉన్నవాడవడంచేత అతని చర్యలో రాగాంధత్వ మునూ లేకపోలేదు.

*189. క. దానికి భీతుడనై-దివ్యమునీంద్రా.*

అర్థం: దివ్యమునీంద్రా=దేవతా సన్నిభుడవైన ఓ మహర్షీ!, దానికి భీతుడనై= ఋతు విఫలత్వం చేసి భ్రూణహత్యా పాపమునకు గురి అవుతానని, భీతు డనై=భయపడినవాడనై, అమ్మానవతీ ప్రార్థనన్=అభిమానవతియైన శర్మిష్ఠ కోరిక మీద, క్రమంబొనరగ=వరుసగా, సంతానము పొంది తిని, ఎదలో దీనికి అలుగంగదగునె=మనస్సులో మీరు దీనికై నామీద కోపింపదగునా అని యయాతి విన్నవించాడు.

తా. దేవసన్నిభుడవైన ఓ మహర్షి సత్తమా!, భ్రూణహత్యా పాపానికి వెరచి, మానవతియైన శర్మిష్ఠ కోరిక తీర్చి సంతానము పొందాను. దీనికై మీరు నాపై ఆగ్రహించడం న్యాయమా, అన్నాడు.

వి. దీనిలో ఒక్క లోపం కనబడుతూంది. కేవల సంతానోత్పత్తియే యయాతి లక్ష్యమైనచో ఒక్క కుమారునితో ఆతడు శర్మిష్ఠ ప్రణయాన్ని విరమించవలసి ఉండెను. దిలీప మహారాజు ఒక్క కొడుకుతో, రఘు మహారాజు వుట్టుకతో 'ప్రజాయై గృహమేధినామ్' అను సూర్య వంశపు రాజుల ఆదర్శాన్ని చక్కగా పాటించాడు. యయాతి అట్లు చేయలేదు.

*190. వ. ఏ నిద్దేవయానియందు- దాల్చిన వానికి.*

అర్థం: విషయోపభోగ తృప్తుండఁగామ=విషయ సుఖములు అనుభవించడంతో తృప్తి పొందలేను, జరాభారంబు దాల్పనోపను=ముసలితనాన్ని భరింప లేను, ఓపు = సహించు, వానికి కరుణించి = వానిపై దయతలచి, అట్లేని=అట్లయినచో, నీ ముదిమి=నీ ముసలితనాన్ని, ముదియు ధాతువు. ఒక్కరుని పయింబెట్టి=నీ కొడుకులలో ఒకనికి నీ ముసలితనమిచ్చి, వాని జవ్వనంబు=వాని యౌవనాన్ని, యౌవనము=తద్భవము-జవ్వ నము అనగా పడుచుదనాన్ని, విషయోపభోగ తృప్తుండవైన మఱి= ఇంద్రియ సుఖములతో సంతుష్టడవైన తర్వాత, నీ ముదిమి నీవతాల్చి= నీ ముసలితనాన్ని తిరిగి నువ్వే పుచ్చుకొని, తాల్చు=ధరించు, వానికి నిచ్చునది=వాని యౌవనం వానికి ఇచ్చివేయవలెను. నీ ముదిమి తాల్చిన పుత్రుండ=నీ ముదుసలితనం కొంతకాలం ధరించిన కొడుకే. బా.వ్యా. సమాస-26. వంశకర్తయునగు = వంశానికి మూలపురుషుడవుతాడు, వీడ్కొని=సెలవు తీసుకొని, శుక్రు శాపంబున జరాభారంబు దాల్చిన= శుక్రుని శాపముచే యయాతి అకాలంలో ముసలివాడయాడు. వార్ధక్య చిహ్నాలు అతన్ని ఆవరించాయి.

తా. యయాతి శుక్రాచార్యునితో ఇట్లా విజ్ఞాపన చేశాడు: నేను దేవయానితో ఇంద్రియ సుఖతృప్తుడను కాలేదు. ముసలితనం దాల్చలేను. అనగా అనుభవజ్ఞుడును, కరుణాళువును ఆ మహర్షి ఒక ఉపాయం సూచించాడు. నీ ముసలితనాన్ని నీ కొడుకులలో ఒకనికిచ్చి, వాని యౌవనం నువ్వు ధరించి, విషయసుఖములనుభవించి తరువాత మళ్ళీ వాని పడుచుదనం వాడికి ఇచ్చివేయునది. ఆ విధంగా నీ వార్ధక్యాన్ని ధరించిన కొడుకే

రాజ్యార్హుడయి, వంశకర్త కూడా అవుతాడు, అని శాప ప్రతిక్రియ చెప్పాడు. యయాతి ఆ మహర్షి సెలవు తీసుకొని స్వరాజ్యానికి వెళ్ళి పోయాడు. ఇంతలో శుక్రశాపం చేత వార్ధక్యం అతన్ని ఆవరించింది.

వి. సులభ వచన శైలికి మంచి యుదాహరణము. పడుచుదనము – ముసలి తనము–వీటి అన్యోన్య వినిమయ ప్రక్రియ మన మెరుగము. ధన్వంతరు లకే తెలియాలి. ఇక్కడ శుక్రాచార్యుని పాత్ర ప్రశంసనీయంగానే ఉంది. తన కూతురికి అన్యాయం జరిగిందని మొదట కోపగించి, యయాతిని శపించినప్పటికీ, ఆలోచన మీద యయాతి ప్రవర్తన కేవలము గర్హ్యము కాదని ధర్మకాముడైన శుక్రుడు తలచి ఉంటాడు. ''ప్రకృతిం యాంతి భూతాని-నిగ్రహః కిం కరిష్యతి'' అను గీతా వాక్యము నందలి పరమార్థ మును ఆయన అనుభవ మహితుడగుటచే, పైకి చెప్పకపోయినా అంగీక రించాడు. మానవు లందరు నిష్ఠాపరులు కాలేరు. ప్రకృతి బలీయమై వారిచే ధర్మాధర్మములు చేయిస్తూ ఉంటుంది. తన కుమార్తెకు అవమా నము జరిగినా శుక్రుడు ప్రతీకారదీక్షను పూన లేదు.

ఇంకొక విశేష మేమన, యయాతి అనంతరం రాజ్యార్హత తన దౌహి త్రునికే అనగా దేవయాని కొడుకులైన యదుతుర్వసులలో ఒకనికి చెందా లని ఆ మహర్షి విధించలేదు. నిష్పక్షపాత బుద్ధియై, యయాతి వార్ధక్యం ధరించి త్యాగం చేసిన కొడుకుకే చెందాలని వచించడం ఆయన ధర్మ పక్షపాత బుద్ధికి నిదర్శనము. శుక్రాచార్యుడు సురాపాన నిషేధ శాసనం చేతనూ, ఇప్పుడు యయాతి వంశకర్త నిర్ణయ విషయంలోను తన ధర్మ కామత్వాన్ని నిరూపించుకొని అభ్యర్హితుడవుతున్నాడు.

*191. క. తలవడకఁ దొడఁగె—దరికొనుదెంచెన్.*

అర్థం. యయాతికి వార్ధక్య చిహ్నాలన్నీ కనిపించాయి. తలవడక దొడగె = తల వణుకు మొదలు పెట్టింది, గర్వమడంగె = ఇంద్రియాలు తమ తమ పటుత్వాన్ని పోగొట్టుకున్నాయి. అంగములు వదలె= శైథిల్యం వచ్చింది. వళీపలితంబులయ్యె = ముడుతలు పడ్డాయి, తెల్ల వెంట్రుకలు లేచాయి.

ద్వంద్వ సమాసము. వగరు=ఉబ్బసము, తలయేరును=తలనొప్పి, ఉక్కసము=పొడిదగ్గు, దరికొనుదెంచెన్=దాపురించాయి, దరికొను= సమీపించు. తెంచు అనుబంధము. బా. వ్యా. క్రియ-110.

తా. శుక్రుని శాపమున వార్ధక్యము ఆవహించగానే యయాతికి తల వణకడం మొదలుపెట్టింది. ఇంద్రియముల పటిమ తగ్గింది. అవయవములు శ్లథము లయాయి. వ్రేలాడ జొచ్చినవి అనుట. బింకం తగ్గినాయి-ముడుతలు, తెల్ల వెంట్రుకలు పొడచూపాయి. రకరకాల దగ్గులు, తలనొప్పి మొద లైన వార్ధక్య చిహ్నాలన్నీ అతన్ని ఆవరించాయి.

యయాతి యదు ప్రముఖులకు శాపం ఇచ్చుట

*192. వ. ఇట్లు జరాక్రాంతుండై - తండ్రి కిట్లనిరి.*

అర్థం. జరాక్రాంతుండైన=ముసలితనానికి వశుడైన, నాకు విషయ సంతృప్తి లేకున్నయది=నాకు ఇంద్రియ సుఖముల విషయమై ఇంకను తృప్తి కలగడంలేదు. ఉన్నది, ఉన్న యది రెండు రూపములు, ఒక్కరుండు= ఒకడు, నా ముదిమి=నా వార్ధక్యమును పుచ్చుకొని, అనగా పెద్దవాళ్లైన యదు, తుర్వసు, ద్రుహ్యు, అనులు.

తా. ముదిమిచేత ఆక్రమింపబడినవాడై యయాతి తన కొడుకుల్ని అందరిని పిలిపించి, నాకు ఇంద్రియ సుఖాలతో ఇంకా తృప్తి కలగలేదు. కావున మీలో ఒకరు నా ముసలితనం చేకొని తన యౌవనం నాకు ఇవ్వవలెను- అని కోరాడు.

వచ్చు ధాతువునుండి రప్పించు, రావించు ప్రేరణార్థక రూపాలు.

*193. ఆ. తగిలి జరయు — యెట్టి శుమతులైన.*

అర్థం: జరయు=ముసలితనమున్నూ, రుజయు=రోగమున్నూ, తగిలి=అని వార్యములై, దైవవశంబున = కాలవశంచేతగాని, దైవవశంచేతగాని

అయ్యేనేని=ప్రాప్తించినట్లయితే, అనుభవింత్రుగాక=తప్పించుకోడానికి వీలులేకపోవడంచేత అనుభవిస్తారుకాని, ఎట్టి కుమతులైన=ఎంత మంద బుద్ధులయినా, తెలిసి తెలిసి కావాలని పూనుకొని వాటిని (ముసలి తనాన్ని, రోగాన్ని) చేకొందురయ్య=ఆహ్వానించి మీదవేసుకుంటారా? వేసుకొనరు అనుట.

తా. నాయనగారూ! వార్ధక్యము, రోగము దైవవశంచేత ప్రాప్తిస్తే తప్పించు కోలేక ఎవరైనా అనుభవిస్తారు కాని, ఎంత మందబుద్ధులైనా కావాలని వాటిని ఆహ్వానించి నెత్తిన వేసుకుంటారా ?

కుమతి అంటే వక్రబుద్ధి అని ఇప్పుడు చెప్పుకుంటున్నాము. నన్నయ కాలంలో అంత తీవ్రమైన అర్థంలేక పోవచ్చును. తెలివి తక్కువ వాడు అనే భావంలో కవి వాడాడు.

*194. క. నరలుగల- భోగబాహ్యుడకాడే.*

అర్థం. నరలుగల = తెల్లి వెంట్రుకలుగల, నెరసిన జుట్టు మొదలైనవికల, కామునైనను=మన్మథుణ్ణి అయినా, తరుణులు = యువతులు, డాయ రోయుదురు=సమీపించడానికి అసహ్యించుకుంటారు. పురుషుడు = మగవాడు, ధనపతియయ్యున్=కుబేరుడైనా సరే, దుర్వార జరాపరి భూతిన్=వారింపరాని ముసలితనంచేత పరిభవింపబడినవాడై, అనగా జరాపరిభవంచేత, అభీష్టభోగ బాహ్యుడకాడే = ఇష్టభోగాలకు వెలి అవుతాడు కదా.

తా. జుట్టు నెరసిన మన్మథుణ్ణైనా పడుచు ఆడవాళ్ళు సమీపించడానికి రోత పడతారు. కుబేరుడైనాసరే (అంటే ధనమున్నంత మాత్రాన) మగ వాడు ముసలితనంచేత ఆక్రమింపబడితే భోగాలకు దూరం అవుతాడు.

వారకాంతల విషయంలో ఇది వ్యత్యస్తమని 'కొక్కోకమెల్ల చదివిన' అనే పద్యంలో సుమతీ శతకకారుడు చమత్కరించాడు.

*195*. వ. అని యొడంబడకున్న — ఆ రాజున కిట్లనిరి.

అర్థం. ఒడంబడకున్న = అంగీకరింపకపోగా, యయాతి కోపించి, యదువంశం బునవారు = యదువంశం వారు అనుట చాలియుండగా 'వంశంబునవారు' విశేష ప్రయోగము అధికరణార్థమున 'న' కారము. అయోగ్యులుగా = రాజ్యార్హతలేనివారుగా. శ్రీకృష్ణుడు యాదవుడగుటచేతనే రాజ్యార్హత లేకపోయెను. తుర్వసువంశంబునవారు = తుర్వసు వంశంవారు, ధర్మాధర్మ వివేకంలేనివారై, సంకీర్ణ వర్ణ కిరాతులకు రాజులుగా = కిరాతజాతులకు ప్రభువులగునట్లు, ద్రుహ్యువంశంబున వారు = ద్రుహ్యు డనువాని వంశంవారు, ఉడుప, ప్లవ సంతార్యంబైన దేశంబునకు = తెప్పమానులు, దోనెలు మొదలగు వాటి సహాయంతో దాటదగిన దేశ ములకు రాజులై (అనగా చిన్న చిన్న దీవులై ఒక దానినుండి మరొక దానికి తెప్పలమీద వెళ్ళవలసి యుండుననుట. జలప్రాయములైన దేశము. అనూపమనియు అందురు. 'జలప్రాయమనూపం స్యాత్' నిఘం.) జరాదూషకుండగుట = వార్ధక్యమును నిందించి యౌవనాహం కారం చూపినవాడవడం చేత 'అను' వాని వంశీయులు, ముదియు నంతకు నుండక = పెద్ద వయస్సుదాకా బ్రతుకక, అర్ధాయుష్కులై, జవ్వనంబునన = యౌవనములోనే, పంచత్వంబున కరుగువారు నుంగా = మరణమును పొందువారునుగా, (దేహి మరణానంతరము అయా శరీర శక్తులు పంచభూతములలో కలిసిపోవునని మనవారు భావింతురు. 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' అనే గేయంలో గురజాడ అప్పా రావుగారు పూర్ణమ్మ కన్నులు కలువలలో కలిసాయని కరుణాత్మకంగా వ్రాశారు. శాపంబిచ్చి, (ముసలితనము దేహదృష్ట్యా బాధాకరమైనది అయినప్పటికీ పండిన అనుభవంచేత సమ్మానార్హమే అవుతూంది. పాపీ చిరాయుః సుకృతీ గతాయుః అన్నది సార్వజనిక సత్యంకాదనుట) ఆ నలువురకుం గొండుకవాని = యదు, తుర్వసు, ద్రుహ్యు, అను వారలకంటె చిన్నవాడైన, శర్మిష్ఠా పుత్రు పూరుంబిలిచి = శర్మిష్ఠ కొడుకు పూరు అనే వానిని పిలిచి, అడిగిన తండ్రి కోరినయట్లే చేసిన, యయాతి నవ యౌవనుండై = యయాతి లబ్ధయౌవనుడై, అభిమత

సుఖంబులు = ఇష్టోప భోగములు, సహస్రవర్షంబు లనుభవించి = వెయ్యి ఏండ్లు అనుభవించి, తృప్తుడై= ఇంద్రియ సుఖాలతో తృప్తి పొందినవాడై, పూరు జవ్వనంబు వానికయిచ్చి = పూరుని యవ్వనాన్ని తిరిగి వానికే వప్పచెప్పి, తన జరాభారంబు తానదాల్చి=తనముదిమిని మళ్ళీ తానే కైకొని, నిజాజ్ఞా విధేయ - చతురంత మహీతల - బ్రహ్మ క్షత్రాది వర్ణ ముఖ్యులనెల్ల రావించి=తన యాజ్ఞకు లోనయిన నేల నాలుగు చెరగుల సర్వవర్ణ ప్రముఖులను రావించి (తూర్పు చాళుక్య వంశపు రాజుల శాసనాల్లో ఇటువంటి సమావేశాలు వినవస్తాయి, నన్నయ రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి కదా) మంత్రి, పురోహిత, సామంత, పౌరజన సమక్షంబున=ఉద్యోగి వర్గం వారిని, పౌరజనులను కూడా పిలవడం ఆ కాలపు రాజులు కేవల నిరంకుశ ప్రభువులు కారన డానికి నిదర్శనము, ఉద్యోగి వర్గం వారిని (బహుశా బ్రాహ్మణులే కావచ్చును) నైయోగికులు అనేవారు, ఆంధ్ర బ్రాహ్మణులలో వినవచ్చు రెండు ప్రధాన శాఖలు-నియోగి, వైదిక-అనునవి తూర్పు చాళుక్యుల కాలము నుండియే ఏర్పడి ఉండవచ్చునని కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిరి. ప్రభువుల సేవలో నియుక్తులైనవారు నియోగులు-వీరు మంత్రి, దండనాథాది ఉద్యోగములలో నియుక్తులు అవుతూ వచ్చారు. అందుచేతనే నియోగులైన వంశములలో పుట్టిన కవులు మంత్రి, అమాత్య మొదలగు ఉపనామములు ధరిస్తూ ఉండిరి. సకలక్షోణీ చక్రంబునకు=తన అధీనములో ఉన్న సమస్త రాజ్యానికి, పూరునభి షిక్తుంజేసిన=పూరుడు అను కడసారపు కొడుకును రాజుగా అభిషేకించగా, సర్వ ప్రకృతి జనంబులు=బ్రహ్మ క్షత్రాది అన్ని వర్ణాలకు చెందిన జననాయకులు యయాతితో ఇట్లు అన్నారు.

తా. కుమారులలో పెద్దవారైన యదు, తుర్వసు, ద్రుహ్యు అను అనే నామధేయాలు కలవారు తండ్రి కోరికను తిరస్కరించగా, యయాతి వారి అవిధేయతకు కోపించి, వారు తన రాజ్యానికి వారసులు కాకుండునట్లుగాను మరి యితర విధముల ఆ నలుగుర్ని శపించాడు, శర్మిష్ఠ కడపటి కొడుకైన పూరు అనువాడు బుద్ధిమంతుడై తండ్రి కోరికను మన్నించి తన యౌవనం తండ్రికిచ్చి, ఆతని జరాభారాన్ని తాను వహించాడు.

యయాతి మహారాజు ఈ విధంగా రెండవ యౌవనం పొంది చిరకాలం ఇంద్రియ సుఖాలు అనుభవించి, తృప్తుడై వానప్రస్థానికి పోదలచాడు. పూరుని యౌవనం అతనికే ఇచ్చివేసి తాను ముదిమి తిరిగి స్వీకరించాడు. అంత తన యేలుబడిలో ఉన్న సర్వ సామ్రాజ్య మందలి చాతుర్వర్ణ్య ప్రముఖులను రావించి, వారి సమక్షంలో పూరును రాజ్యాభిషిక్తుని చేశాడు. అప్పుడు సమావిష్టులైన ప్రకృతి జనంబుల ప్రతినిధులు యయాతితో ఇట్లా విజ్ఞాపన చేశారు.

వి. యయాతి కథలో ప్రసక్తమైన రాజరికపు పద్ధతి తూర్పు చాళుక్య వంశీయుల కాలములో అమలులో ఉన్న విధానమే. దీని విషయమై విశేష జ్ఞానమునకై నేలటూరి వెంకటరమణయ్యగారు, శ్రీ భావరాజు వెంకట కృష్ణరావుగారు మున్నగు చారిత్రకులు వ్రాసిన గ్రంథాలు చూడవచ్చును.

*196.* మ. అవిచారంబని— జఘన్యాత్మజున్.

అర్థం. ధర్మాభిజ్ఞ = సర్వధర్మాలు తెలిసిన ఓ యయాతి మహారాజా! అవిచారంబని = నీకు ప్రత్యాఖ్యానం చేయగలవారము కాము, నీకన్న ఎక్కువ తెలిసినవారము కాము అనే శంకతో, పల్కనోడెదము = చెప్పడానికి వెనుదీస్తున్నాము. కాని నీ యగ్రనందనుడు = నీ పెద్దకొడుకు (జ్యేష్ఠ పుత్రుడే రాజార్హుడగుట ప్రాచీన కాలంనుంచీ వస్తూన్న ఆచారము), అత్యున్నత శక్తియుక్తుడు = మహా బలశాలి, సమర్థుడు- జ్యేష్ఠపుత్రుడు ఏ కారణం చేతనైనా భూపరిపాలనకు అనర్హుడైతే వానిని తప్పించుట కూడ ప్రాచీన మర్యాదయే. ధృతరాష్ట్ర పాండురాజులలో ఎవరిని అభిషిక్తుని చెయ్యాలి అనే సమస్య ఆ కాలంలో ఏర్పడినదని తెలుస్తుంది. మహీభార ప్రగల్భుండు = భూ భారం వహించడానికి ప్రాగల్భ్యం కలవాడు, అంతేకాక, మహర్షి శుక్రాచార్యుని మనుమడు, పాత్రుడు = యోగ్యుడు, లోకఖ్యాతుడు = ప్రజానీకంలో ప్రసిద్ధిచెందినవాడు (అనగా ఇతడు రాజవడం ప్రజలందరికి సమ్మతమనుట) ఈ యదుడు ఉండగా, వానిని త్రోసి రాజని, భువనేశత్వ భరంబు = భూ భారం వహించే కార్యాన్ని, జఘన్యాత్మజున్ = కేవలం చిన్నవాడైన, పూరున్ = పూరుని, పూన్పదగునే =

పూరునిపై పెట్టవచ్చునా? అనుభవ శూన్యుడైన యువకుని రాజును చేసి నట్లు అవుతుంది. అసమర్థుడు రాజైతే అరాచకమేర్పడి, బాధలనొంద వలసినవారు ప్రజలే అవుతారు కదా అనుట- 'రాజానం ప్రథమం విన్ద్యాత్- తతోభార్యాం- తతోధనమ్' అని మహాభారతంలో ఏకచక్ర పురవాసియై, బకునికి ఆహారంగా పోవలసిన వంతు వచ్చిన బ్రాహ్మణుడు విచారిస్తాడు.

జఘన్య శబ్దానికి అర్థవైన్యం ఉంటె కాని ఇక్కడ బాలుడు, కడపటివాడు అనే సామాన్యార్థమే చెప్పుకోవాలి. భార్గవ దౌహిత్రుడనడం చేత వృష పర్వుని దౌహిత్రుని కంటె తల్లి మూలంగా అగ్రవర్ణజుడు అనే భావం దూరదూరంగా వ్యజ్యమాన మవుతూంది. కాని శుక్రాచార్యుడు స్వయంగా దీనిని కోరలేదు. ఆయన నిష్పక్షపాత బుద్ధిని ఇదివరలో పరామర్శించు కున్నాము.

తా. ఓ మహారాజా, ధర్మాధర్మ నిర్ణయంలో నీ కన్న యెక్కువ తెలిసిన వారము కామని చెప్పడానికి సందేహిస్తున్నాము కాని నీ పెద్దకొడుకైన యదువు సర్వవిధములా రాజ్యార్హుడు. అటువంటి పాత్రుని కాదని కేవలం పిన్నవాడు, అనుభవ శూన్యుడు అయిన పూరునిపై రాజ్యభారం పెట్టడం ఉచితమా అని ప్రజాప్రముఖులు అన్నారు.

*197* వ. *అనినవారలకయ్యయాతి యిట్లనియె.*

*198* క. *యదుడగ్రతనూజుడు-కృతావమానుండయ్యెన్.*

అర్థం. యదుడు అగ్రతనూజుడు = పెద్దకొడుకు, తండ్రికి పెద్దకొడుకు, తల్లికి కడసారం సంతానము ప్రియతములని లోకంలో నానుడి ఉన్నది. నా హృదయ సముద్భవుడు = నా హృదయానికి చాలా సన్నిహితుడు, తానయిన=అట్లయినప్పటికీ- తానైనా నా కోర్కె తీర్పవలసి ఉండెను. మద్వచనంబిదియేటిది యని = నా మాటను గౌరవంతో మన్నింపక, ఇదేమి కోరిక అని, కడుదుర్మదుడై = మదాంధుడై, నా మాట పాటింపక, కృతావమానుండయ్యెన్ = అవమానింపబడినవాడు అయ్యాడు. యదువును

తక్కువ శాపంతోనే తండ్రి విడిచిపెట్టాడు. యదువు వంశంవారికి రాజ్యార్హత ఉండదని మాత్రమే శపించాడు. తక్కిన ముగ్గుర్ని కఠోరంగా శపించాడు.

తా. మహాజనులారా! మీరన్నట్లు నాకు యదువుపై ప్రత్యేకాభిమానమే ఉంది. నా హృదయానికి చాలా సన్నిహితుడే. అయితేనేమి, తండ్రి కోరిక తీర్చవలసిన బాధ్యత తనమీద అధికంగా ఉందని గుర్తించక, వాడు మదాంధత్వంతో నా మాటను చీదరించి అవమానానికి గురి అయ్యాడు అన్నాడు యయాతి. తల్లిని చంపమని క్రోధావిష్టుడై తండ్రి యాజ్ఞాపించినప్పటికీ చిరకారి యను మునికుమారుడు సుదీర్ఘంగా ఆలోచించి మాతృవధాదోషాన్నుంచి తప్పించుకున్నాడు. ఈ కథ భారతంలోనే ఉంది. యదువు మొదలైనవారు నిర్మొగమాటంగా తండ్రి కోరికను ఈసడించుకున్నారు. యయాతి వాంఛించినది లోకవిరుద్ధమే అయినా కొడుకులైనా కొంత వివేకం చూపించవలసిఉండెను. వారట్లు చేయలేదు. ''వినినంతనే వేగపడక వివరింపదగున్'' అన్నాడు సుమతీ శతక కర్త.

*199 క. తనయుండు అర్హుండగునే.*

అర్థం. తనయుండు=కుమారుడు, తల్లిదండ్రులు పనిచిన పని=ఆజ్ఞాపించిన కార్యము, చేయదేని=చెయ్యకపోతే, పలుకెడలో జేకొనదేని=వారు చెప్పిన మాటను గౌరవంతో మన్నింపకపోతే, వాడు కొడుకు అనబడుతాడా? పితృ ధనమున కర్హుండగునే = తండ్రి ధనానికి వారసుడు కాగలుగుతాడా? అనెను యయాతి.

తా. కుమారుడైనవాడు తల్లిదండ్రుల మాటను పాటింపకపోతే, అధమము మనస్సులో దాన్నిగూర్చి ఆలోచించడం కూడా చెయ్యకపోతే వాడు కొడుకు అనబడుతాడా? తండ్రి ధనానికి అర్హుడవుతాడా?

ఇది యయాతినాటి వ్యవస్థ. అనంతరకాలంలో జనకునకు ధర్మసంతానమైన కుమారులంతా ఆస్తిలో భాగస్థులే. అయితే ఈ నియమం వంశక్రమానుగత ఆస్తికే చెల్లుతూంది. తండ్రి స్వయంకృషి చే సంపా

దించిన ఆస్తికి నిరభ్యంతర వారసత్వం ఇప్పుడు లేదు. వీలునామానుబట్టి వస్తుంది కాబోలు.

ఏని = పోయినట్లయితే, వాడేని వీడేని = వాడుకాని వీడుకాని, పనుచు ప్రేరణార్థకంగా కనబడుతూంది. చను స్వార్థము కావచ్చును.

*200. క. పూరుడు - కుశలుండగుటన్.*

అర్థం : పూరుడు కొడుకయయ్యెను = వయస్సులో చిన్నవాడైనా, కనిష్ఠుడయినా, భూరిగుణజ్యేష్ఠుడు = గుణంలో గొప్పవాడనిపించుకున్నాడు. సుపుత్రుడు = తండ్రి కోరికను మన్నించి సుపుత్రుడనిపించుకున్నాడు. కోరిన కార్యంబు దీర్చి తండ్రి కోరికను మన్నించి (అపూర్వ త్యాగంచేసి) కుశలుండగుటన్ = నేర్పరి అవడంచేత, అతడు = వాడే, అవనీ భార సహిష్ణుండు = భూభారం వహించడానికి సమర్థుడు.

తా. పూరుడు వయస్సులో చిన్నవాడైనా, గుణసంపదలో జ్యేష్ఠుడు. తండ్రి కోరికను మన్నించి నేర్పరితనం చూపెట్టాడు గనుక అతడే భూభారం వహించడానికి సమర్థతముడు అన్నాడు యయాతి. అంటే గుణసంపద, నేర్పరితనం, కష్టసహిష్ణుత ఉన్నవాడే రాజ్యానికి అర్హుడవుతాడు కాని కేవల వయస్సుచేత రాజ్యార్హత చేకూరదని యయాతి మతం. "తేజసాం హినవయః సమీక్ష్యతే" అని కాళిదాసున్నూ, "గుణాః పూజాస్థానం గుణిషు - నచలింగమ్, నచవయః" అని భవభూతియు అంటున్నారు.

*201 వ. నా జరాభారంబు - వానింబూజించి యిట్లనియె*

అర్థం : నా జరాభారంబు దాల్చిన పుత్రుండ = నా ముదిమిని తాల్చిన కుమారుడే, రాజ్యంబున కర్హుడు, వంశకర్త = వంశ మూలపురుషుడు అవుతాడు, శుక్రువచనంబు నిట్టిద = శుక్రాచార్యుడు కూడ ఇట్లే చెప్పాడు. ఇట్టిద = ఇదియే అనుట. ప్రకృతి జనంబుల నొడబఱచి = జనాన్ని ఒప్పించి, పూరుని అఖిల భూభారధురంధరుంజేసి = అఖిల సామ్రాజ్య భారం వహించే వాడుగా చేసి, యదు ప్రభృతులను = యదువు మొదలైనవారిని

ప్రత్యంతభూములకు రాజులంజేసి=సరిహద్దు ప్రాంతాలకు అధిపతులను చేసి; (ఇక్కడ శ్రీకృష్ణ దేవరాయలవారు ఆముక్తమాల్యదలో చెప్పిన ఒక రాజనీతి చిట్కాను స్మరించాలి. పాలకుడైన రాజుకు శత్రువులై, బల వంతులైన వారిని, సరిహద్దు భూములకు పాలకులుగా నియమించాలి, దీని వలన రెండు ప్రయోజనాలు సిద్ధిస్తాయి. సరిహద్దుకు అవతలఉన్న రాజు సాధారణంగా శత్రువుగానే ఉంటాడు. వానితో జరిగే యుద్ధాల్లో రాజబంధువైనవాడు మరణిస్తే రాజుకే లాభం, పీడవిరగడ అవుతుంది. లేదా రాజబంధువే గెల్చి ప్రత్యంతరుడైన రాజు సంహరింపబడితే అదీ లాభమే, శత్రునాశనం అవుతుంది. ఏదైనా కోరదగినదే కదా. యదువు మున్నగువారు సహజంగానే, చిన్నవాడై, సమ్రాట్టైన పూరుని మీద ద్వేషపూరితులై ఉంటారు. వారు ముఖ్యపట్టణానికి సమీపంగా ఉండడం ప్రమాదకరము, అందుచేత వాళ్ళని వీలైనంత దూరంగా ఉంచాలి. పూరుని క్షేమంకోసమై యయాతి ఈ పద్ధతినే అవలంబించి ఉంటాడు.) తాను వేద వేదాంగ పారగులైన=వేదాలలోను వాటి అంగాలైన ఆరింటి లోను నిష్ణాతులైన బ్రాహ్మణులతోడ - ''శిక్షా, వ్యాకరణం, ఛందో, నిరుక్తం, జ్యోతిషంతథా, కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః'' తపోవనంబున కుంజని=తపస్సు చేయుటకై వనమునకు వెళ్ళి (వాన ప్రస్థమవలంబించెననుట, ఇక్కడ కాళిదాసు చెప్పినది - వార్ధకేముని వృత్తీనామ్- ) అందు కందమూలఫలాశనుండై = దుంపలు, ఫలములు మొదలైనవి తింటూ — అనగా రాజభోజనమైన మాంసాదుల పరి త్యజించి అనుట – వన్యంబులయిన ఫలంబులతోనే, అగ్ని భట్టారకుని, పితృదేవతలను హవ్యకవ్యంబుల తనుపుచు = ఆరాధించుతూ, ( హవ్యము = దేవతల కీయదగిన అన్నము, కవ్యము = పితృ దేవతల కియ్యదగిన అన్నము. దేవతల కర్పించునపుడు ''స్వాహా'' యనియు, పితృదేవతల కర్పించునపుడు 'స్వధా' అనియు చెప్పవలెనట) వానప్రస్థ విధానంబు తప్పక = వానప్రస్థాశ్రమంబు నడుపుతూ, తప్పక=అందు లోపము రానీయక, శిలోంఛవృత్తిన తిథిభుక్తశేషంబుప యోగించును, ఉంఛవృత్తియనగా ధాన్యమేరుకొని తెచ్చి బ్రతుకుట. శిలోంఛవృత్తి ఇంకనూ కఠినమైన నియమము. మహాభారతంలో సక్తు

ప్రస్తుతకథ చూచునది. అతిథి భుక్త శేషంబుపయోగించుచు = ఉంఛ వృత్తిలో కూడ అతిథి పూజ చేయుచు, అతిథులకు పెట్టిన తర్వాత మిగిలినదే భుజించును, (అతిథి దేవోభవ అని యుపనిషద్వాక్యము - అతిథిర్గురోణసత్ అని మధ్యాహ్న సంధ్యయందు అతిథి బ్రహ్మ స్వరూపమన్నట్లు చెప్పబడినది.) నియతాత్ముండై = వశీకృతమైన ఆత్మకలవాడై, జితారిషడ్వర్గుండగుచు = జయింపబడిన అరిషడ్వర్గము కలవాడై = కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అరిషడ్వర్గము) సహస్ర వర్షంబులు తపంబు సలిపి = వేయి సంవత్సరములు తపస్సు చేసి, సర్వసంగవిముక్తుండై = సమస్తమైన అనుబంధములనుండి విడివడినవాడై, భార్యాపుత్రాదులందుగాని, ధన ధాన్యాదులందు కాని మమకారము లేనివాడై, సర్వద్వంద్వంబులును విడిచి = రాగద్వేషములు, శీతోష్ణములు, మానావమానములు, సుఖ దుఃఖములు—ఇత్యాదులను ద్వంద్వములందురు. యోగియైనవాడు వీని నతిక్రమించియుండును. "ద్వంద్వాతీతో విమత్సరః" అని గీతావచనము. ముప్పదియేండ్లు నిరాహారుండై = ముప్పై సంవత్సరాలు ఆహారము లేకుండగను, ఒక్కయేఁడు వాయు భక్షకుండయి = గాలిని మాత్రమే ఆహారముగా తీసుకొనుచు, పంచాగ్ని మధ్యంబున నిల్చి యొక్కయేఁడు = నాలుగు చుట్టుల నెగళ్లను, తల మీద తీక్ష్ణాతపమును (ఇది పంచాగ్ని విధానము) ఇట్టి పంచాగ్ని మధ్యమున నిల్చి, నీటిలో యేక పాదంబున నిలిచి = నీళ్ళలో ఒక్క కాలి పైననే నిల్చి, మహాఘోరతపంబుచేసి, దివ్య విమానంబున దేవలోకంబు నకుంజని = ఆతని తపస్సునకు మెచ్చి ఇంద్రుడు పంపిన దేవతా విమానంబున స్వర్గమునకు వెళ్ళి, అందు = అక్కడ, దేవర్షి గణ పూజితుండై = దివ్యమునులచే సంభావింపబడినవాడై, బ్రహ్మలోకంబునకుంజని = బ్రహ్మదేవుడుండు లోకమునకుపోయి, అందు = అక్కడ, బ్రహ్మర్షి పూజితుండై = బ్రహ్మర్షులు అనగా బ్రహ్మవేత్తలైన ఋషులచే పూజింపబడినవాడై, ఇక్కడ బ్రహ్మలోకమనగా ప్రజాపతి లోకమని అనుకోవాలి. ఇది ఇంద్రలోకము, బృహస్పతి లోకములకు పైమెట్టని తైత్తిరీయ ఉపనిషత్తు ఆనందవల్లిలో సూచితమవుతూంది. మునులు, మహర్షులు మొదలగు శబ్దాలన్నీ మనకిప్పుడు ఏకార్థములుగానే కనబడినప్పటికీ, ప్రాచీ

నులు వారిలో తరతమ భేదం చేసేవారు కావచ్చును. 'బ్రహ్మదేవానాం, పదవీఃకవీనాం, ఋషిర్విప్రాణాం' విప్రులలో ఋషి శ్రేష్ఠుడని సంకేతింపబడింది. అనేక కల్పంబులుండి=వేయియుగములు కల్పమని సంకేతము. ఇది బ్రహ్మకు ఒక దినమగునట. పెక్కు కల్పములు బ్రహ్మలోకముననుండి, క్రమ్మఱ = మరల, ఇంద్ర లోకమునకు వచ్చిన, ఇంద్రుండు వానింబూజించి యిట్లనియె.

తా. ఇంద్రియ భోగములతో తృప్తిపడి యయాతి వానప్రస్థమునకు పోదలచినాడు. ప్రజాప్రతినిధుల నొప్పించి పూరుని సామ్రాజ్య పట్టాభిషిక్తునిచేసి, అతని రాజ్యమునకు ప్రమాదము రాకుండుటకై అన్నదమ్ములైన యదువు మున్నగు వారిని ముఖ్య పట్టణానికి దూరంగా, రాజ్య సరిహద్దు సీమలలో పాలకులుగా నియమించాడు. అంత తాను రాజ్యాన్ని విడిచి పెట్టి తపోవనమునకు పోయి, పెక్కు సంవత్సరాలు జలవాయు భక్షకుడై, కొన్ని యేండ్లు పంచాగ్ని మధ్యమందును, జలములందును నిలిచి ఘోర తపస్సు చరించాడు. అతని తపస్సుకు మెచ్చి దేవతలు పంపిన విమానంలో దేవలోకానికి, అక్కడ నుండి బ్రహ్మలోకానికి కూడా వెళ్ళి, బ్రహ్మర్షి గణంచేత పూజింపబడి, తిరిగి యింద్రలోకానికి తిరిగి రాగా ఇంద్రుడు వానిని పూజించి యిట్లా అన్నాడట. ఇక్కడ మనకు ఒక ప్రశ్న ఎదురవుతుంది. ఇంత ఘోర తపస్సు చేసిన యయాతి శాశ్వతంగా బ్రహ్మలోకంలో ఎందుకు ఉండలేక పోయినాడు. మళ్ళీ క్రింది లోకమైన ఇంద్రలోకానికి ఎందుకు వచ్చాడు. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అను గీతావాక్యమే సమాధానమనుకోవాలి. యయాతి చేసినది ఘోర తపస్సే అయినా అది సాత్త్వికత తపస్సు కాదనుకోవాలి. తామసము కాకపోయినా, రజోగుణ ప్రేరితమైనది అని భావించాలి.

మరొక విశేషము. యయాతి మహారాజు మిథ్యాచారుడు కాడు. అతడు ఋజువర్తనుడే. తనకింకను ఇంద్రియభోగాభిలాష తరుగలేదని బహిరంగముగానే చెప్పినాడు. అల్పసత్వులైన పలువురు తాము ఇంద్రియాతీతులమని ప్రకటించుకుంటూ, వాస్తవంగా వాటిని అధిగమించలేక గ్రుక్కిళ్ళు మింగుతూంటారు. ఇట్టివారిని ఉద్దేశించియే భగవద్గీత ఇట్లు

సుడువుతూంది. "కర్మేంద్రియాణి సంయమ్య-య ఆస్తే మనసా స్మరన్-ఇంద్రియార్థాన్ విమూఢాత్మా- మిథ్యాచారః స ఉచ్యతే".

*202. ఆ. కొడుకు జవ్వనంబు—ఇట్టులనుచు బలికె.*

అర్థం. కొడుకు జవ్వనంబు గొని = కుమారుని యౌవనాన్ని నీవు ధరించి ఇంద్రియ సుఖములనుభవించి, నిజ రాజ్య భూరిభరము=నీ సామ్రాజ్య భారము, వాని బూన్చునప్పుడు = వానికి అధీనము చేయునప్పుడు, అతని కెద్ది గఱపితని యడిగిన=అతనికి ఏమి నీతులు బోధించావు అని అడుగగా ఇంద్రునితో యయాతి ఇట్లు చెప్పాడు.

తా. ఓ యయాతీ, నీవు కొడుకు యౌవనం ఎరువు పుచ్చుకొని ఇంద్రియ సుఖాలు అనుభవించి నీ సామ్రాజ్యాన్ని పూరునకు అధీనం చేసేటప్పుడు వానికి ఏమి నీతులు బోధించావు? అని యింద్రు డడుగగా యయాతి ఇట్లా చెప్పాడు.

పూను స్వార్థము- పూన్చు ప్రేరణము. కఱచుట, నేర్చుట స్వార్థము, కఱపుట ప్రేరణము. ప్రేరణార్థమందు చుక్కాగామములు ఇంచు ప్రత్యయము వస్తూంటాయి.

### యయాతి పూరునకు బోధించిన నీతులు

*203. క. ఎఱుక గలవారి—సమంజస బుద్ధిన్.*

అర్థం. ఎఱుకగలవారి చరితలు = జ్ఞానవంతులైన వారి ప్రవర్తన రీతులు, కఱచుచు=నేర్చుచు, సజ్జనుల గోష్ఠి కదలక=సజ్జనులనడుమనే మసలుచు, వారి సంగతిలోనే ఉండుచు, ధర్మం బెఱుగుచు=ధర్మమార్గమును తెలుసుకుంటూ, ఎఱిగిన దానిని = తెలుసుకొన్న ధర్మ విధానమును, మఱవక=ఏమఱక, సమంజస బుద్ధిన్=సద్బుద్ధితో, అనుష్ఠించునది= ఆచరింపవలెను సుమా!

తా. జ్ఞానులైన వారి ప్రవర్తన రీతులు తెలుసుకుంటూ, సజ్జనులతోనే మైత్రి, సంభాషణ మొదలైనవి చేస్తూ, ధర్మమార్గాన్ని పెద్దలవలన తెలుసుకుంటూ, తెలుసుకొన్న ధర్మమార్గాన్ని మరిచిపోక సద్బుద్ధితో అనుష్ఠించవలెను. అనగా ధర్మమార్గం తెలుసుకోడంతో చాలదు. దానిని ఎంత మాత్రము పొరపడక ఆచరణలో పెట్టు చుండవలెను, 'సత్యంవద, ధర్మంచర' మొదలైన మహావాక్యాలు వల్లె వేయవచ్చును గాని వాటి యాచరణ సామాన్యులకు దుర్లభము. అట్టివారే మిధ్యాచారులు.

ఈ పద్యంలో కవి చిన్న చిన్న అచ్చ తెలుగు పదాలతో మహార్థాలు బోధించాడు. నన్నయభట్టుది తత్సమ కవిత్వం అనేది కొంతవఱకు నిజమైనా ఆయనకు దేశి కవిత్వ పద్ధతి అనభ్యస్తము కాదు.

*204. క. ఇచ్చునది పాత్రునకు—సర్వ భూతప్రీతిన్.*

అర్థం. పాత్రునకు ఇచ్చునది = యోగ్యుడైన వ్యక్తికే దానము చేయునది. అపాత్ర దానము బూడిదలో పోసిన పన్నీరగును. అపాత్ర దానము తామస దానంగా పరిగణింపబడుతుందని గీతా వాక్యము. ధనమును అచ్చుగ నొరు వేడకుండునది = ధనమునకై పరులను యాచించకుండునది, యాచ్ఞాపరుడు దూదికన్న తేలికగా చూడబడతాడు. అభిముఖులై వచ్చిన ఆశార్థుః = ఏదియో కోరికతో తన్ను సమీపించిన వారిని, వృథ పుచ్చక = రిక్త హస్తాలతో పంపివేయక, సర్వ భూతప్రీతిన్ = సమస్త భూతములకు హితమును, ప్రీతిని కావించునది. అనగా మనుష్యులకే కాక భూతగ్రామమునకంతకూ హితము చేయునది. అశోక చక్రవర్తి ఉదాహరణము.

*205. క. మనమునకు—ధర్మయుతముగ సభలన్.*

అర్థం. సభలన్ = మహాజనసభలయందు, పలుకు ఒనరగ పలుకునది = ఒప్పునట్లు మాట మాట్లాడవలెను, ఎట్టి పలుకు? మనమునకు ప్రియంబును = ఎదుటి వారి మనస్సునకు ప్రీతిని కలిగించునది, హితమును = వారికి క్షేమమును సమకూర్చునది, పథ్యము = రోగికి ఆరోగ్యము కూర్చు

ఆహారమువలె వారికి మానసికారోగ్యము కలిగించునది, తథ్యము = సత్యమైనది, "హితం మనోహారిచ దుర్లభమ్ వచః" అని కవియన్నాడు. హితమైనది, మనస్సుకు ఉల్లాసము కలిగించేది అగు మాట చాలా దుర్లభము అనుట, అమోఘము = వ్యర్థముకానిది, దశరథరాముని బాణము వలె లక్ష్యము తప్పనిది, మధురము = హితమైన దగుటయేకాక ఇంపైన మాటలలో చెప్పబడేది, పరిమితమును = చాలా తక్కువ మాటలు కలది. మిత భాషిత్వము నన్నయకు చాలా అప్యాయమైనది, "మిత హిత సత్య వాక్య" అని జనమేజయుని ఉదంకుడు సంబోధిస్తాడు, ఏవం విధ లక్షణములుగల మాటలనే, ధర్మయుతమ్ముగ = పైగా ధర్మాతిక్రమణము చేయని మాటలనే సభల్లో మాట్లాడవలెను.

రఘువంశపు రాజుల సదాచారమైన "సత్యాయ మిత భాషిణమ్" అనేది స్మరింపదగును.

తా. మహాజనుల సభల్లో, మనస్సుకు నిజమైన ఉల్లాసము కలిగించేది (అనగా గిలిగింతలు పెట్టునది కాదనుట) హితమైనది, వారి మానసిక కల్మషమును తొలగించేది, సత్యమైనది, ప్రత్యాఖ్యానం చెయ్యడానికి వీలు లేనిది, మృదు వాక్యములతో కూడినది (అశ్లీలము లేనిది) మితభాషిత్వ లక్షణం కలది ధర్మ విరుద్ధము కానిది అయిన వాక్యమునే మాట్లాడవలెను. పొల్లు సంభాషణ పనికి రాదనుట.

పథి భవం పథ్యమ్ ఋజో మార్గగామిగా చేయునది. రోగమును ఉపశమింప చేయు ఆహారమువలె.

*206* సీ. *వదనబాణాసన - వెలుపలియహితుల.*

అర్థం : పై పద్యములో సంగ్రహంగా చెప్పినదానినే మహాకవి దార్ఢ్యమునకై తిరిగి చెప్పుచున్నాడు. ఇట్ల ఒకమాట చెప్పినదానినే మళ్ళీమళ్ళీ చెప్పడం పునరుక్తి దోషం కదా అని కొందరంటారు. ఇది ఆర్ష ధర్మము. వేద సమ్మతము. 'సత్యంవదదే, ధర్మంచర' అని శిష్యునకు ఆచార్యుడు బోధించి మళ్ళీ వెనువెంటనే 'సత్యాన్న ప్రమదితవ్యమ్ ధర్మాన్న

ప్రమదితవ్యమ్' అని బోధించుట శిష్య మనోదార్ఢ్యమునకని వ్యాఖ్యాతలు చెబుతున్నారు. ఇదికూడా అటువంటిదే.

దుర్జన యోధవరుల కడ నుండకున్నది (మేలు అని అధ్యాహారము.) దుర్జనులనే వీరాగ్రేసరుల సాంగత్యములో నుండకూడదు. ఉండకుండేది కర్తవ్యము. రూపకము. ఆ దుర్జన యోధవరు లెటువంటి వారు? వదన బాణాసన = ముఖము, నోరు అనే విల్లునుండి-రూపకము-వ్యక్తముక్తములైన - బాహాటంగానే విడువబడే పలుకులు - మాటలను-కడువాడి బాణతతుల = మిక్కిలి తీక్ష్ణములైన అమ్ములచేత పరమర్మ లక్ష్యముల్ = పరుల హృదయ మార్దవమనే లక్ష్యాన్ని గురించి, పాయక భేదించు = వెనుదీయకుండా నిర్మూలించే దుర్జన యోధ వరులకు దూరంగా ఉండడం శ్రేయస్కరము, కరుణ = దయ, ఆర్జవము = ఋజు స్వభావము, అక్షజయము = ఇంద్రియ నిగ్రహము, సత్యము, శమము = శాంతి (క్రోధ ద్వేషాదుల నుపశమింప చేయుట) శౌచము = పరిశుభ్రత, పూర్వులు మడి అనేవారు, శుచిత్వము, అనునివి = అనువానిని, ఎద నిల్పునది = మనస్సులో, ఎప్పుడూ నెలకొనునట్లు ప్రయత్నము చేయవలెను. శత్రు షడ్వర్గ జయమందునది = అరిషడ్వర్గమును జయించునది. శుద్ధ శాంతబుద్ధి = రాగ ద్వేషములులేని బుద్ధితో, మదము = నాకంటె గొప్పవాడు లేడని విఱ్ఱవీగుట, కామము = స్త్రీ వ్యసనము, క్రోధము = ఎడతెగని కోపము (కోపాః తక్షణ భంగురాః) అని మహాత్ములను గూర్చి అంటారు. మత్సరము = ఎదుటివాని ధన విద్యాదుల ప్రకర్షను చూచి ఈర్ష్య వహించుట, (బోద్ధారోమత్సర గ్రస్తాః, అంటాడు భర్తృహరి), లోభమును = తన కవసరమైన దానికంటె అధికముగా ధనాదులయందు కాంక్ష. 'మాగృధః కస్యస్విద్ధనమ్' అని ఈశావాస్యోపనిషత్తు చెబుతూంది. మోహమును = పరదారాదులందు కాంక్ష. అనులోని సహజ వైరివర్గముకు = పైన చెప్పిన ఆరు అభ్యంతర శత్రువులను. ఇవి మనస్సును అంటి ఉంటాయి. భౌతిక నేత్రములకు కనబడవు. కాని క్రియాదికమునందు వ్యక్తమౌతాయి. పైగా ఇవి సహజములు, పుట్టుకతో వచ్చునవి. ఒడిచినవాడ = అంతఃకరణగత సంఘర్షణలో జయించిన ఉత్తమ పురుషుడే, అక్రమంబున = అవలీలగా వెలుపలి

యహితతుల = బయట ఉండే, శత్రుతతులను = శత్రు వర్గమును, ఒడుచును = జోడించును, జయించగలుగును అనుట.

తా. ముఖము లేక నోరు అనే ధనుస్సునుండి బాహాటముగా ప్రయోగింపబడిన మాటలు అను తీక్ష్ణనులైన (అనగా హృదయబాధాకరములయిన) బాణ సంఘాతముచేత, పరుల ఆయువుపట్టులను, లక్ష్యస్థానములను (గురి Target) గురితప్పకుండా విదారితములు చేయు దుర్జను (కరుణా శూన్యులైన) లను యోధుల దగ్గర ఉండకపోవడం శ్రేయస్కరము. దయ, ఋజుత్వము (అనగా కౌటిల్యం లేకుండుట), ఇంద్రియ జయము, సత్యము, శమము (శాంతి) శుచిత్వము అను వాటి నెప్పుడూ మనస్సులో నిలుపవలెను. (మాటల్లో మాత్రమే కాదనుట) శాంతబుద్ధితో అరిషడ్వర్గమును జయించునది. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనేవి అంతశ్శత్రువులు. వీటినే అరిషడ్వర్గమంటారు. ఈ అంతశ్శత్రువులను జయించిన పురుషుడే, బయటిశత్రువులను అవలీలగా జయించగలుగును. అంతశ్శత్రుజయమే నిజమైన జయము అనుట.

ఈ పద్యంలో కవి రూపకాలంకారం చాలా వాడాడు. సావయవ రూపకము, బాణాసనము, వాడి బాణతతులు, లక్ష్యములు, ఉండకున్నది = విశిష్టప్రయోగము. ఉండకయుండునది, ఉండకుండునది. ఉండకున్నది అను రీతిని యేర్పడియుండవచ్చును. జాడు = స్వార్థము, ఒడుచు లేక ఓడించు ప్రేరణము.

*207* *వ. అని పూరుంగలవితి—ఇట్లనియె.*

అర్థం. పైన చెప్పినట్లు పూరుని బోధించితిని- కలచు = స్వార్థము, కలవు = ప్రేర, పూరుడు మహాపురుషుడు. వానికి ఒకరు బోధించనక్కరలేదు. తానే ఇతరులకు బోధింప సమర్థుడు. అట్టి సర్వగుణ సంపన్నుడు = సద్గుణములే సంపత్తిగా కలవాడు. అనగా ఇంద్రుడు యయాతితో ఇట్లా అన్నాడు.

తా. సులభము.

*208. క. ఏమితపంబొనరించితి-వత్సరముల్.*

అర్థం. భూమీశ్వర=ఓ యయాతి మహారాజా! ఏమి తపంబొనరించితి=ఎంత విశిష్ట తపస్సు చేసినావో కదా, శతసహస్ర సంవత్సరముల్=లక్ష సంవత్సరాలు, తేజోమహిమన్=తేజస్సుయొక్క ఆధిక్యతతో, పుణ్య లోక భోగంబుల = పుణ్యలోకములందలి భోగములను అనుభవించావు. ఇది సామాన్యమే=అసాధారణ గౌరవమును పొందినావనుట, ఒనరించితి అనుభవించితి. బా.వ్యా.క్రియ-24.

తా. ఓ యయాతీ, నీ వెంత ఘోర తపస్సు చేశావో కదా. సామాన్యు లెవరికి లభించని విశిష్ట గౌరవం నీకు దక్కింది. లక్ష సంవత్సరాలకు పైగా పుణ్యలోకభోగాలు అనుభవించావు అని యింద్రుడు యయాతిని భూషించాడు. అతని యాంతర్యము పసికట్టుటకు వేసిన ధర్మ ప్రశ్నయైన కావచ్చును. ఇంద్రుడు తన ఇంద్రత్వానికి ఎవరినుంచి ప్రమాదం వస్తుందో అని భయపడే అసూయా స్వభావుడంటారు. ఎవరూ నూరశ్వమేధాలు నిర్విఘ్నంగా నెరవేర్చకుండా అంతరాయాలు కలిగిస్తూంటాడని పురాణ ప్రతీతి.

*209. వ. అనినయ్యింద్రున కయ్యయాతి యిట్లనియె.*

అయ్యింద్రుడు, అయ్యయాతి-బా.వ్యా.సమా-14.

*210. క. సురదైత్య యక్ష నరియుగావమరేంద్రా.*

అర్థం: అమరేంద్రా=దేవతా విభుడవైన ఓ యింద్రుడా!, సురలు, దైత్య=రాక్షసులు, నరులు, ఖేచరులు=ఆకాశచరులు, సిద్ధులు, ముని గణప్రవరులు=మహర్షి శ్రేష్ఠులు-వీరందరి యొక్కయు, భాసురతపములు=ప్రశస్తమైన తపములేవీ, నాదగు=నాదియైన అనగా నేను చేసిన, దుష్కర ఘోరతపంబు=ఎవరూ ఆచరింపజాలనిది, ఘోరము అయిన తపస్సుతో. సరియుగావు=సరితూగలేవు.

తా. దేవతలు, రాక్షసులు, మనుష్యులు, ఆకాశయానము చేయువారు, ముని గణశ్రేష్ఠులు చేసిన తపస్సు లేవియునునేను చరించిన దుష్కర ఘోర తపస్సుతో సరియైనాకావు అన్నాడు యయాతి.

సరియుకావు అన్నప్పుడు నా తపస్సుతో సరితూగనేలేవు. దానిని మించే ప్రశ్న ఉదయించనే ఉదయించదు అని సముచ్చయ 'యు' వర్ణమునకు భావంగా గ్రహించాలి. నన్నయ ఇటువంటి ప్రయోగం చేస్తూంటాడు.

సర్వ తీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియు గావు

తపము, తపస్సు రెండు రూపాలు చెల్లుతాయి. బా.వ్యా. తత్సమ 80.

—ఇంద్రుడు యయాతిని స్వర్గలోక భ్రష్టుని చేయుట—

*211. వ. అని తపోభిమానంబున- యింద్రు ననుమతంబువడసి.*

అర్థం: అని తపోభిమానంబున=తనదైన తపశ్చర్యపై అభిమానము చేత, మహర్షుల తపంబు లవమానించి పలికిన=మహాఋషుల తపశ్చర్యలను కించపరచుచు మాట్లాడగా, యయాతి గర్వమునకు సహింపక ఇంద్రుడు కోపించి, నీకు దేవలోక సుఖానుభవంబునందు=దేవలోక సుఖములను భవించుటకు సామర్థ్యము నిచ్చు పుణ్యము అంతమైనది, "క్షీణేపుణ్యే మర్త్య లోకం విశంతి" అను గీతా వాక్యము కలదు, నీ గర్వంబు నిన్నింతసేసె=నీ గర్వమే నీ పతనహేతువగుచున్నది, ఇంక నధో లోకమున కరుగుమనిన=ఊర్థ్వలోక వాసశక్తి నశించినది కావున క్రింది లోకాలకు పొమ్మని ఆదేశించిన, యయాతి ఇట్లనెను: నేను భూలోకము నకు పోవలేను. అంతరిక్షంబున=భూమ్యాకాశములకు నడుమ, సద్భువ నంబున=మర్త్య లోకము కంటె మంచిదైన లోకమునందు, సత్సంగతి నుండునట్లుగా=సజ్జనసాంగత్యములో ఉండునట్లుగా, ప్రసాదింపుమని= అనుగ్రహింపుమని వేడి, ఇంద్రుననుమతంబు వడసి=ఇంద్రునిఅనుజ్ఞ సంపాదించి.

తా. యయాతి తనదైన తపోభిమానం చేత మహర్షుల తపస్సులను కూడ కించ పరచుచు ప్రసంగింపగా, ఇంద్రుడు వాని కలిగి, నీకు పుణ్యలోక

సుఖానుభవ సామర్థ్యం నశించింది. అధోలోకములకు పొమ్మని ఆజ్ఞాపింపగా, యయాతి ఇట్లనెను : నేను మనుష్యలోకంలోకి మళ్ళీ పోలేను. అంతరిక్షములో ఏదైన సద్భువమునందు, సజ్జన సాంగత్యమున ఉండునట్లు అనుగ్రహింపుమని యింద్రుని వేడి, వాని సమ్మతి పడసి.

గర్వము పతనహేతువని యయాతి వృత్తాంతం తెల్పుతూంది. ఇక్కడ ఇంద్రుడు నిర్మత్సరుడు కాడనుట తెల్లము. యయాతి ఏదైన గర్వ ప్రసంగంచేస్తే, ఆ మహామహుని అధోలోకములకు త్రోసి వేయవలెనను అసత్సంకల్పముతో ఉన్నట్లే కనిపించును. కాకున్నచో అతని తపశ్చర్యను గూర్చి కావలెనని ప్రశ్నించి, ఏదో అదను చూసుకొని ఆ మహారాజును అధోలోకములకు త్రోసివేయనేల?

*212* తే. *అంతరిక్షంబువలన - యేమి యొక్కొయనుచు*

అర్థం : అంతరిక్షంబు వలన=యయాతి అంతరిక్షమునకు దిగుచుండగా కలిగిన కాంతి విశేషము చేత, దిగంతరములు వెలుగ=దిక్కులు ప్రకాశమానములగునట్లుగా, చనుదెంచు=వచ్చుచున్న, ఆతని విమలదీప్తి=యయాతి యొక్క భాసురమైన దేహకాంతిని చూచి, సద్గణములు=సజ్జన సమూహములు, ఉరుతరద్యుతి ఇదియేమి యొక్కొయనుచు = గొప్పదైన ఈ కాంతిపుంజ మేమిటోయని, కడుచోద్యమందిరి=మిక్కిలి ఆశ్చర్యము నొందిరి.

తా. యయాతి అంతరిక్షంలోకి దిగుతుండగా అతని యద్భుతకాంతి శరీరము యొక్క వెలుగులో దిగంతరములు అతిశయ భాస్వరములయ్యెను. అతని నిర్మలకాంతిరాశిని చూచి, సజ్జనగణములు ఈ యద్భుత కాంతిపుంజ మేమిటోయని ఆశ్చర్యపడ జొచ్చిరి.

*213* వ. *అంతనయ్యయాతి - యిట్లనియె*

అర్థం : ఆ యయాతి దౌహిత్రులు, అష్టకుడు, ప్రతర్దనుడు, వసుమంతుడు, ఔశీనరుడు (ఉశీనర దేశపు రాజు కావచ్చును,) శిబి అనువారు, సద్భు

వనవాసులు = వీరందరును సద్భువనములో నివసించుట కర్హమైన పుణ్యాచరణము చేసిన వారనుట, తమ యొద్దకువచ్చిన, అధికతేజోమయు = గొప్ప తేజస్సుకలవాడు, అనంతపుణ్యమూర్తి = మూర్తిభవించిన పుణ్యము వలె ఉన్న యయాతిని, నిసర్గస్నేహంబున = తమకు సహజమైన ప్రేమతో, వారికి తెలియకుండగనే వారి హృదయములందు మాతామహుడను భావముచే కల్గిన ఆదరము జనించియుండవచ్చును. అభ్యాగత పూజల సంతుష్టుంజేసి = అతిధికి చేయవలసిన ఆదర గౌరవములచేత సంతోషింపజేసి, నీ వెవరవు, ఎక్కడనుంచి ఏమి కారణమున ఈ లోకమునకు వచ్చితివి అని యిడగిన, యయాతి వారితో ఇట్లా చెప్పాడు :

తా. యయాతి సద్భువనమున కవతరించగా అతని దౌహిత్రులైన యష్టకాదులు, సద్భువనంలో వసింపనర్హతగల పుణ్యశీలురు, అధిక తేజోమయుడును. అనంత పుణ్యమూర్తియు అయిన యయాతిని చూచి, తమ మాతామహుడని యెరుగని వారైనను, వారి హృదయాల్లో ఏదో అవ్యాజానురాగము తలయెత్తగా, వారాతనిని అతిధి పూజలతో సంతుష్టపరచి, మీరెవరు, ఎక్కడనుండి ఏ కారణమున ఈ లోకానికి వచ్చారు అని యడిగారు. యయాతి వారితో ఇట్లా చెప్పాడు :

ఒక వ్యక్తి ఆత్మీయుడని యెరుగక పోయినను ఎందుచేతనో ఆత్మీయతా భావం కలుగుతూంటుంది. ''రమ్యాణివీక్ష్య - జననాంతర సౌహృదాని'' అను కాళిదాస వాక్యము ఇక్కడ ఉపయోగించునేమో !

*214 క. అనవద్య ధర్మచరితంబున - చనియెడువాడన్*

అర్థం : అనవద్య ధర్మచరితంబున = అనింద్యమైన ధర్మ ప్రవర్తనచేత, ఉన్నతుడైన = లోకోత్తరుడైన, నహుషపుత్రుడ = నహుష చక్రవర్తి కుమారుడను. పూరుడను, మధ్యమలోకేశ్వరుజనకుండ = మధ్యమ లోకమునకు ప్రభువైన పూరుడను ప్రసిద్ధ చక్రవర్తి తండ్రిని. పాతాళము భూమి కన్న క్రింది లోకమని చెబుతారు. అందుచేత భూమిని మధ్యమలోకమన్నారు. బలిచక్రవర్తిని వామనావతారంలో మహావిష్ణువు పాతాళమునకే

అణగ్రదొక్కినాడు. లోతుగా ఉన్న బావుల్ని గురించి నీళ్ళెక్కడో పాతాళంలో ఉన్నాయంటారు లోకులు. యయాతి యనగ జనియెడివాడన్ = నా పేరు యయాతి, మన పూర్వుల్లో ఒక సంప్రదాయం ఉండేది. ''నాపేరు వెంకయ్య'' అనడు. ''నన్ను వెంకయ్య అంటారండి'' అని లోకంలో వ్యవహారం. యయాతికూడా ఆ పద్ధతే పాటించాడు.

తా. అనిందిత ప్రవర్తనుడైన నహుష చక్రవర్తి కుమారుడను. భూలోకంలో ఇప్పుడు సమ్రాట్టైన పూరుడను నాతని తండ్రిని. లోకులు నన్ను యయాతి అంటారు - అని చెప్పాడు.

*215. క. అమిత తపో విభవంబున-కడ కేజనినన్*

అర్థం. అమిత తపో విభవంబున=బ్రహ్మాండమైన తపో మహత్వంచేత, కమలజు లోకంబు మొదలుగా గల = బ్రహ్మలోకము మొదలైన, సురలోకములందు=దేవతాలోకములందు, పుణ్యఫలములు క్రమముగ అనుభవించి, ఇంద్రుకడకు=ఇంద్రలోకమునకు, ఏజనినన్=నేను వెళ్ళగా.

తా. అసాధారణము, లోకోత్తరము అయిన తపోమహత్వంచేత బ్రహ్మలోకము మొదలైన దేవతాలోకాల్లో పుణ్యఫలములైన భోగము లనుభవించి, చివరకు ఇంద్రలోకానికి వెళ్ళాను.

ఫలాభిసంధిలేని తపస్సే సాత్త్వికము, మోక్షప్రదము అవుతుంది. తదితర తపస్సులు స్వర్గలోకానుభవముతో క్షీణశక్తులవుతాయి. పునర్జన్మకే దారితీస్తాయని గీతాశాస్త్రము.

*216. క. సురపతి – సరిగా వంచెన్.*

అర్థం. సురపతి=ఇంద్రుడు, నా తపమున కచ్చెరువడి=నాదైన ఉగ్రతపానికి ఆశ్చర్యపడి, ఆశ్చర్యము=అచ్చెరువు. తద్భవము. అచ్చెరువు+పడి అచ్చెరువడి అన్నప్పుడు అంత్యవకారలోపం కనబడుతూంది. పద్యాదులు పరంబులగునపుడు తత్పూర్వశబ్దమందలి 'ము' వర్ణ లోపమును బా. వ్యా. సంధి 46 లో చూచునది. అట్లే పడు పరమగునప్పుడు 'వు'

వర్ణలోపం కూడా వస్తూన్నట్లు కనబడుతూంది. ఇది కర్తృవాచకమునకు రాదు. ఆవు + పడియె = ఆవడియె అనడానికి వీలులేదు.

నీ తపము పేర్మి చెప్పుమ యనినన్ = నీ తపస్సు యొక్క ఆధిక్యాన్ని చెప్పమనగా, సుర, సిద్ధ, మునీంద్ర = వీరి తపశ్చరణలు = వీరి తపస్సాంద్రతలు, అనగా తీవ్రతలు, నా తపస్సుకు సరి కావని అన్నాను.

తా. ఇంద్రుడు నా తపో మహత్త్వానికి ఆశ్చర్యపడి నీ తపస్సు గొప్పతనం ఎటువంటిది అని అడుగగా, సుర, సిద్ధ మునీంద్రుల తపస్సులు నా తపస్సు గాఢతతో పోల్చడానికి వీలులేదు అన్నాను.

షష్ఠికి బదులు తృతీయ. తపమునకు అనడానికి బదులు తపముతోడ అన్నాడు. చెప్పుమ అన్నప్పుడు చూడు. బా. వ్యా. క్రియ-33.

*217.* చ అమరవిభుండు - యొనర్పకుండునే

అర్థం. అమర విభుండు = దేవేంద్రుడు, దానివిని = నేను చేసుకున్న ఆత్మ తపస్తుతిని విని, అల్గి = కోపగించి, మదముతో, ఉత్తమావమానము = పెద్దలు పూజ్యులు అయినవారిని అవమానించుట, చేయతగునయ్యా = చేయవచ్చునా ? తగదు అనుట. బా. వ్యా. క్రియ 33. అని నన్ను, అధో భువన = క్రిందిలోకములకు, ప్రపాత సంభ్రమ = పడుట అనే హఠాత్సంభవము చేత, వివశాత్మజేసె = స్వాధీనము తప్పిన మనస్సు కలవానినిగా చేశాడు. అనగా నాకు తెలియకుండగనే మూర్ఛితుడై నట్లు అధో భువనములకు పడిపోయాను. అది పాడియ = దేవేంద్రుడు నాకు వేసిన శిక్షయుక్తమైనదే. దానికి నేను ఆయనను నిందించను. ఎందును = ఏకాలములందైనా సరే, దర్పము = గర్వము, అల్పమయ్యు = కొంచెమైనది అయినప్పటికీ, బహుకాల = చిరకాలముగా, సంచిత = సేకరించిన, తపఃఫల హాని = తపస్సుయొక్క ఫలమైన పుణ్యమును నష్టపడేటట్లు, ఒనర్పకుండునే = చేయకుండునా? తప్పక చేస్తుంది అనుట,

తా. ఇంద్రుడు నేను కావించిన నిజ తపఃప్రశంసను, మహర్షులు మున్నగు మహనీయుల తపస్సును లఘువుగా పరిగణించుటయు విని, కోపగించి, మదముతో పెద్దలను అవమానింపవచ్చునా? అంటూ నన్ను అధోలోకము లకు మూర్ఛిల్లిన వానివలె పడి పోయేటట్లు వివశాత్ముని చేశాడు. పాక శాసనుడు చేసినది న్యాయమే. అన్యాయమని నేను అనను. ఎందుచేత నంటే కొంచెమైనను దర్పము (అహంకారబుద్ధి) చిరకాలముగా సంపా దించిన తపఃసంజాతమైన పుణ్యము యొక్క నష్టాన్ని చేయకమానదు. ఎందును=ఇది సార్వకాలిక సత్యము అనుట.

అర్థాంతరన్యాసము యయాతి వివేకబుద్ధి మళ్ళీ ప్రశంసింపదగి ఉంది. లోకంలో సాధారణంగా ఎవరూ తమ తప్పు తాము అంగీకరించరు. అందుకు ఎంతయో అహంకార ప్రక్షాళన కావాలి. యయాతి పొరపడు తూంటాడు. అయినా దురహంకారంతో నాదే న్యాయపక్షము అని వాదిం చడు. ఇది యాతని ఘనతా వైలక్షణ్యము.

*218. వ. ఇట్లు కుపిత శతమఖ - వారలకయ్యయాతి యిట్లనియె.*

అర్థం: ఇట్లు, కుపితశతమఖ వచన ప్రపీడితుండనయి=కోపగించిన ఇంద్రుని వాక్యముచేత మిక్కిలి బాధింపబడినవాడనై, తదాదేశంబున=ఆతని యాజ్ఞచేత, సద్భువనంబునకు వచ్చితి=మీరుండే సద్భువనానికి వచ్చాను అనిన నాతడు తమకు మాతామహుండగుటయు=తల్లి తండ్రి అవడమున్నూ అతని మహత్వంబు = అతని గొప్పతనమున్నూ, అనగా మానసిక విశాల పరిధియు, సార్వలౌకికత్వంబును=అన్ని లోకములు సందర్శిం చుటచే కలిగిన అపారానుభవమున్నూ, సర్వజ్ఞానసంపత్తియు = లౌకిక ఆధ్యాత్మ విషయిక జ్ఞాన సంపదయున్నూ, ఎరిగి=తెలుసుకొని, అష్ట కాదులు=యయాతి దౌహిత్రులు, సకల ధర్మాధర్మంబులు=సమస్తమైన ధర్మాధర్మప్రకారములు, సుగతి దుర్గతి స్వరూపములు=ఉత్తమ లోక ప్రాప్తి, అధోలోక ప్రాప్తి స్వరూపములున్నూ- అనగా సుగతికి పోవు మార్గమేది, దుర్గతి దేని వలన సంభవించును అనుట, జీవుల గర్భో త్పత్తి ప్రకారంబులు=సమస్త ప్రాణిజాతము ఎట్లు తల్లి గర్భము ప్రవే

శించి, జన్మగైకొనును అనే విషయాలున్నూ, వర్ణాశ్రమ ధర్మంబులు అడిగిన వారికి యయాతి ఇట్లా సమాధానించాడు:

తా. ఇట్లు యయాతి ఆత్మ తపస్తుతికి కోపించి ఇంద్రుడాతనిని సద్భువనంబులకు పొమ్మని శపించాడు. అష్టకాదులు యయాతి తమ మాతామహుడని యెరిగి, అతని మహత్వము, సార్వలౌకిక జ్ఞానమును, సమస్త జ్ఞాన సంపదయు ఎరిగిన వారగుటచే ఆతనినుండి సమస్త ధర్మాధర్మములు, సుగతి దుర్గతుల మార్గములు, జీవుల గర్భోత్పత్తి విధానము, వర్ణాశ్రమ ధర్మములు తెలుసుకొనగోరి వానిని పృచ్ఛించిరి.

కుపిత ప్రపీడితుండను బా.వ్యా. కార - 38.

యయాతి యష్టకాదు లడిగిన ప్రశ్నలకు సంక్షేపరూపంబున సమాధానము లొసగుట

*219.* ఆ. *సర్వ భూత దయకు-అధర్మమనిరి బుధులు.*

అర్థం. సర్వ భూత దయకు = సమస్త ప్రాణిజాతము నందును దయ కలిగి యుండుట, సత్యవాక్యమునకు=సత్య వచనము-వీటిని మించిన ఉత్తమ ధర్మమేదీ నాకు తెలిసినదిలేదు, లోకములో ఎక్కడా లేవనుట, ఒరుల నొప్పికి ఓడక = ఎదుటివాడు బాధ పడుతూన్నప్పటికీ లెక్కచేయక, ఉపతాప మొనరించునదియు = వారిని ఇంకను బాధించుటయే, కడు నధర్మమని=అదియే పెద్ద అధర్మమని విజ్ఞానవంతులు చెబుతున్నారు.

తా. భూతదయ, సత్యము వీటిని మించిన ధర్మము మరొకటి లేదు. బాధపడుతూన్న జీవిని కరుణ లేక ఇంకా పీడించడమే గొప్ప అధర్మమని విజ్ఞులంటున్నారు.

''పరోపకారః పుణ్యాయ-పాపాయ పరపీడనమ్'' అనేది ఇక్కడ స్మరించాలి.

ధర్మము, ధర్మువు రెండు రూపములు. ఓడినవాడు వెనుదీస్తాడు కనుక ఓడక అంటే వెనుదీయక, ఇదివరకు పెట్టిన హింసతో ఆగక,

సత్యముకన్న సర్వభూత దయకే మొదటి స్థానము. అందుచేతనే "అహింసా పరమోధర్మః" అని అభియుక్తోక్తి, ఒక జీవికి ప్రాణహింస కలిగించే సత్యము కూడ కొండొకచో పాపంగా పరిగణింపబడింది.

*220. ఆ. వేద విహిత విధుల మార్గమనిరి మునులు.*

అర్థం. వేద విహిత విధుల నాదరించుట = వేదముచే విధింపబడిన ధర్మముల ప్రకారము చేయుట, ఊర్ధ్వగతికి, తెరువు=మార్గము "తస్మాచ్ఛాస్త్రమ్ ప్రమాణాతే కార్యాకార్య వ్యవస్థితౌ" అని గీతా వచనము. వేదము చెప్పి నట్లు ఆచరించుటచే ఊర్ధ్వలోక ప్రాప్తి కలుగును, విధుల గడచి = వేదము విధించిన దాని నతిక్రమించి, ఆఁగబడినవాని=నిషేధింపబడిన వానిని, లోఁగక చేయుట = వెనుదీయక దుస్సాహసముతో చేయడం, అధమగతికి = అధఃపతనానికి, మార్గమని బుధులు, మునులు చెప్పు తున్నారు. ఆగబడిన అన్నప్పుడు ఆగు సకర్మకంగా గ్రహించాలి. లేక పోతే కర్మణ్యర్థం సిద్ధించదు. ఇప్పుడు మనము 'ఆగు' అకర్మక ధాతువు గానే వాడుకొంటున్నాము. ఆగు అంతర్గత ప్రేరణంగా ప్రాచీనులు వాడి యుంటారు. ఇప్పుడు (ఆపు) ప్రేరణము.

తా. వేదము విధించినట్లు చేయుటచే ఉత్తమగతులును, వేదము నిషేధించిన వాటిని చేయుటచే అధోగతులును కలుగునని మహర్షులు చెప్పుతున్నారు— అని యయాతి వివరించాడు.

*221. వ. మఱియు గర్భయోని యందు – తమ్మును నుద్ధరింతురు.*

అర్థం. యయాతి అష్టకాదుల ప్రశ్నలకు సమాధానాలు చెప్పుతున్నాడు. గర్భ యోనియందు=స్త్రీజనావయవ, గర్భ స్థానములందు, ఋతు పుష్ప రస సంయుక్తంబగుచు = నెల నెల స్రవించు రక్తముతో, (రక్తమనుటకు బదులు పుష్పరసము అనుట కవితా విలాసము. పుష్పవతి అయిన దని కన్యకలను అంటారు.) రేతంబు = పురుషవీర్యము, గాడ్పు చేతం బ్రేరితంబయి=గాడ్పు సహాయమున, కలిసిన = కలవగా (రక్తము, రేతస్సు కలవగా) అందు పంచతన్మాత్రలు=పంచభూతముల సూక్ష్మము

లైన ప్రాథమిక రూపములు. సృష్టికి ముందు పంచభూతములు తన్మాత్ర రూపములో నుండును. పొడవయి = ఈ దేహము తల్లి గర్భమునందు తన్మాత్రల రూపములో పొడవి, క్రమంగా అవి పెరిగి పాంచ భౌతికస్థితి యేర్పడుననుట, క్రమంగా ఈ దేహానికి అవయవాలు స్ఫుటరూపంతో యేర్పడుతాయి. లబ్ధజీవులయి = అనంతర దశలో వానియందు జీవ చైతన్యం పొడచూపుతుంది ఆయా అవయవాలు తమ తమ నియత కర్తవ్యాలు చెయ్యడం మొదలు పెట్టుతాయి. ఎట్లన- శ్రోత్రంబుల శబ్దంబును=చెవులతో ధ్వనిని, నేత్రంబుల రూపమును = కళ్ళతో వస్తువుల రూపాన్ని, ఘ్రాణంబున గంధమును=నాసిక, ముక్కుతో వాసనలను (సుగంధ దుర్గంధాలను) జిహ్వను=నాలుకతో, రసంబును=రుచులను, త్వక్కున స్పర్శంబును=చర్మముతో చలి, వేడి మొదలగు భావములను, మనంబున సర్వంబును= మనస్సు ఈయన్ని కార్యములను తానొక్కచే చేయును. ఆ యా ఇంద్రియముల సహాయముతోనే మనస్సు శబ్దస్పర్శ రూపరస గంధములను గ్రహించగలదు. ఎప్పుడు? మనస్సు జాగరూకమై ఉన్నప్పుడే పంచకర్మేంద్రియ సహాయమున శబ్ద స్పర్శాదు లనుభూతికి వస్తాయి. మనస్సు అనవధానముగా ఉన్నప్పుడో లేక మత్తు మందుచేత నిద్రాణమై యున్నప్పుడో పంచ కర్మేంద్రియములు తమ పనులు తాము చేస్తూనే ఉన్నా, అవి అనుభూతికి రావు. కావుననే మనస్సుచే సర్వంబును అనుట యుక్తమై యున్నది. ఎఱుంగుచు = తెలుసుకొనుచు, పూర్వ కర్మ నియోగంబున=పూర్వజన్మలో చేసిన పుణ్య పాప వాసనల చేత, సుకృతంబును, దుష్కృతంబును చేయుచు, ప్రకృత జన్మయందు చేసిన పుణ్య పాపములు వెంటనే ఫలరూపమును పొందక పోవచ్చును. అయితే ప్రకృత జన్మయందు చేసిన పుణ్యపాపాలు మిక్కిలి గాఢమైనవైనచో వాటి ఫలములు ఈ జన్మయందే అనుభవానికి వస్తాయని ఒక వాక్యం కలదు. ''అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే'' అన్నారు. దుష్కృత బాహుళ్యంబున = దుష్కృత్యములు హద్దు మీరినచో, బుణ్యంబు గీడ్పరచి, అవి పుణ్యాన్ని అణచివేయును, బుద్ధి విరహితులై = బుద్ధిశూన్యులై, తిర్యగ్యోనులయందు పుట్టుదురు = పాపాధిక్యత చేసిన జీవులు పశుపక్ష్యాది తిర్యగ్యోనులయందు పుట్టుదురు. సుకృత బాహుళ్యం

బున=పుణ్యం అధికంగా చెయ్యడంచేత, పాపంబు గీడ్పఅచి=పాపాన్ని అణగద్రొక్కి, లేదా ముందు పడనీయక, బుద్ధియుక్తులై = బుద్ధిగల జీవులై, మనుష్యయోనులందు బుట్టి = మనుష్య స్త్రీ గర్భమునుండి జన్మింతురు. యుక్తాచారులును=యుక్తమైన ఆచారము నడవడి కలవారు అవుతారు. దేహక్రియలు వేనియందును హద్దుమీరి ప్రవర్తింపకపోవుటయే యుక్తాచారము. "యుక్తహార విహారశ్చ- యుక్తచేష్టస్య కర్మసు- యుక్త స్వప్నావబోధస్య, యోగోభవతి దుఃఖహా" అని గీతావాక్యము. అట్టివారు తత్త్వవిదులు అవుతారు. వారికి దేవత్వం వచ్చునట = దేవత్వంబునంబొంది, విశుద్ధ జ్ఞానులయి ముక్తులగుదురు = నిర్మల జ్ఞానవంతులై సంసారము పునర్జన్మలనుండి విడుమర పొందుతారు. దానినే ముక్తి అంటారు. మఱి యుక్తాచారు లెవరనిన = యుక్తాచారు లంటే ఏమిటో వివరిస్తున్నాడు, గురు శుశ్రూష సేయుచు= గురువునకు శిష్యరికం చేస్తూ, అనగా శిష్యవిధులు నిర్వరిస్తూ, నిత్యాధ్యయనాగ్ని కార్యంబుల యందప్రమత్తులయి=ప్రతి దినము వేదాధ్యయనం చేస్తూ, అగ్నిహోత్రముల నారాధిస్తూ, వీటిల్లో ఏమీ అశ్రద్ధ చొరనీయక, "స్వాధ్యాయాన్మాప్రమదః" అని తైత్తిరీయోపనిషత్తు, శమ, దమ శౌచంబులు దాల్చి—శమము=శాంతి, దమము=ఇంద్రియ నిగ్రహము, శౌచము=శుచిగా నుండుట. "యదుచ్ఛిష్టమభోజ్యమ్, యద్వాదుశ్చరితం మమ" ఇత్యాదులు శుచివిరుద్ధములు; అవిప్లుత బ్రహ్మ చర్యులైన బ్రహ్మచారులును=అస్ఖలదింద్రియులై బ్రహ్మచర్య వ్రతం తాల్చె వారును, పాపంబునకు, పరోపతాపంబునకు=ఇతరులను హింసించుటకు, వెఅచి=అత్యంతము భయపడుచు, దుష్టజనుడు పరహింసకు పీడనమునకు ఎంతమాత్రము వెనుదీయడు, ధర్మ్యంబైన విత్తంబున=ధర్మమార్గమున సంపాదింపబడిన ధనముతో, అతిథులం బూజించుచు=అతిథులకు అన్న వస్త్రాదులు ఇచ్చుచు, యజ్ఞంబులు సేయుచు, 'యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం' అని గీతా వాక్యము. 'యజ్ఞశిష్టాశిన స్సంతోముచ్యంతే సర్వకిల్బిషైః' అని కూడా గీత నుడువుతూంది. పరులు యీనిధనంబులు సంగ్రహింపక=ఉత్తములైన దాతలు తమంత తాముగా ఇవ్వని ధనాన్ని స్వీకరించక, అనగా యాచ్ఞా వృత్తితో ధనము

కూడబెట్టక పరులు తామై, ఇష్టముతో ఇచ్చిన ధనాన్ని మాత్రమే సంగ్రహింపుమని ఉద్బోధ, ఈని=ఇవ్వని, ఈయని అనే రూపం కూడా ఉంది. ''బలిమినీయని భూమివలయ పతుల'' అనేది నన్నయ ప్రయోగము బా.వ్యా. క్రియ 92, నిత్యానుష్ఠానపరులయిన గృహస్థులును= ప్రతిదినము తాను పెట్టుకొన్న అనుష్ఠానము=పూజాదులు, జపము మొదలైనవి వదలక ఆచరించు గృహస్థులను=గేస్తులును, మీది వాక్యాల్లో బ్రహ్మచారులను గురించి మాత్రమే ప్రశంసరాగా, గృహస్థుడైన వాని మాటేమిటి అనే దానికి సమాధానంగా ఇది చెప్పబడింది. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులుయతులు నలుతెరగుల వారును తాము తరించి ఇతరులను తరింప చేస్తారని చెప్పబోతున్నాడు. ఎటువంటి వానప్రస్థులు? నియతాహారులై =ఆహార నియమం పాటిస్తున్న వారై, సర్వసంగంబులు పరిత్యజించి=భార్యాపుత్ర, ధనధాన్యాదులతో, సంగమము=సంబంధము, నాదియనే భావము, మమత్వమనుట, ఈషణత్రయము అని కూడా అంటారు. విడిచి, జితేంద్రియులైన వానప్రస్థులును = జయింపబడిన ఇంద్రియ వాంఛలు కలవారైన వానప్రస్థులును. వానప్రస్థము మూడవ ఆశ్రమము. యతులను గూర్చి చెప్పుతున్నాడు. ఎట్టి యతులు? వనము లందే నివసిస్తూ, గ్రామ్య వస్తువుల నుపయోగింపక. రెండర్థాలు చెప్ప వచ్చును. గ్రామాల్లో పండించిన వస్తువులు అని కాని, నింద్యమైన వస్తుజాతము-మద్య మాంసాదులు కావచ్చును. వీటిని ఉపయోగింపక, గ్రామంబుల నుండి=గ్రామాలకు వెళ్ళవలసి వచ్చినప్పటికీ, శరీరధారణార్థము=శరీరం నిలుపడానికి అవసరమైన, నియత స్వల్ప భోజనులయి = నిషిద్ధముకాని మితాహారమునే కైకొనుచున్న వారయి, జిహ్వాచాపల్యం తృప్తి పరచడానికి తినేవికాక కేవలము శరీర ధారణకు అవసరమైన ఆహారమునే సేకరించుకొనుచు, నగర ప్రవేశంబు పరిహరించి=నగరములవంక పోక-నగరాల్లో ఇంద్రియోద్రేకం రేకెత్తించే సన్నివేశాలు చాలా ఉంటాయి కనుక, అనగా వారకాంతా ప్రాచుర్యం మొదలైనవి, వాటినుండి దూరముండి, కామక్రోధాదుల బొరయక = కామము, కోపము మొదలగు అరిషడ్వర్గమును దరికి రానీయక, శౌచాచార క్రియారతులయి=బాహ్యాభ్యంతర శౌచమును పాటించుయత్నమునందు

దీక్షకలవారై, సర్వ ద్వంద్వంబులు నోడిచి = ఒడియు అను ధాతువును కలదు, బియ్యం ఒడిసాయి. అంటే అయిపోయినాయి అనుట. ఒడిచి = సన్న గిల్లునట్లు చేసి అనియైన అర్థం కావచ్చును. ద్వంద్వములు ఇదివరలో వివరింపబడ్డాయి-శీతోష్ణములు. సుఖదుఃఖములు, నిందాస్తుతులు, మానావమానములు ఇట్టి జంటలు ద్వంద్వములు. ''తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టోయేనకేనచిత్'' అని గీతావాక్యం, ఒడిచి = ఓడించి, జయించి. ఓడు ధాతు ప్రేరణ రూపము. సర్వసంగ వివర్జితులయి = నాది, నావారు అనే ప్రత్యేకాభిమానమును విడిచిపెట్టి, ఏకచరులయి = తురీయాశ్రమమునందు అనగా సన్న్యాసాశ్రమమునందు భార్యా సంబంధము కూడ ఉండదు గనుక ఏకచరులయి అనుట. ఏకమాత్ర జీవి అయి. వానప్రస్థములో భార్య తనవెంట ఉండుటకు అనుమతి కలదు. ధృతరాష్ట్రుడు వానప్రస్థమునకు పోవునప్పుడు గాంధారి, కుంతీదేవి, విదురుడు వెంట వెళ్ళినట్లు మహాభారతంలో ఉంది. అనేక నికేతనులయిన యతులును = తన యిల్లు, తన వాకిలి అనే బంధము త్రెంచుకోబడింది కనుక యతియైన వానికి అన్ని యిండ్లును తన ఇళ్ళే అనగా ఇష్టమైన ఇంటికి మధూకరార్థమో దేనికో వెడతాడు. అందుచేత యతీంద్రుడు ఏక నికేతనుడు కాడు. అనేక నికేతనుడు. ఇట్లనుటచేత అతడు పర గృహములందు మకాము చేసి సేవలు కైకొంటాడని కాదు. దీనికి ఉదాహరణముగా శుకయోగీంద్రుని చెప్పవచ్చును. తపోధన్యాగ్రణియైన శ్రీ శుకుడు ఏ యింటిదగ్గరకూడా ''గోదోహన కాలమును'' మించి నిలబడడట. ఆవును పితకడానికై ఎంత స్వల్ప వ్యవధి పట్టునుందో తావన్మాత్రకాలమే ఆ మహాయతి ఇండ్లదగ్గర నిలబడేవాడట. ఏక చరులయి అన్నదానికి సమర్థకంగా ఆంధ్ర భాగవత పద్యం చెప్పవచ్చును. ''సముడై యెవ్వడు-ఒంటిబోవ.'' అటువంటి యతీంద్రులును' వీరలు-నాలుగు ఆశ్రమముల సర్వసంగ పరిత్యాగులును తమ తమ పుణ్యాచారంబులంజేసి = తమ పుణ్య ప్రవర్తనలచేత క్రిందం బదితరంబుల వారిని = తమ తరువాత జన్మించు పది తరముల తమ కుటుంబీకులను, మీదం బదితరంబుల వారిని = తమకు ముందు తమ కుటుంబంలో జన్మించి మరణించిన పది తరముల వారిని ''దశపూర్వేషామ్ - దశాప

రేషామ్'' అని వివాహ మంత్రము. తమ్మను= తమను తాము ఉద్ధరింతురు. ఊర్ధ్వలోకప్రాప్తి కలవారినిగా చేస్తారు.

తా. అర్థవివరణమునందే తాత్పర్యమును గతార్థమయినది. తిరిగి వ్రాయుట పునరుక్తి అవుతుంది. అష్టకాదులు కోరినట్లు యయాతి వారికి జీవోత్పత్తి విధానము, గర్భమునందు పిండము ఆయా దేహముల రూపము క్రమంగా వికసింపజేసుకోవడము, మనుష్య యోనులందు ఎట్టివారు జన్మ పొందుతారో, యుక్తాచారులనగా ఎవరో, నాలుగు ఆశ్రమములలోని జనుల ఆచార వ్యవహారములు, వారు తమ వంశీయులను పది తరములు క్రింద వారిని, పది తరములు పైవారిని తమ్మను ఎట్లు ఉద్ధరిస్తారో సంగ్రహంగా వివరించాడు.

'యుక్త' శబ్దాన్ని సాయనాచార్య భాష్యం ఇట్లా వివరించింది; ''నిత్య నైమిత్తికానుష్ఠానే స్వయంప్రవృత్తాయుక్తాః.'' భగవద్గీత ఆత్మ సంయమ యోగం 8వ శ్లోకం కూడా చూసేది.

*222.* క. *మానాగ్నిహోత్రమును-నాలుగు నర్హిల్.*

అర్థం. మానాగ్నిహోత్రమును= దురభిమానముతో చేయు అగ్నిహోత్రమును-అనగా దంభార్థము ఇతరులు చూడవలెననే అసత్సంకల్పంతో చేసే అగ్ని ఆరాధనమును-చూడు-గీతాశాస్త్రము, 17-12 శ్లోకము. మఱి మానాధ్యయనంబును= దురభిమానంతో కూడిన అధ్యయనమున్నూ- అనగా ప్రదర్శనార్థమై ఇతరులు చూడవలెననే అసత్సంకల్పంతో చేసే వేదాధ్యయనమున్నూ, మానమౌనము= దురభిమానంతో మౌనం పాటించడమున్నూ 'సత్యాయ మితభాషిణాం' అని రఘువంశపురాజులను గూర్చి చెప్పినట్లు అధిక ప్రసంగంచేత అసత్యాలు దొర్లుతాయి అనే భయంతో మౌనం పాటించడం ఉత్తమ ధర్మం అవుతుంది కాని, సుమతీశతకంలో చెప్పినట్లు 'అధరము కదిలీకదలక-అధికారరోగపూరిత మౌనము' మౌనానికి ఆదర్శంకాదు. అది దురహంకారత్వంతో పాటించే మానమౌనము. అవి జ్ఞానంతో= విజ్ఞానదృష్టి లేక, మానయజ్ఞము= దంభముతో ప్రదర్శన

కొరకై చేయు యజ్ఞయాగాదికర్మలును, ఉర్విన్=భూమియందు, ఈ నాలుగును, మానాగ్నిహోత్రము మొదలైనవి. అయథార్థములు= యథార్థములైనవికావు. రాజసములో, తామసములో కావచ్చును కాని సాత్త్వికగుణ ప్రశంస్యములు కావు. దాంభికుడైనవాని అగ్నిహోత్రము, మౌనము, యజ్ఞాచరణము ఇవన్నియు నిష్ఫలములనుట. లేదా అల్ప ఫలదాయకము లనుట.

తా. దంభముతో ప్రదర్శన కొరకు, అనగా ఇతరులు చూచి తనను మెచ్చు కోవాలనే దురభిమానముతో చేయబడు అగ్నిహోత్రము, అధ్యయనము, మౌనము, విజ్ఞానం లేకుండా చేసే యజ్ఞము-ఈ నాలుగును నిష్ఫలములని యయాతి భావించాడు. ఇవి యథార్థములు అనగా సాత్త్వికాచరణములు కావు. అయథార్థములు. రాజస తామస క్రియలకోటిలోనికి వస్తాయి. ఇవి విధిదృష్టవిధానమున పరప్రదర్శనకు కాక, ధర్మ్యములు అని చేయవలె నని యాతని హితబోధ. దానం ఇచ్చేటప్పుడు 'శ్రియాదేయం, హ్రియా దేయం, భియాదేయమ్, సంవిదాదేయమ్' అని ఉపనిషత్తు అనుశాసి స్తూంది. అధ్యయన, యజ్ఞాదులు కూడా అట్టివే. క్రైస్తవులలో కూడ గుప్తదానం ప్రశంసింపబడింది. Let not thy left hand know what thy right hand gives. నీవు కుడిచేత్తో చేసిన దానం ఎడమచేతికి కూడా తెలియనీయవద్దు.

*223. వ. అని యయాతి యష్టకాదు లడిగిన వానినెల్ల సంక్షేప రూపంబునం జెప్పుటయు వార లిట్లనిరి*

అష్టకాదు లడిగిన ప్రశ్నల కన్నిటికి యయాతి సంగ్రహంగా సమాధానాలు చెప్పాడు. అప్పుడు అతని దౌహిత్రు లారాజుతో ఇట్లా అన్నారు.

*224. తే. సకల ధర్మ విదుండవు - గలవె యనిన*

అర్థం. ఈవు = నీవు, సకల ధర్మ విదుండవు=సమస్త ధర్మములు తెలిసిన వాడవు, సకల లోక వర్తనము లెఱింగిన = సర్వలోకముల ప్రవర్తన

ములు, నడక తీరులు తెలిసిన, పుణ్యకర్తవు=పుణ్యమూర్తివి, బా. వ్యా. కార-38, 34 చూచునది. నెయ్యమొనరంగ=మా మీద ఉండే ప్రేమ చేతను, దౌహిత్రులనే అనురాగం చేతను, మాకు పుణ్యలోకములు = పుణ్యలోకాలు, ఊర్ధ్వలోకాలు, వెలయ=నిక్కముగా, కలవె=ఉన్నాయా, ఉంటాయా, ఎఱిగింపుమయ్య = తెలియచేయండి, మనుమలు గనక అభిమానంతో చెప్పుతాడేమో, నిజంగా ఉంటాయో, లేవో అని వారి భయము కావచ్చును. ఈ సందేహం 'వెలయ' శబ్దంలో చూసుకోవాలి. ఎరిగింపుమయ్య-చూ. బా. వ్యా. క్రియ-88.

తా. నీవు సమస్త ధర్మములు తెలిసినవాడవు. అన్ని లోకముల నడకతీరులు గుర్తించిన వాడవు. మా యందలి ప్రేమతో మాకు పుణ్యలోకాలు ఉన్నాయో లేవో నిక్కముగా, మొగమోడక చెప్పవయ్యా అని యయాతిని ప్రార్థించారు. ఇప్పుడు వారున్నది సద్భువన లోకము. దీని పైది ఇంద్ర లోకంలా కనబడుతుంది. ఇంద్రసభ నుండియే కదా మహా తపస్సంపన్నుడయ్యీ యయాతి క్రిందకు త్రోయబడినాడు. ఇంద్ర లోకము మీదిది బ్రహ్మలోకం కావచ్చును. ఈ విధంగా శ్రేణులుగా ఉన్న పుణ్య లోకాలకు అధిరోహించే అధికారం మాకు ఉన్నదా అని వారి ప్రశ్న. తప్పక ఉన్నదని యయాతి వారిని ఆశ్వాసించాడు.

*225. వ. మీకుం బుణ్యలోకంబులు - ఊర్ధ్వలోకంబునకుం జనియె నని.*

అర్థం. మీకుం బుణ్యలోకంబులు గలవని యయాతి చెప్పగా విని, ఆ నలువురును సంతోషించిరి. మరియు ఇట్లా అన్నారు : ఏమునీ దౌహిత్రులము సుమ్ము =మేము నీకు కుమార్తెల వంకనైన సంతానము సుమా, నీకు పరాయి వాండ్రము కాము అనుట, అని తమ్మెఱింగించి = తమ్ము పరిచయం చేసుకొని, వానికి=యయాతికి, పుణ్య లోకము లిచ్చిరి, అట్ల య్యయాతి సత్సంగతిం జేసి=సజ్జన సంఘంతో కూడడం వలన, తానును, దౌహిత్రులును, ఊర్ధ్వలోకంబునకుం జనియె=పై పై లోకాలకు తిరిగి అధిరోహించాడు. అనగా సజ్జనసాంగత్యం వలన సాధింపబడని ఉదాత్త ప్రయో

జనాలు లేవనుట. చనియె-బా. వ్యా. కార-౫౮. అని వైశంపాయనుడు జనమేజయునకు భారత కథ ఉపన్యసించాడు.

తా. అష్టకాదులు మేము నీ మనుమలమని యయాతికి పరిచయం చేసుకొని, అతనికి పుణ్య లోకములు ఇచ్చారు. సజ్జన సాంగత్యం సమకూర్చి పెట్ట లేని ఉత్తమ ప్రయోజనాలు లేవు. యయాతియు, అతని దౌహిత్రులును ఊర్ధ్వలోకములకు అధిరోహించిరని వైశంపాయన మునీంద్రుడు జనమే జయునకు వివరించాడు.

# ఉపసంహారము

యయాతి చరిత్ర లోకవృత్తానికి సన్నిహిత ప్రతిబింబంగా ఉంది. ఇందులో రకరకాల పాత్రలు మనకు ప్రత్యక్షమవుతున్నారు. స్వకీయ వర్గ క్షేమానికై తన ప్రాణం అపదలో పెట్టుకొన్న కచుడున్నాడు, సమస్త ధర్మా ధర్మ విదుడైన శుక్రాచార్యుడున్నాడు. కొంచెమాకుతనంగా పెరిగి భర్తృకాంక్షిణియైన దేవయాని ఉంది. రాజసం మూర్తీభవించిన రాచకన్నియ శర్మిష్ఠ ఉంది. శుక్రాచార్యుడు తన రాజ్యాన్నుంచి వెళ్ళిపోతే తన ప్రజలైన దైత్యగణం ఏమవుతుందో అనే భయంతో తన స్వంత కుమార్తెను శర్మిష్ఠను దేవయానికి దాసిగా సమర్పించడానికి కూడా వెనుదీయని ప్రజాహిత తత్పరుడైన దానవేంద్రుడు వృషపర్వుడున్నాడు. తండ్రి కోర్కెను, వికృతమైనప్పటికీ తీర్చి, వంశకర్తయై వెలసిన పూరువు ఉన్నాడు. పూసల్లో దారంలాగ అడుగడుక్కీ నహుషపుత్రుడైన యయాతి ఉన్నాడు. అతడు తన భావాలు కప్పిపుచ్చడం చెయ్యని ధీరుడు. గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు. అంతకుమించి మహా ఘోర తపస్సులు ఆచరించి బ్రహ్మలోక పర్యంతం వెళ్ళి, పరమపదసోపానపటంలో పాముకాటుచేత క్రిందికి పడిపోయిన వ్యక్తిలాగ సద్భువనందాకా పడిపోయాడు. దీనికి కారణం ఆతని గర్వోక్తియని ఇంద్రుడంటాడు. కాదు- యయాతి సహజగుణమైన ధర్మ సంభాషణా వైముఖ్యం అని మనము అనుకుంటాము. అందుచేత యయాతి మహారాజు మన దృష్టిలో ఇంద్రుని కంటె అభ్యర్హితుడు. తనకింకనూ ఇంద్రియభోగాభిలాష తీరలేదని ఎంత ఋజువర్తనుడైన మహావ్యక్తి చెప్పగలుగుతాడు? అల్పులైన వారు అంత నిష్ఠుర సత్యం కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పలేక శుష్కవేదాంతం వల్లెవేస్తూ ఇంద్రియ సుఖాలకై గుటకలు మ్రింగుతూంటారు. ఇట్టివారినే భగవద్గీత ''మిథ్యాచారులు'' అని తెగడింది.

ఇంత గొప్పవాడైనా యయాతి తన తపస్సు మహర్షుల తపస్సుకన్న మిన్నయైనదని ఎందుకు అన్నాడు? ఎందుకు అధోలోకాలకు నెట్టబడ్డాడు. ఇక్కడ ఒక శ్లోక భాగం మనకు ఉపకరిస్తూంది.

14)

"ప్రాయస్స మాపన్న విపత్తి కాలే
ధియోపిపుంసామ్ మలినాభవంతి"

ఆపదరావలసి యుండగా అనగా విధిలేక దైవ వశంచేత అన్నమాట, పుంసాం = విజ్ఞులైన మహాపురుషుల యొక్కయు బుద్ధులు, యుక్తాయుక్త వివేక జ్ఞానము మలినమవుతున్నాయి. అనగా తమ సహజ దీప్తిని కోల్పోతున్నాయి. విధి బలియమైనదని ఆధునిక యుగంలో కొంతగానైనా ఒప్పుకోక తప్పదేమో? అట్లని విధిలేక దైవము ముందు కాళ్ళు చేతులకు సంకెళ్ళు తగిలింపబడిన వాళ్ళ ల్లాగ నిష్క్రియులము కానక్కరలేదు.

1-9-319/1
Vidyanagar
Hyderabad-44.

ఖండవల్లి లక్ష్మీరంజనం.
ది. 10-12-1982

# శకుంతలోపాఖ్యానము

ఆంధ్ర మహాభారతము : నన్నయ

వ్యాఖ్యాత

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# శకుంతలోపాఖ్యానము

శా. ఆ దుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంత మాతంగ మ
ర్యాదాలంకృతమైన భూ వలయ మాత్మాయత్తమై యుండఁగా
నాదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో
నా దిక్షత్త్రి చరిత్ర నేలె నజితుండై బాహు వీర్యంబునన్. 1

అర్థం. అనంత సత్త్వుఁడు = మేరలేని బలము కలవాడు, ఆశాంత మాతంగ = దిగంతములందలి యేనుగులు, మర్యాద = పొలిమేర, సమీర = గాలి.

భావం. సర్వ దిగంతములకు వ్యాపించిన భూమండలము అపారబలము గల ఆ దుష్యంతుని యధీనమున ఉండెను. సూర్యకిరణములకు వాయువునకు చొఱరాని భీకరమైన అరణ్య దేశములతో ఉన్న భూవలయమును భుజ పరాక్రమముతో ఆ దుష్యంతుడు జయింపబడనివాడై తొలినాటి రాచవారి నడవడితో పాలించెను.

విశేషం. తెలుగు కవులకు కులగురులైన నన్నయ భట్టారకుని ఆంధ్ర మహాభారత ములో ఒక్కొక ఉపాఖ్యానము ఒక్కొక కావ్యము. ఇప్పుడీ శకుంతలో పాఖ్యానము ఆది పర్వములోనిది. నాల్గవ యాశ్వాసము దీనితో ఆరంభ మగును. దుష్యంతుడు యయాతి వంశములోనివాడు. దుష్యంతుని తండ్రి ఈలినుడు. తల్లి రథంతరి. "ఆ దుష్యంతు దనంత సత్త్వుడు" ఈ వృత్తము పేరు శార్దూలము. మొదటిది మగణము. మగణము మూడు గురువులు కలది. ఈ గణముతో కావ్యారంభము చేయుట మంగళప్రదము. ఆ దుష్యంతుడనుటలో ముందున్న తచ్ఛబ్దము ఆయన వంశ ప్రసిద్ధికి, ఆయన పరాక్రమమునకు స్ఫోరకము. దుష్యంతుని అనంత సత్త్వమును వ్యక్తము చేయుటకు శార్దూల మిచట తగియున్న వృత్తము. ఏ రస భావములకు ఏ వృత్తము ఉచితమో తెలిసివాడుట నన్నయ పద్య విద్యారహస్యజ్ఞతలోని యొక అంశము. ఈ పద్యములోని

సమస్తాశాంత ... ఇత్యాది సమాసము దుష్యంతుని సామ్రాజ్య విస్తృతిని మనోహరముగా సూచించుచు.

క. ఆ రాజ్యంబున ను
ర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజా శో
కాంతక క్షయ శంకా
పేతంబై ధర్మ చరితఁ బెరుఁగుచు నుండెన్. 2

భా. ఆ దుష్యంతుని యేలుబడిలో భూతలము ప్రజాసమృద్ధి కలిగి యుండెను. రోగము, దుఃఖము, భయము, తగ్గుదల, సంశయము అన్నవి లేకుండ న్యాయమైన నడవడికలో ప్రజలు పెంపొందుచుండిరి.

వి. అయిదారు శ్లోకములలో విస్తరించియున్న మూల భావసామగ్రిని "రుజా శోకాతంక క్షయ శంకాపేతంబై" అన్న సమాసము పొందికగా కుదించి చెప్పుచున్నది.

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయా వినోదార్థియయి యాదిత్యహయంబులకంటె వడిగల వాహనంబులు పూనిన రథంబెక్కి యాజానేయ తురంగారూఢులైన యాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంత శక్తి చాప కృపాణ పాణులయిన వీరభట సహస్రంబులతోఁ జని వనంబులోని మృగంబులం జుట్టిముట్టి. 3

క. కలయఁగ నార్పుల బొబ్బల
యులివున నవ్విపిన మను మహోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంత మహా
బల మందరనగము సత్త్వ భయజనకంబై. 4

అర్థం. మృగయ=వేట, ఆదిత్యహయములు = సూర్యుని గుఱ్ఱములు, ఆజానేయతురంగ=మేలిజాతి గుఱ్ఱము, ఉలివు=మ్రోత.

భా. ఆ రాజు ఒకనాడు వేట వేడుకతో సూర్యుని గుఱ్ఱములకంటెను వడి గల అశ్వములు పూనిన రథమునెక్కి అడవికి వెళ్లెను. మృగములను చుట్టు

ముట్టెను. మేలిజాతి గుఱ్ఱముల నెక్కిన ఆశ్వికులు ఆయనవెంట నుండిరి. లెక్కలేనన్ని బల్లెములు, చిల్లకోలలు, విండ్లు, కత్తులు ధరించిన వేల కొలది వీరభటులును ఆయనతో ఉండిరి.

యోధులు చేయుచున్న అఱపుల సింహనాదముల మ్రోతలతో మృగములకు వెఱపు కలిగించుచు దుష్యంతుని మహాబల మనెడి కవ్వపు గొండ అడవి యనెడి సముద్రమును మిక్కిలి కలచివైచెను,

వి. విపిన సముద్రమును మథింపగా రాజునకు శకుంతలారూప లక్ష్మి లాభము జరిగినది. దాని కిక్కడ సూచన.

క. సరభస పరిచలిత మహా
శరభ ద్వీపరిపు వరాహ శార్దూల మద
ద్విరదాది ప్రకర భయం
కర వన మధ్యమున నృపతి గడుఁగడిమి మెయిన్. 5

క. ఓసరిలి పఱచు మృగముల
నేసియు డాసిన మృగముల నెగచి భుజాసిన్
వ్రేసియుఁ జంపెను మృగయా
వ్యాసక్తి నపార ఘోర వన్య మృగాళిన్. 6

తా. తొందరగా పరువిడుచున్న శరభములు, సింహములు, అడవి పందులు, పులులు, మదపుటేనుగులు మున్నగు మృగములచే భయము గొల్పుచున్న అవన మధ్యమున రాజు తొలగి పాఱిపోవు ఘోర మృగముల నెన్నింటినో కొట్టెను; దగ్గరపడిన మృగములను కత్తితో పొడిచి చంపెను.

వి. మొదటి కంద పద్యములో మూడున్నర పాదముల ఒకే సంస్కృత సమాసము. ఆయా సమస్త మృగములయొక్క కదలికకు అభివ్యంజక మగు వర్ణ పదవిన్యాసము గమనింపవచ్చును. రెండవ కందములోని తెనుగు పదముల సన్నివేశము రాజుయొక్క మృగయా వినోదమును స్ఫురింపజేయును.

వ. ఇట్లు పెక్కు మృగంబుల నెగిచి చంపుచు మఱియుఁ జంపెడి వేడుక నతిదూరంబున కరిగిన నాతని రథవేగంబు ననుగమింప నోపక యధిక క్షుత్పిపాసా పరవశులయి పదాతు లయ్యయి ప్రదేశంబుల విశ్రమించి రంత దుష్యంతుడు కతిపయామాత్య పరిజన పురోహిత సహితుండై కొండొకనేల యరిగి ముందట నొక్క పుణ్యనదీ తీరంబున వివిధ సురభి కుసుమ ఫలభార వినమ్ర తరు లతాగుల్మ పరిశోభితం బయిన యొక్క వనంబు గని. 7

క. అమరపతి ఖాండవమునకు
రమణను వైశ్రవణు చైత్ర రథమునకు సమా
నముగా దీనిని భూభా
గమునకు రచియించె నొక్కొ కమలజుఁడు దయన్. 8

వ. అని దాని రమణీయ భావంబుఁ బొగడుచుఁ జనుదెంచి యవ్వనంబు సొచ్చునప్పుడు. 9

అర్థం: క్షుత్పిపాసలు = ఆకలిదప్పులు, పదాతులు = కాలిబంట్లు, కతిపయ = కొందఱు, వైశ్రవణుఁడు = కుబేరుడు.

భా. ఇట్లు చాల మృగములను చంపెను. ఇంకను చంపదలచి చాల దూరము పోయెను. అతని రథ వేగమును కాలిబంట్లు అనుసరింప లేకపోయిరి. ఆకలిదప్పికలతో ఆయా చోట్ల విశ్రమించిరి. దుష్యంతుడు కొందఱు మంత్రులు పరిజనము పురోహితుడు వెంటరాగా కొంత దూరము వెళ్లెను. అక్కడ ఒక పుణ్యనది. (దాని పేరు మాలిని) ఆ నది యొడ్డున ఒక వనము. పరిమళించుచున్న పలురకముల పూలతో పండ్ల బరువుతో వంగిన చెట్లు; తీవ జొంపములు; దుష్యంతుడు ఆ వనమును చూచెను. 'ఇంద్రుని ఖాండవమునకు, కుబేరుని చైత్ర రథమునకు సాటిగా భూభాగమున బ్రహ్మ దీనిని చక్కగా సృష్టించెనా, అని వన సౌందర్యమును పొగడుచు వనములో ప్రవేశించెను,

వి. ఖాండవము, చైత్రరథము అను రెండు వనములు భూభాగము లోనివి కావు. మరి-ఈ వనమును సృష్టించి బ్రహ్మ భూమికి ఘనత తెచ్చెను అని ఉత్ప్రేక్ష.

చ. అతిరుచిరాగతుండయిన యాతనికిన్ హృదయ ప్రమోద మా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాప వ
ర్జిత కుసుమాక్షతావళులు సేసలు వెట్టిన యట్టిరైరి సం
పత దళినీ నినాద మృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్. 10

భా. మిక్కిలి ఒప్పిదముగా వచ్చిన దుష్యంతునకు ఆనందముగా ఆ వనము లోని తీగలనెడి మగువలు తుమ్మెద రొదలనెడి మృదువాక్కులతో దీవనలు చేయుచు పిల్లగాలిచే రాల్పబడిన పువ్వులనెడి అక్షతలతో తల బ్రాలు పోసినవారైరి.

వి. అతి రుచికరమైన అగతము కలవాడు. అనగా మిక్కిలి యొప్పిదమైన స్వాగతము కలవాడు. అగతము = అగమనము (భావే క్తః) సు+ అగతము-స్వాగతము. ఆ వనము రాజునకు అందమైన స్వాగత మిచ్చె నన్నమాట. మహారాజునకు తగిన యుపచార మిచట జరగెను. జరుగ బోవు కల్యాణమున కిది సూచన. నన్నయగారి ప్రతి శబ్దము అర్థ వంతము. లతాలలనలు సేసలు పెట్టిరట. లత యనగా చుట్టుకొనెడిది. (లతతీతి లతా. వేష్టనార్థః) లలన=కోరిక కలది, విలాసవతి (లల ఈప్సాయాం. లలతీతి లలనా వ్యుత్పత్తి) ఇక్కడి లతాలలనలు అన్న రూపకములోని శబ్దములు రెండును శకుంతల యొక్క కాంక్షా విలాసము లకు స్ఫోరకములు. రుచిరాగతుడు-మృదుల + అనిల + అపవర్జిత కుసుమ + అక్షత + అవళులు-ఈ సమాస గతమైన సవర్ణ దీర్ఘాక్షరములు ఒకానొక గీతికామాధుర్యమును అనుభవింప జేయును.

వ. మఱియును- 11

క. కాఱడవిఁ బఱచు మృగముల
నూఱడకం దిగిచి డస్సి యున్నతని శ్రమం

బాఱఁగ నెడ ఐరితాపము
దీఱఁగఁ బై వీచె నన్నదీ పవనంబుల్. 12

భా. దట్టమైన అడవిలో పరుగెత్తు మృగములను వేటాడి బడలియున్న ఆ దుష్యంతుని యలసటయు మనస్తాపమును తీరునట్లు ఆ నదీవాయువులు వీచెను.

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగు తావుల జొంపములం
బూచిన మంచి యశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదఁగులన్
గాచి బెడంగుగఁ బండిన యా సహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుక కోకిల సుస్వరముల్. 13

కవిరాజ విరాజితము: చని చని ముందట నాజ్యహవిర్ధృత సౌరభ ధూమలతా తతులం
బెనఁగిన మ్రాఁకుల కొమ్మలమీఁద నపేతలతాంతములైనను బా
యని మధుప ప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్రునివాసము దానగునంచునెడన్. 14

భా. పొదవుగా పెరిగి చిగిరించిన గోరంట చెట్లతో సొగసైన తావులను వీవ గుబురులను పూచిన అశోకములను, సురపొన్నలను, పొన్నలను, మొగలి పొదలను, చక్కగా కాచి పండిన తియ్య మామిడి చెట్లను, అరటి చెట్లను చూచుచు, చిలుకల పలుకులు, కోయిల పాటలు చెవుల పండువుగా వినుచు వెళ్ళి వెళ్ళి ఎదుట పరిమళించెడి హోమధూమలతలు చుట్టుకొన్న చెట్టుకొమ్మల మీద పువ్వులు లేకున్నను తుమ్మెదలుండుట చూచి ఆ దుష్యంతుడు 'ఇది మహామునికి నివాసమైన తపోవన' మని మనస్సులో తలపోసెను.

వి. ఇక దుష్యంతునకు ఆశ్రమములో శకుంతలా దర్శనము జరుగనున్నది. ఆమె మానిని. ఈ వృత్తము దానిని స్ఫురింపజేయును. పూచిన అశోకములు, కాచి పండిన తియ్య మామిళ్ళు మున్నగు వానిని చూచుట–శుక కోకిల సుస్వరములు వినుట-భావి శుభమునకు ఉపశ్రుతులు. మానినీ

వృత్తము తరువాత కవిరాజ విరాజితము. ఈ రెండు వృత్తములకు దగ్గరి సంబంధము కలదు. 'మానిని' లోని మొదటి గురువును రెండు లఘువులుగా మార్చినచో 'కవిరాజ విరాజిత' మగును. చంపకోత్పలము లకుగల సంబంధము వంటిది. మానినీ-కవిరాజ విరాజితములు రెండును శకుంతలా దుష్యంతుల వంటి జంట వృత్తములుగా నుండి భావి కల్యాణ సమాగమమును సూచించుచున్నవి. నన్నయగారి ఛందోవిద్యారహస్యజ్ఞ తకు ఇది యొక మచ్చు.

వ. ఇట్లు హృదయ సుఖావహంబగుచున్న యవ్వనంబులో నరిగి యరిగి యనవరత పదక్రమ పఠ్యమాన మహాద్విజ వేద ధ్వనులను నవిచ్ఛిన్న హూయమానాగ్నిహోత్ర స్వాహా శబ్దంబులను ననేక ముని గణ ప్రణీత వచన విషయ విభాగ వినిర్ణయ న్యాయ నిపుణ విద్వత్సభా సంభాషణ ఘోషంబులను బ్రతిపక్ష దుర్విభేద ప్రమాణ విచార్యమాణ వేదార్థ మీమాంసక గోష్ఠీ వివాద నాదంబులనుం జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగ ప్రవీణులైన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతల కును నధిక తపోనిరతులయిన మహా తపోధనులకును నివాసంబయిన పుణ్యనదీ తీరంబునఁ దద్దయు రమ్యంబయి గంగా తీరంబున నరనారా యణ స్థానంబునుం బోలె జగత్పావనంబగుచున్న కణ్వ మహాముని యాశ్రమంబు గని యందు- 15

భా. ఆ వనములో నిరంతరము పద-క్రమముగా పఠింపబడుచున్న విప్రుల వేదనాదములు, అవిచ్ఛిన్నముగా వేల్వబడుచున్న అగ్నిహోత్ర మందలి స్వాహా శబ్దములు, అనేక మునులు చేసిన నిర్వచనముల విషయ విభాగ నిర్ణయమున న్యాయచతురులైన పండితుల సంభాషణ ఘోషములు, పర పక్షములకు భేదింపరాని ప్రమాణములతో వేదార్థ విచారణము చేయు మీమాంసకుల వివాద ధ్వనులును మ్రోత పెట్టుచున్నవి. యాజ్ఞికులకు కర్మ నిష్ఠులకు మహా తపస్వులకు ఆ పుణ్య నదీ తీరము నివాసముగా ఉన్నది. గంగా తీరమున నరనారాయణాశ్రమమువలె ఆ మాలినీ నదీ తీరమున ఉన్న లోకపావనమైన కణ్వ మహర్షి యాశ్రమమును దుష్యం తుడు చూచెను.

సీ. శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకములు చదువు దగిలి
కదలక వినుచుండు కరులును గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణముల చల్లనిగా డ్పాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు భూతబలుల్ తెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు

గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్న యెలుకలు బిల్లులు నొందు సహజ
వైరి వర్గంబులయు సహవాస మపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది. 16

వ. ఇక్ష్వాకువంశ్యుండైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద నా వచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని. 17

భా. చెవుల పండువుగా చిలుకలు సామగానము చేయుచున్నవి. ఆ చిలుకల చదువులను ఆసక్తితో ఏనుగులు వినుచున్నవి. ఏనుగు తొండముల చల్లని నీడలలో మదజలము తుంపురుల చల్లగాలికి ఆశపడి సింహములు చేరి సుఖపడుచున్నవి. ద్విజులు భూతబలులు తెచ్చి నివ్వరియన్నపు పిడుచలు పెట్టుచుండగా ఎలుకలు పిల్లులు కలసి తినుచున్నవి. సహజముగా విరోధముగల ఆ జంతువులట్లు కలసిమెలసి యుండుట దృశ్యంతుడు చూచెను. మునిశక్తికెంతో ఆశ్చర్యపడెను.

చ. వలయునమాత్యులం దగినవారల నుండఁగఁ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజదళాయతాక్షి సం
కుల మిళితాళినీల పరికుంచితకోమల కుంతలన్ శకుం
తల యను కన్యకం గనియెఁ దన్మునివల్లభు మందిరమ్మునన్. 18

భా. రాజు ఇష్టులైన మంత్రులను 'నేను వచ్చువఱకు ఇక్కడ ఉండు' దని ఆజ్ఞాపించి ఒక్కడే వెళ్ళి మునివల్లభుని మందిరములో శకుంతల యను కన్యకను చూచెను. ఆమె తన్వి. పద్మదళములవలె పొడవైన కనులు కలది. ఆమె ముంగురులు సంకులహాళితములు, తుమ్మెదలవలె నీలములు, వంపులు తిరిగినవి, మృదువులు.

వి. అమాత్యుడు. అమా+త్యుడు-రాజు కూడా ఉండువాడు మంత్రి. తనతో కూడ ఉండవలసిన వారిని కూడ కొంత దూరమున ఉంచి తానొక్కడే కణ్వమందిరమునకు వెళ్ళెను. 'పయోజ దళాయతాక్షి' అనుట వలన రాజు కన్నులు ముందుగా శకుంతల కన్నులను చూచెననుట. సంకుల మిళితాళినీల......కుంతలన్ శకుంతలను రాజు చూచెను. కుంతలము లనగా ముంగురులు. (కుంతాగ్రాకారం లాతి-వ్యుత్పత్తి) బల్లెపు కొసల వలె ఉండునవి కుంతలములు. కుంతల-శకుంతల అన్న శబ్దాలంకారమే ఇక్కడి కుంతల శబ్దము విశేషార్థద్యోతకము. శకుంతలను చూడగానే ఆమె కోమల కుంతలములు ఈటె కొసలవలె దుష్యంతుని తాకినవి. అవి మన్మథుని శరముల వంటివని సూచన. లకారము అంతస్థమైన వర్ణము. "వలయు..."అనిఉపక్రమించిన ఈచంపక మాలావృత్తమున 'ల' అను అక్షరములు తఱచుగా వినిపించును. శకుంతలయొక్క దివ్య సౌందర్య సౌకుమార్యములకు అభివ్యంజకమైన అక్షర రమ్యత.

వ. అదియును నవంత విలాసంబున జయంతుండపోని దుష్యంతు నెఱింగి యతిసంభ్రమంబున నాసనార్ఘ్య పాద్యాది విధులం బూజించి కుశలం బడిగి యున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డిట్లనెను. 19

ఉ. క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి మెందుఁ బోయిరొకొ వా రనినన్ విని యాలతాంగి వా
రిచ్చట నుండి యీ క్షణమ యేఁగిరి కానకుఁ బండ్లుతేర మీ
వచ్చు టెఱింగిరేని జనవల్లభ! వారును వత్తు రింతకున్. 20

వ. వారు వచ్చునంతవరకు నొక్క ముహూర్తం బుండునది యనిన విని యక్కోమలి వినయంబునకు మృదుమధుర వచనంబులకు సంతసిల్లి దానిం

గన్యకఁగా నెఱింగి మనోజరాజ్యలక్ష్మియుంబోనిదాని సర్వలక్షణలక్షితంబు
లయిన సర్వావయవంబులుం జూచి సంచలిత హృదయుండై నీ వెవ్వరి
కూఁతుర విట్టి రూప లావణ్య విలాస విభ్రమగుణసుందరి విందుల కేల
వచ్చితని యడిగిన నది యిట్లనియె. 21

భా. శకుంతల జయంతునివలె అనంత విలాసముతో ఉన్న దుష్యంతుని తెలిసి
కొన్నది. మిక్కిలి సంభ్రమముతో ఆసనమునిచ్చి అర్ఘ్య పాద్యములొసగి
పూజించి కుశల మడిగినది. దుష్యంతుడా కన్యకను చూచి అన్నాడు:
'మేము సవిలాసముగా వేటకై వచ్చి కణ్వ మహామునిని చూచి పోవుటకు
ఇటు వచ్చితిమి. వారెచ్చటికి వెళ్ళిరో!'' శకుంతల ఆ మాట విని అన్నది:
"వారు ఇప్పుడే పండ్లు తెచ్చుటకు అడవికి వెళ్ళిరి. మీరు వచ్చిన సంగతి
తెలిసినచో వారును రాగలరు. జనవల్లభా! వారు వచ్చులోగా ఒక
ముహూర్తము ఉండుడు.'' దుష్యంతుడు విని ఆమె వినయమునకు
మృదుమధురములైన పలుకులకు సంతోషించి ఆమె 'కన్య' అని
గ్రహించినాడు. మన్మథ రాజ్యలక్ష్మి వలె ఉన్న ఆమె అవయములను
చూడగా దుష్యంతుని హృదయము చలించినది. 'నీవెవరి కూతురవు?
ఇంతటి రూప లావణ్య విలాసములుకల సుందరివి, ఇక్కడికి ఎందుకు
వచ్చితివి?' అని అడిగినాడు.

వి. జయంతుడు ఇంద్రుని కుమారుడు. శకుంతలకు దుష్యంతుడు జయం
తుని వంటి సౌందర్యరాశి యని తెలియును. ఆమె మేనక కూతురు.
మేనక అప్సరోవనిత కదా! శకుంతల అంతరంగము దుష్యంతుని చూడ
గనే దుష్యంతుడని తెలిసికొన్నది. అట్లే శకుంతల కన్యయని దుష్యం
తుడు కనిపెట్టినాడు. ఇది వారిద్దఱి భావములందు స్థిరమైన జననాంతర
సౌహృదము. (20) ''క్రచ్చఱ వెట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి
పోవగా వచ్చితి మెందుఁ బోయిరొకొ వారు!'' అని దుష్యంతుఁడడిగెను.
'క్రచ్చఱ' అనగా సవిలాసముగా, అమోఘముగా అను నర్థము చెప్ప
వచ్చును. క్రచ్చ + అఱ–ఇది తెనుగు పదము. మహారాజుయొక్క
విలాసమంతయు ఈ ప్రశ్నలో కనబడును. శకుంతల సమాధానములో
''వారిచ్చటనుండి యీ క్షణమయేగిరి, జనవల్లభ! వారును వత్తురు. వారు

వచ్చునంతకు ఒక్క ముహూర్తం బుండునది' అని త్రివారము 'వారు' 'వారు' అనుట శకుంతల సంభ్రమమును సూచించును. కణ్వమహాముని మందిరమున లేదని దుష్యంతుడు వెడలిపోవును. ఆయనను ఆపవలెను. 'కణ్వుడు ఇంకను వచ్చుటకు ఆలస్యము పట్టును. నీవు ఆగు' మన్న యర్థము కూడ ప్రతీయమానమగును. జనవల్లభ! అను సంబోధనము లోని 'వల్లభ' శబ్దము ఈ సందర్భమున కావలెనని ప్రయుక్తము. (21) సర్వలక్షణలక్షితమ్ములయిన సర్వావయవములుం జూచి ... ఇక్కడ సర్వ శబ్దమునకు, దర్శనీయములైన అవయవములను చూచి అని అర్థము చెప్పుకోవలెను.

శకుంతల దుష్యంతునకు తన జన్మక్రమం బెఱింగించుట

క. జగతీవల్లభ ! యే న
త్యగణిత ధర్మ స్వరూపుఁడని జనములు దన్
బొగడఁగ జగదారాధ్యుం
డగు కణ్వ మహా మునీంద్రు నాత్మజ ననినన్.

భా. రాజా ! లెక్కింప జాలని ధర్మ స్వరూపుడు, లోకములకు ఆరాధింప దగినవాడు నైన కణ్వ మునీంద్రుని కూతురను అనగా.

వి. జగతీ వల్లభ ! అని సంబోధించుటయు, జగదారాధ్యుడగు కణ్వుని ఆత్మజ ననుటయు సాభిప్రాయములు.

చ. ఇది మునికన్యయేని మఱి యేలొకొ యీ లలితాంగియందు నా
హృదయము దద్దయుం దవిలె నిప్పలు కింతను నమ్మనేర న
య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక విందు నంచు దా
నిది కలరూ పెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్. 22

వ. ఇట్లు దుష్యంతుండా శకుంతల జన్మం బెఱుంగ వేఁడి వెండియు
దాని కిట్లనియె. 23

భా. "ఈమె ముని కన్య యైనచో మరి నా హృదయము ఈమె యందు ఎందుకు లగ్నమైనది ! ఈ మాట నమ్మదగినది కాదు. కణ్వముని జితేంద్రియుడని విందును." అనుకొని దుష్యంతుడు శకుంతల నిజ వృత్తాంతము తెలిసికొనుటకు వేడ్క పడెను. మరల అమెతో అనెను.

వి. "ఈమె మునికన్యక యైనచో నా మనస్సు ఈమెయందు ఏల లగ్నమయి నది !" ఈ సంశయము దుష్యంతునకు కలిగినది. మూల భారతమున తన సంశయమును దుష్యంతుడు శకుంతలతో చెప్పినట్లు ఉన్నది. నన్నయగా రట్లు కాక, ఆ సంశయము ఆత్మగతముగా ఉంచి సమా ధానపడినట్లు చెప్పిరి. ఇక్కడ కాళిదాసు నభిజ్ఞాన శాకుంతలములోని శ్లోకార్థము తెలుగునకు ఆకారము.
"అసంశయం క్షత్రి పరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః।"
తన మనస్సు ఆమెయందు లగ్నమైనది కనుకనే నిస్సంశయముగా ఆమె క్షత్రి పరిగ్రహక్షమ. క్షత్రియుడు వివాహమాడదగినది.

గీ. ఉత్తమాశ్రమ నిష్ఠితు డూర్ధ్వరేతు
డైన కణ్వమహాముని యనఘచరితు
డట్టి మునికెట్లు గూతుర వైతి దీని
నాకు నెఱుగంగ జెప్పుము నలిననేత్ర ! 24

వ. అని యడిగిన నారాజునకు శకుంతల యిట్లనియె. 25

అర్థం : ఊర్ధ్వరేతుడు = అధఃపతనము లేని రేతస్సు కలవాడు, ముని.

భా. ఉత్తమాశ్రమ నిష్ఠలో ఉండి ఊర్ధ్వరేతుడైన కణ్వమునికి నీవు కూతుర వగుట ఎట్లు? నాకు తెలియజెప్పుము అని రాజడుగగా శకుంతల చెప్పినది.

క. ఇక్కమలాక్షి శకుంతల
యెక్కడియది దీని జన్మ మెవ్విధ మని త

మ్రొక్కి మునినాథుఁ డడిగిన
నిక్కాశ్యపు లర్థిఁ జెప్పి రేను వినంగన్. 26

వ. నా జన్మ ప్రకారంబు మా యయ్య యమ్మునికిం జెప్పిన విధంబు చెప్పెదఁ జిత్తగించి వినుమని యా దుష్యంతునకు శకుంతల యిట్లనియె. 27

సీ. అనఘుఁడు రాజర్షియై తపశ్శక్తిమై
బ్రహ్మర్షి భావంబుఁ బడసియున్న
సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోర
తపము సేయుచు నున్నఁ దత్తపమున
కెంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరో
గణములలో నగ్రగణ్యయైన
దాని మేనక యను ధవళాక్షిఁ బిలిచి వి
శ్వామిత్రు పాలికిఁ జని తదీయ

ఘోర తపము చెఱచి కోమలి నాదైన
దేవరాజ్య మహిమఁ దివిరి నీవు
గావు మనిన నదియుఁ గడు భయంపడి యమ
రేశ్వరునకు మ్రొక్కి యిట్టు లనియె. 28

అర్థం. కాశ్యపులు=కణ్వముని, అర్థిన్=ప్రీతితో.

భా. ఈ శకుంతల జన్మవృత్తాంతము చెప్పుమని ఒక ముని అడుగగా మా తండ్రి కాశ్యపులు ఆయనకు చెప్పిరి. అపుడు నేను విన్నాను. ఆయన చెప్పినది చెప్పినట్లు నీకు వినిపింతును, వినుమని దుష్యంతునకు శకుంతల యిట్లు చెప్పెను: రాజర్షి యగు విశ్వామిత్రుఁడు తపశ్శక్తిచే బ్రహ్మర్షిత్వమును పొంది మరియు అతి ఘోరమైన తపస్సు చేయుచుండెను. దేవేంద్రుడు ఆయన తపస్సునకు భయపడి అప్సరసలలో తలమానికమైన మేనకను పిలిచి 'నీవు విశ్వామిత్రుని దగ్గరకు వెళ్ళి ఆతని ఘోర తపస్సును భంగము చేసి, నా స్వర్గరాజ్య మహిమను కాపాడవలెను' అని చెప్పెను. ఆమె భయపడి ఇంద్రునకు నమస్కరించి యిట్లు పలికెను.

చ. వనజభవ ప్రభావుఁడగు వాని వసిష్ఠు నపత్యశోక మ
న్వననిధిలోన ముంచిన యవారిత సత్త్వుఁడు నిన్నుఁ దొట్టి యీ
యనిమిషు లెల్ల వానికి భయంపడుచుండుదు రట్టి యుగ్రకో
పనుకడ కిప్పుడేఁగుమని పాడియె యిప్పని నన్నుఁ బంపఁగాన్. 28

ఉ. అమ్మని యల్గి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారణీ
ధ్రమ్ములు వ్రయ్య నయ్యిసుమ దక్కఁగ నంబుధు లింకు మూఁడులో
కమ్ములు దిర్దిరం దిరుగు గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం
బమ్మిన యట్టి కోపపరు పాలికి భామలు వోవనేర్తురే ! 29

అర్థం. వనజభవుఁడు=బ్రహ్మ, అపత్య=సంతానము, తొట్టి=మొదలుకొని, పాడి=న్యాయము, ధారణీధ్రము=పర్వతము, ఇసుము=ఇసుక, పమ్మిన=అతిశయించిన.

భా. బ్రహ్మ ప్రభావుడైన వసిష్ఠునంతవానిని పుత్రశోక మనెడి సముద్రములో ముంచిన శక్తిగలవాడు; నిన్ను మొదలుకొని దేవతలందరు ఆయనకు భయపడుచుందురు. అట్టి ఉగ్రకోపనుడైన ముని దగ్గరకు ఈ పనికై నన్ను పంపుట న్యాయమా?

ఆ ముని అలిగి చూచినచో క్షణములో గోత్రాచలములు బ్రద్దలగును. సముద్రములు ఇసుక మిగులునట్లు ఇంకిపోవును. మూఁడు లోకములు దిరదిర తిరుగను. గాలి కదలుటకు భయపడును. అట్టి ఉగ్ర కోపముకల వానికడకు స్త్రీలు వెళ్ళగలరా ?

వి. 'వనజభవ ప్రభావుడు' అనుట వసిష్ఠుని యొక్క ఆధిక్యము సూచించుటకు. అట్టి వానిని కూడ పుత్రశోకసాగరమున ముంచిన అవారితసత్త్వుడు విశ్వామిత్రుడు. పైని గల వసిష్ఠ విశేషణము విశ్వామిత్రుని యుత్కర్షమును స్ఫురింపజేయును. వసిష్ఠుడు బ్రహ్మమహిమ కలవాడయితే విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేయగలవాడు అను స్ఫూర్తి. ఉగ్రకోప

నుడు=ఉగ్రునివలె కోపనుడు, ఉగ్రుడనగా రుద్రుడు. ఆయన కోపము యొక్క ఉగ్రతను (29 వ పద్యము) తెలియజేయును.

వ. అయినను నానేర్చు విధంబున నమ్మునివరు చిత్తంబు మెత్తన చిత్తజాయత్తం బగునట్లుగాఁ జేసెదనని వాసవు వీడ్కొని మేనక తనకు మంద మలయానిలంబు దోడుగాఁ జనుదెంచి హిమవత్పర్వత ప్రదేశంబునం దపంబు సేయుచున్న విశ్వామిత్రు తపోవనంబు సొత్తెంచిన— 30

క. చల్లని దక్షిణ మారుత
మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాధ
మ్మిల్ల కుసుమాంగరాగ స
ముల్లసన సుగంధి యగుచు మునివరుమీఁదన్. 31

వ. అంత- 32

అర్థం. వాసవుడు=ఇంద్రుడు, ధమ్మిల్ల=కొప్పు, అంగరాగ=మైపూత.

తా. అయినను నా శక్తికొలది మునీశ్వరుని మనస్సు మన్మథ వశ మగునట్లు చేయుదునని మేనక ఇంద్రునియొద్ద సెలవు పుచ్చుకొని హిమవత్పర్వత ప్రదేశమున తపోనిరతుడైన విశ్వామిత్రుని తపోవనమునకు వచ్చెను. ఆమెకు మెల్లని మలయ వాయువు తోడుగా నుండెను. మేనక కొప్పునందలి పూలతో మైపూతలతో పరిమళించుచు చల్లని మెల్లని పైరగాలి మునివరుని మీద వీచెను.

వి. మేనక 'నా నేర్చు విధంబున మునివరుని మనస్సును మన్మథాయత్తము చేయుదు' ననుట ఆమె ధీరత్వమునకు తగిన మాట. ఆమెకు మందమలయానిలము తనంతతానే తోడయ్యెను. విశ్వామిత్రుని తపోవనము ఉత్తర దిక్కున ఉన్నది. హిమవత్ప్రదేశము కదా! అక్కడి మునివరుని మీద దక్షిణ వాయువు వీచెనట. కాబోవు మేనకా విశ్వామిత్ర సమాగమమునకు ఆ దెసనుండి యీ దెసకు వీచు గంధవహుడు రాయబారి. (31) మునివరు మీదన్ మారుతము వీచె- ఇక్కడ 'వర' శబ్దము మేనక యిష్టసిద్ధికి స్ఫోరకము.

చ. అనిమిషకాంతయున్ నవలతాంత విభూషణ లీల నల్ల న
ల్లన వనకేళిలాలస విలాసగతిం చనుదెంచి ముందటం
గనియె మహాముని ప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్తభీతి సం
జనన మహాతపశ్చరణ సంయతచిత్తు నిరస్త చిత్తజున్. 33

అర్థం. కౌశికుడు=విశ్వామిత్రుడు, ఇంద్రుడు.

భా. దేవకాంతయైన మేనక క్రొత్త పువ్వుల కై సేతతో మెల్లమెల్లగా వనకేళీ విలాస గమనమున వచ్చి మునివీరుడైన విశ్వామిత్రుని చూచెను. ఆయన ఇంద్రుని మనస్సునకు వెఱపు కలిగించు మహాతపోనిరతి కలిగి తిరస్కృతకాముడై యుండెను.

వి. మేనక అనిమిషకాంత. ఱెప్పపాటు లేకుండ విశ్వామిత్రుని చూచెననుట. ఈ పద్యమున విశ్వామిత్రునకును, ఇంద్రునకును అర్థము చెప్పు కౌశిక శబ్దములు ఉపయోగింపబడినవి. ఆ కౌశికుడు ఈ కౌశికునకు ప్రతిస్పర్థి.

క. అంబుజలోచన గని విన
యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయ వ్యా
జంబున విహరించుచుండె సఖులుం దానున్. 34

భా. పద్మనేత్రయైన మేనక అడకువతో ఆ మునికి మ్రొక్కి కూర్మితో పూలు కోయు నెపమున చెలికత్తెలును తానును విహరించుచుండెను.

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్ముని వల్లభు మ్రోల నున్న సం
మిళిత సుగంధ బంధుర సమీరవశంబునఁ దూలి బాలపై
వలు వెడలన్ బయల్పడియె వల్గుచంబులుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దరళత్రి వళీయుత రోమరాజియున్. 35

భా. ఆమె అలసభావముతో ముని యెదుట ఉండగా, సుగంధమిళితమైన గాలి వలన చలించి ఆమె పైట తొలగెను. అపుడామె పాలిండ్లు, బాహు

మూలములు, సన్నని నడుము, మెఱయుచున్న కడుపుమీది ముడుతలతో కూడిని నూగారు బయలుపడినవి.

వి. మునివల్లభు మ్రోల - ఇక్కడి 'వల్లభ' శబ్దము ప్రియత్వమును తోప జేయును. సుగంధబంధుర సమీర...సమీరము అనగా ప్రేరణ చేయునది, వాయువు. 'బాల' పదునాఱేండ్లలోపు వయస్సు కలది. వలుద=వర్ధి (పాఠాంతరము). స్థూలములైనవి; పెద్దవి. సంస్కృత భారతమున 'అని ర్దేశ్య వయోరూపా మపశ్య ద్వివృతాం తదా' అని యున్నది.

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ
గందర్పనిశాత సాయకంబులు పెలుచన్
డెందముఁగాఁడిన ధృతిసెడి
కంది మునీంద్రుండు దానిఁ గవయం దివిరెన్. 36

వ. మేనకయు విశ్వామిత్రునిష్టంబునకుం దగిన కామోపభోగంబులం బెద్ద కాలంబు రమియించిన నయ్యిద్దఱకు సిక్కన్యక పుట్టిన దీని మాలినియను నొక్కయేటి పులిన తలంబునం బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె. విశ్వామిత్రుండును దపోవనంబునకుం జనియె. నంత నమ్మని ప్రభా వంబున- 37

ఆ. చెలఁగి లేవనేడ్చు చిఱుతుకదానిఁ గ్ర
వ్యాద ఘోరమృగము లశనబుద్ధిఁ
బట్టకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు
కొని శకుంతతతులు గూడియుండె. 38

అర్థం. (36) నాటుడు=తగులుకొనగా, కందర్పనిశాతసాయకములు=మన్మ ధుని వాడి బాణములు, కాఁడిన = నాటగా, ధృతిసెడి = ధైర్యము కోల్పోయి, క్రవ్యాద=రాక్షసులు, చట్టుపలు=ఱెక్కలు, శకుంత= పక్షులు.

భా. విశ్వామిత్రుడు కామవశుడై ధైర్యము కోల్పోయి మేనకను కలసెను. మేనకయు ముని యభీష్టమునకు తగినట్లు కామోపభోగములతో చాల కాలము రమింపగా వారిద్దఱికి ఈ కన్యక పుట్టెను. దీనిని మాలినీ నది యిసుకతిన్నె మీద ఉంచి మేనక స్వర్గమునకు పోయెను. విశ్వామిత్రుడు తపోవనమునకు పోయెను. ఆ ముని మహిమచే, లేవనేడ్చుచున్న ఆ పసిపిల్లను రాక్షసులు, ఘోర మృగములు ఆహారబుద్ధిచే పట్టకుండునట్లు ఱెక్కలచే కప్పి పక్షులు రక్షించుచుండెను.

వి. మూల భారతమున బాల శకుంతలను పక్షులు తమకుతాము రక్షించినట్లున్నది. నన్నయగారు 'అమ్ముని ప్రభావమున శకుంతములు బాలను కాపాడినట్లు' చెప్పిరి. ముని మహిమ ప్రకటనము ఇక్కడ సందర్భోచితము.

వ. అంత నేము శిష్యగణంబులతోడ సమిత్కుసుమ ఫలాహరణార్థం బక్కడకుంజని యమ్మాలినీ పులిన తలంబున శకుంత రక్షితయై యున్న కూఁతు నత్యంత కాంతిమతి నవనీతలంబున కవతరించిన తరుణ శశిరేఖ యుంబోని దానిని నెత్తుకొని వచ్చి శకుంత రక్షిత యగుట జేసి శకుంతల యను నామంబిడి కరంబు గారవంబునం బెనిచితిమి. 39

భా. మేము శిష్యులతో సమిధలను పూలను పండ్లను తెచ్చుటకు వెళ్ళితిమి. మాలినీనది యిసుకతిన్నెపై పక్షులచే కాపాడబడుచున్న యీ బిడ్డను చంద్రరేఖవలె వెలుగొందుచున్న దానిని ఎత్తుకొని వచ్చితిమి. శకుంతములచే రక్షింపబడిన దగుటచే శకుంతల యను పేరు పెట్టి మిక్కిలి కూర్మితో పెంచినాము.

మధురాక్కర:
తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత
యును ననఁగ నింతులకు మువ్వు రొగిన గురువులు వీర
లనఘ! యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు
ననఁగఁ బురుషున కియ్యేవు రనయంబును గురువులు. 40

వ. అనం బరఁగిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల మగుటంజేసి గురుల మిదియును మాచే నభివర్ధితయగుటంజేసి మాకు హృదయానందిని యైన కూఁతురని కణ్వమహాముును లమ్మునికిం జెప్పిన విధంబంతయు సవిస్తరంబుగా శకుంతల చెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున-41

భా. తండ్రి, అన్నదాత, భయమునుండి కాపాడువాడు, అని స్త్రీలకు గురువులు ముగ్గురు. మగవారికి వీరు మువ్వురును గాక ఉపనయనము చేసినవాడు, వేదమును చెప్పినవాడును మొత్తము ఈ అయిదుగురును గురువులు. ఈ శాస్త్రముచే మేము దీనికి గురువులము; దీనికి భయమును పోగొట్టితిమి కదా! ఇది మాచే పెంచబడినది కావున మాకు హృదయానందము కలిగించు కూతురు. అని కణ్వముని ఆ మునికి చెప్పిన విధమంతయు విస్తరించి శకుంతల దుష్యంతునకు చెప్పెను. దుష్యంతు డదివిని తన మనస్సులో-

వి. వ్యాస భారతమున "శరీరకృత్ ప్రాణదాతా యస్యచాన్నానిభుంజతే! క్రమేణైతే త్రయోఽప్యుక్తాః పితరో ధర్మదర్శనే" అని యున్నది. స్త్రీకి తండ్రి, అన్నదాత, ప్రాణదాత గురువులని. నన్నయగారు ఈ మధ్యాక్కరలో పురుషులకు వారు ముప్పురే కాక మఱి యిద్దరు గురువులు ఉన్నారని ప్రపంచించిరి.

దుష్యంతుఁడు శకుంతలను వివాహము చేసికొనగోరుట

చ. ఇది మునినాథకన్య యని యెంతయు నిస్స్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్త్రియని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిఁగించినన్ మదనబాణ పరంపర కిప్పు డుండ నా
స్పదమయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్. 42

భా. ఈమె 'ముని కన్యక' యని నిరాశతో ఉన్న నా హృదయము ఈమె తాను రాజపుత్త్రినని నిజవంశోన్నతి నెఱిగించుటచే ఇప్పుడు మన్మథ బాణములకు వశమై తుమ్మెదలు మూగుటచే చలించు పద్మమువలె చలించుచున్నది. 'అని దుష్యంతుడు తనలో అనుకొనెను'.

వి. "ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీ లలితాంగియందు నా హృదయము తద్దయుం దవిలె..." అన్న పద్యము, "ఇది మునినాథ కన్య యని యెంతయు నిస్పృహవృత్తి నున్న..." అన్న యీ పద్యము- ఈ రెండును కథా గమనమునకు చక్కని అనుసంధానము చేయుచున్నవి. అభిజ్ఞాన శాకుంతలములోని "భవ హృదయ సాభిలాషం సంప్రతి సందేహ నిర్ణయోజాతః," ఇత్యాదికము నన్నయ భట్టారకులకు యీ ఘట్టమున ఎంతో సహకరించినది.''సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అనుదానిని ధ్వనితము చేయు చున్నది.

వ. అనుచు మదనాతురుండయి దుష్యంతుండు దనయం దక్కోమలి యను రాగం బుపలక్షించి యిట్లనియె. 43

క. ఈ వల్కలాజినములకు
నీ వన్య ఫలాశనముల కీవిటప కుటీ
రావాసములకు నుచితమె
నీ విలసిత రూపకాంతి నిర్మల గుణముల్. 44

ఉ. ఈ మునిపల్లె నుండు టిదియేల కరం బనురాగ మొప్పఁగా
భామిని! నాకు భార్యవయి భాసురలీల నశేషరాజ్య ల
క్ష్మీ మహనీయ సౌఖ్యముల మేలుగనందు మనిందితేందు పా
దామలతుంగ హర్మ్యముల హారిహిరణ్మయ కుట్టిమంబులన్. 45

భా. ఇటులనుకొని దుష్యంతుడు కామాతురుడై తన యెడల ఆ శకుంతల యనురాగమును గ్రహించి ఇటులనెను: నీ చక్కని రూపము, కాంతి యనెడి నిర్మల గుణములకు ఇక్కడి ఈ నారచీరలు కృష్ణాజినములు, ఈ యడవి పండ్ల యాహారములు, ఈ పర్ణశాలా నివాసములు తగినవి కావు. ఓ భామినీ! ఈ మునిపల్లెలో ఉండుట యేల? మిక్కిలి అనురాగమున నన్ను పెండ్లాడి చంద్రకిరణములవలె నిర్మలములు బంగారు కట్టడపు నేలలు గల ఎత్తయిన మేడలలో సమస్త రాజ్యసుఖములు మేలుగా పొందుము.

వి. "ఈ మునిపల్లె నుండు టిదియేమి"- అని చిన్ని తెలుగు పలుకులతో ఆరంభము చేసి, అనిందింతేందు పాదామలతుంగ హర్మ్యముల హారి హిరణ్మయ కుట్టిమముల మేలునందు' మని పొదవైన సంస్కృత సమాసములు ఉపయోగించుట, అప్పటి యామె దైన్యమునకు, తన్ను పెండ్లాడిన తరువాత ఆమె పొందు అశేష రాజ్యలక్ష్మీ మహనీయ సౌఖ్యములకు స్ఫోరకమైనది.

సీ. బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ బ్రా
జాపత్యమును రాక్షసంబు నాసు
రంబు గాంధర్వంబు రమణఁ బైశాచంబు
నను నెనిమిది వివాహముల యందుఁ
గడుఁ బ్రశస్తములు సత్క్షత్త్రి వంశ్యులకు గాం
ధర్వ రాక్షసములు ధర్మయుక్తి
నీకును నాకును నెమ్మిఁ బరస్పర
ప్రేమంబు గాముండు పెంపఁదొడఁగెఁ

గాన నెదయుఁ జేయఁగా నేల గాంధర్వ
విధి వివాహ మగుట వినవె యుక్త
మనిన లజ్జఁజేసి యవనత వదనయై
యా లతాంగి యిట్లు లనియెఁ బతికి. 46

భా. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము, ఆసురము, గాంధర్వము, పైశాచము అను ఎనిమిది విధములయిన వివాహములలో ఉత్తమ క్షత్త్రియులకు గాంధర్వ రాక్షసములు శ్రేష్ఠములయినవి. నీకును నాకును అన్యోన్య ప్రేమ కలదు. కావున ఆలసింపక మనము గాంధర్వ విధిని పెండ్లి యాడుట యుక్తము అని రాజు పలుకగా శకుంతల సిగ్గుచే తలవంచుకొని యిట్లు పలికెను:

క. కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయజనకులు సనుదెం
తురు వారు వచ్చి నీకి
చ్చిరేని పాణిగ్రహణము సేయుము నన్నున్. 47

భా. దయాపరులు ధార్మికులునగు మా తండ్రిగారిప్పుడే వత్తురు. వారు వచ్చి నన్ను నీకిచ్చినచో నన్ను పెండ్లాడుము.

వి. ఈ కందములోని రెండవ పాదము, నాల్గవపాదము మొదటి గణములు జగణములు. జగణము మధ్యగురువు కలది. కంద పద్యము నడకకు ఈ పాదాది జగణములు మంచియందము నిచ్చును.

వ. అనిన దానికి దుష్యంతుడిట్లనియె: 48

గీ. తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు
గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనగఁ
వనజనేత్ర గాంధర్వ వివాహ మతిర
హస్యమును నమంత్రకమును నగుచునొప్పు. 49

భా. శకుంతల మాటలు విని దుష్యంతుడన్నాడు : వనజనేత్రా! తనకు తానే చుట్టము; తానే దిక్కు; తన్ను దానము చేయుటకు తానే అధికారి. కనుక మిక్కిలి రహస్యము, మంత్రము లేనిదియు అగు గాంధర్వ వివాహము తగినది.

వ. అని దుష్యంతుండు గాంధర్వ వివాహ స్వరూపంబు చెప్పి శకుంతల నొడంబఱిచిన నది యిట్లనియె: 50

చ. నరనుత! నీ ప్రసాదమున నాకుదయించిన నందనున్ మహీ
గురుతర యౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమదాన యట్లయిన నీకును నాకును సంగమంబగున్. 51

భా. అని దుష్యంతుడు గాంధర్వ వివాహపద్ధతిని చెప్పి శకుంతలను అందుకు అంగీకరింపజేయగా, ఆమె దుష్యంతునితో ఇట్లనెను: రాజా! నీ అనుగ్రహముచే నాకు పుట్టిన పుత్రునకు దయతో యౌవరాజ్య పట్టాభిషేకము చేయుదునని వర మిమ్ము. అట్లయినచో మనకు వివాహము జరుగును.

వ. అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దాని కోరిన వరంబిచ్చి గాంధర్వ వివాహంబున కభిమత సుఖంబు లనుభవించి యకొక్కమలి పీడ్కొని నిన్నుఁ దోడ్కొనిరా నస్మత్ప్రధాన వర్గంబుఁ గణ్వముని పాలికిం బుత్తెంచెద నని యూఱడనాడివి దుష్యంతుడు నిజపురంబునకుం జనియె నిటు శకుంతలయుఁ దనచేసిన దాని మునివరుం డెఱింగి యలి గెడునో యని వెఱచుచుండె నంత నమ్మహాముని వనంబున నుండి కంద మూలఫలంబులుగొని చనుదెంచి లలిత శృంగారభావంబున లజ్జావనత వదనయు నతిభీతచిత్తయునై యున్నకూఁతుం జూచి తన దివ్యజ్ఞానంబున నంతవృత్తాంతంబు నెఱింగి క్షత్రియులకు గాంధర్వ వివాహంబు విధి చోదితంబు యని సంతసిల్లి శకుంతల కిట్లనియె : 52

గీ. తల్లి నీ కులగోత్ర సౌందర్యములకుఁ
దగిన పతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ
మయ్యె నీదుగర్భమున వాఁడఖిల భువన
వహన మహనీయుఁ డగు చక్రవర్తిసుమ్ము. 53

వ. నీ ధర్మ చరితంబునకు మెచ్చితి నీవు గోరిన వరం బిచ్చెద వేఁడుమనిన శకుంతలయు నాచిత్తం బెప్పుడు ధర్మమునంద తగిలియుండను నా కుదర్చి విల్లెడు పుత్త్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్య బల సమన్వితుండును వంశ కర్తయుఁగాను వలయు ననిన నమ్మహాముని కరుణించి దానికోరిన వరం బిచ్చి యథాకాల విధుల గర్భసంస్కార రక్షణంబులు సేయించి యున్నంత వర్షత్రయంబు సంపూర్ణంబైన శకుంతలకు భరతుం డుద దయించి కణ్వ నిర్వర్తితజాతకర్మాది క్రియా కలాపుం డయి పెరుఁగుచుఁ గరతలాలంకృతచక్రుండును జక్రవర్తి లక్షణ లక్షితుండును సింహ సంహననుండును దీర్ఘబాహుండును ననంతజవసత్త్వ సంపన్నుండునై పరఁగుచు- 54

భా. శకుంతలకు దుష్యంతుడు ఆమె కోరిన వరము నిచ్చెను. గాంధర్వ వివా హమున ఇష్టసుఖములను అనుభవించెను. నిన్ను వెంటబెట్టుకొని వచ్చు టకు మంత్రులను కణ్వుని దగ్గరకు పంపుదునని ఆమెను సమాధానపఱచి

తన పట్టణమునకు పోయెను. ఇక్కడ శకుంతల తాను చేసిన తప్పునకు ముని కోపించునేమో అని భయపడుచుండెను. అంతలో కణ్వుడు కంద మూల ఫలములు కొనివచ్చెను. శృంగార భావముతో సిగ్గున తలవంచి భయపడుచున్న కూతును చూచి దివ్యదృష్టితో జరిగిన వృత్తాంతమును తెలుసుకొని 'క్షత్రియులకు గాంధర్వ వివాహము శాస్త్ర సమ్మతమే' అని సంతోషించి శకుంతలతో అన్నాడు : "అమ్మా! నీ కులగోత్ర సౌందర్యములకు తగిన పతిని పొందితివి. దానికి తగినట్లు నీకు గర్భమైనది. నీ గర్భమున ఉన్నవాడు సమస్త భూమండలమును పాలింపగల చక్రవర్తి సుమీ! నీ ధర్మ వర్తనమునకు మెచ్చితిని. వరము కోరుకొను" మనెను. "నా మనస్సు ధర్మబద్ధమై యుండునట్లును, నాకు జనించు కుమారుడు దీర్ఘాయువు ఆరోగ్యము ఐశ్వర్యము బలముకలిగి వంశకర్త యగునట్లును వరమిమ్ము" అని శకుంతల కోరెను. కణ్వుడు ఆమె కోరిన వరము ఇచ్చెను. మూడేండ్లు నిండిన తరువాత శకుంతలకు భరతుడు పుట్టెను. కణ్వుడు జాతకర్మాదులు జరిపింపగా భరతుడు పెరుగుచుండెను. భరతుడు అరచేతి యందు చక్రరేఖ కలిగి చక్రవర్తి లక్షణము కలవాడు. సర్వాంగ సుందరుడు. దీర్ఘబాహుడు. అపారమైన జవసత్త్వములు కలవాడు.

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహ వ్యాళ శార్దూల ఖ
డ్గ మదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత భూ
జములం దోలిన కట్టుచున్ బలిమిమై శాకుంతలుం డొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచున్ దగిలి నానాశైశవ క్రీడలన్. 55

భా. శకుంతల కొడుకు భరతుడు కడు బలము కలవాడై భయంకరారణ్యమున సంచరించు అడవిపందులను పాములను పులులను ఖడ్గ మృగములను మదపుటేనుగులను మరి యితర మృగములను కట్టి తెచ్చి కణ్వాశ్రమ సమీపమున చెట్లకు కట్టివైచుచు, అడవిలోని మదపుటేన్గులు ఎక్కుచు వివిధములైన బాల్య క్రీడలు నెఱుపుచుండెను.

వ. ఇట్లు వనంబులోని సర్వసత్త్వంబులను దన మహాసత్త్వంబునం జేసి దమి యించుచున్న యాతనిం జూచి యాశ్చర్యంబంది యందలి మునులెల్ల నాతనికి సర్వదమనుం డను నామంబుఁ జేసిరి. కణ్వ మహామునియు నక్కుమారు నుదారతేజోరూప విక్రమ గుణంబులకు సంతసిల్లి వీఁ డఖిల భువన యౌవరాజ్యాభిషేకంబునకు సమర్థుం డగు సమయం బరుగు దెంచె నని విచారించి యొక్కనాఁడు గూఁతున కిట్లనియె : 56

ఆ.వె. ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మవు
సతుల కేడుగడయుఁ బతుల చూలె. 57

అర్థం. సత్త్వములు=మృగములు, సత్త్వము=బలము, తద్ద=మిక్కిలి, ఏడుగడ=రక్షకము.

భా. అడవి యందలి సర్వ మృగములను తన మహాబలముచే దమించుచుండుటచే మునులు భరతునను సర్వదమనుడని పేరు పెట్టిరి. కణ్వుడు ఆ కుమారుని గొప్ప తేజస్సునకు రూపమునకు పరాక్రమమునకు సంతోషించెను. ఇతడు సమస్త రాజ్యమునకు యువరాజగుటకు తగిన సమయము వచ్చెనని ఆలోచించి ఒకనాడు శకుంతలతో అన్నాడు: "ఎట్టి పతివ్రతలకైనను పుట్టినింట చాలకాలము ఉండుట తగదు. పతుల దగ్గర ఉండుటయే సతులకు ధర్మము. సతులకు భర్తయే సర్వము."

### కణ్వ మహాముని శకుంతలను దుష్యంతు పాలికిం బంపుట

వ. కావున నీవిక్కుమారునిం దోడ్కొని నీ పతిపాలికి నరుగు మని మహా తపోధనులైన తన శిష్యులం గొందఱిఁ దోడుపంచిన శకుంతలయు దౌష్యంతుం దోడ్కొని దుష్యంతుపాలికి వచ్చి సకల సామంత మంత్రి పురోహిత ప్రధానపౌరజన పరివృతుండై యున్న యారాజుం గనుంగొని-

క. గురునాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనిన యనురాగము నా
దరణము నను్గ్రహంబును
గరుణయు సంభ్రమము నపుడు గానక యెడలోన్. 59

క. ఎఱుఁగఁడొకొ నన్ను నెఱిఁగియు
నెఱుఁగని యట్లుండు నొక్కొ యెడ దవ్వగుటన్
మఱచెనొకొ! ముగ్ధు లధిపులు
మఱవరె బహు కార్యభారమగ్నులు కారే! 60

చ. తలఁపఁగ నాఁడు వల్కినవిధం బెడఁ దప్పఁగ వీడెనొక్కొ చూ
డ్కులు విరసంబులై కరము క్రూరములైన నిమిత్తమేమియో
కలయఁగఁ బల్కరించి రుపకారులు నైరని నమ్మియుండఁగా
వలవదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధినాథులన్. 61

భా. 'కావున నీవు ఈ కుమారుని తీసికొని నీ మగని దగ్గరకు వెళ్లుము' అని కణ్వుడు కొందఱు తపోధనులైన శిష్యులను తోడుగా పంపగా, శకుంతల భరతుని వెంటబెట్టుకొని దుష్యంతుని దగ్గరకు వచ్చెను. మంత్రులు పురోహితులు ప్రధానులు పురజనులు దుష్యంతుని పరివేష్టించి యుండిరి. శకుంతల రాజును చూచెను. పూర్వము తండ్రి యాశ్రమములో రాజు తనయెడల చూపిన అనురాగము, ఆదరము, అనుగ్రహము, దయ, సంభ్రమము ఇపుడు ఆమెకు కనబడలేదు. అప్పుడు శకుంతల మనసులో అనుకొన్నది: 'ఇతడు నన్ను ఎఱుగడా? ఒకవేళ తెలిసికూడ తెలియని యట్లు నటించుచున్నాడా? చూచి చాలకాలమైనది కదా! మఱచెనేమో! ప్రభువులు మూఢులు. ఎన్నో వ్యవహారములలో మునిగియుందురు. వారికి మఱపు వింతకాదు. ఆలోచింపగా, ఈ రాజు పెండ్లినాడు చెప్పిన మాట తప్పెననిపించుచున్నది. ఇతని చూపులు నా యెడల విరసముగా, పరుషముగా ఉన్నవి. కారణము తెలియదు. ప్రభువులు క్రొత్తవారియందు ప్రేమగలవారు. కనుక, వారు ప్రేమతో మాటాడిరని, ఉపకారము చేసిరని తెలివిగలవారు నమ్మరాదు. ''ముగ్ధులధిపులు మఱవరె! బహు

కార్యభారమగ్నులు కారే!", "నమ్మియుండగా వలవదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధినాధులన్" ఈ రెండును శకుంతల యొక్క లోకజ్ఞతా వివేకములకు నిదర్శనములైన సమర్థనములు.

వ. అని తలంచి చింతాక్రాంతయై శకుంతల వెండియు నాత్మగతంబున- 62

క. మఱచినఁ దలఁపింపఁగ నగు
నెఱుఁగనినాఁ డెల్లపాట నెఱిఁగింపనగున్
మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని
కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే? 63

వ. అయినను వచ్చి మిన్నకపోవంగాదు కావున నా పూర్వ వృత్తాంతం బెల్ల నెఱింగించి యే నిక్కమారుం జూపుదు నని మనంబున నిశ్చయించి శకుంతల యారాజున కిట్లనియె- 64

భా. (63) నిజముగా మఱచిపోయినచో జ్ఞప్తికి తేవచ్చును; అసలు తెలియని వానికి ఏదో విధముగా బోధింపవచ్చును. అంతేకాని, తెలిసికూడ తెలియనివానివలె నటించు మోసగానికి తెలియజేయుట బ్రహ్మతరము గాదు.

క. జననాథ! వేఁట నెపమున
గొనకొని కణ్వాశ్రమమునకున్ వచ్చి ముదం
బున నందు నాకు నీయి
చ్చిన వరముఁ దలంపవలయుఁ జిత్తములోనన్. 65

క. బాలార్కతేజుఁ డగు నీ
బాలుఁడు నీ కొడుకు వీనిఁ బౌరవకుల ర
త్నాలంకారు నుదార గు
ణాలయు యువరాజుఁ జేయుమభి షేకమునన్. 66

అర్థం. గొనకొని = పూని.

తా. రాజా! నీవు వేటకై వచ్చి కణ్వాశ్రమములో నాకు వరము నిచ్చితివి. జ్ఞప్తికి తెచ్చుకొనుము. బాల సూర్యునివలె వెలుగుచున్న ఈ బాలుడు నీ కొడుకు. పౌరవ వంశమునకు అలంకారమైనవాడు; గొప్ప గుణములు కలవాడు. వీనిని యువరాజుగా అభిషేకింపుము.

వ. అనిన విని దుష్యంతుండు దాని నంతయు నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నిట్లనియె: 67

క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి
దానవు మిన్నకయ యనుచితంబులు పలుకం
గానేల యరుగు మంబురు
హానన! యెందుండి వచ్చి తందులకు వడిన్. 68

అర్థం. మిన్నకయ=ఊరకే.

తా. పద్మముఖీ! నిన్ను నేనెఱుగను. నీవు ఎక్కడిదానవు ? ఊరకే కూడని మాటలు పలుకనేల? ఎక్కడినుండి వచ్చితివో అక్కడికి వెంటనే పొమ్ము.

వి. అంబురుహానన ! అను సంబోధనములో అంతర్గతమైన దుష్యంతుని ప్రేమ స్ఫురించును.

వ. అనిన విని వెలువెల్లనై వెచ్చనూర్చి నిశ్చేష్టితయై కెందమ్మిరేకుల వలనం దొరంగు జలకణంబులపోలెఁ గోపారుణ తనయనంబుల బాష్పకణంబులు దొరఁగం దలవాంచి యారాజుం గటాక్షించుచు హృదయ సంతాపంబు దనకుఁదాన యుపశమించుకొని పెద్దయుంబ్రొద్దు చింతించి శకుంతల యా రాజున కిట్లనియె- 69

అర్థం: వెలువెల్లనై=వెలవెలపోయి, వెచ్చనూర్చి=వేడిగా నిట్టూర్పు విడిచి, కెందమ్మి=ఎఱ్ఱదామర, తొరంగు=కాఱుచున్న, పెద్దయుంబ్రొద్దు=చాల సేపు.

ఆ.వె. ఏల యెఱుకలేని యితరుల యట్ల నీ
వెఱుగననుచుఁ బలికె దెఱిఁగి యెఱిఁగి
యేనకాని దీని నెఱుఁగ రిం దొరులని
తప్పఁబలుక నగునె ధార్మికులకు. 70

అర్థం: ఎఱుక = జ్ఞానము.

భా. జ్ఞానహీనునివలె నీవు ఎఱిగిన దానిని ఎఱుగనని ఎందుకు చెప్పెదవు? ఇతరు లెవ్వరును సాక్షులులేరని ధర్మాత్ములు అబద్ధమాడవచ్చునా?

చ. విమల యశోనిధీ! పురుషవృత్త మెఱుంగుచు నుండుఁజూవె వే
దములును బంచభూతములు ధర్మవు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్ర సూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివియుండఁగా నరుఁడు దక్కొఁన నేర్చునె తన్ను గ్రుచ్చిలన్. 71

భా. నిర్మలమైన కీర్తికి నెలవైనవాడా! వేదములు, పంచభూతములు, ధర్మము, రెండు సంధ్యలు, హృదయము, యముడు, చంద్రుడు, సూర్యుడు, పగలు, రాత్రి అనునట్టి మహా పదార్థములు నరుడు చేయు పనులను తెలిసికొను చుండగా, ఆ నరుడు తాను చేసిన దానిని దాచుకొనజాలడు.

"ఆదిత్య చంద్రావనిలోఽ నలశ్చ
ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభేచసంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్యవృత్తమ్."

ఈ మూల శ్లోకమునకు ఇది తెలుగు పద్యము. మూలములో 'వేదములు' అన్న మాట లేదు. తెలుగులో నన్నయ భట్టారకులు దానిని చేర్చుట వారి శ్రుతి గౌరవము. విమల యశోనిధీ ! అన్న సంబోధనముతో ఈ పద్యమారంభమైనది. అసత్యము పలికి స్వచ్ఛమైన నీ కీర్తికి మచ్చ తెచ్చుకొనకుము అన్న హెచ్చరిక యిందున్నది.

క. నా యెఱిఁగినట్ల యిన్నియు
నీ యిచ్చిన వరము ధారుణీవర యెఱుఁగున్
నాయందుఁ దొంటియట్టుల
చేయు మనుగ్రహ మవజ్ఞ సేయం దగునే? 72

క. సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయునైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతి దు
ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. 73

క. సంతత గృహమేధి ఫలం
బంతయుఁ బడయంగ నోపు ననుగుణ భార్యా
వంతుండగు వాఁడు క్రియా
వంతుఁడు దాంతుండుఁ బుత్త్రవంతుండు నగున్. 74

భా. రాజా! నీవు నాకిచ్చిన వరము నాకు ఎట్లు తెలియునో వేదములు మున్నగు వానికి అటులే తెలియును. కనుక, వెనుకటివలెనే నాయెడల ప్రీతి నెఱపుము. అవమానించుట తగదు.

పతివ్రత, గుణవంతురాలు, సంతానవతి, అనుకూలురాలు అయిన భార్యను తిరస్కరించు దుర్బుద్ధికి ఇహ పరములు రెండును ఉండవు. అనుకూలవతియైన భార్యగలవాడు కర్మ లాచరించుచు, ఇంద్రియ నిగ్రహము కలవాడై పుత్త్రవంతుడై గృహస్థాశ్రమ ఫలమంతయు పొందగలుగును.

వ. మఱియును. 75

సీ. ధర్మార్థకామ సాధన కుపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూఁత

గౌరవంబున కేకకారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లుగావు ప్రియము.

ఆ. లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీఱములను ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁ గనిన జనుల కెందు. 76

అర్థం : ఉపకరణము=సాధనము, ఆచార్యకము=గురుత్వము, ఆకరము= గని, ఒండ్లు=ఇతరములు.

భా. ధర్మార్థ కామములు సాధించుటకు సాధనము, గృహనీతియను విద్యకు చోటు, నిర్మలమైన చరిత్రను ఉపదేశించు గురువు, వంశ స్థితికి మూలము, సద్గతికి ఆధారము, గౌరవమునకు కారణము, ఉన్నతములు స్థిరములు అయిన గుణములకు నెలవు. హృదయమునకు ఆనందము కలిగించునది భార్యయే. మగనికి ఇల్లాలికంటె ఇంపైనది వేరొకటి లేదు. ఆలుబిడ్డలను సరిగా చూచువారికి ఎటువంటి ఆపదల వలన వచ్చిన దుఃఖములైనను తొలగిపోవును.

వ. మఱియు భార్య పురుషునం దర్ధంబగుటంజేసి పురుషునకు మున్న పరేతయైన పతివ్రత పరలోకమునం దన పురుషుం గూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండుఁ బురుషుండు మున్న పరేతుండైనఁ బదంపడి తానును బరేతయై తన పురుషుఁగూడ నరుగునట్టి భార్య నవమానించుట యధర్మంబు మఱియునుం బురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుఁడై తాన యుద్భవిల్లుఁ గావున నంగా దంగా త్సంభవసి యనునది యాదిగాఁ గల వేద వచనంబుల యందును జనకుండును బుత్త్రుండును నను భేదంబు లేదు. 77

అర్థం : పరేతుడు=చనిపోయినవాడు, పరేత=చనిపోయినది (స్త్రీ).

భా. భార్య భర్తలో సగము. మగనికంటె ముందు భార్య మరణించినచో ఆమె పరలోకమున పతిని కలియుటకు అతని రాకకై నిరీక్షించు చుండును. మగడే ముందు చనిపోయినచో, భార్య తానును మరణించిన పతిని కలియుటకు పోవును. అట్టి యిల్లాలిని అవమానించుట అధర్మము. అంతేకాక భర్త భార్యయందు ప్రవేశించి ఆమె గర్భమున తానే పుత్రుడుగా పుట్టును. 'అంగా దంగా త్సంభవసి' అను వేద వచ ముచే తండ్రి కొడుకులకు భేదము లేదు. (అంగాత్+అంగాత్+సంభవసి = శరీరమునుండి పుట్టుచున్నావు.)

వ. విను గార్హపత్య మను న
య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును
జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్. 78

క. తాన తన నీడ నీళ్ళుల
లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత! త
త్సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయ ప్రీతిమెయిన్. 79

భా. గార్హపత్య మనెడి అగ్ని విహరింపబడి ఆహవనీయాగ్నిగా వెలుగును. అట్లే తండ్రి తానే పుత్రుడుగా జనించి తన కాంతితో వెలుగుచుండును. పురుషుడు నీళ్ళలో తన నీడ స్పష్టముగా చూచునట్లు తండ్రి తన కొడుకును చూచి మిక్కిలి ఆనందమును పొందును.

వ. పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్ర యను వేద వచనంబు గలదు గావునఁ బుణ్యాచారుం డయిన పుత్త్రుం డుభయ పక్షంబుల వారి నుద్ధరించుఁ గావున- 80

క. నీ పుణ్య తనువు వలనన
యీ పుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పున్

దీపంబు వలన నొండొక
దీపము ప్రభవించినట్లు తేజం బెసఁగన్. 81

భా. పుత్ + నామ్నః నరకాత్-త్రాయతే + ఇతి-పుత్త్రః-'పుత్' అను పేరు గల నరకమునుండి కాపాడువాడు గాన పుత్త్రుడు. ఒక దీపమునుండి మరియొక దీపము పుట్టి ప్రకాశించునట్లు నీ పుణ్య శరీరమునుండి యీ పుత్త్రుడు పుట్టి ప్రకాశించుచున్నాడు.

మ. విపరీత ప్రతి భాష లేమిటికి నుర్వీనాథ! యీ పుత్త్రగా
త్ర పరిష్వంగ సుఖంబు సేకొనుము ముక్తాహార కర్పూర సాం
ద్ర పరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే. 82

భా. రాజా! విరుద్ధములైన మాఱు మాటలు చెప్పకుము. ఈ పుత్త్రుని కవుగిలించుకొని సుఖమును అనుభవింపుము. జీవులకు ముత్యాలహారములును, పచ్చకర్పూరపు పొడియు చందనమును, వెన్నెలయు పుత్రుని కౌగిలి వలె సుఖప్రదములు కావు.
ఇది లోకోత్తర మనోహరమైన పద్యము.

క. అనఘుఁడు వంశకరుండై
పెనుపున నీ సుతుఁడు వాజపేయంబులు నూ
ఱొనరించు నని సరస్వతి
వినిచె మునులు వినఁగ నాకు వినువీధి దెసన్. 83

క. భూరిగుణు నిట్టి కుల ని
స్తారకు దారకు నుదార ధర్మప్రియ! ని
ష్కారణమ తప్పఁ జూడఁగ
సారమతీ! చనునె నాఁటి సత్యము గలుగన్. 84

భా. నీ కుమారుడు వంశకర్తయై నూఱు వాజపేయ యాగములు చేయునని అకాశవాణి మునులు వినగా నాతో చెప్పెను. ఆనాడు పెండ్లి సమయమున

చెప్పిన సత్యము ఉండగా, గుణవంతుడు వంశోద్ధారకుడు అయిన ఈ బాలకుని కారణము లేకుండగా కాదనుట తగినది కాదు.

వి. ఉదార ధర్మప్రియ! సారమతీ! అనుసంబోధనములు దుష్యంతుని హెచ్చరించునవి.

చ. నుతజల పూరితంబులగు నూతులు నూటికంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్. 85

తా. సత్యవ్రతముగల ఓ రాజా! మంచినీటి బావులు నూటిటి కంటె ఒక దిగుడుబావి ఉత్తమము. నూఱు దిగుడుబావుల కంటె ఒక యజ్ఞము శ్రేష్ఠము. అట్టి యజ్ఞములు నూటికంటె ఒక పుత్రుడు మేలు. అట్టి పుత్రులు నూఱుగురు కంటె ఒక సత్యవాక్యము మంచిది.

వి. దుష్యంతుడు మాట తప్పినాడు. అట్టి వానిని శకుంతల 'సూనృతవ్రత' అని సంబోధించినది. 'నీవు సత్యవాక్పాలకుడవని నమ్మి మోసపోతిని సరిగా ఆలోచించుకొనుము' అన్న సత్యప్రబోధము ఈ సంబోధనములో స్ఫురించును. చేదుడు బావి కంటె దిగుడుబావి, దాని కంటె యజ్ఞము, దానికంటె పుత్రుడు, పుత్త్రుల కంటె సత్యవాక్యము ఒకదానికంటె ఒకటి గొప్పదని చెప్పుటచే దీనిని సారాలంకార మందురు.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన మొలుసూపు గౌరవంబున పేర్మిన్. 86

గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావు
యెఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁబెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు. 87

క. కావున సత్యము మిక్కిలి
గా విమల ప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమ సం
భావిత సమయ స్థితి దయఁ
గావింపుము గొడుకుఁజూడు కరుణాదృష్టిన్. 88

క. క్షత్త్రివరుడైన విశ్వా
మిత్త్రినకుఁ బవిత్రయైన మేనకకున్ స
త్పుత్త్రినయి బొంకు వలుకఁగ
ధాత్రీతల నాథ! యంత ధర్మేతరనే? 89

భా. వేయి అశ్వమేధ యాగములు ఒకవైపు, ఒక్క సత్యము ఒకవైపు త్రాసునందు ఉంచి తూచినచో సత్యమువైపుననే బరువు ఎక్కువై మొగ్గు కనబడును. సమస్త తీర్థములకు పోవుట, సర్వవేదములు అధ్యయనించుట సత్యముతో సాటికావు. ధర్మజ్ఞులైన ఋషులు అన్ని ధర్మముల కంటెను సత్యమే గొప్పదని చెప్పుదురు. కనుక, నిర్మలమైన బుద్ధితో సత్యమును పాటించి నీవు కణ్వాశ్రమములో చేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పుము. ఈ పుత్రుని దయతో చూడుము. క్షత్త్రియులలో ఉత్తముడైన విశ్వామిత్రునకును, పవిత్రురాలైన మేనకకును పుట్టి అసత్యమాడుటకు నేనంత ధర్మములేని దానను కాను.

వ. అనిన శకుంతల పలుకులు సేకొన నొల్లక దుష్యంతుం డిట్లనియె: 90

క. ఏనెట నీవెట సుతుఁడెట
యేనెన్నఁడు తొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానిను లసత్య వచనలు
నా నిట్టు లసత్య భాషణం బుచితంబే? 91

క. పొడువునఁ బ్రాయంబునఁ గడుఁ
గడిఁది బలంబునను జూడఁగా నసదృశు నీ
కొడుకని యీతని నెంతయు
నెడమడుగుగఁ జూపఁ దెత్తె యిందఱు నగఁగాన్. 92

వ. ఇట్టి లోకవిరుద్ధంబులఁ కే మోడుదు మయుక్తంబు లయిన పలుకులు పలుకక నీ యాశ్రమంబునకుం బొమ్మనిన శకుంతల యత్యంత సంతాపితాంతఃకరణయై- 93

అర్థం. నాన్=అనగా, పొడవు=ఉన్నతి, కడిఁది=మిక్కిలి, ఎడమడుగు=వ్యత్యాసము.

భా. శకుంతల మాటలకు అంగీకరింపక దుష్యంతు డన్నాడు: "నేనెక్కడ? నీ వెక్కడ? కుమారుడెక్కడ? నిన్నెప్పుడును నేను చూచి ఎఱుగను, 'ఆడువారు అబద్ధము లాడుదురు' అన్న దానికి తగినట్లు నీవు అసత్యము లాడవచ్చునా? ఉన్నతిచే వయస్సుచే పరాక్రమముచే సాటిలేని ఈ బాలుని నీ కొడుకని విరుద్ధముగా అందఱు నవ్వునట్లు తీసికొని వచ్చితివా? ఇట్టి లోకవిరుద్ధములకు మేము అంగీకరింపము. తగని మాటలు చెప్పక నీ ఆశ్రమమునకు పొమ్ము." దుష్యంతుని యీ మాటలకు శకుంతల మనస్సు సంతాప పడెను.

వి. 'అసత్యవచనానార్యః' అను మూలమునకు 'మానిను లసత్య వచనలు నా నిట్టు లసత్య భాషణంబుచితంబె?' అనుటలో నన్నయ భట్టారకులు గొప్ప యౌచిత్యమును నిక్షేపించిరి. (నాన్=అనగా) 'స్త్రీలు అసత్య వచనలు' అన్న పేరు నీ వలన వచ్చును సుమీ, అనుట, స్త్రీ జాతిని దుష్యంతుడు నిందించుట లేదు. శకుంతలను మాత్రమే కాదనుచున్నాడు.

మధ్యా. తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁబడియెద నాకొ్క్క!
నుడువులు వేయు నింకేల యిప్పాటి నోములు తొల్లి
కడఁగి నోఁచితిని గా కేమియనుచును గందె డెందమున. 94

భా. 'పుట్టిననాడే నన్ను తలిదండ్రులు విడిచిపెట్టిరి. ఇప్పుడు మగడు విడుచుచున్నాడు కాబోలు! ఇంక పెక్కుమాట లెందుకు? పూర్వము నేను ఇట్టి నోములే నోచితిని' అని మనస్సులో దుఃఖించెను.

వి. కరుణరసస్ఫూర్తికి 'మధ్యాక్కర' ఎంతో సహకారి. ఈ పద్యమంతయు తెనుఁగు పదములతో నిండియున్నది. పతి శబ్దమొక్కటే తత్సమము. చిన్ని చిన్ని తెలుగుమాటలన్నియు ఆమె యొక్క శోక భావమును వ్యక్తము చేయుచున్నవి.

వ. ఇట్లు తద్దయు దుఃఖించి విగతాశయై బోరనఁ దొరఁగు బాష్పజలంబు లందంద యొత్తుకొనుచు నింక దైవంబు కాని యొండు శరణంబు లేదని యప్పరమ పతివ్రత తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవ నున్న సమయంబున- 96

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకున్ బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము పల్కె సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్. 97

భా. ఈ విధముగా దుఃఖించి, ఆశలు విడిచి, కన్నీరు ఒత్తుకొనుచు దైవము తప్ప మఱొక దిక్కులేదని ఆ మహా పతివ్రత కుమారుని తోడ్కొని తిరిగి పోవనున్న సమయములో—ఆకాశవాణి రాజుతో ఇట్లు పలికెను.

"ఈ బాలుడు నీకును శకుంతలకును పుట్టిన కుమారుడు. ఈ బిడ్డను స్వీకరించి పోషింపుము. శకుంతల చెప్పినది సత్యము. ఈమె మహా పతివ్రత."— దివ్యవాణి పలికిన యీ మాటలకు సభలో ఉన్న వారందఱు ఆశ్చర్యపడిరి.

వ. ఇట్లెల్ల వారలకు నతి హర్షంబుగా శకుంతల పతివ్రతాత్వంబును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రకాశంసించు వేలుపుల పలుకు లతివ్యక్తంబు లయి యాకాశంబు వలన వీతెంచిన విని దుష్యంతుండు సభాసదులు విన నిట్లనియె: 97

గీ. ఏను నీ యింతియును గాని యెఱుఁగ రన్యు
లర్థిఁ గణ్వ మహామునిశ్రీయాశ్రమంబు

నందు గాంధర్వ విధి వివాహమునఁ గరము
నెమ్మిఁ జేసిన దీని పాణిగ్రహణము. 98

గీ. అన్య లెఱుఁగమి జేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నిందఱ కిప్పు డెఱుఁగఁ
జెప్పె నాకాశవాణి యచ్చెరువు గాఁగ. 99

భా. శకుంతల పాతివ్రత్యమును, సత్యమును, భరతుని పుట్టుకయును కొని యాడు దేవతల వాక్కులు ఆకాశము నుండి వినబడగా సభ్యులందఱు ఆనందపడిరి. దుష్యంతుడు అప్పుడు సభాసదులతో ఇట్లు పలికెను: "నేను కణ్వాశ్రమ మందు గాంధర్వ వివాహ పద్ధతితో ఈమెను పెండ్లా డితిని. ఈ సంగతి ఈమెకు, నాకు తప్ప ఇతరులకు తెలియదు. ఇత రులకు తెలియక పోవుటచే లోకనింద కలుగునన్న భయముతో తెలిసి కూడ తెలియదని పలికితిని. ఇపుడు అందఱికి తెలియునట్లు ఆశ్చర్యముగా ఆకాశవాణి చెప్పెను."

దుష్యంతుడు శకుంతలను వెంటనే ఆదరించి కుమారుని స్వీక రించినచో లోకము తప్పక నిందించును. మహానుభావుడు ధీరోదాత్తుడు ధర్మజ్ఞుడునైన ఆ చక్రవర్తికి ముఖ్యమైనది లోకాపవాదమును పోగొట్టు కొనుట. భార్యాపుత్రుల మీది ప్రీతికంటె లోకనిందాభీతి ఆ సార్వభౌము నకు హెచ్చు. దుష్యంతుని లోకారాధన తాత్పర్యము, ధర్మ గౌరవము ఎంతటివో ఈ మాటలు మూటగట్టి చూపుచున్నవి.

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్ష పులక లెసఁగ నాలింగ నంబు సేసి శకుంతలా మహాదేవి నతి ప్రణయ గౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తన రాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యంతుడు దపోవనంబున కరిగిన- 100

చ. భరతుఁ డశేష భూభువన భార ధురంధరుఁడై వసుంధరం
బరఁగి యనేక యాగములఁ బాయక భాస్కర జహ్నుకన్యకా
సురుచిర తీరదేశముల సువ్రతుఁడై యొనరించి భూరి భూ
సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధ సువర్ణ గవాశ్వ హస్తులన్. 101

భా. భరతుడు సమస్త సామ్రాజ్య భారమును వహించి గంగా యమునా తీర ములందు అనేక యజ్ఞములు నిష్ఠతో చేసి విప్రులకు సువర్ణమును, గోవులను, గుఱ్ఱములను, ఏనుగులను దక్షిణగా సమర్పించెను.

# పీ ఠి క

ఈ నలచరిత్రము చాల రమణీయమైన కథ. చాల రసవంతమైన కథ. చాల సంపూర్ణమైన కథ. మహాభారతము నందిది యుపకథగా వర్ణితమైనది. ధర్మరాజు నాశ్వాసించుటకై బృహదశ్వుఁడీ కథ నాయనకు చెప్పెను. నలుఁడు బ్రహ్మజ్ఞుఁడు. వైదిక ధర్మమున కుదాహరణముగా ప్రజా పాలనము చేసిన వాఁడాతఁడు. వైదర్భియైన దమయంతి జగదేకసుందరి. ఒకరి గుణసౌందర్యము లొకరు విని వారికి పరస్పర మనురాగము కలిగినది. హంసదౌత్యమువల్ల వారికి ప్రేమబంధము దృఢమైనది. దమయంతీ స్వయంవరము ప్రకటింపఁబడినది. ఇంద్రాదులా స్వయంవరమునకు వచ్చుచు త్రోవలో నలుని జూచి యతనిని తమకు దౌత్యము గావింపుమని దమయంతికడ కంపిరి. దూతగా వచ్చిన నలునికి దమయంతి దేవతల సమక్షముననే నలుని వరించుటకు తన నిశ్చయం బెఱింగించెను. నలుని వేషమున వచ్చిన యింద్రాదులను ప్రార్థించి దమయంతి నలు నెఱింగి యతనిని వరించెను. నలదమయంతులు సుఖముగా కాలము గడపుచుండ కలి ప్రేరేపణమున పుష్కరునిచేత జూదమున నలుఁ డోడి రాజ్యము కోల్పోయి భార్యతో గూడ నడవికి పోయి కష్టముల పాలయ్యెను. నిద్రించుచున్న దమయంతిని విడిచి నలుఁడు కర్కోటక దష్టుఁడై వికృతరూపము నొంది బాహుకుఁ డన్న పేరుతో ఋతుపర్ణుని యొద్ద సూదకుఁడు నశ్వశిక్షకుఁడునై ప్రచ్ఛన్నముగా కాలము గడపుచుండెను. నిద్ర మేల్కాంచి దమయంతి నలుఁగానక బహు కష్టములు పడి చేదిపురమునకు చేరి రాజమాత రక్షణమున సైరంధ్రియై కాలము గడపుచుండెను. దమయంతి తండ్రి నలు రాజ్యభ్రంశము విని వారిని వెదకుటకై బ్రాహ్మణులను పంపెను. వారిలో సుదేవుఁడన్న బ్రాహ్మణుఁడు చేదిపురమునకు వచ్చి దమయంతిని గుర్తించెను. తరువాత దమయంతి రాజమాత యనుజ్ఞగొని తల్లిదండ్రుల యొద్దకు పోయెను. ఆమె నలుని వెదకుటకు పంపిన బ్రాహ్మణులలో పర్ణాదుఁడనువాడు కోసలకు పోయి యచట దమయంతీ ప్రశ్నమున కుత్తరము చెప్పిన బాహుకుని యుదంతము నామె కెఱింగించెను. ఆమె యతఁడే నలుఁడని యనుమానించి యతనిని రప్పించుటకై ద్వితీయ స్వయంవరమను

మిషతో ఋతుపర్ణునకు సుదేవునిచే వార్త నంపెను. ఋతుపర్ణుఁడు నలుఁడు రథ చోదకుఁడుగా నేకాహ్నమున విదర్భాపురమునకు వచ్చెను. త్రోవలో ఋతుపర్ణుని వలన పొందిన యక్షపదయ మను విద్యచే కలి నలుని వీడి పోయెను. యచ్చట దమయంతి బాహుకుని నలుఁగా నెఱింగి తన పాతి వ్రత్యము నాతని కెఱింగించెను. వాయు భట్టారకుని సాక్ష్యము వలన నలుఁడు దమయంతి పాతివ్రత్యము నెఱింగి యామెను స్వీక రించెను. కొలది దినముల తరువాత నతఁడు నిషధ దేశమునకుపోయి దమయంతి రోయగా పుష్కరునితో జూదమాడి యతని నోడించి రాజ్యమును తిరిగి గైకొనెను. ఇది సంగ్రహముగా నలుని కథ. ఇందు తొలుత వివాహమునకు పూర్వము నలదమయంతుల కయోగ విప్రలంభము, నలుని రాజ్యభ్రంశము, తరువాత వియోగ విప్రలంభము, తుదియందు పునస్సంయోగము కథ యందే సహజముగా నున్నవి. అందుచేత నిది సంపూర్ణమైన కథ. పరిపుష్టమైన శృంగార రసమున కాలవాలమైన కథ. నలుడు ధీరోదాత్త నాయకుఁడు. ఏక పత్నీవ్రతుఁడు కనుక సంపూర్ణముగ నాయక గుణములు గలవాఁడు. దమ యంతి ధీరనాయిక. ఇది శృంగార రసమునకు సంబంధించిన విభాగము. ఇరువురు నుత్తమ పాత్రలు. దీనిని వ్యాసభారతమునందు కంటె రసపరముగను, కథా పరముగను కూడ యెంతయైన పెంచి వ్రాయవచ్చును. కాని నన్నయగారా పని చేయలేదు. ఎందుచేత? యని ప్రశ్న. నన్నయగారికి పూర్వుఁడైన శ్రీ హర్ష మహాకవి సంస్కృతమునందు దీనినెంతయో పెంచి బహుపర్ణనామయముగా వ్రాసెను. నన్నయగారు శ్రీ హర్షుని నుండి యే యంశమును స్వీకరింపలేదు. ఈ కథను మూలము నందు కంటె చాల సంగ్రహించి వ్రాసెను. కారణము- ఇది యుపాఖ్యానమగుట యొకటి. మఱియొకటి- మహాభారత కథ యందు శాంతము ప్రధానరసము- ఈ కథయందు శృంగార రసము. శృంగార రసము నకు, శాంతమునకు విరోధము. శృంగార ప్రతీతి యధికమైనచో నీ విరోధము భాసించి రసభంగ మేర్పడును. కావున నీ విరోధము భాసింపరాదు. మఱియును నిది శాంతమున కంగభూతము గావలెను. అంగభూతమగుట యనఁగానేమి? యని పెద్ద ప్రశ్న. రసాంతర సన్నివేశముచే రస విరోధమును పరిహరింప వచ్చునని యలంకారికుల తీర్పులున్నవి. ఈ తీర్పులుదాహరింప వచ్చును. సమ న్వయింపను వచ్చును. కాని రసనిర్వహణమున నది యనుభవైక వేద్యమే కాని

గ్రంథములనేకరువు పెట్టినంత మాత్రమున తెలియునట్టిది కాదు. రసముల కంగాంగి భావమనఁగా నంగ రసమునం దంగత్వము సమన్వయమగుచుండఁగనే దానియందు కూడ ప్రధాన రస ప్రతీతి యుండుట యన్నది రస నిర్వహణమున నిగూఢమైన రహస్యము. అందుచేత నిందలి శృంగార రస పరిపోషణావకాశమును నన్నయ- ఆ మాటకు వచ్చిన వ్యాసమహర్షి కూడ యుపయోగించుకొనలేదు. మలయానిల చంద్రాదికమైన యుద్దీపన సామాగ్రిని గాని, శీతలోపచారాదులు గాని, వసంత చంద్ర మన్మథోపాలంభనాది అను భావ సంపుటిని గాని వర్ణింపక కేవల కథాలంబకమైన శృంగారమునే సూచనా ప్రాయముగ, పరమ నాగ రకముగ నన్నయగారు నిబంధించెను. అందువలన నీ నలచరిత్రమునందు శృంగార మాలోచనాగమ్యమై సంలక్ష్య క్రమమగునుగాని నైషధము నందువలె నసంలక్ష్య క్రమముగాదు. సంలక్ష్య క్రమమగుట వలన శృంగార మల్ప నిర్వాహమై కథ నలంకరించుచు నంతరితమై శాంతమున కంగమగుటలో విప్రతిపత్తి లేదు. స్వభావముచేత నన్నయగారు పరమశాంతుఁడు. ఆయన వాక్కు పరమ ప్రసన్నము. రస నిర్భరము, ఆయన మాటలు వట్టి మాటలు కావు. ఏ మాట పట్టుకొన్నను దానిచుట్టు నొక వాతావరణముండును. ఆ వాతావరణము ప్రశాంత రమణీయమైనది. ఆయన వాక్కులలోనున్న ప్రశాంతి తెలుఁగు కవుల మాటల లోనే గాదు - సంస్కృత కవుల మాటలలో గూడ నరుదు. ఆయన "రెండవ వాల్మీకి" యనుట యథార్థము. ఈ కథ నలుఁడనుభవించిన కష్టములు వివరించు నట్టిది. తన్ముఖముగా చెప్పఁబడినట్టిది. ఇందు స్వాభావికముగ నున్న విప్ర లంభము కథనలంకరించుట గుణమే యగును. ఇందలి హంస శివుఁడు; నల దమయంతుల ప్రేమ పండించినవాఁడు. ఆయన రసమాత్రమూర్తి, శాంత రస స్వరూపుఁడు. నన్నయగారీ హంసయందు శివ స్వరూపమును దర్శించినారు. ఆ శివుఁడు సంఘటించిన శృంగారమిది. నన్నయగారు విభావానుభావ వ్యభిచారి సంపుటి లేకుండగనే తన ప్రసన్న గంభీర వాక్కులచేతనే శాంతరస ప్రతీతిని [illegible]గించును. "వాయుభక్షుఁలు, పర్ణభక్షుఁలు, శాక నీ,వారభక్షుఁలు" అను మాటలలోనే గాదు- "నలదమయంతు లిద్దరు మనఃప్రభవానల బాధ్యమానలై" యన్న మాటలలోగూడ మనకనుభూయమానమగునది పర్యవసానమున శాంత రసము. ఈ విషయమును వివరించిన నొక గ్రంథమగును.

ఇది విడిచి నన్నయగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తికి, ఆయన రుచిరార్థ సూక్తులకు, పద్య రచనకు నీ నలచరిత్రము కాణాచి, ఆయా గుణము లన్నియు వ్యాఖ్యానమునం దాయాస్థలముల నా శక్తి కొలది విశదీకరించితిని. ఇచ్చట మరల వానిని తడవుట చర్విత చర్వణ మగును. ఆయన యీ కథ యందు మూలమున కెన్నియో మెరుగులు దిద్దెను. కొన్ని మార్పులు చేసెను. కొన్ని చేర్పులు చేసెను. సంస్కృత మూలమును చదివినగాని నన్నయగారు చేసిన పరిశ్రమ యొక్క స్వరూపము మనకు తెలియదు. ఎన్ని పర్యాయములు చదివినను నన్నయగారిలో తెలిసికొనవలసినది మిగిలియే యుండును. ఆయన సముద్రమంత లోతు. తిక్కన గారాకసమంత యెత్తు, తిక్కనగారి యౌన్నత్యము మనము కొలువ గలుగుదుమేమో గాని నన్నయగారి లోతును మనము కొలువలేము సరిగదా ఆకళింపు గూడ చేసికొనలేము. ఈ గ్రంథము నకు టీక వ్రాయుటలో నేను సరళమైన గ్రాంథిక భాష నుపయోగించితిని. గ్రాంథిక మనఁగా వ్యావహారికము కాదని మాత్రమే యర్థము. ఇది యధార్థముగా వ్యాకరణ యుక్తమైన భాషకాదు, ఇందు సరళాదేశములు, అర్ధానుస్వారములు, గసడదవాదేశములు మొదలైనవి పాటింపలేదు - శబ్ద రూపములు మాత్రము గ్రాంథికములే. చదువరులకు సుబోధముగా నుండుటకై ధారాళముగా వ్రాసిన భాష ఇది. మూల భాష మాత్రము యథాతథముగనే యుంచితిని. సమాసము లకు, కఠిన పదములకు నర్థములు వ్రాయుటలో సుబోధముగా నుండుటయే లక్ష్యముగా పెట్టుకొంటిని. వ్యాకరణ చర్చలు, నలంకార చర్చలు మొదలైనవి సామాన్య పాఠకుల కందుబాటులో నుండవను తలంపున వదలితిని. ఈ గ్రంథ మునకు టీకను రచించు నవకాశమును నాకు కల్పించిన సాహిత్య ఎకాడమీ వారికి నా కృతజ్ఞత —

—ధూళిపాళ శ్రీరామమూర్తి.

విజయవాడ
10-12-82

# నలోపాఖ్యానము

కం. శ్రీ రమ్య ధర్మ నిత్య
ప్రారంభ విభాసి రాజ పరమేశ్వర ఘో
రారి మద కుంభి కుంభ వి
దారణ దారుణ కృపాణ దక్షిణహస్తా! 1

అర్థం. శ్రీరమ్య=శోభాసంపదలచేత రమణీయమైన వాడా, ధర్మనిత్యప్రారంభ విభాసి = ఎల్లప్పుడు ధర్మకార్యములతో ప్రకాశించువాడా, రాజ పరమేశ్వర=రాజులకు రాజైన వాడా, ఘోరారి మద కుంభి కుంభ విదారణ కృపాణ దక్షిణహస్తా=ఘోరమైన శత్రువుల మదపుటేనుగుల కుంభస్థలములను చించుటయందు తీక్ష్ణమైన ఖడ్గముగల కుడి చేయి గలవాడా!

తా. రాజాధి రాజా! నీవు శ్రీమంతుడవు. నీ సంపదకు తగినట్లెల్లప్పుడు ధర్మ కార్యములను చేయుచుందువు. నీవు మహా వీరుడవు. నీ చేతిలోని ఖడ్గము నీ శాత్రవుల మదపుటేనుగుల కుంభస్థలములను చీల్చుచుండును.

వి. నన్నయగారు తాను రచించిన మహా భారతమును రాజ రాజ నరేంద్రున కంకిత మిచ్చెను. ఈ పద్యము ఆయనకు సంబోధనము. ఆయన శ్రీమంతుడు, ధర్మమూర్తి, మహా వీరుడు, పరాక్రమవంతుడు.

వ. అక్కథకుండు శౌనకాది మహా మునులకుం జెప్పినట్లు సాంత్వన వచనంబుల భీమసేనునకుం గోపాటోపోపశమనంబు చేయుచున్న ధర్మ రాజు నొద్దకు బృహదశ్వుండను మహాముని వచ్చి విధి దృష్ట విధానం బునం బూజితుండై విశ్రమించి యున్న నమ్మునివరునకు ధర్మతనయుం డధర్మపరులైన పరులచేతం దమ పడిన నికార ప్రకారంబంతయు నెఱింగించి యిట్లనియె : 2

అర్థం. సాంత్వన వచనములు=ఓదార్పు మాటలు, కోపాటోపోపశమనము = కోపోద్రేకమును చల్లబఱచుట, విధి దృష్ట విధానము=శాస్త్రమునందు చెప్పిన రీతి, పరులు=శత్రువులు, నికారము=అపకారము.

తా. అరణ్యవాసము పూర్తి చేయకుండనే దుర్యోధనాదుల జయించి రాజ్యమును నాక్రమింతమని కోపముతో పలుకుచున్న భీముని నోదార్చుచున్న ధర్మరాజు నొద్దకు బృహదశ్వుడన్న మహాముని వచ్చెను. ఆయనను శాస్త్ర ప్రకారము పూజించి ధర్మరాజు శత్రువుల వల్ల తాను పడ్డ పాటు చెప్పి యిట్లనెను:

వి. బృహదశ్వుడు సరియైన సమయములో వచ్చినాడు. ఆయన వచ్చినది ధర్మరాజునకు నల చరిత్రము చెప్పుట కొఱకే. ఆయనకు ధర్మరాజుతో కావలసిన పనిలేదు. ఆ చరిత్ర చెప్పెను, వెడలిపోయెను, కాబట్టి యాయన వచ్చినది యీ నలచరిత్రము చెప్పి యోదార్చుటకు, మఱి యేదియైనను నడగక చెప్పరాదు. ఆయన యిట్టి యభిప్రాయముతో వచ్చినాడు కావున నట్టి కథను చెప్పుటకు కావలసిన ప్రశ్నము ధర్మరాజునందు పుట్టినది. ఆ వచ్చిన ఋషి యంత సిద్ధ సంకల్పుడన్నమాట. శ్రీమద్రామాయణము కూడ యిట్లే మొదలైనది. తపస్వియైన వాల్మీకి తపస్వియైన నారదు నడిగెనని వాల్మీకి రామాయణము మొదలుపెట్టెను. నారదుడు రామకథను చెప్పుటకే వచ్చెను. వాల్మీకి తగిన ప్రశ్న వేసెను. ఇద్దఱును తపస్వులే. ఇచ్చట కూడ నిద్దఱును తపస్వులే.

ఒక కావ్యము గాని, ఒక కథగాని తపస్వులైన వారివల్ల ప్రవర్తించినప్పుడది లోక కల్యాణము చేయును, ఈ నల చరిత్ర మట్టిది.

కం. పుడమియు రాజ్యము బంధుల
విడిచి మృగావలులఁ గలసి విపినంబులలోఁ
గడుకొని మాయట్లిడుమలఁ
బడిన నరులు గలరె యొరులు పరమ మునీంద్రా! 3

అర్థం : మృగావలులు = మృగ సమూహములు, విపినములు = అడవులు, ఇడుమలు = కష్టములు.

తా. భూమిని, రాజ్యమును, బంధువులను విడచి క్రూర మృగములతో అడవులలో సహవాసము చేయుచు మావలె కష్టములు పడిన వారినెవరినైనను మీరు కని విని యుండిరా !

వ. అనిన యుధిష్ఠిరునకు బృహదశ్వుండిట్లనియె. 4

అర్థం : యుధిష్ఠిరుడు = ధర్మరాజు.

కం. దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాలితో వచ్చి యర
ణ్యావాసము సేసెదు ధర
ణీవల్లభ నీవు ధర్మ నిష్ఠిత బుద్ధిన్. 5

అర్థం : అనుజులు = తమ్ములు, విప్రులు = బ్రాహ్మణులు, రథాలి = రథముల సమూహము, ధర్మనిష్ఠిత బుద్ధిన్ = ధర్మమునందు నెలకొన్న బుద్ధితో.

తా. సమర్థులైన తమ్ములతో, బ్రాహ్మణులతో, రథములతో నీవు అరణ్యములో నివసించుచుంటివి, దీనికి కారణము నీ ధర్మబుద్ధియే.

వి. ధర్మ కారణముననే నీవు అరణ్యమునకు వచ్చితివి. కాని నీకిచ్చట కష్టమేమున్నది? నీ తమ్ములు నీవేది చెప్పిన అది చేయుదురు. సర్వ సమర్థులు. కాలక్షేపమునకు వేద వేదాంగ విదులైన బ్రాహ్మణులున్నారు. రాకపోకలకు, ఫలమూల సేకరణకు బండ్లుకూడ నున్నవి.

కం. నరనుతుఁడు దొల్లి నలుఁడను
ధరణీశుఁడు జూదమాడి తన విభవము పు
ష్కరుఁడు చేత నోటువడి యొ
క్కరుఁడ కరంబిడుమఁ బడఁడె కానన సీమన్. 6

అర్థం : నరనుతుఁడు = మనుష్యులచేత స్తుతింపబడినవాడు, విభవము = సంపద, ఓటువడి = ఓడిపోయి, కానన సీమన్ = అడవిలో, కరంబిడుమఁ బడఁడె = మిక్కిలి కష్టములు పడలేదా !

వి. నీ కంటెను నల మహారాజెక్కువ కష్టములు పడెనని ధ్వని. నీ కేమి? నీకు పైన చెప్పిన సహాయ సంపత్తి యున్నది. సూర్యు డిచ్చిన యక్షయ మైన చతుర్విధాహారము లందించు తామ్రస్థాలి యున్నది. అడవిలో నుంటి వన్న మాటగాని రాజ్యమునందు కంటె నిచ్చటనే సుఖతరముగా నున్నది. మఱి నలుడో! పాప మాయనకు నొక్క సేవకుడైనను లేడు. ఈ భావ మిచ్చుట నన్నయగారు రమణీయముగా ధ్వనింపఁ జేసినారు. సంస్కృత మూలము నందిది వాచ్యముగా నున్నది.

వ. అనిన నది యెట్లని ధర్మనందనుండడిగిన బృహదశ్వుం డిట్లనియె: నిష ధేశ్వరుండయిన వీరసేనుని కొడుకు నలుండను వాడనే కాక్షౌహిణీపతి యనవరతాక్ష ప్రియుం డజేయం బైన తన తేజంబున నెల్ల రాజులను జయించి బ్రహ్మణ్యుండయి బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజా పాలనంబు సేయు చుండ-

అర్థం. అనవరతాక్ష ప్రియుఁడు = పాచిక లాడుట యందెడతెగని ప్రేమ కల వాడు, బ్రహ్మణ్యుఁడు = బ్రాహ్మణుల యందు, వేదము నందు, వైదిక కర్మల యందు, పరమాత్మ యందు శ్రద్ధ కలవాడు, బ్రహ్మోత్త రంబుగా = వేదోక్త మార్గమున.

తా. బృహదశ్వుని ధర్మరాజు నలుని కథ చెప్పుమని యడిగెను. బృహదశ్వు డిట్లు చెప్పెను: నిషధ దేశమునకు వీరసేనుడను రాజు కలడు. ఆయన కొడుకు నలుడు. అతనికి చాల యక్షౌహిణుల సేన కలదు. జూదమన్న నతనికి ప్రీతి మెండు. అతఁడు తండ్రి తరువాత రాజై పరాక్రమముతో రాజు లందఱి జయించి, బ్రాహ్మణులందు, వేదము నందు, వైదిక కర్మ లందు, పరమాత్మ యందు శ్రద్ధాభక్తులతో వేదోక్త మార్గమున ప్రజ లను పాలించు చుండెను.

సీ. అట విదర్భాధిపుఁ డైన భీముండను
వాఁడనపత్యుఁడై వ్రతములోలి
సలుపుచు దమనుఁ డన్మునిఁ బత్నియుఁ
దాను నుపాసించి తద్వరమున
దమయంతి యను కూఁతు దమదాంత దమనుల
న్సుతులను బడసె విశ్రుత గుణాఢ్యుఁ
డందుఁ గన్యా రత్నమగు దమయంతి దా
నత్యంత కాంతి రూపాభిజాత్య

ఆ. విమల గుణ సమృద్ధి వెలుగుచు సురసిద్ధ
సాధ్య కన్యలట్టి సతులు నూర్వు
రొలసి తన్నుఁ గొలుచు చుండఁగ మహి నొప్పు
చుండెనధిక విభవ యుక్తితోడ. 8

అర్థం. అనపత్యుఁడు = సంతానము లేనివాడు, విశ్రుత గుణాఢ్యుఁడు = ప్రసిద్ధి కెక్కిన గుణములు కలవాడు, అత్యంత...సమృద్ధి=అధిక మైన కాంతి, సౌందర్యము, సత్కులము నందు పుట్టుక, నిర్మలమైన గుణ ముల పెంపు.

తా. విదర్భ దేశమునకు రాజు భీముఁడు. ఆయనకు సంతానము లేదు. ఆయన అనేక వ్రతములు చేయుచు భార్యయు, తానునుఁ దమనుఁడన్న మునిని సేవించి, యాయన వరమువలన దమయంతి యను నొక కూఁతును, దముఁడు, దాంతుఁడు, దమనుఁడను ముగ్గురు కొడుకులను పొందెను. అందు దమయంతి రత్నము వంటి పిల్ల. అరుదైన అందగత్తె, కాంతి మంతురాలు, సద్గుణవంతురాలు. ఆమెకు దేవకన్యల వంటి నూర్గురు చెలి కత్తెలు గలరు.

వ. అంత- 9

వి. ఈ మాటను నన్నయగారు చాల చమత్కారముగ వాడుచుండును. ఇంత వరకు నిక్కడ నలుని సంగతి, అక్కడ దమయంతి సంగతి చెప్పుట

జరిగినది. వీరిద్దరికిని యౌవనోదయమైనది. ఇచ్చటి కొక ఘట్టము. కథ యందు రెండవ ఘట్టము తరువాతి పద్యము నుండి మొదలగును. ఇచ్చట నీ 'యంత' యను మాట, యీ రెండు ఘట్టములను కలుపుచున్నది. కాబట్టి కథ మలుపు దిరుగుచున్నదని సూచన.

కం. నలు గుణములు దమయంతికి
నలునకు దమయంతి గుణగణంబులు జనులి
మ్ములఁ బొగడుట నిరువురకును
వెలసె మనోభవ వికార విభ్రమమెదలన్ 10

అర్థం: మనోభవ వికార విభ్రమము = ప్రేమ విలసనము (వలపు), ఎదలు = హృదయములు.

తా. ఆ దేశము నుండి యీ దేశమునకు, ఇచ్చట నుండి యచ్చటకు వచ్చుచు పోవుచుండెడి జనుల వలన నల దమయంతులకు పరస్పరము ప్రేమ పుట్టెను.

వ. ఒక్కనాఁడు నలుఁడు దమయంతీ గుణబద్ధ చేతస్కుండై మదనానలము సహింపక నోపక ప్రమద వనంబున నుండ నంత నంతరిక్ష కాంతా హారావళియుంబోలె హంసావళి యవనీ తలంబున కవతరించిన- 11

అర్థం: దమయంతీ గుణబద్ధ చేతస్కుఁడు = దమయంతి యొక్క గుణములందు లగ్నమైన మనస్సు గలవాడు, మదనానలము = విరహము, ప్రమద వనము = ఉద్యానవనము, అంతరిక్ష కాంతా హారావళి = ఆకాశమను స్త్రీ యొక్క (ముత్యాల) హారముల వరుస, అవనీతలము = భూమి.

తా. ఒకనాడు దమయంతీ విరహము సహింపలేక నలు డుద్యానవనమున విహరించుచుండగా కొన్ని హంసలు వ్రాలెను.

వి. ఆకాశము ఒక స్త్రీ యైనచో నీ హంసలామె తాల్చిన ముత్యాల పేరువలె నున్నవి. హంస లెగురుచున్నప్పుడు సరళరేఖగా కన్పించును. వ్రాలు

చున్నప్పుడు వలయాకారముగా కన్పించును. మఱియొక చమత్కార మేమనగా, హంసగతి యందాకసమున తెల్లని కాంతి రేఖ కట్టి మెరయు చుండును. ఈ యుపమానము చాల రమణీయమైనది. సంస్కృత మూలము నందిది లేదు. ఇది నన్నయ గారిదే.

ఆ. వీరసేన సుతుఁడు వీరుండు హంసల
నడబెడంగు చూచి నగుచు వాని
నెగచి యెగచి యందు నెగయకుండగు నొక్క
హంసఁ బట్టుకొనియె నతి రయమున. 12

అర్థం: వీరుఁడు=ఉత్సాహవంతుడు, నడబెడంగు=నడకయందము, ఎగచి యెగచి=పొంచి పొంచి, అతి రయమున=వేగముగా.

తా. నలుఁడా హంసల నడకల యందమును చూచి, వాని వెనుక పొంచి పొంచి యొక హంసను వేగముగా పట్టుకొనెను.

ఆ. దాని విడిచి పోవఁగా నోపక ఱచుచు
నంతరిక్షమునను హంసలెల్లఁ
బిండుగట్టి తిరుగుచుండె వాతోద్ధూత
శారదాభ్ర శకలచయముఁ బోలె. 13

అర్థం: పిండుగట్టి=గుంపుగట్టి, వాతో...చయము=గాలిచేత నెగుర గొట్టబడిన శరత్కాలమునందలి మబ్బుతునకల సమూహము.

తా. నలుడు పట్టుకొన్న హంసను విడిచిపోలేక తక్కిన హంసలన్నియు గాలి చేత నెగురగొట్టబడిన తెల్లని మబ్బు తునకలవలె ఆకసమున తెగిరి అచట గుంపు గట్టి తిరుగుచుండెను.

వి. ఈ యుపమానము గూడ నన్నయగారి సొత్తే. సంస్కృత మూలమున నిది లేదు.

వ. అదియును దన కమ్మనుజేశ్వరుఁడపాయంబు సేయుంగా వగచి మనుష్య వాక్యంబుల నిట్లనియె: నయ్యా యేను నీకుం బ్రియంబు చేసెద నీ హృదయేశ్వరియైన దమయంతి కాలికింబోయి నీ గుణంబులు దానికి వర్ణించి యక్కన్య యన్యుల నపేక్షింపక నీ యంద బద్ధానురాగ యగు నట్లుగాఁ జేసెద. 14

అర్థం. హృదయేశ్వరి = ప్రియురాలు, అపేక్షింపక = కోరక, బద్ధానురాగ = నిలిచిన ప్రేమగలది.

తా. ఆ పట్టుబడ్డ హంస యా రాజు తన కపాయము చేయునేమో యన్నట్లుగా భావించి మనుష్య భాషలో 'రాజా! నేను నీ కిష్టమైన పని చేయుదును, నీ ప్రియురాలైన దమయంతి యొద్దకు పోయి నీ గుణములు దానికి చక్కగా వర్ణించి చెప్పి యితరులను కోరకుందునట్లును, నిన్నే కోరు నట్లును చేయుదు'నన్నది.

వి. అపాయము చేయునని కాదు హంస యనుకొన్నది. చేయునేమో యని భావించినట్లు నటించినది. ఈ యర్థము సేయుంగా వగచి యనుటలో నున్నది. హంస మనుష్య వాక్యములలో మాట్లాడుటకు, దానికి మనుష్య భాష వచ్చునన్నమాట. మరియు నది నీ ప్రియురాలు దమయంతియొద్దకు పోవుదునన్నది. దానికి దమయంతి నలునికి ప్రియురాలని తెలియునన్న మాట. సామాన్య హంసల కిట్టి శక్తి యుండునా? యని ప్రశ్న. దానికి మనుష్యుల భాష వచ్చును, మనుష్యుల మనస్సులలోని భావములు తెలి యును. ఇది యెట్లు? మఱియొకటి. ఆ హంసలన్నియు నిట్టి శక్తి గలవేనా లేక యీ హంస యొక్కటియేనా? యిట్టిది—ఇట్టిదిది యొక్క టియే యైనచో దానినే నలుఁడెట్లు పట్టుకొనెను? ఈ ప్రశ్నలకు సంస్కృత భారతమునందు సమాధానము కానరాదు. నన్నయగారీ సమస్యల నెట్లు పరిష్కరించెనో ముందు ముందు చూతము. మనకిచ్చట నన్నయగారా హంస యిట్టి శక్తులు కలది గాన నది సామాన్య హంస కాదని సూచించి నారనుకొందము.

కం. అనిన విని హంస పలుకులు
తన హృదయంబునకు నమృతధారాపాతం
బును బోలె నైన నృపనం
దనుఁడనురక్తుఁడయి విడిచెఁ దడయక దానిన్. 15

అర్థం. అమృతధారాపాతఁబును బోలె=అమృతధారలు కురిసినట్లు, నృపనంద నుఁడు=రాజకుమారుడు, అనురక్తుడు=ప్రేమగలవాడు, తడయక= ఆలసింపక.

తా. నలుఁడా హంస మాటలు తనవిరహాగ్ని నమృతవర్షమువలె చల్లన చేయగా వెంటనే దానిని విడిచిపెట్టెను.

వ. హంసపిండుతో నదియును విదర్భాపురంబున కరిగి యందుపవనంబున సఖీజన పరివృతయైయున్న దమయంతి యంతికంబునకు వచ్చి విహరించు చుండెనంత వానిం జూచి పరమ కౌతుకమ్మున- 16

అర్థం. ఉపవనము=ఉద్యానవనము, సఖీజనపరివృత=చెలిక త్తెలతో చుట్టుకొన బడినది, అంతికము=సమీపము, కౌతుకము=కుతూహలము.

తా. ఆ హంస యచ్చటనుండి తక్కిన హంసలతో కూడ విదర్భాపురమునకు పోయి యందు రాజోద్యానములో చెలిక త్తెలతో కూడ విహరించుచున్న దమయంతి సమీపమున వ్రాలి తిరుగుచుండెను. వారు కుతూహలముతో-

తే. ఒండొరులఁ గడవంగ నయ్యువిదలెల్లఁ
బఱచి యొక్కొక్క కలహంసఁ బట్టికొనఁగఁ
జెలువముగ నందు దమయంతిచేతఁ బట్టు
వడియె నలుచేత విడువంగబడిన హంస. 17

అర్థం. ఉవిదలు=స్త్రీలు, పఱచి=పరువెత్తి, చెలువముగా=అందముగా.

తా. ఒకరకంటె నొకరు వారందఱు హంసల వెంటబడి ఒక్కొక్క రొక్కొక్క దానిని పట్టుకొన్నారు. నలుడు విడిచిన హంస దమయంతికి పట్టుబడినది.

వి. నలుడు విడిచిన హంస దమయంతికి పట్టుబడనేల? మఱియొకరు పట్టుకొన్నచో నేమి జరిగెడిది? యని ప్రశ్న. అనగా నా హంస అందముగ నొయ్యారముగ నడచుచు నితరుల తప్పించుకొనుచు దమయంతి కందుబాటులో తిరిగినదన్నమాట. 'దమయంతి చేత పట్టువడియె' నన్నారు నన్నయగారు. అది కావలెనని దమయంతికి పట్టుబడ్డది. ఇది రమణీయమైన కల్పన. అంతకంటె మఱియొక లోతైన సమాధానము ముందు పద్యమునందు నన్నయగారు నిక్షేపించెను.

కం. దమయంతికి నలునకు సం
గమ కారణ దూతయైన కలహంస మనో
జ్ఞ మనుష్య వాక్యముల న
ద్దమయంతికి హర్షమెసఁగఁ దానిట్లనియెన్. 18

అర్థం: సంగమ కారణదూత = కలయికయే కారణముగా దూతయైనట్టిది, లేక కలయికకు కారణమైన దూతయైనట్టిది, లేక కలయికకు కారణ దూతయైనట్టిది, మనోజ్ఞము = మనోహరము.

తా. నలదమయంతుల కలయికకు కారణమైన దూత యీ కలహంస. అది మనోహరములైన మనుష్య వాక్యములతో దమయంతి కానందముగా నిట్లు చెప్పెను.

వి. ఇచ్చట సంగమ కారణదూత యనుటలో నీ కథలోని రహస్యమంతయు నున్నది. ఈ మాటగాని, ఇందలి స్వారస్యముగాని సంస్కృత మూలమునందు లేదు. ఇది నన్నయగారు కల్పించినదే. ఆ కలహంస నలుని యొద్దకు వచ్చుటగాని, దమయంతి యొద్దకు వచ్చుటగాని వారి యిద్దఱి కలయికను సాధించుటకే. అది దూతయగుటకు వారి యిద్దఱి కలయికయే కారణము. మఱియొక కారణము లేదు. ఇది యెట్లు? హంస దూత్యము వల్ల వారు కలయుట తటస్థించినది. కావున హంస దూత్యము కారణము. వారి కలయిక కార్యము. ఇట్లు చెప్పుట సరిగదా! అని ప్రశ్న. అది సరే. ఇక్కడ చెప్పినది అంతకంటెను లోతైనది. ఇచ్చట కారణమనఁగా హేతువు. ఈ హంస దూతయగుటకు హేతువేమి? ఆ హేతువు వారిద్దరి

కలయిక సాధింపంబడవలసి యుండుట. వారి సంగమము జరుగవలసి యున్నది కావుననది కారణముగా నీ హంస దూతయై వచ్చినదని లోతైన సమాధానము. దీనిపైన తోచు మఱియొక స్వారస్యము- ఈ హంస వారి సంగమము నిర్వహించుట కది యొక కారణముగా వచ్చినది గాని తక్కిన సామాన్య హంసల వంటిదిగాదు. లోకములో కారణ జన్ములని, కర్మ జన్ములని యుందురు. ఒక మహాకార్యమును నిర్వహించుటకు పుట్టిన వారు కారణజన్ములు, జన్మాంతరమున జేసిన పుణ్యాపాపము లనుభవించు టకు పుట్టినవారు కర్మజన్ములు. ఈహంస యటువంటి కారణజన్మగలది. ఈ దౌత్యము కొఱకే జన్మయెత్తినట్టిది. ఇది యొక స్వారస్యము. ఇంత కంటెను నన్నయగారుద్దేశించినట్టిది కనుక గంభీరమైనది. హంస యనగా శివుఁడు. ఈ కలహంస శివుఁడు. నల దమయంతుల సంగమము నిర్వ హించుటది కారణముగా దూతయైనాడు గావున కారణదూత. శివుఁడా హంస యాకారముతో వచ్చినాడు. హంసలలో నొక్క హంసగా కాదు. ఆ హంసలన్నియు శివుఁడే. నలుదేహంసను పట్టుకొన్నను నది శివుఁడే. దమ యంతి యే హంసను పట్టుకొన్నునది శివుఁడే. ఈ పద్యములోని సొగ సిది. నన్నయగారి నల చరిత్ర యందలి హంస దౌత్యమునకు చెప్పిన భాష్యమిది. నన్నియగారు తాను బ్రహ్మాండాది నానా పురాణములయందలి విజ్ఞానము నంతయు నెఱిఁగిన వాడనని చెప్పుకొనెను. ఈ కథ శివ పురా ణము నందలిది. నలదమయంతుల జన్మాంతరీయక మహాపుణ్య విశేష ఫలితముగా శివుఁడు వారికి హంస రూపమున దౌత్యము నెఱపినట్లు శివ పురాణము నందున్నది. ఈ సందర్భమున బ్ర. శ్రీ. విశ్వనాథ సత్య నారాయణగారి 'నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి' చూచునది.

వ. నీ హృదయేశ్వరుండైన నలునొద్దనుండి వచ్చితి నపార పారావార పర్యంతానంత మహీతలంబునందు నా చూడని రాజులెవ్వరు లేరు. సర్వ గుణ సౌందర్యంబుల నెవ్వరు నలుంబోలరు. 19

అర్థం. అపార...తలంబునందు = అంతులేని సముద్రముల వరకు గల అనంత మైన భూప్రదేశమందు, సర్వగుణ సౌందర్యంబులన్ = సర్వ సద్గుణము లందు, సౌందర్యంబునందున.

తా. నేను నీకు ప్రియుడైన నలునొద్దనుండి వచ్చితిని. ఈ విశాల భూమండలమునందు నున్న రాజులందఱ నేను చూచితిని. సద్గుణములందును, సౌందర్యము నందును నలుని బోలినవారు లేరు.

తే. నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁ
గాక నీ సముజ్జ్వల రూపకాంతి విభవ
నిత్య సౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర
లక్షణావలులవి సఫలంబులగునె. 20

అర్థం. పేర్మితో=ప్రేమతో, దేవి=భార్య, నీ సముజ్జ్వల...లక్షణావలులు=ప్రకాశించునట్టి నీ యందము, కాంతి, సంపద, సౌభాగ్యము, భాగ్యము, మంచి కులమందలి జన్మ, శుభ లక్షణములును.

తా. నీవు నలునకు భార్యవైన తప్ప నీ సౌందర్యము, లావణ్యము, సౌభాగ్యము, భాగ్యము మొదలైన నీ శుభలక్షణములు ఫలవంతములు గావు.

వ. నీవు నారీరత్నంబ వాతండు పురుషరత్నంబు గావున మీ యిద్దఱ సమాగమంబన్యోన్య శోభాకరంబగునని విని సంప్రాప్త హృదయ సమ్మదమై దమయంతి దానికిట్లనియె: 21

అర్థం. అన్యోన్య శోభాకరము=పరస్పరమును ప్రకాశింపఁ జేయునది, సంప్రాప్త హృదయ సమ్మద=పొందిన మనస్సంతోషము గలది.

తా. నీవు స్త్రీ రత్నమవు, అతఁడు పురుష రత్నము. మీరిద్దఱు పెండ్లియాడిన నొకరి కొకరు సౌందర్యమును దీపింపఁజేయుదురు. మీ దాంపత్యము పరిపూర్ణమై మిక్కిలి యొప్పి యుండును. హంస చెప్పిన యీ మాటలు విని చాల సంతోషించి దమయంతి యిట్లనెను:

మధ్యా. ఆ రాజు గుణములు నా కెఱింగించినట్టులు నన్ను
నా రాజునకు నెఱింగించి కరుణ నాయందుఁ గావింపు
మారంగ ననుడు నిషధ విషయమున కరిగి యా హంస
వీరసేనజునకు దాని గుణ రూప విభవముల్ సెప్పె. 22

అర్థం. నిషధ విషయము=నిషధ దేశము, వీరసేనజుఁడు=వీరసేనుని కొడుకైన నలుఁడు.

తా. ఆ రాజు గుణములు నాకు చెప్పినట్లుగనె నన్ను గుఱించి యాయనకు చెప్పి నా యందు దయ చేయుము. దమయంతి మాటలు విని హంస నిషధ దేశమునకు పోయి నలునకు నామె గుణ రూప సంపద వర్ణించి చెప్పెను.

వ. అంత- 23

తా. ఇక్కడికి మఱియొక ఘట్టమైనదన్నమాట. నల దమయంతుల కిద్దఱకును పరస్పర ప్రేమ ముదయించినది. 'అంత' యనఁగా నుదయించినంతనే యని యర్థము.

చ. నల దమయంతు లిద్దఱు మనః ప్రభవానల బాధ్యమానలై
సలిపిరి దీర్ఘ వాసరనిశల్ విలసన్నవ నందనంబులన్
నలినదళంబులన్ మృదు మృణాళములన్ ఘనసార పాంసులం
దలిరుల శయ్యలన్ సలిల ధారలఁ జందన చారు చర్చలన్. 24

అర్థం. మనః ప్రభవానల బాధ్యమానలు=విరహాగ్ని చేత బాధింపబడిన వారు, దీర్ఘవాసర నిశల్=పొడవైన పగళ్లు, రాత్రులును, విలసన్నవ నందనంబులన్ = ప్రకాశించుచున్న లేఁ దోటలందు, నలిన దళంబులన్ = తామర పూరేకుల తోడను, మృదు మృణాలములన్ = లేఁత తామర తూడులతోను, ఘనసార పాంసులన్ = పచ్చకప్పురపు పొడులతోను, తలిరుల శయ్యలన్=చిగురుటాకుల సెజ్జలతోను, సలిల ధారలన్ = చల్లని నీటి ధారలతోను, చందన చారు చర్చలన్ = సొగసైన మంచి గంధపు పూతలతోను, సలిపిరి=గడపిరి.

తా. నల దమయంతులకు పరస్పర విరహ బాధవల్ల పవలు, రాత్రులు కూడ మిక్కిలి పొడవై కన్పించెను. వారు కాలమంతయు శీతలోపచారములతో నెల దోటలలో గడిపిరి.

వి. నన్నయగారి ప్రసిద్ధ పద్యములలో నిది యొకటి. ప్రసాద మాధుర్య గుణముల కుదాహార్యము. అయోగ విప్రలంభము పద్యమునందు సుకుమారముగా ధ్వనించుచున్నది. దీనికి సంస్కృత మూలములేదు. నన్నయ గారి స్వకల్పనమే.

వ. ఇట్లిద్దఱు నన్యోన్య రూపగుణ శ్రవణ సంజాత ప్రీతులై యుండునంత నంతఃకరణ సంతత మనోజాత సంతాప వివర్ణవదనయైన యా దమయంతిం జూచి భయసంభ్రమాక్రాంతలై సఖీజనులెల్ల కోమలి వృత్తాంతం బంతయు భీమున కెఱింగించి యిట్లనిరి: 25

అర్థం. అన్యోన్య...ప్రీతులు = ఒకరి రూప గుణములు మఱియొకరు వినుటవల్ల పుట్టిన ప్రేమ గలవారు, అంతఃకరణ...వదన = మనసునందు నెడ తెగని విరహము చేత వాడిన ముఖము గలది.

తా. వారిట్లు పరస్పరము ప్రేమించుకొని యుండ విరహతాపము వల్ల దమయంతి ముఖము వాడియుండుట చూచి చెలికత్తెలు భయపడి యామె ప్రేమ కథ యంతయు భీమునకు చెప్పి యిట్లనిరి:

సీ. కలహంస పలికిన పలుకులు గణియించు
వడి దాని పోయిన వలను చూచుఁ
బలుకదు సఖులతో లలితాంగి మిన్నక
యలయుచు నుండుఁ దాననుదినంబుఁ
జారు విభూషణాహార విహార శ
య్యాసన భోగములందు విముఖి
యయి రేయుఁ బగలు నిద్రయు నోర్పు నెఱుఁగక
దమయంతి నలుఁడను ధరణినాథు

ఆ. నంద బుద్ధి నిలిపి కందర్ప బాధిత
యగుచున్న యది ధరాధినాథ
ధరణిపతుల నొరుల నురు గుణాఢ్యుల, విన
నొల్లదెంత విభవ యుక్తులైన. 26

అర్థం: చారు...భోగంబులు = అందమైన నగలు, తిండి, తిరుగుట, శయ్యలు, పీఠములు మొదలైన భోగములు, విముఖ = ఆదరములేనిది.

తా. 'దమయంతి నలునియందే మనసు నిలిపి ఆ హంస చెప్పిన మాటలు తలచుకొనుచు, దాని పోయిన దిక్కు చూచుచు సఖులతో మాట్లాడక, యూరక యాయాస పడుచున్నది. ఆభరణముల లంకరించుకొనదు. ఆహార మొల్లదు. పాన్పులు, పీఠములు, భోగముల నాదరింపదు. రాత్రింబవళ్లు నిద్రపోదు. ఇట్లు బాధపడుచు నెంత గొప్ప గుణవంతులైన రాజులైనను నెంత వైభవముగల వారినైనను విననొల్లకున్నది' - అని చెలికత్తెలు భీమునకు చెప్పిరి.

వి. పద్యమునందు గ్లాని చింతౌత్సుక్యాది వ్యభిచారి భావములు ధ్వనించు చున్నవి. అయోగ విప్రలంభము, వ్యభిచారి భావసంపుటిచే పరిపుష్టమై ధ్వనించుచున్నది.

వ. అనిన విని భీముండేమి సేయుదు నెవ్విధంబున నమ్మహీపతినిట రావింప నగునోయని చింతించుచు సంప్రాప్త యౌవనయైన కూతుంజూచి యప్పుడు- 27

అర్థం: సంప్రాప్తయౌవన = వయసు వచ్చినది.

తా. చెలికత్తెలు చెప్పిన మాటలువిని భీముడు నలుని రావించుటకు నుపాయము చింతించుచు వయసు వచ్చిన కూఁతు చూచి-

కం. ఆ వైదర్భుడు నిఖిల ధ
రావలయములోనఁ గలుగు రాజన్యుల నా
నా విషయాధీశ్వరులను
రావించెం దత్స్వయంవర వ్యాజమునన్ 28

అర్థం: వైదర్భుఁడు = విదర్భ రాజైన భీముడు, నిఖిల ధరావలయము = సమస్త భూమండలము, రాజన్యులు = పట్టాభిషేకము పొందిన రాజులు, నానా విషయాధీశ్వరులు = అనేక దేశములకు ప్రభువులు, తత్స్వయంవర వ్యాజమునన్ = ఆ దమయంతి యొక్క స్వయంవరమను మిషచేత.

తా. భీముడు దమయంతీ స్వయంవరము చాటింపించి యా మిషతో భూవలయమునందలి రాజులనెల్ల రావించెను.

వి. రాజన్యులనుట వలన స్వయంవరమున కాహూతులైన వారందరు రాజ్యాధిపతులేగాని సామాన్య క్షత్రియులు కారు. దమయంతి నలుని వరించెనని భీమునకు దెలియును. మఱి స్వయంవరము ప్రకటించుటెందులకు? ఆ కాలమున నిప్పటివలె వరాన్వేషణ చేయుచు కన్య నిత్తుమనుట మర్యాద కాదు. అది కన్యాదాత గౌరవమునకు భంగకరమని భావించెడివారు. అట్టి భయముచేత భీముడు నలుని పిలిచి పిల్లనిత్తునని చెప్పలేదన్న మాట.

కం. మనుజేశ్వరు లెల్లను బో
రన దమయంతీ స్వయంవరమునకు నొప్పం
జనుదెంచిరి సైన్య స్యం
దన ఘట్టన నవని తలము దల్లడపడగన్. 29

అర్థం: మనుజేశ్వరులు = రాజులు, సైన్యస్యందన ఘట్టనన్ = సైన్యముల యొక్కయు, రథముల యొక్కయు తాకిడిచేత, అవనితలము = భూమి, తల్లడ పడగన్ = అదరి పడఁగ.

తా. రాజులందఱును చతురంగ సైన్యములతో, రథములతో పుడమి యదరునట్లు దమయంతీ స్వయంవరమునకు వచ్చిరి.

వ. ఆ సమయంబునఁ బర్వత నారదులను పురాణ మునులు భూలోకం బెల్లఁ గ్రుమ్మరి యింద్రలోకంబునకుఁ బోయిన నింద్రుండు వారిం బూజించి భూలోకంబున కుశలవార్తయడిగి యిది, యెట్లు? ధర్మ పరిపాలన పరులై వీరులై రణ నిహతులైన రాజు లక్షయ లోక సుఖంబు లనుభవింపఁ నతిథులై యిందులకు నింత కాలంబయ్యెఁ, రాని కారణంబేమి యని యడిగిన నారదుం డిట్లనియె:

అర్థం. పురాణ మునులు = పురాతన ఋషులు, రణనిహతులు = యుద్ధమునందు మరణించిన వారు, అక్షయలోక సుఖములు = తరుగని పుణ్యలోక సుఖములు.

తా. అప్పుడు పర్వత నారదులను పురాతన మునులు భూలోకమంతయు తిరిగి స్వర్గమునకు పోయిరి. ఇంద్రుడు వారిని బూజించి భూలోకములోని కుశల వార్తలు విని- ''రాజులు ధర్మముగా పరిపాలించుచు. యుద్ధములాడుచు, నందు మరణించి యిచ్చట కెప్పుడును వచ్చుచుందురు గదా! చాలకాలము నుండి రాకపోవుటకు కారణమే మని యడుగగా నారదుడిట్లు చెప్పెను:

వి. క్షత్రియులకు యుద్ధమునందు మరణ ముత్తమ లోకముల నిచ్చును. ధర్మ పరిపాలనము, రణమారణము రాజులకు విహితము.

కం. నర సిద్ధ సాధ్య విద్యా
ధర సుర కన్యకల కంటె దమయంతియ సుం
దరి దాని సు స్వయంవర
మరుదై వర్తిల్లుచున్నయది యిప్డు మహిన్. 31

అర్థం. నర......కన్యకలు = మనుష్య కన్యకలు, సిద్ధ సాధ్య విద్యా ధరదేవ కన్యకలు, సిద్ధ సాధ్య విద్యాధరులు దేవతల వలన జనించిన వారు, అరుదై = ఆశ్చర్యమై.

తా. మనుష్య కన్యకలలోనే కాదు, దేవ కన్యకలలో గూడ దమయంతి వంటి యందగత్తె లేదు. భూమిలో నామె స్వయంవర మిప్పుడు నడచుచున్నది.

కం. అందులకు ధరణిఁగల నృప
నందనులెల్లను ముదంబునంబోయెదు వే
డ్కం దమలోఁ గలహంబును
గ్రందును లేకున్నవారు గడునెయ్యమునన్. 32

అర్థం. ముదంబున = సంతోషముతో, క్రందు = యుద్ధము.

తా. ఆ స్వయంవరమునకు భూమి యందున్న రాజకుమారులెల్లరు పోవు వేడుకలో నుండుటవలన పరస్పర విరోధములు మాని స్నేహముతో నున్నారు.

వ. అనిన నింద్రుండును లోకపాలవరులును దదాలోకన కౌతుకంబునం గనక రత్న రమ్య దివ్య విమానారూఢులై భూలోకంబునకు వచ్చి దమయంతీ స్వయంవరంబునకుం బోయెడు వాని నాదిత్యులలోన విష్ణుం డునుం బోలెఁ దేజోధికుండైన వాని ననన్య సాధారణ రూప విభవంబున రెండవ మన్మథుండునుంబోని వాని నలుంగని యంతరిక్షంబున విమానం బులు నిలిపి భూతలంబునకు వచ్చి వానికిట్లనిరి. 32

అర్థం. తదాలోకన కౌతుకంబున = ఆ స్వయంవరము చూచు వేడుకతో, కనక రత్న రమ్య దివ్య విమానారూఢులై = బంగారముతోను, రత్నములతోడను నిర్మించిన యందమైన దివ్య విమానము లెక్కి, ఆదిత్యులు = అదితి సంతానము (దేవతలు), తేజోధికుడు = అధికమైన కాంతి గలవాడు, అనన్య సాధారణ రూప విభవంబున = ఇతరుల యందు కన్పింపని సౌందర్య సంపదచేత, అంతరిక్షంబున = ఆకాశమున.

తా. నారదుని మాటలు విని ఇంద్రుడు దిక్పాలురతో కూడ దమయంతీ స్వయం వరమునకు విమానము లెక్కి భూలోకమునకు వచ్చుచు త్రోవలో నలుని చూచెను. నలుడు రాజులందఱిలో దేవతలయందు విష్ణువవలె ప్రకాశించు చుండెను. ఇతని సౌందర్యము తక్కిన రాజులకు లేదు. రెండవ మన్మథుని వలె నుండెను. ఇట్టి నలుని చూచి యాకసంబున విమానములు నిల్పి భూమికి దిగివచ్చి వానికిట్లనిరి.

వి. ఇచ్చట నన్నయగారు నలునకు రెండు విశేషణములు వేసినారు. ఒకటి— ఆదిత్యులలో విష్ణునివలె యధిక తేజోవంతుఁడని. రెండు-సౌందర్యము నందు రెండవ మన్మథుడని. మొదటి విశేషణము నలుని మహానుభావ త్వమును చెప్పునట్టిది, పరాక్రమాతిశయమును చెప్పునట్టిది. రెండవది

శరీరసౌందర్యమును చెప్పునట్టిది. సంస్కృత మూలమునందీ పట్టున మొదటి విశేషణము "భ్రాజమానం యథా రవిం" అని యున్నది. దానిని నన్నయగారు "ఆదిత్యులలో విష్ణుండునుంబోలె" అని మార్చినారు. వచ్చినవారు దేవతలు. విష్ణువు దేవతలలో శ్రేష్ఠుడు. మహాపరాక్రమ వంతుడు. మహానుభావుడు. ఇంద్రాదులు నలుని చూచి తమకంటె మహానుభావుడని, యధిక తేజస్వియని భావించిరి. తమకంటె సౌందర్య వంతుడని భావించిరని ధ్వని. అందుచేత తమ సంకల్పమును వదలుకొౌని రని ధ్వని. సంస్కృత మూలమునందు "తస్థుర్విగత సంకల్పాః" అని నలుని జూచి యింద్రాదులు తమ సంకల్పమును వదలిపెట్టిరని వాచ్య ముగా నున్నది. నన్నయగారు దానిని ధ్వనింపజేయుటకు ఉపమానమును రమణీయముగా మార్చెను.

సీ. నిత్య సత్యవ్రత నిషధేశ నీవు మా
 కమరంగ దూతవై యభిమతంబు
సేయుము నావుడుఁ జెచ్చెర నట్టుల
 చేయుచు మఱి నాకుఁ జెప్పుఁడు మీర
లెవ్వారలేను మీకిష్టంబుగా దూత
 నై యేమి సేయుదుననిన నతని
కమరేశ్వరుండిట్టు లనియె నే నింద్రుండ
 వీరు దిక్పాలురు విదితయశులు

ఆ. ధరణి నొప్పుచున్న దమయంతి సుస్వయం
వరముఁ జూచు వేడ్క వచ్చియున్న
వార మీవు మమ్ము వారిజాక్షికి నెఱిం
గింపు నామధేయ కీర్తనముల. 34

అర్థం : అభిమతంబు సేయుము = ఇష్టము చేయుము, విదితయశులు = ప్రసిద్ధ మైన కీర్తిగలవారు, వారిజాక్షి = తామర పూవులవంటి కన్నులు గలది (దమయంతి), నామధేయ కీర్తనముల = పేరు చెప్పుటచేత.

తా. నిషధ రాజా! నీకు సత్యము వ్రతము. మాకు దూతవై మాకిష్టమైన పనిని చేసిపెట్టవలెనని యడిగిరి. నలుడట్లే చేసిపెట్టెదనని, 'మీరెవరు, మీకేమి చేయవలె' నని యడిగెను. ఇంద్రుడు 'మేము దిక్పాలురము, నే నింద్రుడను, దమయంతి స్వయంవరమునకు పోవుచుంటిమి, నీవు మమ్ము దమయంతికి మా పేరు చెప్పి పరిచయము చేయవలసినది.

వ. అట్లయిన న క్కోమలి మాయందుఁ దన వలచిన వాని వరియించు' ననిన యింద్రునకు కృతాంజలియై నలుం డిట్లనియె. 85.

అర్థం : కృతాంజలి = నమస్కరించినవాడు.

తా. దమయంతి మాలో నెవ్వరిని ప్రేమించిన, వారిని వరించును - అనఁగా నలుడు ఇంద్రునకు నమస్కరించి యిట్లనెను.

వి. ఇంద్రాదులు నలుని సత్యనిష్ఠ తలచుకొన్నారన్న మాట, తలచుకొనగా వారి యాశ చిగురించె నన్నమాట. అతనినే దూతగా పంపినచో దమయంతి వానిని వరించుటకు వీలులేదు. దౌత్యము చేయుటకు పోయిన వారు దమయంతి వరించినప్పటికిని నంగీకరింపరాదు గదా! అందుచేత ముందుకాళ్లకు బందముగా పని స్వరూపమేమియు చెప్పక, వానినుండి చేయుదునని వాగ్దానము తీసికొనిరి. నలుడు యథాలాపముగా వాగ్దాన మిచ్చి తరువాత పనియేమని యడిగెను. ఇంద్రాదులు పని స్వరూపము చెప్పిరి. నలుని పోటీనుండి తప్పించినచో తక్కిన రాజులకంటె తేజస్సౌందర్యములలో వారే యధికులు గావున వారినే దమయంతి వరింప వచ్చును. అపుడు నలుని దూతగా పంపనేల? పోటీ మానుకొని యింటికి పొమ్మనవచ్చును గదా యనఁగా మఱి తమలో తమకు పోటీ తప్పదు గదా! తమలో నెవరెవరో దమయంతికెట్లు తెలియును? కావున తమ పేరు లామెకు చెప్పినచో వారిని గుఱించి యామె ముందుగనె లెక్క కట్టుకొని యే యొకనినో యెన్నుకొనును. అది వారి యాశ

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థసముపేతుఁ
బాడియయ్యె యిట్టి పనికిఁబనుప
ననిన నుత్సుకుండవై యేల చేసెద
నంటి చేయకుండ నగునె యింక. 86

అర్థం : ఏకార్థ సముపేతుఁడు=సమప్రయోజనమును కోరినవాడు, ఒకే పనిమీద వచ్చినవాడు. పాడియయ్యె=ధర్మమా, ఉత్సుకుఁడు=వేడుకగలవాడు,

తా. నేనుకూడ యదే పనిమీద వచ్చిన వాడనని మీరు తెలిసి కూడ నన్ను దూతగ పంపుట న్యాయమా? యని నలుడనఁగా నింద్రుఁడు నీవు మొదట చేసెదనన్నావు గదా, యిప్పుడు చేయకుండుట యెట్లు?

ఆ. నిన్ను సత్యనిరతుఁగా నెఱిఁగి యి
క్కార్యమునకు వలను గలుగు టెఱిఁగి
పనుపవలసె దూతభావ మపేక్షించి
దేవ హితము దీనిఁదీర్చవలయు. 87

అర్థం : నిత్య సత్యనిరతుడు=ఎల్లప్పుడు సత్యమునందే మిక్కిలి యాసక్తి గల వాడు, వలను=సామర్థ్యము.

తా. నీవెప్పుడును సత్యమునందే రమింతువు. ఈ పని చేయుటకు తగిన సామర్థ్యము కూడ నున్నది. అందుచేత నిన్ను పంపుచుంటిమి. ఇది దేవతల కిష్టమైనది. కావున నీవు దీనిని చేయవలసినది.

వ. ఆయుధీయ సురక్షితంబైన రాజగృహంబెట్లు సొరనగునని శంకింపవల వదు. దమయంతి నివేశంబు ప్రవేశించునపుడు నిన్నెవ్వరు వారింప నోడు దురనిన శక్రు వచనంబుల నశంకితుండై నలుండప్పుడ విదర్భా పురంబు నకుం బోయి యొక్కరుండ దమయంతీ గృహంబు సొచ్చి- 28

అర్థం : ఆయుధీయ సురక్షితంబు=ఆయుధములు ధరించిన వారిచేత చక్కగా రక్షింపఁబడినది. వారింపనోడుదురు = అడ్డగింప భయపడుదురు, శక్రుఁడు=ఇంద్రుడు, అశంకితుండు=సందేహము లేనివాడు.

తా. 'రాజభటులు కాపున్న దమయంతి యంతఃపురములోనికి ప్రవేశించుటకు సందేహింపవలదు. నిన్నెవ్వరడ్డగింపరు' అనిన ఇంద్రుని మాటలు విని నలుడు విదర్భాపురమునకు పోయి యొక్కడే దమయంతి యింట ప్రవేశించెను.

వి. దేవతలు యెత్తుగడ యెట్టిదైనను నది నలునకే యుపకరించెను. వారు స్వయంవరమునకు ముందుగనే నలదమయంతుల సమాగమము నేర్పాటు చేయుట జరిగినది.

సీ. హంసచేఁ దన వినినంతకంటెను రూప
 విభవాతిశయమున వెలయుదాని
సురకన్యకల యట్టి సురుచిర శతకన్య
 కాళిచేఁ బరివృతయైన దాని
హృదయేశుఁడైన తన్నెప్పుడు వినుచున్కి
 నలయ కాశ్వాసితయైన దాని
దమయంతిఁ జూచి కందర్ప శరావిద్ధుఁ
 డయ్యె నలుండంత నతనిఁ జూచి

ఆ. యితఁ డపూర్వ మనుజుఁ డెందుండి వచ్చెనో
యనుచు నదరిపడి లతాంగులెల్ల
నాసనములు డిగ్గి యప్పుడభ్యుద్గత
లైరి మనములందు హర్షమెసఁగ. 39

అర్థం. రూప విభవాతిశయము=సౌందర్య సంపదయొక్క ఆధిక్యము, సురుచిర శతకన్యకాళి=అందమైన నూర్గురు కన్యకల గుంపు, పరివృత=చుట్టుకొనబడినది, హృదయేశుఁడు=వలచినవాడు, ఆశ్వాసిత = ఓదార్పు పొందినది, కందర్ప శరావిద్ధుఁడు = మన్మథుని బాణములచే కొట్టబడినవాడు, అపూర్వ మనుజుఁడు=క్రొత్త మనుష్యుఁడు, లతాంగులు=తీగ వంటి శరీరము గలవారు (స్త్రీలు), అభ్యుద్గతలు=ఎదురు వచ్చినవారు, మనము=మనస్సు.

తా. నలుఁడు అంతఃపురమునందు ప్రవేశించి దమయంతిని చూచెను. ఆమె హంస చెప్పిన దానికంటె నధిక సౌందర్యముతో నొప్పుచుండెను. దేవ కన్యకల వంటి కన్యలు నూర్గురామె చుట్టు చేరి సేవించుచుండిరి. వారి వల్ల తన వలపుకాడైన నలుని గుఱించి యెప్పుడును వినుచుండుటచేత నామె యోదార్పు పొందియున్నది. నలుఁడామెను జూచి కామ పరవశుఁ డయ్యెను. అచ్చటనున్న చెలికత్తెలెల్లరు నితఁడెవఁడో క్రొత్తవాడు వచ్చె నని పీఠములు దిగి సంతోషముతో నెదురువచ్చిరి.

వ. అంత- 40

వి. పై పద్యములో నలుఁడు దమయంతిని చూచిన తరువాత 'అంత' యని పదమున్నది. ఇచ్చట వచనము నందు 'అంత' యని యొక్కటే పద మున్నది. ఆ మొదటి దానికి విశేష మేమియు లేదు. నలుఁడు దమ యంతిని చూచుటలో విశేషమున్నది. తరువాత చెలికత్తెలు నలుని చూచి లేచి యెదుర్కొనిరి. ఈ రెండవ దానికి విశేషార్థము గలదు. అది తరు వాతి పద్యముతో దమయంతి నలుని చూచుట. అందుచేత నీ రెండవ దానికి గల ప్రత్యేకతను చెప్పుటకు ఒక వచనమును ప్రత్యేకించెను. చెలి కత్తెలు నలుని చూచిరి, దమయంతియు నలుని చూచెను. వారి వారి దృష్టి భేదముల నీ 'అంత' యను శబ్ద ప్రయోగము సూచించుచున్నది

కం. దమయంతి మనోభవ నిభు
నమరేంద్ర ప్రతిము దినకరాభు సుధారు
క్సము వరుణ సదృశు ధనదో
పము నశ్వి సమాను నిషధపతిఁ జూచి నలున్. 41

అర్థం. మనోభవ నిభుఁడు=మన్మథుని వంటివాడు, అమరేంద్ర ప్రతిముఁడు= ఇంద్రుని వంటివాడు, దినకరాభుఁడు=సూర్యుని కాంతివంటి కాంతిగల వాడు, సుధారుక్సముఁడు=చంద్రునితో తుల్యుఁడు, వరుణ సదృశుఁడు= వరుణునితో సమానుడు, ధనదోపముఁడు = కుబేరునితో పోల్చఁదగిన వాడు, అశ్విసమానుఁడు=అశ్వినీ దేవతలతో తుల్యుఁడు.

తా. దమయంతి నలుని చూచినది. అతఁడు మన్మథుఁడు, నింద్రుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, వరుణుఁడు, కుబేరుఁడు, అశ్వినీదేవతలతో తుల్యుఁడై కన్పించెను.

వి. దమయంతి నలుని చూడగనే యతడు మానవుడని యామె యనుకొన లేదు. అతడెవడో దేవతయై యుండవచ్చుననుకొన్నది. మన్మథుఁడను కొందమన్న మన్మథునికి నొక్క యందమే యుండును. ఇతనియం దితర గుణములును కన్పించుచున్నవి గావున మన్మథుని వంటి యంద గాడేగాని మన్మథుఁడు కాడనుకొన్నదన్నమాట. అట్లే అనుభావము, కాంతి, అమృత నిష్యందము, చల్లదనము, వైభవము, వైదుష్యము మొదలైన గుణములను చూచి ఆయా గుణముల కధిష్ఠాన దేవతలని భావించి వారు కాదని, వారితో సమానుఁడని నిశ్చయించినదన్నమాట. ఇట్లు బహూపమానములు వాడుటవలన నా యుపమానములకంటె నధి కుడని ధ్వని. ఆ యుపమానములు దాశీభూతమైనవాడని ధ్వని. ఉపమా నము వెంట నుపమానము మెఱసి సురిగిపోవుటవలన నలుని లోకోత్తర గుణ సౌందర్యమును జూచి దమయంతి పొందిన తబ్బిబ్బు ధ్వనించు చున్నది. ఈ దమయంతి తబ్బిబ్బు నవతరింపఁజేయుటకు పై వచన మను వ్రాసినారు నన్నయగారు. ఇది యిందలి సొగసు.

కం. వారిరుహనేత్ర మదన
ప్రేరితయై లజ్జయుడిగి భీతిల్లక బృం
దారకమూర్తికి రాజకు
మారున కిట్లనియె మంద మంద మృదూక్తిన్. 42

అర్థం. వారిరుహనేత్ర = తామర పూవుల వంటి నేత్రములు గలది, మదన ప్రేరిత = మన్మథునిచేత ప్రేరేపింపఁబడినది, బృందారక మూర్తికి = దేవతల యొక్క యాకారము వంటి యాకారముగల వానికి, మంద మంద మృదూక్తిన్ = మెల్లమెల్లని మెత్తనైన మాటలతో.

తా. దమయంతి ప్రేమయొత్తిడిచే సిగ్గు విడచి నిర్భయముగా దేవతవలె వెలుగుచున్న నలునికి నెమ్మదిగా మెత్తని మాటలతో నిట్లనెను:

వ. నీవు మహానుభావుండ వెవ్వండ ? విందులకేమి కారణంబున నేకతంబ వచ్చితి? విది యత్యుగ్రశాసనుండైన మదీయ జనకుచేత సురక్షితం బగుట నెవ్వరికిఁ జొర నశక్యంబు దీని నెవ్వరెఱుంగకుండ నెవ్విధంబునం జొచ్చితివి? నాకు మనోజ వేదనా వివర్ధనుండవైన నీ తెఱంగెఱింగింపు మనిన దానికి నలుండిట్లనియె:

అర్థం: ఏకతంబ = ఒంటరిగా, అత్యుగ్రశాసనుఁడు = భయంకరమైన యాజ్ఞ గలవాడు, చొఱన్ = ప్రవేశించుటకు, మనోజవేదనా వివర్ధనుఁడు = వలపు బాధను వృద్ధి నొందించువాడు, తెఱంగు = సంగతి.

తా. నీవు మహానుభావుఁడవు. ఎవ్వఁడవు? ఇచ్చట కేల వచ్చితివి? మా తండ్రి కఠిన శాసనుఁడు. ఈ మేడకు గట్టి కాపు పెట్టినాడు. ఇఁదెవ్వరును ప్రవేశింపలేరు. ఎవ్వరికి తెలియకుండ నెట్లు ప్రవేశించితివి? నిన్ను చూచిన నాకు ప్రేమగా నున్నది. నీ సంగతి చెప్పుమనఁగా నలుఁ డిట్లనియె:

ఆ. ఏను దేవదూత నింతి నలుండను
వాఁడ నింద్ర దహన వరుణ యములు
నీ స్వయంవరంబు నెమ్మితోఁ జూడంగ
నరుగుదెంచి నన్ను నబల మున్న. 44

అర్థం. దహనుడు = అగ్ని; నెమ్మితో = ప్రేమతో, అరుగుదెంచి = వచ్చి; అబల = స్త్రీ (దమయంతీ !

తా. నేను దేవదూతను. నా పేరు నలుఁడు. ఇంద్రాగ్నియమ వరుణులు నీ స్వయంవరమును చూడవచ్చి ముందుగనె నన్ను (పై పద్యముతో నన్వయము).

కం. నీ యొద్దకుఁ బుత్తెంచిరి
మాయం దొక్కరు నభీష్టమతి వరియింపం
దోయజముఖిఁ బ్రార్థింపుము
మా యందఱకును బ్రియంబమర్పుము బ్రీతిన్. 45

అర్థం. పుత్తెంచిరి=పంపిరి, ఒక్కరున్=ఒకరిని, తోయజముఖిన్=తామర పూవువంటి ముఖము గల దమయంతిని, అమర్పుము=ఘటింపుము.

తా. నీ యొద్దకు పంపించిరి. మాయం దొక్కనిని వరింపుమని దమయంతిని ప్రార్థింపుము. మా యందఱకు నిష్టము చేయుము (అని పంపించిరి).

వ. అని పంచినఁ దత్ప్రభావంబున నన్యులచేత నలక్షితుండనై వచ్చితి నింద్రాదులకుఁ బ్రియంబు సేయుమనిన నవనత వదనయై దమయంతి దొల్లి హంసచేత నలువిని వానియందు బద్ధానురాగయై నవయుచున్న యది యపుడతనిని నలుంగా నెఱింగి తద్వచన శ్రవణ దుఃఖాయమాన మానస యగుచు నిట్లనియె: 46

అర్థం. పంచినన్=పంపించిన, ప్రభావంబునన్=మహిమచేత, అలక్షితుఁడు= చూడబడనివాడు, అవనతవదన=వంచిన ముఖముగలది, బద్ధానురాగ= ప్రేమగలది, నవయుచున్నయది = బాధపడుచున్నట్టిది, తద్వచన శ్రవణ దుఃఖాయమాన మానస=అతని మాటలు వినుటవలన దుఃఖమగు చున్న మానసము గలది- అనఁగా దుఃఖించుచున్నది.

తా. 'అని పంపగా వారి మహిమవలన నితరులకు కన్పింపక నిచ్చటకు వచ్చితిని. కాబట్టి దిక్పాలుర కిష్టము చేయుము.' దమయంతి నలుని మాటలు విని మొగము వంచికొని వాని నలుడని తెలిసికొని దుఃఖించుచు నిట్లనెను:

తరు ఏనేడ? నింద్రాదులేడ? వారలకు
వోజ. నెప్పుడు మ్రొక్కుదు నేను నీ ధనమ
భూనాథ నీ గుణంబులు హంసచేతఁ
బొలుపుగా విని మనంబున నిల్పియున్న
దాన భవన్నిమిత్తమున నిట్లఖిల
ధారుణీనాథ సార్థంబు రావింపఁ
గా నిప్పు వలసె లోకఖ్యాత కీర్తి
కరుణించి పతిబుద్ధి గావింపుమిందు. 47

అర్థం. నీ ధనము=నీ సొమ్మే, పొలుపుగా= అందముగా, భవన్నిమిత్తమునన్ = నీ కారణమున, అఖిల ధారుణీనాథ సార్థంబు=ఎల్లరాజుల సమూహము, పతిబుద్ధిఁ గావింపుమిందు = ఈ దమయంతి యందు భర్తృభావము చేయుము.

తా. నే నెక్కడ? దిక్పాలు రెక్కడ? వారలకెప్పుడును నేను మ్రొక్కు-చుందును. వారియందు నాకు భక్తి యున్నది గాని భర్తృభావము లేదు. నేను నీ సొత్తే, నీ గుణములు హంసవల్ల విని నిన్నే ప్రేమించితిని. నిన్ను రావించుటకే యీ స్వయంవరము చాటించి రాజులనెల్ల రప్పింప వలసి వచ్చెను. కావున దూతభావము వీడి భర్తృభావము వహింపుము.

వ. నీవు దీని కొడంబడని నాఁడు రజ్జు విషాగ్ని జలంబులం బ్రాణ పరి త్యాగంబు సేసికొందునన్న దానింజూచి నలుండిట్లనియె: 48

అర్థం: రజ్జువు=పాశము, పరిత్యాగము=వదలుట.

తా. నన్ను పెండ్లియాడుటకు నీ వొప్పుకొనని యెడల నురి పోసికొనియో, విషము మ్రింగియో, నిప్పులోగాని, నీటిలోగాని దుమికియో ప్రాణములు వదలుదుననెను. ఆమె మాటలు విని నలుఁడిట్లనెను:

మ కో. భూరిసత్త్వులు సర్వలోక విభుల్ విభూతి సమృద్ధు లి
ద్ధోరుతేజులు నిన్నుఁ గోరుచు నున్న వారమరోత్తముల్
వారి పాదరజంబుఁ బోలని వాని నన్ను మనుష్య సం
సారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నులై సురలుండఁగాన్. 49

అర్థం : భూరిసత్త్వులు=అమితమైన బలముగలవారు, సర్వలోక విభుల్= అన్ని లోకములకు ప్రభువులు, విభూతి సమృద్ధులు = సమృద్ధమైన యైశ్వర్యము గలవారు (అనగా నష్టసిద్ధులు గలవారు), ఇద్ధోరు తేజులు= వృద్ధి పొందుచున్న గొప్ప తేజస్సు గలవారు, అమరోత్తముల్ = దేవోత్తములు, పాదరజమున్=కాలి దుమ్మును, ప్రసన్నులు = అను గ్రహము గలవారు, సురలు=దేవతలు.

తా. దేవతలు చాల బలముగలవారు, అన్ని లోకము లేలువారు, అష్ట సిద్ధులు గలవారు, నిరంతరము పెరుగునట్టి తేజస్సు గలవారు. వారు నీయందు నను గ్రహముతో వరించుటకు వచ్చియున్నారు. నేను వారి కాలి కంటిన దుమ్ముతో గూడ సాటిగాను. మనుష్యుడను, సంసారిని, నన్ను కోరెదవేమి? ఇది మంచిది కాదు.

కం. దేవతల కప్రియంబులు
గావించి మనుష్యు లధమగతులగుదు రిలం
గావున వారి కభీష్టము
గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ ! 50

అర్థం. అప్రియములు=ఇష్టముకాని పనులు, అధమగతులు=క్రింది లోకమునకు పోవువారు, ఇలన్=భూమిపైన, అభీష్టము=ఇష్టమైనది, తరుణీ= యువతీ !

తా. దేవతల కిష్టములేని పనులు చేసి మనుష్యులు నరకమున బడుదురు. కాబట్టి వారికిష్టము చేసి నన్ను కాపాడుము.

వి. నన్ను కాపాడుమనుటవలన నేను నా వాగ్దానము సరిగా నిర్వర్తించలేదని వారు కోపగించి నా కపకారము చేయుదురు. నీకు నాపైన ప్రేమ యున్నచో నన్ను కాపాడుటకైన వారిని వరింపుమని ధ్వని. సంస్కృత మూలమునందీ పట్టున నీవు వారిని వరింపక నన్ను వరించినచో నేను స్వార్థపరుడనగుదును. నేను వారి పనిమీద వచ్చి స్వార్థపరుఁడనై ప్రవర్తించుట ధర్మము గాదు. కావున నిట్టి ధర్మసంకటము లేకుండ నాకు స్వార్థము నెఱవేరునట్టి యుపాయ మాలోచింపుమని నలుఁడు దమయంతిని గోరినట్లున్నది. నన్నయగారు దానిని మార్చినారు. నన్నయగారి మార్పు నందు నలుని యౌదార్యము, సత్యనిష్ఠ ధ్వనించుచున్నవి.

వ. అనిన దమయంతి నయనాంతర్గళిత బాష్పకణ కరాళ కపోల యుగళ యగుచుం బెద్దయుం బ్రొద్దు చింతించి నీ యభిప్రాయమునకు నిర పాయంబయిన యుపాయంబు గంటి నింద్రాదులు నా స్వయంవరంబు

నకు వచ్చెదరేని వారి సన్నిధిన నిన్ను వరియించెద నట్లయిన నీకు నిర్దోషం బగుననిన నలుండు లోకపాలురకు పొలికింబోయి దమయంతికిం దన పలికిన విధంబును దనకు దమయంతి పలికిన విధంబును జెప్పె నంతఁ బుణ్యతిథి నక్షత్ర ముహూర్తంబున దమయంతీ స్వయంవరంబు ప్రవర్తిల్లిన- 51

అర్థం: నయనాంతర్గళిత...యుగళ = కనుగొలకుల నుండి కారిన నీటి బిందువుల చేత నెత్తుపల్లములుగా నున్న బుగ్గల జంట గలది, నిరపాయంబైన = భద్రమైన.

తా. నలుని మాటలకు దమయంతి కన్నీరు కార్చుచు చాలకాల మాలోచించి నలునితో- నీయందు దోషము లేకుండ చేయుటకు నాకొక యుపాయము తోచినది. ఆ దిక్పాలురముందే నిన్ను వరించెదను. అప్పుడు నీకు దోషము రాదని చెప్పెను. నలుడు దిక్పాలుర యొద్దకుపోయి జరిగిన సంగతి యంతయు చెప్పెను. తరువాత మంచి ముహూర్తమున దమయంతీ స్వయంవరము జరిగెను.

ఆ. నలున కాని నళినదళనేత్ర వరియింప
దట్టె చూతమనుచు నమరవరులు
నలువురును గడంగి నలరూపమున వచ్చి
రాస్వయంవరమున కతిరయమున. 52

అర్థం: నళినదళనేత్ర = తామర పూవుల వంటి కన్నులు గలది (దమయంతి), అతిరయమున = మిక్కిలి వేగముగా.

తా. నలుని దప్ప నితరుంను దమయంతి వరింపదట- మనమందఱము నలుని రూపము దాల్చి పోవుదము- అప్పుడామె నలునెట్లు వరించునో చూతమని వారు నలరూపముతో స్వయంవరమునకు పోయిరి.

వి. దేవతలు తమకింక లాభము లేదని దమయంతి పాతివ్రత్య మెట్టిదో పరీక్షించుటకు నిశ్చయించి, యిట్టి యుపాయము పన్నిరన్నమాట. 'అట్టె'

ఆక్షేపమును దెలుపునది. 'చూతము' అనఁగా పరీక్షింతమని యర్థము. శబ్దమునకు ముఖ్యార్థము కాదు- లక్షణార్థము సొగసైన వాడుక.

వ. అంత- 53

సీ. దమయంతి సిత పుష్పదామాభిశోభిత
హస్తయై చనుదెంచి యంబుజాక్షి
యమ్మహోత్సవ దర్శనాగత రాజన్య
నివహంబు వీక్షించి నెమ్మితోడ
నలువురు వేల్పులు నలుఁదొట్టి యప్పుడే
కాకారులై నను నందు నలుని
నేర్పరింపఁగ నేర కింద్రాదులను నలు
నెఱుఁగు నుపాయమింకెద్ది యొక్కొ-

ఆ. యనుచు సంశయాకులాత్మయై సురలార
నలునెఱుంగు విధము నాకుఁ జేయుఁ
డాత్మరూప ధరులరగుఁడని పరిదేవ
నంబు సేసెఁ దన మనంబులోన. 54

అర్థం: సితపుష్పదామాభిశోభిత హస్త=తెల్లని పూలదండతో శోభిల్లుచున్న చేతులు గలది, అంబుజాక్షి = తామరపూవుల వంటి కన్నులు గలది, అమ్మహోత్సవ...నివహంబున్=ఆ గొప్ప వేడుకను చూచుటకు వచ్చిన రాజసమూహమును, ఈక్షించి=చూచి, ఏర్పరింపఁగ నేరక=గుర్తింప లేక, సంశయాకులాత్మ=సందేహము చేత కలవరము నొందిన మనస్సు గలది, ఆత్మరూపధరులరగుడు = నిజ రూపములను పొందుడు, పరిదేవనము సేసె=దుఃఖించెను.

తా. దమయంతి తెల్లని పూలమాల పట్టుకొని వచ్చి స్వయంవరమునకు వచ్చిన రాజులందఱను చూచి నలునితో గూడ యతని వంటివారిని నలుగురు దిక్పాలురను చూచి నలుని గుర్తు పట్టజాలక "ఓ దేవతలారా! నాకు నలునెఱుఁగునట్లనుగ్రహించుడు" అని తన మనస్సులో ప్రార్థించెను.

వ. దేవతలు దాని పరిదేవనము విని కరుణించి యనిమిషలోచనంబులు నస్వేదగాత్రంబు లొప్ప నవనీతలంబు ముట్టక యాసన్నులై నిలిచి రంత- లోకపాలురును, భూలోకంబునం గల రాజలోకంబు నవలోకించు చుండఁ బుణ్యశ్లోకుండైన నలు ధర్మ విధానంబున వరియించి దమయంతి తదీయ స్కంధంబున సుగంధి కుసుమ దామకంబు పెట్టిన- 56

అర్థం. అనిమిషలోచనములు=ఱెప్పలు వ్రాలని కనులు, అస్వేద గాత్రంబులు= చెమ్మట పోయని శరీరంబులు, అవనీతలంబు ముట్టక=భూమిని ముట్టక, ఆసన్నులై=సమీపమునందున్నవారై, అవలోకించుచుండన్ = చూచు చుండఁగా, పుణ్యశ్లోకుండు=పవిత్రము చేయు కీర్తి గలవాఁడు, నలుని కీర్తించిన పాపము తొలఁగును, ధర్మవిధానము=ధర్మమైన మార్గము, తదీయ స్కంధంబున=అతని మూపునందు (మెడలో), సుగంధి కుసుమ దామకము=పరిమళముగల పూలదండ.

తా. దమయంతి యార్తితో ప్రార్థింపఁగా దేవతలు కరుణించి ఱెప్పలు వ్రాలని కన్నులతో, చెమ్మట పోయని శరీరములతో, భూమిని ముట్టక నిల్చిరి. అపుఁడు దమయంతి నలుని గుర్తించి వారి సమక్షములో రాజులందఱు చూచుచుండ నలుని మెడలో పూలదండ వైచెను.

వి దమయంతి నలుని గుర్తించుట తన శక్తికి మించినదని గ్రహించి తన్ను దేవతలు పరీక్షించుచున్నారని తెలిసికొన్నది. వారినే ప్రార్థించినది. ఇది దమయంతి నిరహంకారితను తెలియఁజేయును. దేవతలును కరుణించిరి. అహంకారము లేకుండ ఋజుత్వముతో ప్రార్థించిన దేవతలు తప్పక ప్రసన్నులగుదురన్నమాట- కన్నులు మూత పడకుండుట, శరీరము చెమరింపకుండుట, నిల్చినపుడు భూమిని తాకకుండుటయు నివి దేవతల లక్షణములు. ఇచ్చట దేవతలు నలుని రూపములోనే యున్నారు. కాని యీ మూఁడు లక్షణములను దమయంతి యెఱుగుటకు దాల్చియున్నారు.

కం. దేవతల సాధువాదము
తో విప్రాశీరవంబుతో బహుతూర్యా

రావంబులు సెలగెను బా
రావార రవంబుఁ బోలె ననివార్యములై. 56

అర్థం. సాధువాదము = ప్రశంసారవము, విప్రాశీరవము = బ్రాహ్మణుల యాశీర్వాదముల ధ్వని, బహు తూర్యారావము = బహు విధములైన మంగళవాద్యముల ధ్వనులు, పారావారము=సముద్రము, అనివార్యములు=అడ్డగింపరానివి.

తా. అప్పుడు దేవతల ప్రశంసలు, బ్రాహ్మణుల యాశీర్వాదములు, బాజా బజంత్రీల ధ్వనులు సముద్ర ఘోషవలె నెడతెగక మ్రోగెను.

వ. ఇట్లపూర్వ స్వయంవర లబ్ధయైన దమయంతి నత్యంత విలాసంబుతో వివాహంబైన యా నలునకు నింద్రుండు వాని యజ్ఞంబుల యందు నిజ రూపంబుఁ జూపను నగ్నియు వరుణుండును వాని వలచిన చోటన యగ్ని జలంబు లుత్పాదింపను ధర్ముండు ధర్మువునంద వాని బుద్ధి వర్తిల్లను వరంబులిచ్చి దేవలోకంబున కరుగువారెదుర ద్వాపరంబుతో వచ్చు కలింగని యెందులకుం బోయెదవని యడిగిన నింద్రాదులకుఁ గలి యిట్లనియె. 57

అర్థం. అపూర్వ స్వయంవరలబ్ధ=ఆశ్చర్యమైన స్వయంవరమునందు పొంద బడినది, అత్యంతము=మిక్కిలి, నిజరూపము = తన రూపము, వలచినచోటు=కోరినచోటు ఉత్పాదింపను=పుట్టించుటకు.

తా. దమయంతిని పెండ్లి యాడిన నలునకు నింద్రుడు మొదలైన దేవతలు వరము లిచ్చిరి. ఇంద్రుడు యజ్ఞములలో నలునకు తన రూపము చూపుట టకును, అగ్ని, వరణులు కోరినిచోట నిప్పు నీళ్ళులు పుట్టించుటకును, యముడు నలుని బుద్ధి ధర్మమునందు ప్రవర్తించునట్లును వరము లిచ్చి దేవలోకమునకు పోవుచుండిరి. దారిలో వారి కెదురుగా ద్వాపరముతో కలి వచ్చుచుండెను. ఇంద్రుడు కలిని నీ వెచ్చటకు పోవుచుంటి వని యడిగెను. కలి యిట్లనెను:

వి. దేవతలు వరములిచ్చుటను బట్టి వారు నల దమయంతుల సత్య నిష్ఠకు ఋజుత్వమునకు సంతసించినట్లు మనకు తెలియుచున్నది.

తే. అవనిలో దమయంతీ స్వయంవరంబు
విస్తరిల్లుట విని కడు వేడ్కతోడ
నేను దమయంతిచే వరియింపఁబడుదు
నని తదర్థి నయి యరిగెద నాసఁ జేసి. 58

అర్థం. తదర్థిని = దానిని కోరిన వాడను.

తా. భూలోకమున దమయంతీ స్వయంవరము నడచుచున్నదని విని దమయంతి చేత వరింపబడుదునను నాశతో పోవుచుంటిని.

వ. అనిన నందఱు నగి నీ వందుల కేల పోయెదది ముందర నిర్వృత్తం బయ్యె నక్కోమలి యొరుల నెవ్వరి మెచ్చక నలుండను వాని వరియించె ననినం గలి కరంబలిగి యన్నలునకు దమయంతికి రాజ్య విభవ పరిత్యాగంబును బరస్పర వియోగంబునుం జేసెదనని నిశ్చయించి వాని నక్షరతుంగా నెఱింగి యక్షంబులం జొచ్చియుండ ద్వాపరంబుం బనిచి నలుండు సేయుచున్న యశ్వమేధాదికానేక భూరి దక్షిణ మహాక్రతువులయు జప హోమ దానాది వివిధ పుణ్య కర్మంబులయుఁ గారణంబునం జొర నవసరంబు గానక యంతరం బన్వేషించుచుఁ బెద్ద కాలంబుండి యొక్కనాఁడతండు కృత మూత్రుండై జలోపస్పర్శనానంతరంబునం బాదశౌచంబు సేయ మరచి సంధ్యోపాసనంబు సేసిన నుపలబ్ధావసరుండై కలి నలునందుఁ బ్రవేశించి పుష్కరుండను వాని పాలికిం బోయి తన్నెఱింగించి నీవు నలునితో జూదం బాడి వాని రాజ్యంబును సర్వస్వంబును నోడిచి కొమ్మని చెప్పి తానును వానికి విప్ర వేషంబున సహాయుండయి యక్షంబులు గొని పుష్కరుతో నొక్కటంజని నీవు మా రాజుతో జూదం బాడుమనిన.

అర్థం. నిర్వృత్తంబయ్యె = కడచెను, రాజ్య విభవ పరిత్యాగము = రాజ్యసంపద వదలుట, పరస్పర వియోగము = ఒకరి నొకరు ఎడబాయుట, అక్షర

తుడు = పాచికల యందు (జూదమున) తగులము కలవాడు, పనిచి = ఆజ్ఞాపించి, అశ్వమేధా...క్రతువులయు = అశ్వమేధము మొదలైన పెద్ద దక్షిణలు గల అనేకములైన గొప్ప యజ్ఞములు, అవసరము = అవకాశము, అంతరము = అవకాశము, అన్వేషించుచు = వెదకుచు, కృతమూత్రుడు = మూత్రమును విడచిన వాడు, జలోపస్పర్శనము = ఆచమనము, పాదశౌచము = పాదములు కడగికొనుట, ఉపలబ్ధావసరుడు = పొందిన యవకాశము కలవాడు, సర్వస్వము = ఉన్న సొమ్మంతయు, ఒడిచి కొమ్ము = ఓడించి తీసికొనుము, ఒక్కటంజని = ఏకముగా పోయి.

తా. కలి మాటలకు దేవతలు నవ్వి, యోయి! అది జరిగిపోయినది. దమయంతి నలుని వరించినది నీ వింక పోనేల యని చెప్పిరి. కలి కోపగించి యా దంపతులకు రాజ్యము పోవునట్లును వియోగము కలుగునట్లును జేయుదునని యనుకొని నలుడు జూద మందిష్టము కలవాడని తెలిసికొని పాచికలలో చొచ్చియుండుమని ద్వాపరమును పంపి నలునిలో ప్రవేశించుటకు నవకాశము కొఱకై చూచుచుండెను. నలుడు నిరంతరము యజ్ఞములు, జపహోమ దానములు చేయుచుండుట వలన చాలకాలము వరకు కలికి సమయము దొరకలేదు. ఒకనాడు నలుడు మూత్రవిసర్జనము చేసి పాదములు కడుగుకొనుట మఱచి యాచమించి సంధ్యావందనము చేయుచుండెను. అది యదనుగా కలి నలునిలో జొచ్చెను. తరువాత కలి పుష్కరుని యొద్దకు పోయి తన సంగతి చెప్పి, నీవు నలునితో జూదమాడి వాని రాజ్యము సొమ్మునంతటిని గెలుచుకొనుమని ప్రేరేచెను. తాను కూడ బ్రాహ్మణ వేషముతో పాచికలు పుచ్చుకొని పుష్కరునితో కలిసి నలు నొద్దకు పోయి నీవు మా రాజుతో జూదమాడు మనెను.

వి. సంస్కృతమూలమున కలి నలునియందు ప్రవేశించుటకు పండ్రెండు సంవత్సరములు వేచియుండెనని యున్నది. నలుడు నిరంతరము బహుపుణ్యకార్య మగ్నుడై యున్న మహానుభావుడు. ఆయనయందు కలి ప్రవేశించుటకు పండ్రెండేండ్లు పట్టెను. ఇంతకాలము నతడు నలు డనాచారమే

మైన చేయునేమో యని ప్రతీక్షించుచుండెనన్నమాట. అనాచారము వలన ధర్మక్రియలకు ప్రతిబంధక మేర్పడును. అప్పుడు పుణ్యఫలము ప్రవర్తింప జాలదు.

కం. ద్యూతార్థము తత్కృతవా
హూతుడనై జూద మాడకుండుట ధర్మా
పేతంబని యభిముఖుఁడై
యాతనితో నలుడు జూదమాడఁ గడంగెన్. 60

అర్థం. ద్యూతార్థము=జూదమాడుటకు, తత్కృతవాహూతుడనై =ఆ జూదరుల చేత పిలువబడినవాడనై, ధర్మాపేతము=అధర్మము, ధర్మరహితము, అభిముఖుడు=ఎదురు కూర్చున్నవాడు.

తా. జూదమాడుటకు పిలిచినప్పుడాడకుండుట యధర్మమని వానికెదురు కూర్చుండి నలుడు వానితో జూదమాడదొడగెను.

కం. కలధనము లెల్ల నొడ్డుచు
నలయక జూదమున విజితుడగుచుండె నిజా
ప్తులు వారించిన నుడుగక
నలుడు కలిప్రేరణంబునను హతమతియై. 61

అర్థం. ఒడ్డుచు=పందెము కాయుచు, విజితుడగుట=ఓడిపోవుట, నిజాప్తులు= తనమేలు కోరువారు, హతమతి=వివేకము పని సేయనివాడు.

తా. కలి ప్రేరణముచేత బుద్ధి మందగించి నలుడున్న ధనమంతయు పందెముల నొడ్డుచు జూదమున నోడిపోవుచుండెను హితులు వద్దని చెప్పినను వినలేదు.

వ. ఇట్లనేక మాసంబులు దుర్వ్యసనాక్తుండైన యన్నలుండు వివిధ వస్తు వాహన నివహంబులొడ్డి పుష్కరునకోటువడంబోయిన నెఱింగి పౌర బ్రాహ్మణ ప్రధానవరులు దమయంతి పురస్కృతులయి వచ్చి వారించి

కలి సమావేశ పరవశుండైన యన్నలుచేత ప్రతిహతులయి వలుకకుండి
రంత దమయంతి చింతాక్రాంత చిత్తయై- 62

అర్థం. దుర్వ్యసనాసక్తుఁడు=దుర్వ్యసనమునందు తగుల్కొన్నవాడు, ప్రధానులు
=మంత్రులు, వరులు=ముఖ్యులు, దమయంతీ పురస్కృతులు=దమ
యంతిని ముందుంచుకొన్నవారు, కలిసమావేశ పరవశుఁడు=కలియావహిం
చుట వలన పరతంత్రుడైనవాడు, ప్రతిహతులు=తిరస్కరింపబడినవారు.

తా. నలుడు బహుమాసములు జూదమాడుటలో నిమగ్నుడై, యున్న వస్తువులు
వాహనముల నోడిపోవుచుండెను. ఊరియందలి పౌరులు బ్రాహ్మణులు
మంత్రులు దమయంతితో కూడ వచ్చి వారించినను వినలేదు. అప్పుడు
దమయంతి చింతించి-

ఆ.వె. ఎంత యోటువడిన నంతియు జూదంబు
నందుఁ దగులుఁ జలము నతిశయిల్లు
నేమి సేయుదాన నిది యెగ్గునకు మూల
మని లతాంగి దుఃఖితాత్మ యగుచు. 63

అర్థం. ఓటువడుట=ఓడిపోవుట, తగులు=ఆసక్తి, చలము = పట్టుదల,
అతిశయిల్లు=పెరుగును, ఎగ్గు=కీడు, దుఃఖితాత్మ = దుఃఖించిన
మనస్సు గలది.

తా. ఓడినకొలది జూదమునందాసక్తియు, పట్టుదలయు పెరుగును, జూదము
వలన కీడు కలుగును, నేనేమి చేయవలెనని దుఃఖించుచు-

సీ. అక్షముల్ పుష్కరునందు వశ్యంబులై
యునికియు నలునియందొండు విధము
లగుటయు నెఱిఁగి నిజాధీశ్వరున కప
జయమకా లక్షించి సరసిజాక్షి

భర్త యనుజ్ఞమున్ వడసి వార్ష్ణేయుఁ
దన్ సారథిఁ బిలిచి యీ స్యందనమున
నింద్రసేనుండను నిక్కుమారకు నింద్ర
సేనయం గూఁతుఁ జెచ్చెరను దోడు

ఆ.వె. కొని విదర్భకరిగి గురుకొని మద్బంధు
జనులయొద్దఁ బెట్టి చట్టరమ్ము
యంచు నెమ్మిఁ బుచ్చె నాప్త పురోహిత
మంత్రి బాంధవాభిమతము గాఁగ. 64

అర్థం. వశ్యములు=లోబడ్డవి, ఒందు విధములు=వ్యతిరేకములు, లక్షించి=ఊహించి, స్యందనము=రథము, చెచ్చెరన్=వేగముగా, చట్టన్=వెంటనే, అభిమతము=ఇష్టము.

తా. పాచికలు పుష్కరున కనుకూలములు నలునికి ప్రతికూలములు నగుట తెలిసికొని తన భర్తకపజయమూహించి దమయంతి భర్త యనుమతి పొంది వార్ష్ణేయుడన్న సారథిని పిలిచి, యీ రథము మీద యింద్రసేను డన్న తన కొమరుని, యింద్రసేన యన్న తన కూతును తీసికొని పోయి విదర్భలో తన పుట్టినింట దించి వెంటనే రమ్మని చెప్పి పంపెను.

వి. సంస్కృత మూలమునందు రథమును నశ్వములను కూడ తన పుట్టి నింటనే వదలి నీవచ్చట కాని మఱెచ్చటగాని నీ యిచ్చానుసారము ఉండుమని దమయంతి చెప్పినట్లున్నది! నన్నయగారు దానిని మార్పు జేసెను. కథాగమనమునందు వార్ష్ణేయుడు ఋతుపర్ణు నొద్దకేగినట్లు ముందు ముందు కానబడును. మఱి నన్నయగారి మార్పున కౌచిత్యమేమి యన్నది యా సందర్భమున విచారింపబడును. ఇచ్చట నీ మార్పు చదువరులు గుర్తించుట యావశ్యకము.

కం. నలుడును ధరణీరాజ్యము
దలఁగఁగ సర్వంబు నపహృతంబయినఁ గడుం

దలరి దమయంతిఁ దోడ్కొని
వెలువడియె నశేషరాజ్య విభవచ్యుతుడై. 65

అర్థం. తలగఁగన్=తొలుగగ, అపహృతము=అపహరింపబడినది, తలరి= దుఃఖించి, అశేష రాజ్య విభవచ్యుతుఁడు=సమస్తమైన రాజ్య సంపద నుండి తొలగింపబడినవాడు.

తా. నలుడు జూదమునందు రాజ్యమును సర్వసంపదల నోడిపోయి దమయంతిని తీసికొని బయలుదేరెను.

తే,గీ. పురము వెలి మూడహోరాత్రములు వసించి
యున్న నలుపాలికెవ్వరు నోడిరరుగ
జనవిభుండైన పుష్కరు శాసనమునఁ
గలికృత ద్యూత విద్వేషకారణమున. 66

అర్థం. అహోరాత్రములు=రాత్రింబవళ్లు, అరుగనోడిరి=పోవుటకు భయపడిరి, జనవిభుఁడు=రాజు, కలికృత ద్యూత విద్వేష కారణమున=కలి పన్నిన జూదము వల్లనైన విరోధము కారణముగ.

తా. నలుడూరి బయట మూడు రాత్రులు మూడు పగళ్ళు దమయంతితో కూడ నివసించెను. ప్రజలలో నొకరును పుష్కరుని యాజ్ఞవల్ల నతనియొద్దకు పోలేదు. కలి పన్నిన జూదముతో చిక్కుట వలన నతనియందు ప్రజలు కూడ విముఖులైరి.

వ. ఇట్లు సర్వజన సత్కారార్హుండయ్యును నలుండు విధికృతమున నెవ్వరి వలనను సత్కారంబు గానక జలంబు లాహారంబుగాఁ దత్పుర సమీపంబున దమయంతీ ద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్య పక్షంబులతోఁ దమ ముందటఁ దిరుగుచున్న పక్షులంగని యవి భక్ష్యంబులగునని యప్పక్షులం బట్టుకొన సమకట్టి తన కట్టిన పుట్టంబు వానిపై వైచిన నవి పుట్టంబుతోడ గగనంబున కెగసి నగుచు విగత వస్త్రుండైన నలున కిట్లనియె : 67

అర్థం: సర్వజన సత్కారార్హుఁడు=జనులెల్లరియొక్క గౌరవమునకు తగినవాడు, దమయంతీ ద్వితీయుఁడు=రెండవది దమయంతిగా కలవాడు, అనగా సేవకరహితుడైనవాడు, బుభుక్షాపీడ=ఆకలి బాధ, హిరణ్యపక్షములు=బంగారు రెక్కలు, భక్ష్యములు=తినుటకు యోగ్యమైనవి, కట్టిన పుట్టము=కట్టిన బట్ట, విగత వస్త్రుడు=పోయిన వస్త్రము గలవాడు, బట్టలేనివాడు.

తా. అందటి మన్ననలకు తగిన నలుని నెవ్వరును గౌరవింపలేదు. నలుడు దమయంతితో గూడ పురము వెలుపల నుండి ఆకలిబాధ సహింపలేక బంగారు రెక్కలతో తమ ముందు తిరుగుచున్న పక్షులను చూచి వానిని పట్టుకొనుటకు తన కట్టుబట్ట విప్పి వానిపైన వేసెను. అవి కట్టుబట్టతో కూడ నాకసమున కెగిరి నవ్వుచు నిట్లనెను. నలునికి విధముగా కట్టుబట్ట గూడ కఱవయ్యెను.

తే.గీ. నీ ధనంబును రాజ్యంబు నికృతిఁ గొన్న
యక్షముల మేము నీ వస్త్ర మపహరింపఁ
బక్షిరూపులమై వచ్చి పార్థివేంద్ర
యపహరించితి మని జెప్పి యరిగెఁ జదల. 68

అర్థం: నికృతిన్=మోసముతో, చదలన్=ఆకాశము నందు.

తా. నీ ధనమును రాజ్యమును మోసముతో నపహరించిన పాచికలము మేము. ఇప్పుడు మిగిలిన నీ కట్టుబట్ట కూడ యపహరించుటకు పక్షి రూపముతో వచ్చి తీసికొంటిమని చెప్పి ఎగిరి పోయెను.

వ. నలుండును వానింజూచి విస్మయంబంది ఈ యక్షంబుల దోషంబునం గాకేమి నాకిట్టి దయ్యెననుచు దమయంతి కట్టిన పుట్టంబు దెఱంగు గట్టికొనియె, నట్లిద్దఱు నేకవస్త్రులయి యొండొరుల మొగంబులు చూచి దుఃఖించుచో నలుడు దమయంతి కిట్లనియె : 69

అర్థం. విస్మయము=ఆశ్చర్యము, ఏకవస్త్రులు=ఒకటే వస్త్రము గట్టినవారు.

తా. నలుడు వాని మాటలకు ఆశ్చర్యపడి ఈ పాచికల మోసము వల్లనే నాకిట్లు జరిగినదనుచు దమయంతి చీరచెఱగు కట్టుకొనెను. ఇట్లిద్దఱకు ఒకే వస్త్రము కట్టుబట్టయయ్యెను. వారు ఒకరివంక నొకరు చూచి యట్టి కష్టములకు దుఃఖించుచుండిరి. దమయంతితో నపుడు నలుడిట్లనెను.

కం. ఇది దక్షిణాపథంబున
కిదియు విదర్భాపురమున కిది కోసల కి
య్యది యుజ్జయినికిఁ దెఱువులు
మది నిన్నిటిలోన నరుగ మనకెద్ది యగున్. 70

అర్థం. దక్షిణాపథము=దక్షిణ దేశము, తెఱువులు=మార్గములు.

తా. ఇది దక్షిణ దేశమునకు, నిది విదర్భకు, నిది కోసలకు, నిది యుజ్జయినికి పోవు త్రోవలు. మన మే త్రోవ వెంట పోవుదము?

కం. అడవులలో నాతోఁగడు
నిడుమలు వడనోప వరుగు మిందుముఖీ యి
ప్పుడు నీ బంధుజనంబుల
కడకనవుడుఁ దరుణి శోకగద్గద యగుచున్. 71

అర్థం. ఇడుమలు=కష్టములు, ఇందుముఖీ = చంద్రుని వంటి ముఖము గల దానా, దమయంతీ.

తా. అడవులలో నీవు నాతో కష్టములు పడలేవు. నీవు విదర్భకు నీ తల్లి దండ్రుల యొద్దకు పొమ్ము. ఆ మాటలు విని దమయంతి దుఃఖముతో నిట్లనెను :

వి. సంస్కృత మూలమునందు నలుడు త్రోవలు మాత్రమే చెప్పి యూర కున్నట్లున్నది. దమయంతి అతని మాటలను బట్టి యతడు తన్ను వదలి పోవునని శంకించినట్లున్నది. నన్నయగారు అది నలునియందు క్రూరత్వ మగునని భావించి కంఠోక్తిగా చెప్పినట్లే పద్యమును వ్రాసెను.

ఆ.వె. అవని కిట్టులనియె నవనీశ! నీవును
నేనుఁజని విదర్భ నిష్టలీల
నుండుదము మృగాకులోగ్ర వనంబుల
కరుగనేల యిడుమలందనేల? 72

అర్థం. ఇష్టలీలన్ = సుఖముగా, మృగాకులోగ్ర వనంబులకు = క్రూర జంతువులతో నిండిన భయంకరమైన యడవులకు.

తా. రాజా! మనమిద్దఱము విదర్భకుపోయి యచ్చట సుఖముగా నుందుదము. అడవులకు పోయి కష్టపడుట యెందులకు?

వ. అనిన విని నలుం డవనతాననుండై నీ చెప్పినట్లు విదర్భేశ్వరు రాజ్యంబును మన రాజ్యంబ యేను. దొల్లి యధికైశ్వర్యయుతుండనయి యందులకుం బోయి బంధుజనులకు హృదయానందంబు సేసి యిప్పుడివ్విధంబున సర్వస్వహీనుండనయి ఎట్లు పోవనేర్తుననిన దమయంతి యిట్లనియె. 73

అర్థం. అవనతాననుఁడు = వంచిన ముఖము కలవాడు, సర్వస్వహీనుఁడు = సొమ్మంతయు పోయినవాడు.

తా. ఆ మాటలు విని నలుడు మొగము వంచికొని యిట్లనెను: నీవు చెప్పినట్లు మీ తండ్రి రాజ్యము మన రాజ్యమే; కాని నేను పూర్వమచ్చటికి గొప్ప యైశ్వర్యముతో పోయి వారికి సంతోషము కలిగించితిని. ఇప్పుడిట్టి స్థితిలో నెట్లు పోవుదును? వాని మాటలకు దమయంతి యిట్లనెను.

తే.గీ. అధిక దుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చువ్వె నెందు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంతలయ్యు నాపద లెఱుక బడవు. 74

అర్థం. అధిక దుఃఖరోగార్తునకు = అధికమైన దుఃఖము చేతను, లేక దుఃఖమను రోగము చేతను బాధపడువానికి, భార్యాసమేతుఁడు = భార్యతో కూడినవాడు.

తా. దుఃఖముగాని రోగముకాని తటస్థించినపుడు భార్య కంటె నెక్కువ యగు మందు లేదు. భార్యతోనున్న వానికి కష్టములు కనిపించవు.

కం. అలసినెడ దప్పినెడ నాఁ
కలి తృష్ణయు నైన నెడలఁ గడుకొని ధరణీ
తలనాథ ! పురుషునకు ని
మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్. 75

అర్థం. తృష్ణ=దాహము, ధరణీతలనాథ=రాజా !, పాచున్=తొలగించును.

తా. అలసినప్పుడు, నీరసపడ్డప్పుడు, అకలి దప్పులైనప్పుడు భార్య యాదుకొని పురుషునకు దుఃఖము పోగొట్టును.

వి. నన్నయగారు సూక్తినిధి. రమణీయమైన సూక్తులను ఆయన చిన్నిచిన్ని పద్యములలో వేఱ వేఱ వ్రాయును. వానిని కథతోను చదువుకొనవచ్చును, వేఱుగను చదువుకొనవచ్చును. ఈ పై రెండు పద్యములట్టివి.

వ. కావున నిది మదనుజీవిత యనియు ననువ్రత యనియు ననుకంపనీయ యనియు నన్ను విడువక నా యనుగమనంబునకు ననుమతుండవు గమ్మనిన నట్ల చేయుదుఁ బ్రాణసమానవైన నిన్నేల విడుతు నోడకుండుమని నలుండు తన దేవి నాశ్వాసించుచు నొక్కటఁ జని విజనంబైన విపినంబున నొక్క సభంగని యందు విశ్రమించి పరుష ధూళి ధూసర స్థలంబున శయనించి మార్గశ్రమ నిమీలిత నయనుండై దుఃఖంబునఁ గన్ను మొగుడకున్న లేచి తన పాదంబుల యంతికమ్మునఁ గ్లేశ పరవశయై నిద్ర వోయెడు దమయంతిం జూచి- 76

అర్థం. మదనుజీవిత=నాతో బ్రదుకునట్టిది, అనువ్రత=భక్తిగలది, అనుకంపనీయ=జాలిపడ తగినది, అనుగమనము=వెంట వచ్చుట, అనుమతుడు = అంగీకరించినవాడు, ఆశ్వాసించు = ఓదార్చు, విజనము= జనులులేనిది, విపిన=అడవి, సభ=శాల, చావడి, పరుష ధూళి ధూసర స్థలమున = కఠినమైనట్టియు దుమ్ము కప్పికొన్నట్టియు ప్రదేశమున,

మార్గశ్రమ నిమీలిత నయనుఁడు=నడచుట వలని శ్రమవలన మూసి కొన్న కనులు కలవాడు, కన్ను మొగుడకున్న= నిద్ర రాకపోవుటచేత, అంతికమున= సమీపమున, క్లేశపరవశ=శ్రమచేత యొడలెఱుంగనిది.

తా. కాబట్టి ఈ దమయంతి నీతోడి బ్రతుకు గలది భక్తి గలది అని జాలిపడి నీ వెంట నన్ను రానిమ్మనెను. నలుడు నీవు నా ప్రాణముతో సమానము నిన్ను విడువను భయపడకుమని యామె నోదార్చుచు నడవిలో పోవుచు ఒక చోట నొక శాలను చూచి అక్కడ నేలపైన శయనించిరి. నలునికి దుఃఖము వలన నిద్ర రాలేదు. దమయంతి శ్రమ వలన గాఢ నిద్రలో మునిగెను. నలుడామెను చూచి-

సీ. ధరణి రాజ్యంబుతో ధనమెల్లఁ బరులచే
నపహృతం బగుటయు నాప్త మిత్ర
బంధు జనంబులుఁ బ్రకృతి జనంబులు
విడుచుటయును మహా విపిన భూమిఁ
బత్నితోఁదన పరిభ్రమియించుటయు నప్డు
దలఁచి శోకించి యి త్తరుణి దొల్లి
మృదుశయనంబున మెలఁతలు మెలపుతో
నడుగు లొత్తఁగ నిద్ర యనుభవించు

ఆ. కోమలాంగి యిపుడు గుఱుకొని పాంసుల
స్థలమునందు నిద్ర దగిలినదియుఁ
బంకజాక్షి నాకు భార్యయై యిట్టి దుః
ఖంబు వొందె దైవఘటనఁ జేసి. 77

అర్థం. పరిభ్రమించుట = తిరుగుట, మెలతలు=స్త్రీలు, చెలికత్తెలు, పాంసుల స్థలము= దుమ్ముతో నిండిన స్థలము.

తా. నలుడు తన రాజ్యము ధనము పోవుటయు మిత్రులు బంధువులు సామాన్య జనులు తన్ను పరిత్యజించుటయు అడవిలో తాను భార్యతో తిరుగు చుండుటయు తలచుకొని దుఃఖించుచు నీ దమయంతి పూర్వము మెత్తని పక్కమీద చెలికత్తెలు నెమ్మదిగా పాదము లొత్తుచుండ నిద్రపోయెడిది

ఇప్పుడీ దుమ్ములో నిద్రపోవుచున్నది. నాకు భార్యయై యిట్టి దుఃఖమును దైవఘటన వలన నీమె పొందినది.

వ. ఏను దీని దుఃఖంబుఁ జూడనోప నెట యేనియుం బోయెద యిది నన్నుం గానక తన బంధువుల యొద్దకుంబోయి దుఃఖంబులం బడయకుండునని విచారించి పోవ సమకట్టి యక్కోమలి మేలుకొనకుండ మెల్లన దాని వస్త్రంబునం దర్ధంబు సించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి కొండొక నేల పోయి దమయంతి ఘనంబైన తన నెయ్యంబను తీఁగం ద్రెంపనేరక క్రమ్మఱి వచ్చి. 78

అర్థం. పొరయకుండును=పొందకుండును, సమకట్టి=పూని, పరిధానము= కట్టుబట్ట, కొండొకనేల=కొంతదూరము, నెయ్యము=స్నేహము, క్రమ్మఱి వచ్చి=తిరిగివచ్చి.

తా. నేను దీని దుఃఖము చూడలేను, ఎక్కడికైనను పోయెదను. ఈమె నన్ను జూడక తన తల్లితండ్రుల యొద్దకు పోయి సుఖపడునని భావించి ఆమె వస్త్రములో సగము చించి కట్టుకొని శాలనుండి బయటికివచ్చి కొంత దూరముపోయి ఆమె యందలి ప్రేమను త్రెంచుకొనలేక వెనుదిరిగివచ్చి-

చం. కలి దమయంతిఁ బాప సమకట్టు బొరిం బలి వాయనోపఁడా
లలన నుదీర్ణ సౌహృద బలంబున నిట్టులు రెంటఁజేసి య
న్నలుడు విమోహ రజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు
య్యలయును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దువినిశ్చితాత్ముఁడై. 79

అర్థం. ఉదీర్ణ సౌహృద బలంబున=అధికమైన స్నేహబలముచేత, విమోహరజ్జు లన్=అధికమైన ప్రేమయనెడి పాశముల చేతను, పోయిన ప్రేమయనెడి పాశములచేతను, విమోహశబ్దము నందలి వి యను యుపసర్గకు విశేష మైన యనియు, విగతమైన యనియు రెండర్థములు కలవు. ఆ యర్థ ముల రెండిటిని నన్నయగారిచటనుద్దేశించెను.

గతాగతకారి=రాకపోకలు కలిగించునట్టిది, వినిశ్చితాత్ముడు= మనస్సునందు నిశ్చయములేనివాడు.

తా. కలి దమయంతిని విడిపొమ్మని నలుని ప్రేరేపించును. నలుడామెను వీడ జాలడు. అతని ప్రేమబల మట్టిది. ఒకప్రక్క నీ ప్రేమ పాశములు, మఱి యొకప్రక్క కలివైచిన ప్రేమ రాహిత్యమను పాశములు నలుని లాగ జొచ్చెను. అతడారెంటి తోడను పెనగుచు నూయెలవలె నటునిటు పోవుచు చాలాకాలము నిశ్చయము లేక దుఃఖించెను.

వి. ఈ పద్యము చాల ప్రసిద్ధమైనది. నలుని యప్పటి మనస్థితిని వర్ణించు నట్టిది. విమోహరజ్జులు, "వినిశ్చితాత్ముడు" అను నీ రెండుచోటులందును 'వి' యనునది నుపసర్గము. మొదటి పదమున దీనికి రెండర్థములు కాగా రెండవ పదమునందు వ్యతిరేకార్థమొక్కటే నన్నయగా రుద్దేశించెను పద్యభావము సంస్కృతమూలము నందలిదే. ఈ యుపమానము కూడ నచ్చటిదే. నన్నయగారీ భావము నిచ్చట పంచివ్రాసి కరుణరస ప్రతీతిని కలిగించెను. ఈ పద్యమువలన దమయంతిని నలుడు వదలిపోయినను అతనియందు పాఠకులకు సానుభూతియే కలుగును.

తే. బాలనొక్కర్తు నిక్కాన పాలుసేసి
నిష్ఠురుండనై యేనెట్లు నేర్తుఁబోవ
ననక కలిచేత నాకృష్టుఁడైన నలుఁడు
విగతకరుణుఁడై దమయంతి విడిచచనియె. 80

అర్థం. నిష్ఠురుఁడు=కఠినుడు, ఆకృష్టుఁడు=లాగబడినవాడు, విగతకరుణుఁడు =దయలేనివాడు.

తా. దమయంతి నడవిలో విడిచి కఠినుడనై యెట్లుపోవుదునని విచారింపక కలి బలమువల్ల నలుడామెయందు జాలివిడిచి వెడలిపోయెను.

వ. అంత దమయంతి మేలుకొని తన పతింగానక తన వస్త్రార్థ నికృంత నంబును జూచి లేచి నలుగడం బరికించి భయశోక వ్యాకుల చిత్తయై. 81

అర్థం. వస్త్రార్థ నికృంతనము=చీరలో సగము తెగిపోవుట, నలుగడం=నాలుగు దిక్కులను, భయశోక వ్యాకులచిత్త=భయము చేతను దుఃఖముచేతను కలవరపాటుపొందిన మనస్సుగలది.

తా. దమయంతి మేలుకొని తన భర్తను కానక తన చీరలో సగము చిరిగి యుండుట చూసి చుట్టుజూచి భయదుఃఖములతో-

సీ. హా ! మహారాజ ! మహామహీరక్షణ
దక్షదక్షిణ బాహు దండదండి
తారాతి నిషధ రాజాగ్రణీ నన్నిట్లు
వీతదయుండవై విడిచి చనఁగఁ
దగునె నీవెన్నఁడు ధర్మువు దప్పని
వాఁడవు సూనృతవ్రతరతుండ
వోడకుమని నన్ను నూఱడఁబలికిన
పలుకిట్లు మఱవంగఁబాడి యగునె

ఆ. పొదలలోన డాఁగి పొడసూపకిట్లేల
యున్నవాడ విట్టి యుగ్రభావ
మేల నీకు వలసె నెటవోదు నింకెట్లు
గాంతు నిన్ను నుగ్రకాననమున. 82

అర్థం. మహా...దండ=సర్వ భూమిని రక్షించుట యందు సమర్థమైన దండము వంటి కుడి బాహువు కలవాడా, దండితారాతి=దండింపబడిన శత్రువులు కలవాడా, వీతదయుఁడు=దయలేనివాడు, సూనృత వ్రతరతుఁడు= సత్యమును పలుకుట యందిష్టము గలవాడు.

తా. మహారాజా! ఈ భూమండల మంతయు భరింపగల వాడవు. శత్రువుల మర్దించిన వాడవు. నన్ను దయలేక విడిచి పోతివి. ధర్మాత్ముడవు, సత్యవాదివి నన్నట్లూఱడించి యా మాట లన్నియు మఱచిపోతివి. పొద లలో దాగి కొంటివా? నీ కిట్టి క్రూరత్వమేల? నేనెక్కడికి పోయెదను? ఈ కాఱడవిలో నిన్నెట్లు చూతును?

వి. పద్యమునందు కరుణరసము ధ్వనించుచున్నది. ప్రసిద్ధమైన నన్నయ గారి సీస పద్య రచనా రీతికి నుదాహరింప దగ్గ పద్యము. దుఃఖము యొక్క పొంగు మొదట నుల్బణముగా వచ్చును. తరువాత తెఱలు తెఱలుగా ముక్కలు ముక్కలుగా వచ్చును. పద్య రచన దానికి ప్రతీకగా నున్నది.

కం. వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పో
ల్పఁగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్. 83

అర్థం. వగవఁగన్=విచారింపగా, సాంగోపాంగములు = అంగములు ఉపాంగములతో కూడుకొనినది, ఎన=సాటి.

తా. విచారించిన చతుర్వేదములు శాస్త్రములు వల్లించుట కంటె సత్యమును పాటించుటయె గొప్పది. సత్యముతో పోల గలదేదియును లేదు.

వ. ప్రాణ సమానురాలవైన నిన్నవశ్యంబును విడువనని పలికితి. సత్య ప్రతిపాలనంబు సేయుమని ప్రలాపించుచుం దన యేకాకిత్వంబునకు, నబలా భావంబునకు, ప్రతి పదన్యాస జాయమాన కంటక మృగ పన్నగ భయంబునకు వగవక నిజనాథు నసహాయత్వంబునకు దుస్సహ క్షుత్పిపాసా శ్రమాకులత్వంబునకు వగచుచు. 84

అర్థం. అవశ్యము=తప్పకుండ, ప్రలాపించుచు=ఏడ్చుచు, ఏకాకిత్వము = ఒంటరితనము, అబలాభావము=స్త్రీత్వము, ప్రతిపద...భయంబు = అడుగడుగున సంభవించుచున్న ముళ్ళు క్రూరమృగములు పాములు వలన కలుగు భయము, వగవక=దుఃఖింపక, అసహాయత్వము = తోడులేనితనము, దుస్సహ...ఆకులత్వము=భరింపరాని ఆకలి దప్పులు శ్రమతోడి కలవరపాటు.

తా. నిన్ను వదలిపెట్టను నీవు నా ప్రాణముతో సమానము అని చెప్పితివి గదా, అన్నమాట నిలబెట్టుకొనుము అని యేడ్చుచు తన యొంటరితనమునకు స్త్రీత్వమునకు విచారింపక ముళ్ళకు పాములకు క్రూరమృగములకు దుఃఖింపక తన భర్తకు తోడులేదని ఆకలి దప్పులకు శ్రమకు నోర్చుకొనలేడని దుఃఖించుచు-

కం. అలయుచుఁ బులుఁగుల యెలుగుల
కులుకుచు నుగ్రాతపమున కోపక వృక్షం
బుల నీడల నిలుచుచు నెలుఁ
గులఁ బులులం జూచి భయము గొని వగవగచున్. 85

అర్థం. అలయుచు=శ్రమపడుచు, పులుగుల యలుగులకు=పక్షుల కూతలకు, ఉలుకుచు=భయపడుచు, ఉగ్రాతపమునకు=తీక్ష్ణమైన ఎండకు.

కం. ఏచిన పొదలఁ బొరల్పడఁ
ద్రోచుచు ముండ్లకును నల్లఁ దొలఁగుచు దిక్కుల్
సూచుచుఁ దొడరుచుఁ ద్రెళ్ళుచు
లేచుచు లలితాంగి సంచలించుచు నరిగెన్. 86

అర్థం. పొరల్పడ ద్రోచుచు=అంతరములు విడదీయుచు, తొడరుచు=ప్రయత్నించుచు, త్రెళ్ళుచు=పడుచు, సంచలించుచు=వడఁకుచు.

తా. దమయంతి శ్రమపడుచు, పక్షి కూతలకు భయపడుచు, ఎండ వేడిమికి తాళక చెట్ల నీడ నిలుచుచు, క్రూర మృగములు జూచి భయపడుచు, పెరిగిన పొదలలో భర్త కొఱకు పొరలు పడద్రోయుచుం గ్రుచ్చుకొను ముండ్లకు తప్పుకొనుచు, దిక్కులు చూచుచు, పడుచు లేచుచు వడఁకుచు.

వి. రసమయమైన రచన-కరుణరస వ్యంజకము.

వ. ఇట్లరుగుచున్న దమయంతి నంతికన్యస్త చరణయైన దాని నాహారార్థియై యొక్క యజగరంబు పట్టికొనిన యక్కోమలి మెదల నేరక- 87

అర్థం. అంతికన్యస్త చరణ=సమీపమున నుంచిన యడుగు గలది, ఆహారార్థి =ఆహారమును కోరినది, మెదలనేరక=కదల లేక.

తా. ఇట్లు దమయంతి పోవుచు నొకచోటనున్న యొక కొండచిలువ దగ్గఱ తన పాదమునుంచెను, ఆ యజగరమునకు ఆకలై యామెను పట్టుకొనెను. ఆమె కదలలేక-

ఆ. ఇంకనైన నన్ను నేల యాలింపవు
నాకు శరణమగుము నాథయనుచు
నరచుచున్న దాని యాక్రందన ధ్వని
వినుచు నొక్క యెఱుకు వేగవచ్చి. 88

తా. ఆమె యింకనైన నా మొఱ వినుము నన్ను రక్షింపుమని భర్తను పిలుచుచు నేడువ జొచ్చెను. ఆ ధ్వని విని ఒక యెఱుకు త్వరగా వచ్చి-

వ. తన పట్టిన సురియ నప్పెనుబాము వదనంబు వ్రయ్యందఱిగిన రాహుముఖ విముక్తయైన చంద్రరేఖయుంబోలె నజగర ముఖంబువలన వెలువడిన యా దమయంతి నాశ్వాసించి తత్సమీప సరోవరస్నాతను వన్యస్వాదు ఫలాహారనుంగా జేసి విగతశ్రమం గావించి నీ వెవ్వరిదాని విట్లేల యేకతంబు యివ్వనంబునకు వచ్చితని యడిగి మధురభాషిణియైన యమ్మగువ వలన నంత వృత్తాంతంబు నెఱింగి-

అర్థం. సురియ=పిడిబాకు, వ్రయ్యన్=చీలికలగునట్లు, రాహుముఖవిముక్త= రాహువు యొక్క నోటినుండి విడువబడినది, ఆశ్వాసించి=ఓదార్చి, తత్సమీప సరోవరస్నాతను=అచ్చటకు దగ్గఱనున్న చెఱువులోస్నానము చేసినదానిని, వన్యస్వాదు ఫలాహారను=అడవిలో పండిన తియ్యని పండ్లను తిన్న దానిని, విగతశ్రమను = అలసట తీరిని దానిని, ఏకతంబు= ఒంటరిగా, మగువ=స్త్రీ, వృత్తాంతము=చరిత్రము.

తా. తనచేతి యందలి పిడిబాకుతో ఆ చిలువనోరు చీలికలుగా తఱిగిన దమయంతి రాహువు ముఖమునుండి చంద్రునివలె బయటకు వచ్చెను.

అతడామెనోదార్చి అచ్చటి చెఱువులో స్నానము చేయించి తియ్యని యడవిపళ్ళు తినిపించి ఆమె యలసట తీర్చుకొన్న తరువాత నీ వెవ్వరి దానవు ఒంటరిగా ఈ యడవికేల వచ్చితివని యడిగెను. అమె తియ్యని మాటలతో తన వృత్తాంతమంతయు చెప్పెను. అది యంతయు తెలిసికొని ఆ యెఱుకులవాడు

కవిరాజ విరాజితము.

రజనికరాననఁ బీనపయోధర రాజిత రాజసుతన్ విలస
ద్గజపతి గామినిఁ జందనగంధిఁ బ్రకాశిత కాంతి సమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామనిశాత శరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్య చరిత్రకు వేడుకతోన్. 89

అర్థం. రజనికరానన=చంద్రుని వంటి ముఖము గలది, పీన పయోధర= బలసిన స్తనములు గలది, రాజిత రాజసుత = ప్రకాశించుచున్న రాజ పుత్రి, విలసద్గజపతి గామిని = ఒప్పుచున్న మదపుటేనుగు యొక్క నడక గలది, చందన గంధి=మంచి గంధము వలె సువాసించు శరీరము గలది, ప్రకాశిత కాంతి సమన్విత=తళతళలాడు శరీరకాంతితో కూడు కొన్నది, పంకజదళ లోచన = తామర పూరేకులవంటి నేత్రములు గలది, కామనిశాత శరాహతుడు=మన్మథుని వాడి బాణములచేత కొట్ట బడినవాడు, నిజ హృదయము=తన హృదయము, కోరిక, అనింద్య చరిత్ర=నిర్మలమైన నడవడి గలది.

తా. దమయంతి సౌందర్యముదు చూచి కిరాతునకు మతిపోయి యామెకు తన వలపు నెఱింగించెను.

వి. నన్నయగారి ప్రసిద్ధ పద్యములలో నొకటి. ఇట్లు సొగసుగా పద్యమును నడిపించుట నన్నయగారి సొమ్ము.

ఆ.వె. అగ్నిశిఖయుఁ బోలె నంటను డాయనుఁ
జూడరాని యట్టి శుభచరిత్ర
నెఱుకలేని కఱకుటెఱుక పేక్షించెఁ గా
దనక తనకు నాయువల్పమైన. 90

అర్థం. అల్పము = కొంచెము.

తా. దమయంతి అగ్నిజ్వాలవలె వెలుగుచున్నది, ఆమెను ముట్టుకొనరాదు. సమీపింపరాదు. చూడరాదు. అట్టి పవిత్రమైన చరిత్ర యామెది. ఆ మూఢుడైన కఱకుటెఱుకు తనకాయువు లేకపోవుట వలన నిట్టిపని చేయ గూడదని భావింపక యామెను కోరెను.

వి. ఈ యుపమానము సంస్కృత మూలము నందలిదే. కాని అంటను డాయను చూడరాని యట్టి యను విశేషణము నుపమేయమైన దమయంతికి వేసి వ్యతిరేకాలంకారమును స్ఫురించునట్లు నన్నయగారు నిబంధించెను. అంటరాని అగ్నిశిఖ యున్నది. డాయరాని యగ్నిశిఖ యున్నది. నిప్పు నంటుకొనిన కాలును. విద్యుత్‌ను సమీపించిన కాలును. శివుని ఫాలాగ్ని చేత చూడబడినవారు కాలుదురు; కాని ఫాలాగ్నిని చూచిన వారు కాలరు. దమయంతి వంక చూడను కూడ రాదు. అనగా దమయంతి శివఫాలాగ్ని శిఖ కంటె కూడ తీక్ష్ణమైనదన్నమాట.

వ. దమయంతియు వాని నలిగి చూచి యేను పతివ్రతనైతినేని యిద్దురాత్ముండైన కిరాతుండిప్పుడ మృతుండయ్యెడుమని శాపంబిచ్చిన వాఁడప్పుడ యగ్నిదగ్ధంబైన వృక్షంబునుంబోలె విగతజీవుండై పడియె. నట్లు పరమ పతివ్రతాగుణ ప్రభావంబున- 91

అర్థం. విగతజీవుఁడు = ప్రాణములు పోయిన వాడు.

తా. దమయంతి కోపగించి, నేను పతివ్రతనైనచో వీడిప్పుడే చనిపోవుగాక యని శాపంబిచ్చెను. ఆమె శాపాగ్నికి వాడు వెంటనే చనిపోయెను. అట్లు ఆమె తన పాతివ్రత్య మహిమతో-

కం. బాల హృదయమున నృపశా
ర్దూలు నిజాధీశు నిలిపి దుష్టోరగ శా
ర్దూలాభీల మృగావళి
కోలిన భయమంద కఱిగె నుగ్రాటవిలోన్. 92

అర్థం. నృపశార్దూలుఁడు=రాజశ్రేష్ఠుడు, నిజాధీశుఁడు=తనభర్త, దుష్టోరగ... మృగావలి=విషపు పాములు పులులు మొదలైన భయంకరమైన క్రూర మృగముల సమూహము, ఉగ్రాటవి=భయంకరమైన అడవి.

తా. దమయంతి తన మనసులో నలుని భావించుచు పులులకు పాములకు క్రూర మృగములకు భయపడక ఆ కాఱడవిలో పోవుచుండెను.

వ. మఱియును- 93

వి. భంగ్యంతరము చేత దమయంతి దుఃఖమును విస్తరించుచున్నాడు.

సీ. సహకారమత్ప్రియ సహకారుఁ బున్నాగ
పున్నాగుఁ దిలక భూభువన తిలకుఁ
జందన బుధ హరి చందనుఁ బుష్పితా
శోక సుహృజ్జన శోకదమను
వకుళ కులైక దీపకు విభీతక భయో
పేతారి హరు నలుఁ బ్రీతితోడఁ
గానరే కానలలోన లోకోత్తరు
నని భ్రమానికి నరిగియరిగి

ఆ.వె. యడుగు నడుగు లెండఁ బొడవడఁ బొక్కిన
నిర్ఝరాంతరముల నిలుచుఁబొలుచు
గిరుల దరులయెడల నురు గృహాగృహములఁ
దొంగి తొంగి చూచుఁ దోయజాక్షి. 94

అర్థం. సహకార !=తీయ మామిడి వృక్షమా !, మత్ప్రియ సహకారున్=నా ప్రియుడైన స్నేహితుని, పున్నాగ వృక్షమా !, పున్నాగు=పురుష శ్రేష్ఠుని, తిలక!=ఓ తిలక వృక్షమా! భూభువన తిలకుఁ ఈ భూలోక మునకు తిలకమువంటి వానిని, చందన!=ఓ మంచి గంధపు వృక్షమా! బుధహరి చందను=పండితులకు కల్పవృక్షము వంటివానిని, పుష్పితా శోక=పూచిన యశోకమా, సుహృజ్జన శోకదమను=స్నేహితుల దుఃఖమును పోగొట్టు వానిని, వకుళ !=ఓ పొగడచెట్టా !, కుల్లైక

దీపకు=వంశమునకంతకు కీర్తి తెచ్చిన వానిని, విభీతక!=ఓ తాండ్ర చెట్టా!, భయోపేతార్తిహరు=భయపడిన వారి దుఃఖమును పోగొట్టు వానిని, లోకోత్తరుఁడు=లోకములో శ్రేష్ఠుడు, మ్రాని మ్రానికి=చెట్టు చెట్టునకు, నిర్ఝరాంతరములన్=సెలయేళ్ళలో.

తా. దమయంతి చెట్టుచెట్టునకు పోయి వాని పేళ్ళవలన నలుని గుణములు గుర్తునకురాగా, ఆ గుణములను పేర్కొనుచు అట్టివానిని చూచిరాయని యడుగుచు నెండవేడిమికి తాళక కాళ్ళు బొబ్బలు పొక్కుచుండగా సెల యేళ్ళలోనికి పోవుచు కొండచఱియల చాటునను గుహలలోను తొంగి తొంగి చూచుచు-

వ. ఇట్లు దమయంతి నిజనాథు నన్వేషించుచు భీషణారణ్యంబునం దిరుగునది ముందట. 95

అర్థం. భీషణారణ్యము=భయంకరమైన యడవి.

తా. ఇట్లు దమయంతి నలునివెదకుచు ఆ భయంకరారణ్యములో తిరుగుచు తన ముందు-

వి. పై పద్యము మిక్కిలి ప్రసిద్ధమైనది. వృక్షనామములు నలుని గుణము లకు జ్ఞాపకములై దమయంతియొక్క నిస్సహాయత్వమును దీనత్వమును భర్తృవిరహవేదనమును తెలుపుచు విప్రలబ్ధశృంగారమును మిక్కుటముగా ధ్వనింపజేయుచున్నవి. పద్యమునందు యమకాలంకారము సహజముగా నతుకుకొన్నది. యమకాలంకారము సీసమునందు రెండు చరణములే. మూడవ చరణమున యమకము నిర్వహింపబడలేదు. కాని దాని ఛాయ యున్నది. నాలుగవ చరణములో ఈ భావమున కుపసంహారము చెప్ప బడినది. ఇట్టి రచనవల్ల దుఃఖానుభవమెట్టిదో వ్యక్తమగును. ఎత్తుగీతి యందు ఆమె కష్టములు విస్తరించుట యున్నది. దమయంతి సంప్రశ్నము నందు వ్యక్తమగుచున్న నలుని మహాగుణములు వ్యంగ్యమగుచున్న విప్ర లంభమునందు చర్వణాధిక్యమును సంపాదించుచున్నది. ఈ పద్య రచన నన్నయగారి స్వోపజ్ఞకము, పోతనగారి భాగవతము నందలి 'గోపికల

కృష్ణ మార్గణము నందలి) 'పున్నాగ కానవే పున్నాగవందితు' నీ మొదలైన సీసపద్యముల కిది మాతృక.

మత్త కోకిలము. వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాక నీ
వార భక్షులు వృక్షమూల నివాస యుక్తులునై తపం
బారఁ జేయు మహామునీంద్రుల యాశ్రమంబెడఁ గాంచె నం
భోరుహాక్షి పురా సమార్జిత పుణ్య కర్మ ఫలంబునన్. 96

అర్థం. వారిభక్షులు = నీరే యాహారముగా కలవారు, పర్ణభక్షులు=ఆకులను మాత్రమే తినువారు, వాయుభక్షులు=గాలి మాత్రమే యాహారముగా జీవించువారు, శాక నీవార భక్షులు = కూరలు నివ్వరి ధాన్యము తిని యుండువారు, వృక్షమూల నివాసయుక్తులు = చెట్ల మొదళ్ళు అను నిండ్లతో కూడి యున్నవారు, పురాసమార్జిత పుణ్య కర్మ ఫలంబునన్= పూర్వము సంపాదించిన పుణ్య కర్మల ఫలము చేత.

తా. దమయంతి యా వనములో జన్మాంతర పుణ్యవశమున నొకచోట నొక యాశ్రమమును చూచెను. అచ్చట కొందఱు మహామునులు తపస్సుచేసి కొనుచుండిరి. కొందఱికి నీరే యాహారము. కొందఱికి చెట్ల యాకులే యాహారము. కొందఱు వట్టి గాలిని మాత్రమే స్వీకరించి బ్రతుకుదురు. కొందఱు శాకము నివ్వరి ధాన్యము తిందురు. వారందఱకు చెట్ల మొదళ్లే యిండ్లు.

వి. మహర్షులు, మహాయోగులు పుణ్యస్థలములందు అడవులలో కొండలలో నదీతీరములందు నివసించుచు తపస్సులో మునిగి యుందురు. సామాన్య జనులకు వారి దర్శన మబ్బదు. వారి దర్శన మబ్బుట జన్మాంతరీ యకమైన మహా పుణ్యఫలము. దమయంతి కట్టి వారి దర్శన మబ్బినది. ఇక నుండి ఆమె కష్టములు తొలగిపోవుట ప్రారంభమగును అని సూచన.

వ, ఇట్లు మృగ వ్యాళ తస్కర కిరాత నిరంతరంబయిన కాంతారంబునం బుణ్యనదీ తీరంబున నొక్క మునిపల్లియం గని యందు వసిష్ఠ వామదేవ వాలఖిల్య భృగు నారద సదృశులైన మహామునులం గని నమస్కరించి

యున్న నమ్మునులు దమయంతిం జూచి యచ్చెఱువడి యవ్వా! నీ వెవ్వరి
దాన వివ్వనదేవతవా ! దేవభామినివా దివ్యంబైన తేజంబుతో నేల
గ్రుమ్మఱియెద వనిన వారలకు దమయంతి యిట్లనియె. 97

అర్థం. మృగ...నిరంతరము = క్రూర మృగములు పాములు దొంగలు కిరాతు
లతో నిండినది, కాంతారము = అడవి, సదృశులు = సమానులు,
అచ్చెఱువు = ఆశ్చర్యము, భామిని = స్త్రీ, గ్రుమ్మఱు = తిరుగు.

తా. ఈ విధముగా క్రూర జంతువులతో పాములతో దొంగలతో కిరాతులతో
నిండియున్న యడవియందు నొక్క పుణ్య నది యొడ్డున నొక యాశ్ర
మము నందు వసిష్ఠ వామదేవాదులతో సమానులైన మహా మునులను
చూచి దమయంతి నమస్కరించెను. ఆ మునులామెను జూచి, అమ్మా!
నీ వెవ్వరవు ? వనదేవతవా, దేవకాంతవా, ఇంత దివ్యమైన తేజస్సుతో
నిచ్చట నేల తిరుగుచుంటివని యడిగిరి. ఆమె యిట్లనెను :

కం. వినుడేఁ బుణ్యశ్లోకుం
డనఁగ సదా యజ్ఞ నిరతుఁడనఁగ ధరిత్రిం
దనరిన నలు భార్యను స
జ్జనసుత దమయంతి యన నెసంగిన దానన్. 98

అర్థం. పుణ్యశ్లోకుఁడు = పవిత్రము చేయు కీర్తి గలవాడు, సదా యజ్ఞ నిర
తుఁడు = ఎల్లప్పుడు యజ్ఞములు చేయుటయందు తగులము కలవాడు,
తనరిన = పేరు పడ్డ, ప్రసిద్ధిపొందిన, ఎసంగినదానన్ = ఒప్పినదానను,
సజ్జనసుత = మంచివారిచేత మెచ్చుకొనబడినట్టి, ఇది దమయంతికి
విశేషణముగా చెప్పుకొనవలెను, ఏకవచనమున నుండుట వలన.

తా. నేను పుణ్యశ్లోకుడు నిరంతర యజ్ఞ దీక్షితుడునని పేరుపడ్డ నలుని
భార్యను. నా పేరు దమయంతి.

వ. విధివశంబున నన్నుంబాసి హృదయేశ్వరుండెటయేనియుం బోయినఁ
దదన్వేషణాసక్త చిత్తనై విపిన పరిభ్రమణంబు సేసెద. మీ తపోవనంబు

నకు వచ్చి నలుండు భవత్పాదాభివందన కృతార్థుండయి యెక్కడికిం బోయె నతని బోయినవల నెఱుంగుదురేని నానతిండు కొన్ని దినంబుల లోనఁ దద్దర్శనంబు సంభవిల్లనినాఁడు దేహంబు విడుతు నని యేడ్చు చున్నదానిం జూచి కరుణించి మును లిట్లనిరి : 99

అర్థం. హృదయేశ్వరుఁడు=భర్త, తదన్వేషణాసక్తచిత్త=అతనిని వెదకుట యందాసక్తి కలిగిన మనసు గలదానవై, విపిన పరిభ్రమణంబు=అడవి యందు తిరుగుట, భవత్పాభివందన కృతార్థుఁడు=మీ పాదములకు నమస్కరించుట చేత ధన్యుడైనవాడు, వలను=దిక్కు, ఆనతిండు= ఆజ్ఞాపించుడు, చెప్పుడు.

తా. దైవ ఘటనము చేత నా భర్త నన్ను విడచి పోయెను. ఆయనను వెద కుచు నేసీ యడవిలో తిరుగుచుంటిని. ఆయన మీ యాశ్రమమునకు వచ్చి మిమ్ము సేవించి పోయి యుండును. అతడే వైపునకు పోయెనో మీ రెఱిగిన యెడల నాకు చెప్పుడు. కొన్ని దినములలో నతనిని నేను కలిసికొనకున్నచో మరణింతునని యేడువ దొడగెను. మునులు జాలి వడి యామెతో నిట్లనిరి.

కం. వనజాయతాక్షి కతిపయ
దినములలోఁ జూడఁ గాంతు తివిరి నలుని భూ
జననుతు నెప్పటి యట్టుల,
తన పురమున రాజ్యలీలఁ దనరెడివానిన్. 100

అర్థం. వనజాయతాక్షి = తామర పూవువలె విశాలమైన కనులుగలదానా, కతి పయ దినములలో=కొన్ని దినములలో, తివిరి=ప్రయత్నించి.

తా. అమ్మా ! కొన్ని రోజులలో నెప్పటివలె తన రాజ్యమును పరిపాలించు నలుని కలిసి యానందమును పొందగలవు.

వ. మేము మా తపోదృష్టిం జూచితిమి దుఃఖింప కుండుమని తాపసులు దమ యగ్నిహోత్రంబులయ్యు నపార ఫల పుష్ప తరు నదీ రమ్య తపోవనం

బులయుఁ దోడ నదృశ్యులైనం జూచి దమయంతి యిది కలయో నిక్కు-
వంబో యని విస్మయంబందుచుం జని ముందట నొక్క- చనుపం గని
దానిం జొచ్చునపు డందలి జనంబులు- 101

అర్థం. తపోదృష్టి = తపస్సు వలన లభించిన జ్ఞానదృష్టి, అపార...వనంబు
లయుఁ-అనంతమైనపూలుపండ్లతోడి వృక్షములతో నదులతో రమణీయమైన
తపోవనములతో గూడి, అదృశ్యులు = అంతర్ధానము పొందినవారు,
నిక్కు-వము=నిజము, చనుప=సార్థవాహము, బాటసారుల గుంపు.

తా. మేము మా జ్ఞానదృష్టితో జూచితిమని చెప్పి మునులు తమ యగ్ని
హోత్రములతోను తపోవనముతోను అంతర్ధానమైరి. దమయంతి యిది
కలయో నిజయో యని యాశ్చర్యపడుచుండగా నెదుట నొక బాట
సారుల గుంపు కన్పించెను. దమయంతి ఆ గుంపులో జేరి-

సీ. పాంసుజాలములు పైఁబ్రాకిన కరము రూ
క్షములగు నూర్ధ్వాలకముల దాని
నతిమలినంబైన యర్ధవస్త్రంబుచే
నావృతంబగు దేహయష్టి దాని
నాఁకలి తృష నిద్రలను వీని నెఱుఁగక
యున్మాదిఁనియునుబోలె నున్నదాని
దమయింతి ఁజూచి కొందఱు పిశాచంబని
పఱచిరి కొందఱు భయము వొంది

ఆ.వె. అందుఁ గొంద అధిక హాస్యంబు సేసిరి
యడవి నేమి రోసెదనిరి కొంద
అవ్వ! నీవె వేల్పవగుదని కొందఱు
మొగిన కేలు మొగిచి మ్రొక్కి-రంత. 102

అర్థం. పాంసు జాలములు= దుమ్ము దొంతరలు, కరము = మిక్కిలి, రూక్ష
ములు=కఠినములు, ఊర్ధ్వాలకములు= రేగిన ముందటి తలవెండ్రు
కలు, ఆవృతము = కప్పబడినది, దేహయష్టి=కఱ్ఱవంటి శరీరము,

తృష=దాహము, ఉన్మాదిని=పిచ్చిది, వేల్పువు=దేవతవు, మొగిచి=మోడ్చి.

తా. దమయంతి జుట్టు దుమ్ము కొట్టుకొని రేగి యుండెను. ఆమె కట్టుకొన్న చీర మలినముగా నుండెను. అదియును నొడలి నిండలేదు. సగము చీర. ఆకలి, దప్పి, నిద్ర యామె యెఱుగదు. పిచ్చిదానివలె నుండెను. అట్టి దమయంతిని జూచి కొందఱు పిశాచమని భయపడి పారిపోయిరి. కొందఱు భయపడిరి, కొందఱు వేళాకోళము జేసిరి, కొందఱు అడవిలో నేమి వెదకుచుంటివని యడిగిరి. కొందరు నీవే దేవతవనిరి. కొందరు నమస్కరించిరి.

వి. పద్యమునందు మూడు పాదములు దమయంతి పరిదీనమూర్తి వర్ణన నుపయోగించి నాల్గవ పాదమును నెత్తుగీతిని నా గుంపునందలి జనుల వివిధాభిప్రాయములను చెప్పుటకు వినియోగించుట వలన పద్యరచన కరుణరసమునకు వ్యంజకముగా నున్నది. నన్నయగారు సీసపద్యమును బహువిచిత్రముగా ప్రయోగించును. బహుసందర్భములను దీపింప జేయుటకు సీసపద్యము నుపయోగించును. ప్రసిద్ధమైన యాయన సీస పద్యములలో నిది యొకటి.

వ. దమయంతి సార్థవాహులంజూచి యిమ్మహాగహంబున నిట్టి జనసంకులంబైన సార్థంబు గానంబడియెడు నెట్టి పుణ్యంబో యని పల్కి మఱియు నిట్లనియె: 103

అ. సార్థవాహులు=బాటసారులు, మహాగహనము=కాఱడవి, జనసంకులము=జనులతో నిండినది, సార్థము=బాటసారుల గుంపు.

తా. దమయంతి యీ యడవిలో యిట్టి బాటసారుల గుంపు కన్పించినది యెంత పుణ్యము చేసితినో యని మఱలనిట్లని యామె కథ చెప్పెను.

కం. ఏను నలుభార్యఁ బుణ్య వి
హీనతఁ బతిఁ బాసి నవసి యేకాంతమ యీ

కానలఁ బరిభ్రమించెదఁ
గానరె మీ రమరసదృశుఁ గరుణాత్మ నలున్. 104

అర్థం. నవసి=కష్టములు పడి, అమర సదృశుఁడు=దేవతలతో తుల్యుడు.

తా. నేను నలమహారాజు భార్యను. జన్మాంతర పాపమువలన భర్త నెడబాసి యీ యడవులలో యేకాంతముగా తిరుగుచు కష్టములు పడుచుంటిని. నా భర్త దేవతవంటివాడు. దయాపరుడు. మీరాయనను చూచితిరా?

వ. అనిన దానికి సార్థవాహుండు శుచి యనువాడిట్లనియె. 105

అర్థ తాత్పర్యములు సుగమము.

కం. నలుఁగాన మివ్వనంబునఁ
గల వెప్పుడుఁ గాంతు ముగ్రకరులను సింహం
బుల ఋక్షంబుల నిది మ
ర్త్యుల కవిషయ మాతపంబు దూఱదు దీనన్. 106

అర్థం. ఉగ్రకరులు=భయంకరమైన యేనుగులు, ఋక్షములు=ఎలుగుబంట్లు, మర్త్యులకు=మనుష్యులకు, అవిషయము=చోటుకానిది, ఆతపము= ఎండ.

తా. అమ్మా, యిచ్చట మేము ఎల్లప్పుడు చూచునది యేనుగులను, సింహములను, నెలుగు బంట్లను. నలుని చూడము. ఇక్కడ మనుష్యులుండరు. ఈ యడవిలో సూర్యరశ్మి చొఱదు.

వి. ఇంతయమాయికముగ నడిగెదవేమమ్మా.ఇది మహాఘోరారణ్యమని ధ్వని.

వ. అనిన నిచ్చనుప యెట వోయెదునని యడిగినఁ జేదిపతియైన సుబాహు పురంబునకు పోయెదు నని చెప్పిన నట్లేయని మీ తోడ వచ్చెదనని యప్పరమపతివ్రత పతిదర్శన లాలసయై మునుల పలుకులు తలఁచుచు సార్థంబుతో నఱిగిన- 107

అర్థం. చేదిపతి = చేదిదేశపు రాజు, పతిదర్శన లాలస = భర్తృదర్శనము చేయవలెనను కుతూహలము గలది.

తా. అట్లనగా నీ చనుప యెక్కడికి పోవునని దమయంతి యడిగెను. దాని కతడు చేదిదేశపు రాజైన సుబాహుని పట్టణమునకు పోవునని చెప్పెను. దమయంతి నేను కూడ మీతో వచ్చెదనని మునుల మాటలు తలచికొనుచు వారితో పోయెను.

కం. కడునెండ యెక్కునంతకు
నుడుగక యచ్చనుప నడచి యుగ్రాటవిలో
విడిసె బహుశీత జలముల
బెడఁగగు నొక చెఱువునొద్దఁ బెద్దయు దప్పిన్. 108

అర్థం. బెడగు=అందము.

తా. ఆ గుంపు బాగుగా నెండ యెక్కునంతవరకు నడచి చల్లని నీరున్న నొక చెఱువునొద్ద విడిసెను.

వ. అంత- 110

తా. ఈ మాట వలన మరల కథ మలుపు తిరుగుచున్నదన్నమాట.

సీ. అర్థరాత్రము నప్పుడందులకేతెంచె
గజయూథములు జలకాంక్షఁజేసి
యంబుధి విమలతోయంబు లాస్వాదింపఁ
జనుదెంచు జలధర సమితి యట్లు
యచ్చన్నలోన నిద్రాసక్తులై నవా
రున్నత ద్విపముల యుగ్రపాద
హతిఁజేసి మర్దితులైరి కొందఱు దంత
హతిఁజేసి భిన్నాంగు లైరి కొంద

ఆ.వె. ఱఱచి ప్రాణభీతిఁ బఱచి మహీజంబు
లెక్కిరందుఁ గొందఱుక్కడంగి

చనుప యిట్టి పాటఁ బెనుపఱి యవినీతు
సిరియుఁబోలె నడఁగి విరిసి చనియె. 111

అర్థం: గజయూథము=గజముల సమూహము, అంబుధి విమలతోయములు= సముద్రముయొక్క నిర్మలమైన నీళ్ళు, ఆస్వాదింప=రుచిచూడగా, జలధర సమితి యట్ల=మేఘ సమూహమువలె; ఉన్నత ద్విపములు= ఎత్తైన యేనుగులు, ఉగ్రపాదహతిఁజేసి = భయంకరమైన పాదముల త్రొక్కిడిచేత, భిన్నాంగులు=విరిగిపోయిన యవయవములు గలవారు, పఱచి=పరువెత్తి, మహీజములు = చెట్లు, ఉక్కడంగి=రోసము చచ్చి, పెనుపఱి=నశించి, యిట్టిపాట = ఈ విధముగా, అవినీతుసిరి = వినయములేనివాని సంపద, విరిసి=ఛిన్నాభిన్నమై.

తా. అర్ధరాత్రమునందు ఆ చెఱువులో నీరు త్రాగుటకు నేన్గులగుంపు వచ్చి నిద్రపోవుచున్న వారినందఱిని కాళ్ళతో త్రొక్కి, దంతములతో పొడిచి పీడించెను. కొందఱు చనిపోయిరి. కొందఱకు కాళ్ళు చేతులు పోయెను. కొండఱు పాఱిపోయి చెట్లెక్కిరి. ఇట్లా చనుపయంతయు వినయములేని వాని సంపదవలె ఛిన్నాభిన్నమయ్యెకు.

వ. అట్టి సంక్షోభంబున మరణంబునకుఁ దప్పి దమయంతి యాత్మగతంబున-

అర్థం. సంక్షోభము =గగ్గోలు, ఆత్మగతంబున=మనస్సులో.

తా. దమయంతి యా యాపదనుండి తప్పించుకొని మనసులో నిట్లనుకొన్నది :

అ.వె. జీవితార్థులైన జీవుల సుఖసుప్తు
లైనవారిఁ జంపె నఱవ నఱవ
మరణకాంక్ష నున్న మగువఁ జంపక నను
మఱచె విధి కరంబు మందబుద్ధి.

అర్థం. జీవితార్థులు=బ్రతుకకోరినవారు, జీవులన్=ప్రాణులను, సుఖసుప్తులు =సుఖముగా నిద్రపోవువారు, అఱవ=చనుప, మగువ=స్త్రీ.

తా. బ్రతుకుటకు కోరిన వీరినందఱిని సుఖనిద్రలో నుండగా చనుప నంతటిని చంపెను. చావగోరిన నన్ను మాత్రము బ్రతికించెను. దైవ మెంత తెలివితక్కువవాడు!

వి. అఱవ నఱవజంపె. చక్కని తెలుగు పలుకుబడి. నన్నయ గారిట్టి పలుకు బడులను వాడుటలో నేర్పరి. విధి విపర్యాసము చక్కగా వ్యక్తమగు చున్నదీ పద్యములో.

సీ. ఇచ్చన్నృతోఁ జని యివ్వన క్లేశంబు
దలఁగుదునని బుద్ధిఁ దలచియున్న
నురుతర సార్థ పయోరాశి హస్తియూ
థాగస్త్యుచేఁ బీతమయ్యె నదియుఁ
దొలుమేనఁ జేసిన దుష్కృత శక్తియో
వగవక నా స్వయంవరము నాఁడు
సురవరులర్థులై చూచుచు నుండఁగ
నలు వరియించిన నాఁటి యెగ్గు

ఆ.వె. దలఁచి యిట్టి యాపదలు సేసిరో వేల్పు
లమర కోపముననె యయ్యె నాకు
నివ్వియోగ దుఃఖ మింకేమి సేయుదు
ననుచు వగచుచుండె నంబుజాక్షి. 114

అర్థం. వన క్లేశము=అడవి యందలి కష్టము, తలుగుదును=వీడుదును, ఉరు తర సార్థ పయోరాశి=మిక్కిలి పెద్దదైన బాటసారుల గుంపను సము ద్రము, హస్తియూథాగస్త్యుచే=యేనుగుల గుంపను యగస్త్యుచేత, పీత మయ్యె=త్రావబడెను, తొలుమేనన్=పూర్వ జన్మమున, దుష్కృత శక్తి=పాపము యొక్క శక్తి, సురవరులు=దేవతలు, అర్థులు = (నన్ను) కోరినవారు, యెగ్గు=కీడు, అమరకోపము=దేవతల కోపము.

తా. ఈ చనుపతో పోయి యీ యడవి నుండి బయట పడుదు ననుకొనగా నీ యేనుగు లీ చనుపను రూపు మాపినవి. ఇది జన్మాంతరమున చేసిన

నా పాప ఫలమేమొ. లేక స్వయంవరము నాడు కోరివచ్చిన దేవతలను తిరస్కరించి నలుని వరించుటవలన వారికి కోపము వచ్చి మాకు వియోగమును తెచ్చిపెట్టి యుందురో యని దమయంతి దుఃఖించుచుండెను.

వ. ఇట్లు దుఃఖించుచు దమయంతి ప్రభాతంబ హతశేషులైన యచ్చనుపలోని బ్రాహ్మణవరులతో ననవరత ప్రయాణంబులం జేదిపతి పురంబుసొచ్చి జనసంకులంబైన రాజమార్గంబు దఱియ వచ్చుచున్నదాని దినకర ప్రభాపటల ధూసరిత ప్రభాత చంద్రరేఖయుంబోలె దీప్తివిహీనయై దస్సియు రమ్యాకృతియైనదాని దమయంతిం బ్రాసాదగతయైన రాజమాత దవ్వులంగని తన దాది కిట్లనియె: 115

అర్థం. ప్రభాతము=ఉదయము, హతశేషులు=చావగా మిగిలినవారు, అనవరత ప్రయాణంబులం=ఎడతెగని ప్రయాణములచేత, దినకర...చంద్రరేఖయుంబోలె=సూర్యకాంతిచేత బూడిదచేత కప్పబడినట్లున్న ఉదయ కాలమందలి చంద్రరేఖవలె, దీప్తివిహీన=కాంతిలేనిది, రమ్యాకృతి= అందమైన యాకారము గలది, ప్రాసాదగత=మేడమీదనున్నది, దవ్వులగని=దూరములందు చూచి.

తా. అట్లు దుఃఖించుచు దమయంతి మరునాటి యుదయమున చావగా మిగిలిన బ్రాహ్మణులతో కూడ ప్రయాణము సాగించి, చేదిదేశపు రాజధానిలో ప్రవేశించి రాజమార్గములో వచ్చుచుండెను. ఆమె యాకార ముదయ కాలము నందలి చంద్రరేఖవలె నుండెను. దస్సినప్పటికిని రమణీయముగా నుండెను ఆమెను మేడపైనుండి రాజమాత దూరమునందే చూచి దాసితో నిట్లనెను.

వి. సూర్యకాంతిచేత దుమ్ముకట్టుకొన్నట్లున్న నుదయకాల చంద్రరేఖవలె దమయంతి కాంతి తఱిగి యున్నది. దస్సియు రమణీయముగా నున్నది. ఈ రెండు విశేషణములు రాజమాత దమయంతిని చూచి యాకర్షింపబడుటలో కారణములు. ఆమె సౌందర్యము, ఆమె దయనీయస్థితి నధికము చేసి చూపించినదన్నమాట.

తే.గీ. జీర్ణమై కడుమాసిన చీరగట్టి
ధూళి ధూసరాలకములు దూలుచుండ
నబల యున్మత్త వేషిణియైన లచ్చి
కరణినిట వచ్చుచున్నది కంటె దాని. 116

అర్థం. ధూళిధూసరాలకములు = దుమ్ముచే బూడిదవర్ణమైన ముందటి త్రెతల వెంట్రుకలు, ఉన్మత్త వేషిణి = పిచ్చిదాని వేషము గలది, లచ్చికరణి = లక్ష్మివలె.

తా. ఆ వచ్చు స్త్రీని చూచితివా? మాసిపోయి చిఱిగిన చీర కట్టుకొన్నది. తలయంతయు దుమ్ము కొట్టుకొని యున్నది. పిచ్చిదాని వేషము వేసుకొన్న లక్ష్మిదేవి వలె వచ్చుచున్నదామె.

వ. అకోౄమలియందు నాకతిస్నేహంబై యున్నయది. దానిం దోడ్కొని రమ్మనిన నదియు దమయంతిం దోడ్కొని రాజమాత యొద్దకుంజనిన నా రాజమాతయు దానిం జూచి, నీవెవ్వరిదాన విట్లేల దుఃఖావేశ వివశ వై యున్నదానవు చెప్పుమనిన దమయంతి యిట్లనియె : 117

అర్థం' దుఃఖావేశ వివశ = దుఃఖాక్రమణము వలన నొడలెఱుగనిది.

తా. ఆమె యందు నాకు ప్రేమ పెల్లుబుకుచున్నది. ఆమె నిచ్చటకు తీసికొని రమ్మనెను. దాసి పోయి దమయంతిని తీసికొని వచ్చెను. రాజమాత యామెను జూచి, నీవెవరి భార్యవు? దుఃఖములో మునిగి యుండుటకు కారణమేమని యడిగెను. దమయంతి యిట్లనెను.

వి. 'అకోౄమలి యందు నాకతిస్నేహంబై యున్నయది'. ఈ వాక్యమునకు మూలము సంస్కృత భారతమః నందులేదు. నన్నయగారి కల్పనము. ప్రేమయన్నది బయటి కారణములను బట్టి యుండదు. అది జన్మాంతరీయకము. సూర్యు డుదయించిన తామరపూవు వికసించును. చంద్రు డుదయించిన చంద్రకాంతము జాలువాఱును. చంద్రు డుదయించిన తామర వికసింపదు. సూర్యు డుదయించిన చంద్రకాంతము జాలువాఱదు. కావున ప్రేమ యకారణము. 'వీడు నాకు పూర్వమిత్రుడు. వీడు నాకు

పూర్వవైరి అని మృచ్ఛకటికము. అభిజ్ఞాన శాకుంతలము. ఉత్తర రామ చరిత్రము-నీ రెండు నాటకము నీ భావముపై నాధారపడి నిర్మింప బడ్డవి.

మధ్యా. జితవైరి మత్పతి జూదమాడి నిర్జితుఁడై చనినఁ
బతితోడ నీదయుఁబోలె నేనును బాయక యరిగి
యతి బుభుక్షాతురుండైన పతిచేత నవ్వ! దైవాను
మతిఁజేసి వంచితనైతి నొక్కచో మఱచి నిద్రించి. 118

అర్థం. జితవైరి=జయింపబడిన శత్రువులు గలవాడు, నిర్జితుఁడు=ఓడింప బడినవాడు, పాయక=వీడక, అతి బుభుక్షాతురుఁడు=మిక్కిలి యాకలి చేత బాధపడువాడు, వంచితనైతి=మోసగింపబడినదానను.

తా. నా భర్త జూదములో నోడిపోయి యడవులకు పోయిన నేనును వెంట పోయితిని. అతడాకలి బాధకు తాళలేక నేను గాఢనిద్రలో నుండగా నన్ను మోసగించి విడిచిపోయెను.

వ. అంతనుండియు నమ్మహానుభావు నేకవస్త్రు ననికేతను నన్వేషించుచు సైరంధ్రీవృత్తంబు సేకొని వియోగానలంబునం గంది కందమూల ఫలంబుల యాహారంబుగాఁ బ్రొద్దువడిన చోట నివాసంబుగా మృగ కులంబ సహవాసంబుగా వనంబులం బరిభ్రమించితినని బాష్పజలంబులం బయోధరస్థల పరాగంబు పంకంబు సేయుచుఁ బలుకనేరకున్న నా దమ యంతికి రాజమాత యిట్లనియె : 119

అర్థం. ఏకవస్త్రుఁడు=ఒకే వస్త్రము గలవాడు, అనికేతనుఁడు=ఇల్లు లేనివాడు, అనగా నొకచోట నుండనివాడు, సైరంధ్రీవృత్తము=రాజాంతఃపురము లలో రాజకన్యల నలంకరించు వృత్తి, వియోగానలము = విరహాగ్ని, బాష్పజలములు=కన్నీళ్ళు, పయోధరస్థల పరాగము=స్తన ప్రదేశ మునను్న దుమ్ము.

తా. అప్పటినుండియు భర్తను వెదకుచు సైరంధ్రీవృత్తి పూని దుంపలు పండ్లు నాహారముగా ప్రొద్దుగ్రుంకిన చోట నిద్రించుచు వనములలో తిరిగి తినని చెప్పుచు నేడువ దొడగిన దమయంతికి రాజమాత యిట్లనెను.

కం. నీ వుండుము నాకడ నిం
దీ వరదళనేత్ర నీ పతిని రోయంగ భూ
దేవోత్తములం బంచెద
నావుడు నిట్లనియె భీమనందన నెమ్మిన్.

అర్థం. ఇందీవర దళనేత్ర = నల్ల కలువ పూరేకుల వంటి కనులు గలదానా, రోయఁగ = వెదుకుటకు, భూదేవోత్తములను = బ్రాహ్మణులను, నావుడు = అనగా, భీమనందన = దమయంతి.

తా. అమ్మా, నీవు నా యొద్ద నుండుము. నీ భర్తను వెదకుటకు బ్రాహ్మణులను పంపెదననెను. ఆమెకు దమయంతి యిట్లనెను:

వ. ఏను సైరంధ్రినయి యుండియు నుచ్ఛిష్టంబు ముట్టను. బదధావనంబు సేయనుంబర పురుషులతోఁ బలుకనోపఁ బతి నన్వేషించు పొంటె నరిగెడు బ్రాహ్మణులతోఁ బలుకుదు నట్లయిన నీ యొద్ద నుండుదు నొండు విధంబైన నుండనేర ననిన నీ కిష్టంబైన విధంబున నా యొద్దన యుండుమని దాని నతి గౌరవంబునం జేకొని యుండఁ దనకూఁతు సునంద యను దాని సమర్పించిన-

అర్థం. ఉచ్ఛిష్టము = తిని పారవేసినది, తిని వదలినది, పదధావనము = కాళ్ళు పట్టుట, పొంటె = కొఱకు, ఒండు విధంబైన = మఱియొక రీతితో, సమర్పించిన = అప్పగించిన.

తా. నేను సైరంధ్రినై యున్నను నెంగిలి తినను. పాదములు పట్టను. పర పురుషులతో పలుకను. భర్తను వెదుకబోవు బ్రాహ్మణులతో మాత్రము మాటాడెదను. ఈ నియమము లంగీకరించిన నుందును. లేనిచో పోయెదనినెను. రాజమాత నీ కిష్టమైనట్లే యుండుమని యామెను గౌరవముగా చూడవలసినదని తన కుమార్తె సునందకు చెప్పి దమయంతి నప్పగించెను.

కం. అలయక పుణ్య వ్రతములు
సలుపుచు సైరంధ్రి యనఁగఁ జేదీశుపురిన్
నలుదేవి యుండెనెదఁ బతిఁ
దలఁచుచు దుస్సహ వియోగతాపార్దితయై.

అర్థం. దుస్సహ వియోగతాపార్దితయై = భరింపరాని విరహ తాపము చేత బాధింపబడినదై.

తా. ఆ చేది పట్టణము నందు దమయంతి భర్తృ వియోగమును దుఃఖించుచు పుణ్య వ్రతములు చేయుచు సైరంధ్రీ నామమున రాజాంతఃపురము నందుండెను.

వ. అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యంబులో నరుగువాడు ముందట.

అర్థం. దారుణారణ్యము=క్రూరమైన యడవి.

చం. అవిరళ విస్ఫులింగ నివహంబుల నభ్ర పథంబు నంటుచున్
దవ దహనం బుదగ్ర తరు దాహము సేయుచు నున్నఁ జూచి మా
నవపతి దాని యంతరమునన్ వినియెన్ నరనాథ నన్నుగా
రవమునఁ గావ వేగ నిట రమ్మను నార్త మహానినాదమున్.

అర్థం. అవిరళ విస్ఫులింగ నివహంబుల=ఎడ తెగని మిణుగురుల సమూహములచే, అభ్రపథమును=ఆకసమును, దవ దహనము=కార్చిచ్చు, ఉదగ్ర తరు దాహము=ఎత్తైన చెట్లను తగులబెట్టుట, దాని యంతరమునన్= ఆ కార్చిచ్చు లోపల, కావన్=కాపాడుటకు, ఆర్తమహానినాదమున్= ఆపదలో నున్న వాని యొక్క పెద్ద యఱపును.

తా. నలు డడవిలో పోవుచు తనముందొక పెద్ద కార్చిచ్చు చెట్ల నన్నింటిని తగులబెట్టుచుండుట చూచెను. దాని లోపల నుండి ఓ రాజా! నన్ను కాపాడుటకు నీవు తర్వగా రమ్మని యొక యార్తనాదము వినెను.

కం. విని శంకింపక చెచ్చెర
ననఘుం డత్యుగ్రతర దవానల మధ్యం
బున కరిగి కనియె దీనా
నను మండలితాంగు నొక్క నాగకుమారున్.

అర్థం. అనఘుడు=పాపము లేనివాడు, అత్యుగ్రతరదవానల మధ్యంబునకు = భయంకరమైన కార్చిచ్చు నడిమికి, దీనాననుం = దుఃఖించుచున్న ముఖము కలవానిని, మండలితాంగు = చుట్టలు చుట్టుకొనిన శరీరము కలవానిని.

తా. ఆ యార్తనాదము విని నలుడు సందేహింపక నా కార్చిచ్చు నడిమికి పోయి యచట చుట్టలు చుట్టుకొని దుఃఖించుచున్న నొక్క నాగ కుమారుని చూచెను.

వ. అన్నాగ కుమారుండును నలునకుం గృతాంజలియై యేను గర్కోటకుండనువాఁడఁ గర్మ వశంబున నొక్క బ్రహ్మ ఋషి నుపాలంభించి తచ్ఛాపంబున నెక్కడం గదల నేరకున్నవాఁడ.

అర్థం. కృతాంజలి = నమస్కరించినవాడు, ఉపాలంభించి=వేళాకోళము చేసి.

తా. ఆ నాగకుమారుడు నలునకు నమస్కరించి నా పేరు కర్కోటకుడు, కర్మము చాలక ఒక బ్రహ్మఋషిని వేళాకోళము చేసి యతని శాపము వలన కదలలేక పడియున్నాను.

కం. నాలుగు దిశలను దావ
జ్వాలావలి గవిసె గ్రమ్మంది చానోప మహీ
పాలక నన్నొక సరసీ
కూలముఁ జేరంగ నెత్తికొని పొమ్ము దయన్.

అర్థం. దావజ్వాలావలి=కార్చిచ్చు మంటల మొత్తములు, గ్రమ్మంది = నశించి, సరసీకూలము = చెఱువునొడ్డు.

తా. నాలుగు దిక్కులను కార్చిచ్చు చుట్టి యాక్రమించుచున్నది. దీనిలో కాలి చచ్చిపోలేను. దయతో నన్నొక చెఱువు నొద్దకు నెత్తికొని పొమ్ము.

వ. నన్ను రక్షించిన నీకుం బ్రియంబు సేయ నోపుదుననిన వాని నెత్తికొని పోవంజాలుకనై యంగుష్ఠ ప్రమాణదేహుండై యున్న నెత్తికొని నలుండతి త్వరితగతి నరిగి తాపవర్జితంబైన యొక్క సరోవర సమీపంబున విడువం బోయిన నింకను బది యడుగులరుగుము నీకు శ్రేయఃప్రాప్తిం జేసెద ననిన నడుగు లెన్నికొనుచు నరిగి పది యగు నడుగునప్పు డప్పాముచేత దష్టుండై తన రూపంబు విడిచి వికృత రూపంబుతో నున్న నన్నలునకు గర్కోటకుం డాత్మ రూపంబు సూపి యిట్లనియె నయ్యా: నీవు నాచేత విష పీడితుండ వైతినని దుఃఖింపవలదు. నిన్నొరు లెఱింగిన నెగ్గగుం గావున వికృత శరీరుం జేసితి నెంతకాలంబు నీ శరీరంబున నా విషం బుండు నంతకాలంబును నీకు విషోరగ రాక్షస పిశాచ శత్రు నివహంబు వలని భయంబులేదు. సర్వసంగ్రామ జయంబును భార్యా సంగమంబును నెప్పటి రాజ్య విభవంబును నగు నీ కెప్పుడేని నిజరూపంబు సేకొన నిష్టం బయ్యె నప్పుడ నన్నుం దలంపు మీ వస్త్రంబు నీ యొద్దకు వచ్చు దాని ధరియించుడు నిజరూప ప్రాప్తియగునని వరంబిచ్చి వెండియు నిట్లనియె:

అర్థం. అ అంగుష్ఠ ప్రమాణ దేహుడు = బొటన వేలంత కొలతగల శరీరము గల వాడు, తాపవర్జితము = వేడితేనిది, శ్రేయఃప్రాప్తి = మేలు సమకూరుట, దష్టుడు = కఱువబడినవాడు, ఆత్మరూపము = తన స్వరూపము, సంగ్రామము = యుద్ధము, సంగమము = కలయిక, నిజరూపము = అసలు రూపము, వెండియు = మఱియు.

తా. నన్ను కాపాడిన నీకు మేలు చేయుదునని యా పాము బొటన వ్రేలంత శరీరముతో చులుకనై యుండెను. నలుడు వానిని తీసికొని త్వరగా నొక చల్లని చెఱువునొద్దకు కొనిపోయి విడువబోయెను. అతడింకను పది యడుగులు పొమ్ము నీకు మేలు చేసెదనని చెప్పెను. నలుడు అడుగులు లెక్కించుచుపోయెను. పదియవ యడుగున నా నాగకుమారుడు నలుని

కలిచెను. నలునికి వికార రూపము వచ్చెను. ఆ నాగ కుమారుడు తన రూపము ధరించి, నా పేరు కర్కోటకుడు. నిన్నితరులెఱిగిన కీడు కల్గును కావున నీకిట్టి వికార రూపము వచ్చునట్లు చేసితిని. నా విషము నీ శరీర ముతో నున్నంతకాలము పాములు రాక్షసులు పిశాచములు శత్రువుల వలన నీకు భయముండదు. యుద్ధములన్నింట నీకు జయము కల్గును, నీ భార్యను కలిసికొందువు. నీ రాజ్య సంపదలు నీకు లభించును. నీకు నీ పూర్వ రూపము పొందవలెనన్న నన్ను తలచుకొమ్ము. ఈ వస్త్రము నీ యొద్దకు వచ్చును. దానిని కట్టుకొనగనే నీ పూర్వరూపము నీకు వచ్చును అని వరమిచ్చి మఱియు నిట్లనెను :

మధ్యా. ఇలఁ బ్రసిద్ధుడు ఋతుపర్ణుఁ డనెడు మహీశుంఁ డిక్ష్వాకు
కులజుండు నీకు సేవ్యుండగు నతనిఁ గొలిచి యందుండు
నెంకొని యతనికి నశ్వహృదయమనెడి విద్య యిచ్చి
వెలయ నతనిచేత నక్ష హృదయ మన్విద్యఁ జేకొనుము.

అర్థం. ఇక్ష్వాకు కులజుడు = ఇక్ష్వాకు వంశమున పుట్టినవాడు, సేవ్యుడు = కొలువ దగినవాడు.

తా. ఋతుపర్ణుడను రాజు ప్రసిద్ధుడు. ఆయన యిక్ష్వాకు వంశమున పుట్టిన వాడు. అతని కొలువు చేయుము. నీకు తెలిసిన అశ్వహృదయమను విద్యను అతనికిచ్చి యతనినుండి ''అక్ష హృదయము''ను విద్యను గ్రహించుము.

వ. మఱియు బాహుకుండను నామంబుతో సూతవృత్తి నుండుమని హితోప దేశంబు సేసి కర్కోటకుం డదృశ్యుండైనఁ దద్వచనంబున నలుం డయోధ్యాపురంబునకుంజని ఋతుపర్ణుం గని యేను బాహుకుం డనువాఁడ నశ్వ శిక్షయందుఁ గుశలుండ నన్న సంస్కారంబుల శిల్పంబులఁ బెక్కు విధంబుల రచియింప నేర్తు భవత్సేవార్థినై వచ్చితి నన ఋతుపర్ణుం డిట్లనియె :

అ. సూతవృత్తి=రథములు నడపుట వృత్తిగా, కుశలుడు = నేర్పరి, అన్న సంస్కారంబుల=వంటలు చేయుట యందు, భవచ్ఛేవార్థిని=నీ సేవ కోరినవాడను.

తా. బాహుకుడను పేరుతో రథమును నడపువాడవై వానియొద్ద నుండమని చెప్పి కర్కోటకుడ అంతర్ధానము పొందెను. అతడు చెప్పినట్లు నలు డయోధ్యాపురమునకు పోయి ఋతుపర్ణుని దర్శించి నా పేరు బాహుకుడు, అశ్వములను నేను చక్కగా శిక్షింపగలను. పలు విధములైన వంటలు చేయుదును. శిల్ప విద్య నేర్చితిని. నిన్ను సేవింపగోరి వచ్చితి ననెను. ఋతుపర్ణుడు సంతసించి యిట్లనెను :

నా యొద్దనుండుదేని మ
దీయ రథాశ్వములకును ద్రుతిని శీఘ్రముగాఁ
జేయుము నావుడు నట్టుల
జేయుదునని నలుడు వాని సేవించె దగన్.

అ. ద్రుతిని=వేగమును, శీఘ్రముగా=వేగముగా.

తా. నా యొద్ద నున్నచో నా గుఱ్ఱములకు వేగము పెరుగునట్లుగా చేయు మనెను. నలుడట్లే యని వానియొద్ద నుండెను.

వ. ఇట్లు ఋతుపర్ణు నొద్ద నశ్వాధ్యక్షుండై దుష్టాశ్వంబుల వశంబు జేయుచు నశ్వారోహకుల నారోహణంబున శిక్షించుచు రసవంతంబులుగ నన్న సంస్కారంబులు సేయుచు ఋతుపర్ణు చేత నియుక్తులైన వార్ష్ణేయ జీవలులు తనకు సహాయులుగాఁ బ్రచ్ఛన్నుండై యుండి యొక్కనాడు-

అ. అశ్వాధ్యక్షుడు = గుఱ్ఱములపై పరామరిక చేయువాడు, వశంబు సేయుచు=లోబఱచుకొనుచు, అశ్వారోహకులన్=గుఱ్ఱముల నెక్కువారిని, ఆరోహణంబులం=ఎక్కుట అందు, రసవంతములుగ=రుచిగా నుండు నట్లు, నియుక్తులు= నియోగింపబడినవారు, ప్రచ్ఛన్నుడు=మఱుగు పడినవాడు.

తా. నలుడీ విధముగా ఋతుపర్ణు నొద్ద అశ్వపాలకుడుగా నుండి పొగరుబోతు గుఱ్ఱములను లోబరచుకొనుచు, గుఱ్ఱములనెక్కి స్వారీ చేయుట నేర్పుచు, రుచియగు వంటకములు చేయుచు, వార్ష్ణేయుడు జీవలుడు తనకు తోడుగా నుండ బాహుకుడన్న పేరుతో మరుగువడి యుండెను.

సీ. ఇభరాజ గమన నీ వెందుల కరిగి త
 త్యురుకుచాభోగ యెందున్నదాన
వబల యెవ్వనిచేత నడవులలోఁ బట్టు
 వడితశనాపేక్షఁ బఱచుచున్న
యుగ్ర మృగంబుల యుదరంబులో నున్న
 దానవే నీ తల్లిదండ్రు లొద్ద
ధృతినున్న దానవే దేశాంతరంబుల
 నున్నదానవె యంచు నుదితమదన

ఆ.వె. హతి విమోహితాత్ముఁడై హృదయేశ్వరిఁ
దలచి రాత్రులెల్లఁ దాపమునను
నిద్రలేక వంది నిట్టూర్పులూర్చుచు
నుండె నలుడు శోకముత్కటముగ.

అ. ఇభరాజగమన = మదపు టేనుగు యొక్క నడక వంటి నడకదానా, అత్యురుకుచాభోగ=మిక్కిలి స్థూలమైన స్తనముల యొక్క పరిపూర్ణత గలదానా, అశనాపేక్షన్ = తిండి యందలి కోరికతో, ధృతిన్ = ధైర్యముతో, ఉదిత మదనహతి = పుట్టిన కామబాధచే, విమోహితాత్ముడు=మిక్కిలి మోహము పొందిన మనస్సుగలవాడు. వంది = దుఃఖించి, ఉత్కటముగ=అధికము కాగా.

తా. నలుడు దమయంతిని తలచుకొని ప్రేమవల్ల రాత్రులు నిద్ర పట్టక నిట్టూర్చుచు, దమయంతీ, నీవెక్కడికి పోతివి. ఎక్కడున్నావు. అడవిలో నెవరిచేతిలోనైన పట్టు పడితివా. ఆకలిగొన్న క్రూరమృగములు నిన్ను పొట్టబెట్టుకొనెనా. నీ తల్లి దండ్రులొద్ద పోయితివా. దేశాంతరములకు పోయితివా. అని ప్రలాపించుచు దుఃఖించుచుండెను.

వ. అతని ప్రలాపంబు విని యొక్కనాడు జీవలుండాత్మగతంబున-

అర్థం. ప్రలాపము = దుఃఖవచనములు, ఆత్మగతమున = మనస్సులో, తాత్పర్యము సుగమము.

కం. అఱపొఱడు కుఱుచ చేతులు
నొఱవ శరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథుఁ
నొఱవులబడియెడు నితండు యువతీప్రియుడై.

అర్థం. అఱపొఱడు=పొట్టివాడు, ఒఱవశరీరము=వంకరశరీరము, కొఱగాకుండియు=పనికిరాకుండియు, ఒఱపులు=బాధలు, యువతీప్రియుడు=స్త్రీలకు ప్రియమైనవాడు, లేక స్త్రీలయందు ప్రీతిగలవాడు.

తా. వీడు కుఱుచమానిసి. పొట్టి చేతులు, వంకర దేహము కలిగి చూచుటకు గూడ పనికిరాడు. విరహతాపము పడుచున్నాడు. వీని నెవతె వరించును?

వ. వీనిచేతఁ దలంపంబడియె వనిత వీనికంటె లెస్సదిగాకున్నె. యనుచు బాహుకు నొద్దకు వచ్చి, నీ తలంచుచున్న భార్యకు నీకు నేల వియోగం బయ్యెఁ నని యడిగిన బాహుకుండిట్లనియె:

అర్థం. లెస్సది=మెఱుగైనది, 'వీనికంటె లెస్సది' విపరీతలక్షణ-నన్నయగారి తెనుగుపలుకుబడికి నుదాహార్యము.

తా. వీనిచేత తలచబడు స్త్రీ వీనికంటె నందగత్తె కావచ్చుననుచు జీవలుడు బాహుకునొద్దకు వచ్చి, నీ తలచు భార్యతో నీ కెందుల కెడబాటయ్యెనని యడిగెను. బాహుకు డిట్లనెను :

ఆ.వె. ననుఁ జూచి నగర నలినాక్షి నాకేల
విప్రయోగమేల వినవె తొల్లి
యేలయో యెఱుంగ నేను మందప్రజ్ఞుఁ
డను భటుండుఁ దన లతాంగిఁబాసి.

అర్థం. నలినాక్షి నాకేల=నాకు స్త్రీ యెందులకు, విప్రయోగమేల=ఎడబాటెం దుకు, తన లతాంగిన్=తన భార్యను, మందప్రజ్ఞుడు=మందమతి.

తా. జీవలా! వినుము. నన్నుచూచి లోకులు నవ్వెదరు. నాకు భార్య యెందుకు వియోగమెందుకు. పూర్వము మందప్రజ్ఞుడని యొక భటుడుండెడివాడు. అతడు తన భార్య నెడబాసి-

వ. దాని నన్వేషించి యెందునుంగానక ప్రలాపించినం దత్ప్రలాపంబే ననుక రించితినని(జెప్పి యిట్లయోధ్యాపురంబున బాహుకనామం(బుతో నలుడుండె. నంత నిట విదర్భేశ్వరుండు నలు రాజ్యభ్రంశంబు విని కూ(తురు నల్లుండు నెటవోయిరో యెందున్న వారోయనిశోకించి- 138

అర్థం. రాజ్యభ్రంశము=రాజ్యమునుండి తొలగుట.

తా. అతడు దానిని వెదకి యామె కానరాకపోవుటచే దుఃఖించెను. వాని దుఃఖపు మాటలను నేననుకరించితినని బాహుకుడు క్రమ్మరలగా చెప్పెను. ఇక్కడ విదర్భలో భీముడు నలుని రాజ్యము పోవుట విని విచారించి-

వి. నలుడు సత్యవాది. ఇచట మందప్రజ్ఞుడన్నమాట అర్థవంతముగను, పేరుగనుకూడ వాడినాడు. అది పేరుగా తీసుకొన్నప్పుడు ఎవరి కథయో యన్నట్లుండును. విశేషణముగా తనకే యన్వయించును. నలుడంత బుద్ధిమంతుడు గదా మందమతి యెట్లగునన్నచో తనంతటతానే భార్యను వీడి తరువాత నామెకై దుఃఖించుట మందమతి లక్షణము కాదా!

కం. వారలరోయ(గ( బంచెన
పారబలుండిష్టులైన బ్రాహ్మణుల సదా
చారుల విద్వాంసుల స
త్కారం(బుల దనిపి వారి( గడు నెయ్యమునన్.

అర్థం. రోయ(గ(బంచె=వెదకుటకు పంపెను, అపారబలుడు=అమితమైన బలము గలవాడు, సదాచారుడు = మంచి యాచారము గలవాడు, సత్కారము=గౌరవము, పూజ.

తా. వారిని వెదకుటకు తనకు హితులైన బ్రాహ్మణులను ఆచారము పాండిత్యము కలవారిని పూజలతో తృప్తులనుజేసి పంపించెను.

వ. మఱియు నలదమయంతులున్న చోటెఱింగి వచ్చిన వారికి వేయి గద్యాణంబు లిత్తుననియు, వారలందోడ్కొని వచ్చిన వారికి గోసహస్రంబ్రగహారంబు లిత్తుననియుఁ బల్కి పంచిన-

అర్థం. గద్యాణములు=బంగరు నాణెములు.

తా. నలదమయంతుల తెలిసికొని వచ్చిన వారికి వేయి బంగరు నాణెములిత్తును, వారిని తీసికొని వచ్చిన వారికి వేయి గోవుల తోడి యగ్రహారములిత్తునని చెప్పి పంపెను.

కం. జగతీ చక్రమునం గల
నగర మహాగ్రామ పక్కణంబులు కలయన్
జగతీ దేవోత్తము లి
మ్ముగ రోసిరి నిఖిల దేశములకరిగి వడిన్.

అర్థం. జగతీచక్రము=భూమండలము, పక్కణము=కిరాతుల పల్లె, జగతీ దేవోత్తములు=బ్రాహ్మణశ్రేష్ఠులు, నిఖిల దేశములు=ఎల్ల దేశములు.

తా. బ్రాహ్మణులు బయలుదేరి భూమండలము నందున్న నగరములు, గ్రామములు, బోయపల్లెలు అన్నియు దేశ దేశములకేగి వెదకిరి.

వ. అందు సుదేవుం డను బ్రాహ్మణుండు చేది పతియైన సుబాహు పురంబునకుం జని పుణ్యాహంబు సేయింపం బోవు బ్రాహ్మణులతో రాజ గృహంబు సొచ్చి యంతఃపురంబున సునందాసహితయై యున్న దాని ధూమజాల నిబద్ధంబైన యగ్ని ప్రభయుంబోలె నీ లాభ్ర సంవృతంబైన చంద్రరేఖయుంబోలె బహుపంక నిమగ్నంబైన మృణాళియుంబోలె నేర్పడకున్ననుందదీయ భ్రూయుగ మధ్య గతంబైన సూక్ష్మ లక్షణంబిమ్ముగా నిరీక్షించి దాని దమయంతిఁగా నెఱింగి యాత్మ గతంబున నిది పతి విముక్తయై శుష్క ప్రవాహయైన నదియుంబోలె శూన్య కమలయైన

నళినియుంబోలె నపేతచూతంబైన వసంబునుంబోలె నొప్పకుండియుఁ దన పతివ్రతా గుణంబున నొప్పుచున్న యది.

అర్థం. పుణ్యాహము = శుద్ధ కర్మ, ధూమజాలనిబద్ధము = పొగ మొత్తముచేత నడ్డగింపబడినది, నీలాభ్ర సంవృతము = నల్లని మేఘములచేత కప్పబడినది, బహుపంక నిమగ్నము = అధికమైన బురదయందు మునిగినది, తామర, తదీయభ్రూయుగ మధ్యగతము = ఆమెయొక్క కనుబొమ్మల జంట మధ్య నున్నట్టిది, పతి విముక్త = భర్తచే విడువబడినది, శుష్క ప్రవాహ = ఎండిన ప్రవాహముగలది, శూన్యకమల = పద్మములు లేనట్టి, నళిని = తామర తీవ, అపేతచూతము = మావిచెట్లు లేనట్టిది.

తా. ఆ బ్రాహ్మణులలో సుదేవుడన్నవాడు చేది పట్టణమునకు పోయి పుణ్యాహ వాచనమునకై రాజ గృహంబునకు పోవు బ్రాహ్మణులతో రాజ గృహము ప్రవేశించి యంతఃపురమున దమయంతిని చూచి గుర్తించెను. ఆమె కనుబొమలమధ్య నొక పుణ్య లక్షణము గలదు. దానిని జాగరూకముగా పరిశీలించి సుదేవుడామె దమయంతి యని కనిపెట్టకల్గెను. దమయంతి పతి విరహిత యగుట వలన బాగుగా వాడి ప్రకాశహీనముగా నున్నను ఆమె యందు పతివ్రతా లక్షణములు ప్రకాశించుచుండెను. సుదేవుడు వానిని చూచి మనసులోని ట్లనుకొనెను-

తే.గీ. అనపహార్యంబు తేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియఁ బరమమైన
భూషణంబిట్టివే పెఱ భూషణములు.

అర్థం. అనపహార్యము = అపహరించరానిది, తేజోమయము = కాంతితో నిండినది, అలంకారము = ఆభరణము, గురుతరము = మిక్కిలి బరువైనది, పరమము = ఉత్తమము.

తా. స్త్రీలకు పతిభక్తి ఉత్తమ భూషణము, దీనిని దొంగలెత్తికొనిపోలేరు. దీని కాంతి మాసిపోదు. ఇది యన్ని గుణములకు నలంకారము, ఇది

సర్వగుణములకంటె నెక్కువ జరుపైనది. తక్కిన యెల్ల గుణములు దీనితో సాటిగావు. ఇది సర్వాభరణములకు నుత్తమమైనది.

వి. చక్కని సూక్తి.

వ. రోహిణికిఁ జంద్ర సమాగమంబుమంబోలె దీనికి భర్తృ సమాగమం బెన్నండయ్యెడునో తుల్యశీల వయో రూపాభిజాత్యలైన నల దమయంతు లొక్కటనుండం జూచి విదర్భేశ్వరుం డెన్నఁడు కృతార్థుండయ్యెడునో యంచు నల్ల నల్లన దమయంతి కిట్లనియె:

అర్థం. తుల్యశీల వయో రూపాభిజాత్యలు = సమానమైన నడవడి వయస్సు సౌందర్యము కులము గలవారు.

తా. ఈ దమయంతి భర్తతో నెప్పుడు కలియగలదో. సర్వగుణములు నొకరి కొకరు తగియున్న నల దమయంతులు కలిసియుండగా చూచి మా రాజెప్పుడు సంతసించునో యనుకొనుచు మెల్లగా దమయంతితో నిట్లనెను.

తే. అవ్వ నీ తల్లిదండ్రుల కాత్మజులకు
బంధుజనులకుఁ గుశలంబు భామ నీదు
కుశల మెఱుఁగునంతకు వంతగూరి వగచు
చున్నవారు వారికి వంత యుడుగునింక.

అర్థం. ఆత్మజులకు=పిల్లలకు, వంత=దుఃఖము.

తా. అమ్మా నీ తల్లిదండ్రులకు, నీ పిల్లలకు, బంధువులకు కుశలమే. నీ కుశల మెఱుగక వారు దుఃఖించుచున్నారు. ఇంక వారి చింత తీరగలదు.

వ. దేవి యేను భవద్భ్రాతృసఖుండ సుదేవుండను బ్రాహ్మణుండ విదర్భేశ్వ రుండు నీ యున్నచోటె ఱుంగం బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నిందులకు వచ్చి నా పుణ్యంబున నిన్నుం గంటి ననిన దమయంతి వాని నెఱింగి తన పుత్రులఁ దల్లిదండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి

యశ్రుజలంబు లురుల నేడ్చుచున్నం జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్నయది యని సునంద తన జననికిం జెప్పి పుచ్చిన-

అర్థం. భవద్భ్రాతృసఖుడ = నీ తమ్ముని స్నేహితుడను, అశ్రుజలములు = కన్నీళ్ళు, ఉరుల = కారగా.

తా. అమ్మా, నేను నీ తమ్ముని స్నేహితుడను. నా పేరు సుదేవుడు. నీతండ్రి నిన్ను వెదుకుటకు పలువురు బ్రాహ్మణులను పంపెను. వారిలో నే నిచ్చటకు వచ్చి నా పుణ్యఫలమున నిన్ను జూచితిననెను. దమయంతి వానిని గుర్తించి తన పుత్రులను తల్లిదండ్రులను బంధువుల నొక్కొక్కరి నడిగి కంటివెంట బాష్పములు రాల నేడ్చుచుండెను. సునంద యది చూచి తన తల్లికి కబురంపెను.

క. చనుదెంచె నంతిపురమున
వనితానివహంబుతోడ వారిజదళలో
చన రాజమాత నృపనం
దన యగు దమయంతి కడకు దద్దయు వేడ్కన్.

అర్థం. వనితానివహము = స్త్రీ సమూహము, వారిజదళలోచన = తామర పూ రేకుల వంటి నేత్రములు గలది, దద్ద = మిక్కిలి.

తా. రాజమాత పెక్కుఱు స్త్రీలతో కూడి యంతఃపురమున దమయంతి యొద్దకు వచ్చెను.

వ. ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణుని దమయంతిం జూచి రాజమాత బ్రాహ్మణుని కిట్లనియె నయ్యా యిది యెవ్వని కూఁతు రెవ్వని భార్య యేమి కారణంబునం దన భర్తను బాంధవులనుం బాసి పుణ్యవ్రతంబులు సలుపుచున్నయది నీవెట్లెఱిఁగి తిక్కోమలి నామం బేమి యని యడిగిన సుదేవుండిట్లనియె:

అర్థం. సుగమము.

తా. రాజమాత యా బ్రాహ్మణుని దమయంతి సంగతి సందర్భముల గుఱించి యడిగెను. ఆమెనెట్లు తెలిసికొంటివని యడిగెను.

మధ్యా. నలినాక్షి యిది విదర్భేశు తనయ పుణ్యశ్లోకుఁడైన
నలుదేవి దమయంతి సుమ్ము విధికారణంబున రాజ్య
చలితుఁడై నిజనాథుడరిగినఁ దోసచనియె నన్వార్త
వెలయంగ విని వీరి రోయఁ బంచె భూవిభుడు బ్రాహ్మణుల.

అర్థం. రాజ్య చలితుడు=రాజ్యమునుండి తొలగింపబడినవాడు, తోన=వెంట, భూవిభుడు=రాజైన భీముడు.

తా. అమ్మా, యీామె విదర్భరాజు కూతురు, నలుని భార్య. విధి బలమున నలుని రాజ్యము పోయెను. ఈమె భర్తతో కూడ పురము వెడలి పోయె నన్న వార్త విని మా రాజు వీరిని వెదకుటకు బ్రాహ్మణుల పంపెను.

వ. ఏనిందులకు వచ్చి మీచేత సురక్షితయై యున్న యిక్కోమలిం జూచి దీని భ్రూ మధ్యంబునం బద్మ ప్రభంబై విభూత్యర్థంబుగా విధాతృ నిర్మింతంబైన పుణ్య లక్ష్మంబు పాంసు పటలచ్ఛన్నంబై యున్న నుప లక్షించి మా రాజపుత్రిఁగా నెఱింగితి ననిన సునంద శుద్ధోదకంబుల దాని భ్రూ మధ్యంబు గడిగిన నది విస్పష్టంబగుడు నందఱు నాశ్చర్యం బంది రంత-

అర్థం. సురక్షిత = బాగుగా రక్షింపబడినది, పద్మ ప్రభము = పద్మము యొక్క కాంతివంటి కాంతిగలది., విభూత్యర్థము=ఐశ్వర్య కారణము, లక్ష్మి ప్రదము, విధాతృ నిర్మితము = బ్రహ్మచేత నిర్మింపబడినది. పుణ్యలక్ష్మము=శుభ చిహ్నము, పాంసుపటలచ్ఛన్నము=దుమ్ముచేత కప్పబడినది, ఉపలక్షించి = చూచి, శుద్ధోదకములు = మంచినీళ్ళు, విస్పష్టము=తెల్లము, బాగుగా తెలిసినది.

తా. నేనిక్కడకు వచ్చి మీ యింట భద్రముగానున్న యీామెను చూచి యీామె కనుబొమ్మల నడుమ పద్మము వంటి లక్ష్మిప్రదమైన శుభ చిహ్నమును

దుమ్ముతో కప్పబడియున్నను కనిపెట్టి మా రాజపుత్రి యని గుర్తించితి ననెను. సునంద మంచినీటితో నామె భ్రూమధ్యము కడిగించెను. అప్పుడా శుభ చిహ్నము నందఱికిని స్పష్టముగా కన్పించెను.

సీ. ఆనంద భరితాత్మయై రాజమాత య
 క్కమలాక్షి ప్రీతితోఁ గౌఁగిలించి
కొని తల్లి నీవు నా కూఁతురవేను నీ
 జననియుఁ బేర్మి దశార్ణరాజ
తనయల మదియు విదర్భేశు సతియయ్యె
 నే వీరబాహు న కింతినైతి
ననిన నా యవ్వతు సతి వినయంబుతో
 నలుదేవి మ్రొక్కి సునంద నెత్తి

ఆ.వె. కొని కరంబు నెమ్మిఁ గొన్ని దినంబులం
దుండి యిట్టులనియె నొక్కనాఁడు
దేవి యిదియు నదియు ధృతినాఁకుఁ బుట్టిన
యిండ్ల కడు సుఖంబ యుందునందు.

అర్థం. ఆనంద భరితాత్మ = ఆనందముతో నిండిన మనస్సుగలది. కమలాక్షి = కమలముల వంటి నేత్రములు గలది, సతి = భార్య, ఇంతి = భార్య, నెమ్మిన్ = ప్రేమతో.

తా. రాజమాత హృదయ మానందముతో నిండిపోయెను. ఆమె దమయంతిని కౌగలించుకొని, అమ్మా, నీవు నా కూతురవే. మీ యమ్మయు నేను నప్పసెల్లెండ్రము. దశార్ణ రాజు కూతులము. నేను వీరబాహునకు భార్యనైతిని. ఆమె విదర్భ రాజునకు భార్య యయ్యె ననెను. దమయంతి ఆమెకు నమస్కరించి సునంద నెత్తుకొని, కొన్ని దినము లచ్చట నుండి నొకనాడు ఆమెతో అమ్మా, నాకు నిదియు నదియు పుట్టినిండ్లే. ఇచ్చట నున్న నచ్చట నున్న నాకు సుఖమే.

వ. అయినను దల్లిదండ్రుల ననుజుల నాత్మజులం జూడ వేడుకయైనది. విదర్భకుం బోయెద నాన తిమ్మని కృతాంజలి యైన దమయంతి నతి స్నేహంబున సుబాహు జనని సుతప్రేషిత బలంబుతో సువర్ణ మణిమయ విమానోపయానంబున నునిచి పుచ్చిన.

అర్థం. అనుజులను=తమ్ములను, ఆత్మజులను = బిడ్డలను, కృతాంజలి = నమస్కరించినది, సుతప్రేషిత బలము = కొడుకు పంపిన సైన్యము, సువర్ణమణి మయ విమానోపమాన యానమున = బంగారముతోనూ మణులతోనూ నిర్మించిన విమానమువంటి బండిమీద, ఉనిచి=ఎక్కించి, పుచ్చిన=పంపించిన

తా. అయినను తల్లి దండ్రులను తమ్ములను బిడ్డలను చూడ గోరుచుంటిని. విదర్భకు పోయెదను. అనుజ్ఞ యిమ్మని యడిగెను. రాజమాత యామెను వైభవోపేతమైన రథము నెక్కించి సైనికుల రక్షణముతో విదర్భకు పంపెను.

ఉ. భామ విదర్భ కేఁగి తన బంధు జనంబుల యొద్ద నుండియుం
గోమలి దేహ సౌఖ్యములకున్ వెలియై మలినార్ధ వస్త్రమున్
భూమి రజంబు నంగమునఁ బొల్పగు చుండఁగ నుండె జీవిత
స్వామి నిజేశుఁ జూచు దివసంబుల కోరుచు సువ్రతంబుతోన్.

అర్థం. అంగమున=శరీరము నందు, నిజేశుడు=భర్త, దివసము=దినము.

తా. దమయంతి పుట్టినింటి కేగి యున్నను దేహ శౌచము విడిచి పూర్వపు మలిన వస్త్రఖండము తాల్చి దుమ్ము కొట్టుకొన్న శరీరముతో భర్తను కలిసికొనుట కెదురు చూచుచు నియమములు పాటించుచు దినములు గడపు చుండెను.

వ. ఇట్లు భర్తృ వియోగాతుర యై దమయంతి ప్రాణంబు భరియింపనోపక యొక్కనాఁ డేకాంతంబునఁ దన జనని కిట్లనియె.

అర్థం. భర్తృ వియోగాతుర = పతి యెడబాటు చేత నాపద పొందినది, ఏకాంతమున=రహస్యము.

తా. ఒకనాడు ఎడబాటు నోర్వజాలక దమయంతి తన తల్లితో నిట్లనెను.

కం. శోకాపనోదిఁ బుణ్య
శ్లోకుని నలు రోయఁ బనుపు శుభచరితుఁ దదా
లోకనవిహీననై పర
లోక కృతావాసన గూరు లోకం బెఱుఁగన్.

అర్థం. శోకాపనోది = దుఃఖమును తొలగించువాడు, తదాలోకన విహీన = అతని దర్శనము పొందనట్టిది, పరలోక కృతావాస = మరణించినది.

తా. నలుని చూచినగాని నా దుఃఖము తీరదు. అతని వెదకుటకు మనుష్యులను పంపుము. అతనిని దర్శింపకున్న నేను మరణింతు ననెను.

వ. అనిన నదియును గూఁతు నభిప్రాయంబు భీమున కెఱింగించిన నాతండు నలు మార్గణంబున ఋజు మార్గులయిన బ్రాహ్మణుల నియోగించినం దన పతి నన్వేషింప నరుగు బ్రాహ్మణులకు దమయంతి యిట్లనియె:

అర్థం. మార్గణము=వెదకుట, ఋజుమార్గుఉ = తిన్ననైన నడవడి గలవారు.

తా. ఆమె కూతురు చెప్పిన మాటలు భీమునకు చెప్పెను. ఆతడు నలుని వెదకుటకు యోగ్యులైన బ్రాహ్మణులను నియమించెను. వారితో దమయంతి యిట్లు చెప్పెను :

ఆ. నైషధేశ్వరుండు నలు డిప్పు డసమర్థుఁ
డగుటఁ జేసి తన్ను నన్యులెఱుఁగ
కుండనుండుఁగాన నురు సభాంతరముల
కరిగి యరిగి యిట్టులనుడు మీరు.

అర్థం. ఉరు సభాంతరములకు = పెద్ద సభలలోనికి.

తా. నలుడిప్పుడు శక్తిమంతుడు కానందువలన మఱుగువడి యుండును. వానిని తెలిసికొనుటకు మీరు రాజ సభలలోనికిపోయి ఇట్లు మాట్లాడుడు.

సీ. సత్యనిత్యుండవు సతి నిట్లు వంచించి
దాని వస్త్రార్థంబు దఱిగి నీకుఁ
బరిధానముగఁ జేసి పాడియే పోవంగ?
భార్య భర్తవ్యనాఁబరఁగు ధర్మ
మది మిథ్యయయ్యె నీయందు నీకిట్టి ని
ర్దయ బుద్ధిఁ జేకొనఁదగునె? యట్టి
సాధ్వికిఁగడుంఁ బ్రసన్నుండ వగుమని
యెల్లచోఁ బలికినఁ నెవ్వఁడేనిఁ

ఆ. బలుకు వడఁగ నోడి ప్రతివచనంబిచ్చు
నతఁడు నలుఁడుగాఁ బ్రియంబు తోడ
నెఱిగిఁ నన్ను నతనికెఱిగించి తోడ్కొని
రండు రానినాఁడు రండెఱింగి.

అర్థం. సత్యనిత్యుడవు=సత్యవ్రతుడవు, పరిధానము = కట్టుబట్ట, పాడియే పోవంగ=పోవుట ధర్మమా, భర్తవ్య=భరింపదగినది, మిథ్యయయ్యె=అసత్యమయ్యెను, సాధ్వి = పతివ్రత, ప్రసన్నుడు = సుముఖుడు, పలుకువడగన్=మాటపడుటకు, అపకీర్తికి, జెడి=భయపడి, ప్రతివచనము=సమాధానము.

తా. నీవు సత్యవ్రతుడవు. ఆమెను మోసగించి యామె చీరలో సగము చించి కట్టుకొని వదలిపోవుట ధర్మమా? భార్య యనగా భరింపబడునది. భర్త యనగా భరించువాడు. ఆ ధర్మము నీయందు లోపించినది. ఆ పతివ్రతకు సుముఖుడవు కమ్మని పల్కుడు. ఎవడైన సమాధానము చెప్పిన నతడు నలుడని గ్రహించి నన్నతనికెఱిగించి వానిని తీసికొనిరండు. అతడు రాకున్నచో వాని సంగతి యంతయు తెలిసికొనిరండు అని పంపెను.

వ. అని పంచినం బని పూని బ్రాహ్మణులు దమయంతి కఱపిన పలుకు లెల్ల సభలం బలికి యెందునుం గానక వచ్చిరందుఁ బర్ణాదుండను బ్రాహ్మణుండు దమయంతి కిట్లనియె, నే నయోధ్య కరిగి నీ కఱపిన పలుకులెల్ల ఋతుపర్ణు సభఁబలికిన నొక్క పురుషుండు కుఱుచ చేతుల వాడు

ఋతుపర్ణు నొద్ద నూఱు గద్యాణంబులు జీవితంబు వాఁడు శీఘ్రయాన కుశలుండు సూదక్రియా నిపుణుండు విరూపాంగుండు బాహుకుండను నశ్వశిక్షకుండు విని నన్ను నేకతంబు కనుంగొని వెల వెల నగుచు దీర్ఘ నిశ్వాసపురస్సరుండై యిట్లనియె.

**అర్థం.** కఱపిన = నేర్పిన, నూఱు గద్యాణంబులు = నూఱు సువర్ణములు, జీవితము = జీతము, శీఘ్రయాన కుశలుడు = త్వరగా ప్రయాణము చేయుటలో నిపుణుడు, సూదక్రియా నిపుణుడు = వంట చేయుటయందు నేర్పరి, విరూపాంగుడు = కురూపి, దీర్ఘనిశ్వాస పురస్సరుడు = మొదల పెద్ద నిట్టూర్పు పుచ్చినవాడు.

**తా.** బ్రాహ్మణులు దేశ దేశములకు పోయి దమయంతి చెప్పిన మాటలు సభలలో పలికి సమాధానము పొందక తిరిగి వచ్చిరి. వారిలో నొకడు పర్ణాదుడను వాడు వచ్చి దమయంతితో నిట్లనెను: అయోధ్యా పట్టణములో ఋతుపర్ణు సభలో నీవు చెప్పినట్లు పలికితిని. అచ్చట నొక కురూపి యైన పురుషుడు రథచోదకుడుగను వంటలవాడుగను నున్నాడు. వాని పేరు బాహుకుడు. అతడు నన్నొంటరిగా కలుసుకొని పెద్ద నిట్టూర్పు పుచ్చి యిట్లు సమాధానము చెప్పెను.

**వి.** సంస్కృతములో నీ పట్టున బాహుకుని జీతము చెప్పబడి యుండలేదు. బాహుకుడు ఋతుపర్ణుని వద్ద చేరినపుడు మాత్రము వేతనము చెప్పబడినది. ''వేతనంతే శతం శత''యని. దీనికి శతం శత - శతాని మాసికం వేతనమ్ దశ సహస్రమ్ సువర్ణా ఇత్యర్థః, అని నీలకంఠీయ వ్యాఖ్య. నన్నయగారీ వేతన ప్రమాణమును దానిని చెప్పిన స్థలమును కూడ మార్చెను. మఱియును నీ సందర్భమున పర్ణాదునితో బాహుకుడు చెప్పిన మాటలు వేరుగా నున్నవి. నన్నయ గారు దానినంతయు తొలగించి నీ క్రింది యాట వెలదిని వ్రాసెను. సంస్కృతమూలమునందున్న బాహుకుని మాటలతడు స్పష్టముగా నలుడే యని పట్టి యిచ్చునట్లున్నవి. అతడేడ్చుచు చెప్పినట్లున్నవి. సంస్కృత భారత రీతినిబట్టి దమయంతి మఱల నలునెఱింగి వచ్చుటకు సుదేవుని పంపవలసిన పనిలేదు. నన్నయ

గారు మూలమును వదలి నిచ్చట వేఱుగా వ్రాయుట మిక్కిలి యుచిత
ముగా నున్నది. మూలమునందలి నలుని రోదనము తొలగించి నన్నయ
గారు 'అతడు నగుచు' చెప్పెనని వాని నలక్ష్యమును సంవృతముజేసినాడు
నన్నయగారి పరమౌచిత్యజ్ఞానమున కిది యుదాహార్యము.

ఆ. పురుషునందు దోష పుంజంబు గలిగిన
నెఱిగి యెద సహించునేని భార్య
పురుషునంపభీష్టభోగంబు దేహాంత
రంబునందు ధర్మరతియుఁ బడయు.

అర్థం. దోషపుంజము=తప్పుల సమూహము, అభీష్టభోగము=కోరినభోగము,
దేహాంతరమునందు=తరువాతి జన్మములో, ధర్మరతి=ధర్మమునందు
తగులము.

తా. భర్తయందు తప్పులున్నను వానిని సహించిన భార్య యనంతర జన్మమున
భర్తవలన సుఖభోగము లనుభవించును. ధర్మనిష్ఠ గలిగియుండును.

వ. అని యొండెద్దియుఁ బలుకక తన నివాసంబునకుం బోయెనని చెప్పిన విని
పెద్దయుం బ్రొద్దు చింతించి నలుండుగానివాఁడు ప్రతివచనంబేల యిచ్చు
నింకను వలనుగల వారలంబంచి యాతని నిమ్ముగా నెఱుంగ వలయునని
నిజ జనని యనుమతంబున సుదేవు రావించి వానికిట్లనియె:

అర్థం. ఒండెద్దియు=వేఱేమియు, పెద్దయుంబ్రొద్దు=చాలకాలము, ప్రతి
వచనము=సమాధానము, వలనుగలవారు = ఉపాయముగలవారు,
సమర్థులు, ఇమ్ముగా=లెస్సగా.

తా. ఇట్లు చెప్పి వేఱేమియు పలుకక యితడు తన యింటికి పోయెను అని
చెప్పెను. ఆ మాటలు విని దమయంతి నలుడుగాకున్న సమాధాన మేల
చెప్పునని యింకను పరీక్షింపవలయునని తల్లితో చెప్పి సుదేవుని
పిలిపించి యతనితో నిట్లనెను:

క. నన్నెఱిగి తెచ్చినట్ల జ
గన్నుతు నలు నెఱిఁగి తెమ్ము కౌశలమున వి
ద్వన్నాథ సర్వగుణ సం
పన్నుండవు నీవ బుద్ధిఁ బరికింపంగన్.

అర్థం. జగన్నుతు=లోకముచే స్తుతింపబడిన వానిని, పరికింపంగన్=చూడగా.

తా. నన్ను గుర్తించి తెచ్చినట్లు నలుని కూడ గుర్తించి తీసుకొనిరమ్ము. నీవు గుణవంతుడవు. నీవు పండితుడవు.

క. అరుగుమయోధ్యకు దేశాం
తర విప్రుఁడవై రవిప్రతాపోన్నతు ను
త్తర కోసలేశు భాంగా
సరినింగను మనఘు నమరసము ఋతుపర్ణున్.

అర్థం. రవిప్రతాపోన్నతుడు = రవి యొక్క ప్రతాపము వంటి ప్రతాపముచే గొప్పవాడు, దేశాంతరవిప్రుడు=పరదేశి బ్రాహ్మణుడు, భాంగాసరి= భాంగాసరుని కుమారుడు, ఋతుపర్ణుడు. సంస్కృత భారతమున భాంగాసురి యని గలదు.)

తా. పరదేశి బ్రాహ్మణుడవై యయోధ్యకు పొమ్ము. అచ్చట ఋతుపర్ణుని దర్శింపుము.

వ. మఱి విదర్భావిభుండగు భీముండు నలు రోయంబంచి యెందునుంగానక యింకను దమయంతికిఁ బునస్స్వయంవరంబు రచియింపబోయిన నందు లకు భూవలయంబునంగల రాజు లెల్లను బోయెదరని యతి త్వరితంబుగా ఋతుపర్ణునకుం జెప్పుమని పంచిన సుదేవుం డయోధ్యానగరంబునకుం బోయి ఋతుపర్ణుంగాంచి విదర్భాపురంబున దమయంతీ ద్వితీయ స్వయంవరం బెల్లియె యయ్యెడునని చెప్పిన విని ఋతుపర్ణుండు బాహుకుం జూచి నాకు దమయంతీ స్వయంవరంబుఁ జూడ నొక్క నాఁటన విదర్భకుం బోవలయు నీ యశ్వనైపుణ్యంబుఁ బ్రకాశింపుమనిన నట్ల చేయుదునని నలుండు దన మనంబున దుఃఖించి-

అర్థం. పునస్స్వయంవరము = రెండవ స్వయంవరము, ఎల్లియె = రేపే.

తా. విదర్భ రాజైన భీముడు నలుని వెదకించి కనుగొనలేక దమయంతికి రెండవ స్వయంవరము ప్రకటించెననియు, దానికి భూమియందుగల రాజు లెల్లరు పోవుచుండిరనియు ఋతుపర్ణునకు చెప్పుమని పంపించెను. సుదేవు డయోధ్యానగరమునకు పోయి ఋతుపర్ణుని చూచి యట్లే చెప్పెను. ఋతుపర్ణుడు బాహుకుని పిలిచి, నేను దమయంతీ స్వయంవరమునకు నొక్క దినములో పోవలయును. నీ యశ్వ విద్య చూపింపు మనిన నలుడట్లేయని మనసులో దుఃఖించెను.

ఆ. అడవిఁ దన్నుఁబాసి యరిగిన నలిగి కా
కున్నె యిట్లు సేయ నువిద గడఁగె
నెట్లయేనిఁ గూర్తు రింతులు మాకని
విశ్వసించువారు వెడఁగు లెందు.

అర్థం. ఉవిద = స్త్రీ, కూర్తురు = ఇష్టము సేయుదురు, వెడగులు = పిచ్చివారు.

తా. దమయంతి తన్నడవిలో వదలి పోయితినని కోపముతో నీ పని చేయు చున్నది. స్త్రీలు తమకు ప్రియము చేయుదురని నమ్మువారు పిచ్చివారు.

ఆ. సాధ్వి నాకుఁ గూర్చు సంతతి గలయది
చెలువ యిట్టులేల చేయునైన
నెఱుగవలయు దీని నే ఋతుపర్ణుతోఁ
బోదు నని నలుండు బుద్ధిఁదలఁచి.

అర్థం. సాధ్వి = పతివ్రత, నాకుఁగూర్చు = నాకు ప్రియము చేయును, సంతతి గలయది = సంతానము కలది.

తా. దమయంతి పతివ్రత. నాకు ప్రియము చేయునది. సంతానము గలది. మరల పెండ్లి యేల చేసికొనును? అయినను దీనిని తెలిసికొనవలెను. నేను ఋతుపర్ణునితో పోదునని నలుడనుకొని.

వ. తొల్లి వార్ష్ణేయుండు దెచ్చిన తన రథంబు నందు నిజ హయంబుల నాలక్ష్యమాణ శుభలక్షణంబులు మనోవాయు వేగంబులునైనవానిం బూన్చికొని వచ్చిన ఋతుపర్ణుండా రథం బెక్కునప్పుడు హయంబులు మ్రొగ్గినం జూచి యిప్పేద గుఱ్ఱంబు లతిదూరంబెట్లు పోవనోపు నొండు గుఱ్ఱంబులం బూన్పుమనిన బాహుకుం డిట్లనియె:

అర్థం. నిజహయములు = తన యొక్క గుఱ్ఱములు, ఆలక్ష్యమాణ శుభ లక్షణములు = కనిపించుచున్న శుభ లక్షణంబులు గలవి, మనోవాయు వేగములు = మనస్సు యొక్కయు వాయువు యొక్కయు వేగముల వంటి వేగములు కలవి, మ్రొగ్గిన = వ్రాలిన, పేద గుఱ్ఱములు = బలహీనములైన గుఱ్ఱములు.

తా. పూర్వము వార్ష్ణేయుడు తీసికొని వచ్చిన తన రథమును గుఱ్ఱములను పూన్చుకొని తెచ్చెను. ఆ గుఱ్ఱములు మంచి శుభ లక్షణములు గలవి. ఆ రథమును ఋతుపర్ణు డెక్కినప్పుడా గుఱ్ఱములు క్రింద పడిపోయెను. ఋతుపర్ణుడు నలునితో నీ చిక్కిపోయిన గుఱ్ఱము లంత దూరమెట్లు పోగలవని వీనిని తెచ్చితివి? వేఱే బలమైన గుఱ్ఱములు తెమ్మనెను.

వి. నన్నయగారు గుఱ్ఱముల విషయమున చేసిన మార్పు పూర్వము చెప్పితిని. వ్యాస భారతమునందు వలె వార్ష్ణేయుడు రథమును గుఱ్ఱములను విదర్భలో వదలి పెట్టిన యెడల నిప్పుడు ఋతుపర్ణుని శాలలో శుభ లక్షణములు గల గుఱ్ఱములను నలుడెంచుకొనుటలో కాలము వ్యర్థమగును. అట్టి గుఱ్ఱము లచ్చట లభింపకుండి యుండవచ్చును. కావున నీ మార్పు పరమోచితముగా నున్నది.

క. అవనీశ యీ హయంబులు
పవనగతిం బఱచుఁ బ్రొద్దువడకుండఁగ నేఁ
డ విదర్భకు ననవుడు విని
కువలయపతి మెచ్చి బాహుకున కిట్లనియెన్.

అర్థం. పవనగతిన్ = వాయు వేగముతో, ప్రొద్దు వడకుండగా = ప్రొద్దు క్రుంకకుండగా, అనవుడు = అనగా, కువలయపతి = రాజైన ఋతుపర్ణుడు.

తా. రాజా, యీ గుఱ్ఱములు వాయు వేగముతో పరిగెత్తును. ప్రొద్దు క్రుంకక ముందే మనలను విదర్భకు కొనిపోగలవు. రాజా మాటలకు మెచ్చి బాహుకునితో నిట్లనెను:

వ. అట్లయిన నీ హయతత్త్వ కౌశలం బెఱింగి నీకు నభిమతం బొనరింతు నని రథం బెక్కి బాహుక వార్ష్ణేయ సహితుండై యరుగువాఁడు.

అర్థం. హయతత్త్వ కౌశలము = గుఱ్ఱముల సార మెఱుగుటలోని నేర్పు, అభిమతము = ఇష్టము.

తా. అయినచో నీ యశ్వ విద్య తెలిసికొని నీ యిష్టము సేయుదునని ఋతుపర్ణుడు రథమెక్కి బాహుక వార్ష్ణేయులతో కూడి పోవుచు.

మధ్యా. ఎదురను దవ్వులఁ జూచిన పొడవు లెల్లఁ దత్క్షణము
కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద
నిది దినేశ్వరు రథమో యనూరుఁడో యితఁడంచు నపుడు
హృదయమునను గడు విస్మయంబందె నిక్ష్వాకు కులుఁడు.

అర్థం. దవ్వుల = దూరమున, పిఱుదన్ = వెనుక, దినేశ్వరు రథము = సూర్యుని రథము, అనూరుడు = సూర్య సారథి, ఇక్ష్వాకు కులుడు = ఋతుపర్ణుడు.

తా. ముందు దూరమున కన్పించిన వస్తువులు చూచిన క్షణమందే దగ్గఱకు వచ్చి వెనుక నెంతయో దూరమున కన్పించునట్లు రథము పోవుచుండుట చూచి ఋతుపర్ణు డిది సూర్యరథమో, యాతడు సూర్యసారథియైన యనూరుడో యని యాశ్చర్యపడెను. ఈ భావము సంస్కృత భారతమునందు లేదు. దీనివంటి భావము కాళిదాసు శకుంతలము నందు గలదు.

వ. వార్ష్ణేయుండును బాహుకు రథంబు గడుపు నేర్పున కచ్చెరువడి యాత్మగతంబున:

అర్థం. అచ్చెరువడి=ఆశ్చర్యపడి.

తా. వార్ష్ణేయుడు బాహుకుని నేర్పు జూచి యాశ్చర్యపడి-

క. ఈతండు శాలిహోత్రుండో
మాతలియో నలుఁడొ యొరులు మానవులు జవో
పేతముగ నిట్లు హయముల
నీతి యెఱుంగుదురె ధారుణీవలయమునన్.

అర్థం. జవోపేతముగ = వేగముతో కూడునట్లుగా, హయముల నీతి = అశ్వ శిక్ష, ధారుణీవలయమునన్=భూమండలమునందు, శాలిహోత్రుడు= అశ్వ శాస్త్రకర్తయైన నాచార్యుడు (నీలకంఠీయము), మాతలి=ఇంద్ర సారథి.

తా. ఇతడు శాలిహోత్రుడో మాతలియో నలుడో కాని వేఱుకాదు. ఇంత వేగముగా నశ్వముల నడపువాడు భూమండలమున వేఱొకడు లేడు.

వ. వయోవిద్యావైభవంబుల నితండు నలుం బోలియు వికృత రూపధరుం డయిన కారణంబేమి యొ మహాపురుషులు దైవనియుక్తులై ప్రచ్ఛన్న వృత్తి నుండుదురు వారి నెఱుంగంబోలునె యనుచుఁ జనునప్పుడు ఋతు పర్ణుండు దన యుత్తరీయంబు జారి భూతలంబు పయింబడిన మలంగి చూచి బాహుకా వార్ష్ణేయుండు వోయి యుత్తరీయంబు దెచ్చునంతకు రథ గమనం బించుక మందంబు సేయు మనిన బాహుకుఁడు నగి నీ యుత్తరీ యంబు వడిన యెడ యిచ్చోటికి నొక్క యోజనంబు గలదు దాని వార్ష్ణేయుండెట్లు దేనేర్చు నని రథ గమనవేగ మాహాత్మ్యంబు సెప్పుచు ననేక దేశంబులు గడచి చని యొక్క యెడ నగణ్యపర్ణఫలశాఖాలంకృ తంబయిన విభీతక వృక్షంబు గని రంత ఋతుపర్ణుండు బాహుకున కిట్లనియె:

అర్థం. వయో విద్యా వైభవంబుల=వయసునందును విద్యయందును, (వయో వైభవము + విద్యా వైభవము=వయో విద్యా వైభవములు), వికృత

రూపధరుడు=కురూపమును పొందిన వాడు, దైవనియుక్తులు=దైవము చేత నియమింపబడిన వారు, ప్రచ్ఛన్న వృత్తిన్=మరుగుగా నుండుట, భూతలముపయిన్=భూమిమీద, మలంగిచూచి = వెనుదిరిగి చూచి, మందము సేయుము=మెల్లన చేయుము, యోజనము=రెండు క్రోశముల దూరము, (నాలుగు మైళ్ళు), మహాత్మ్యము=గొప్పదనము, ప్రభావము, అగణ్యపర్ణఫల శాఖాలంకృతము=లెక్కపెట్టరాని యాకులు పండ్లు గల కొమ్మలచేత నలంకరింపబడినది, విభీతక వృక్షము=తాండ్రచెట్టు.

తా. వయసు చేతను విద్య చేతను నితడు నలునివలె నున్నాడు. రూపము కురూపముగా నున్నది. మహాపురుషు లొకొక్కప్పుడు దైవ యోగమున మరుగువడి యుండుదురు. వారినెఱుగుట కష్టమనుకొనుచుండెను. అప్పుడు ఋతుపర్ణుని యుత్తరీయము జారి భూమిమీద బడినది. అతడు బాహుకు నితో వార్ష్ణేయుడు పోయి యుత్తరీయము తెచ్చును. కొంచెము రథ వేగ మును తగ్గింపుమనెను. బాహుకుడు నవ్వి, నీ యుత్తరీయము పడినచో టెక్కడికి రెండు క్రోశముల దూరము. నీవీ మాట చెప్పునంతలో నింత దూరము వచ్చితిమి యని చెప్పుచుండ ననేక దేశములు కడచిపోయెను. సమీపమున పండ్లతో నాకులతో నిండిన నొక విభీతక వృక్షమును చూపించి ఋతుపర్ణుడు బాహుకునితో నిట్లనెను.

ఆ. ఎల్లవారు నెఱుఁగ రెల్లవానిని భిన్న
విషయు లెల్లవారు విద్యలందుఁ
దొలఁగ కెనెఱుంగుదును దృష్టి మాత్రన
సకలమైన వస్తుచయము సంఖ్య.

అర్థం. భిన్న విషయులు=వేఱువేఱు విషయములు గలవారు, వస్తుచయము= వస్తు సమూహము.

తా. అందరకు నన్ని తెలియవు. ఒకొక్కొ రొకొక్క విషయమున నేర్ప రులు. ఒకొక్కరి యందొకొక్క విద్య యుండును. నాకు నొక సమూహమును చూచినంతనే దాని సంఖ్య తెలియును.

వ. ఇవ్విభీతకంబున ఫలపర్ణ సముదాయ సంఖ్యఁ జెప్పెద విను మీరెండు శాఖలం గల పర్ణ ఫలంబులు పదివేలు నొక్కండు దక్కిన శాఖలం గల యవి రెండు వేలుం దొంబదే ననిన బాహుకుండు విని వీని నెన్నికాని నిశ్చయింప నేరనని తన రథంబు నిలిపి యా వృక్షం బాక్షణంబ యురులం ద్రోచి యయ్యై శాఖలంగల యాకులుం బండులు నెన్నిన ఋతుపర్ణుండు సెప్పిన యన్ని యయిన నచ్చెరువడి యివ్విద్య నాకు నుపదేశింపవలయు నని యడిగిన ఋతుపర్ణుం డిట్లనియె:

అర్థం. ఫలపర్ణ సముదాయ సంఖ్య=పండ్లు నాకుల సమూహము యొక్క లెక్క, ఎన్ని=లెక్కించి, ఉరులంద్రోచి=పడగొట్టి.

తా. ఈ తాండ్ర చెట్టు నందున్న పండ్లు నాకుల లెక్క చెప్పెదను వినుము. ఈ రెండు కొమ్మల యందున్న యాకులు పండ్లు పదివేల యొక్కటి. తక్కిన కొమ్మల యందున్నవి రెండువేల తొంబదియైదని చెప్పెను. బాహుకుడు వానిని లెక్కించికాని నిశ్చయింపలేనని రథము నిలిపి చెట్టు పడగొట్టి యా యా కొమ్మల యందు గల యాకులు పండ్లు లెక్కించి ఋతుపర్ణుడు చెప్పిన దానికి సరిపోయిన యాశ్చర్యపడి నాకీ విద్య చెప్పుమని ఋతుపర్ణుని కోరెను. ఋతుపర్ణుడిట్లనెను:

క. ఇది యక్ష హృదయ మనగా
విదితం బగు విద్య దీని విధ్యుక్తముగా
మదినెఱుఁగు నరుఁడు సంఖ్యా
విదుఁడగు దుష్కృత కళంక విషముక్తుఁడగున్.

అర్థం. విధుక్తముగా = శాస్త్రము నందు చెప్పబడినట్లు, సంఖ్యావిదుడగు = లెక్క తెలిసినవాడగును, దుష్కృత కళంక విముక్తుడగున్=పాపము చేతను, దోషము చేతను, విషముచేతను విడువబడిన వాడగును, అక్ష హృదయము=పాచికల రహస్యము.

తా. ఇది "అక్ష హృదయ"మను విద్య. దీనిని శాస్త్రోక్తముగా తెలిసికొన్న వాడు లెక్క నేర్చిన వాడగును. వానికి పాపము గాని దోషముగాని యంటవు. విషము వానియందు నిలువనేరదు.

చ. సకల గుణ ప్రసిద్ధుఁడగు సర్వహితుండగుఁ జూవె యంచు బా
హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశ మిచ్చెన
త్యకుటిలబుద్ధి నక్ష హృదయంబుఁ గరంబు రయంబుతో విద
ర్భకుఁ జను వేడ్కఁ జేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనః ప్రసన్నుఁడై.

అర్థం. సకలగుణ ప్రసిద్ధుడు = అన్ని గుణముల చేతను పేరుపొందినవాడు, సర్వహితుడు = ఎల్లవారికి మేలు చేయువాడు, అత్యకుటిలబుద్ధి = మిక్కిలి తిన్ననైన బుద్ధితో, రయము = వేగము, పూర్ణమనః ప్రసన్నుడై = నిండుగా ననుకూలమైన మనస్సు గలవాడు.

తా. ఈ విద్య నెఱిగిన వారికి సద్గుణములు వృద్ధి పొందును. జనులందఱికి ప్రియుడగునని బాహుకునకు అక్ష హృదయమును ఋతుపర్ణుడు విదర్భకు త్వరగా పోవలెనన్న నాశతో నుపదేశించెను.

వ. ఇట్లు నలుండు ఋతుపర్ణు వలన నక్షహృదయంబు వడసి సంతుష్టుడై నీకు నశ్వ హృదయం బిచ్చెదఁ బరిగ్రహింపు మనిన ఋతుపర్ణుం డట్ల చేయుదు నది యంతకు నీ యంద యుండ నిమ్ము నా వలసినప్పుడు గొందు ననియె నంత నయ్యక్షహృదయ సామర్థ్యంబు నప్పుడు-

అర్థం. సంతుష్టుడు = సంతోషించినవాడు, పరిగ్రహింపుము = తీసికొనుము, నా వలసినప్పుడు = నేను కోరినప్పుడు, సామర్థ్యము = బలము.

తా. ఇట్లు నలుడు ఋతుపర్ణుని వలన అక్ష హృదయమను విద్యను పొంది సంతోషించి యతనికి నశ్వ హృదయమిత్తును తీసికొనుమనెను. ఋతుపర్ణుడు నాకు కావలసినప్పుడు తీసికొందును. అంతవరకును నీ యొద్దనే యుండనిమ్మనెను. అప్పుడా యక్ష హృదయ శక్తిచేత-

క. నలుఁ దొల్లి యాక్రమించిన
కలి గర్కోటక విషంబు గ్రక్కుచు నొడలన్
వెలువడి నలునకు విహితాం
జలియై తన్నెఱుఁగఁ జెప్పెఁ జంచలుఁ డగుచున్.

అర్థం. ఆక్రమించిన=ఆవేశించిన, ఒడలన్=శరీరము నుండి, విహితాంజలి= నమస్కరించినవాడు, చంచలుడగుచున్=వణకుచు.

తా. నలుని పూర్వ మావేశించియున్న కలి కర్కోటక విషమును క్రక్కుచు శరీరమునుండి బయటపడి నలునకు నమస్కరించి భయపడుచు తన్నుతి గించెను.

ఆ. వానిఁ జూచి నలుఁడు దానల్గి శాపమీ
నున్నఁ గలి యెఱింగి నిన్నుఁ బొంది
యహి విషంబుచేత ననిశంబు దగ్ధుండ
నైతి నింక నాకు నలుగ వలదు.

అర్థం. అహి విషము=పాము విషము, అనిశము=ఎల్లప్పుడు, దగ్ధుండనైతి= తగులబెట్టబడితి, అలుగవలదు=కోపగింపవలదు.

తా. నలుడు కోపగించి వానికి శాపమీయ నెంచెను. అది యెఱిగి కలి నేనింత కాలము నీ శరీరమందున్న సర్పవిషముచేత కాల్చబడితిని. నాకా శిక్ష చాలును. నాకు శాపమీయవలదు.

వ. నిన్నుం గీర్తించిన జనంబులు నా వలని భయంబుఁ బొందరు నాకుం గరుణింపుమనిన నలుండు గోపం బుడిగెఁ గలియు నవ్విభీతక వృక్షంబు నాశ్రయించె నది మొదలుగా విభీతకం బప్రశస్తం బయ్యె నట్లు నలుఁడు వికృతరూప మాత్రంబు దక్కఁ దక్కిన దుష్కృతంబుల వలన విముక్తుండై రథంబెక్కి యతివేగంబున ఋతుపర్ణ వార్ష్ణేయ సహితుండై విదర్భకుం జనియెనంత సాయాహ్నంబున-

అర్థం. ఉడిగెను=మానెను, అప్రశస్తం బయ్యె=చెడ్డది యయ్యె, దుష్కృతంబులు=పాపములు, సాయాహ్నమున=సాయంకాలమున.

తా. నిన్ను స్తుతించిన జనులు నావల్ల భయము పొందరు. నాయందు దయ జూపుమనెను. నలుడు కోపము మానెను. కలి యా తాండ్ర చెట్టు నావే

శించెను. అప్పటినుండి తాండ్ర చెట్టు నింద్యమయ్యెను. అపుడు నలునికి కురూపము తప్ప తక్కిన దోషములన్నియు పోయెను. అతడు ఋతుపర్ణ వార్ష్ణేయులతో సాయంకాలమగు సరికి విదర్భ జేరెను.

క. మానుగ ఋతుపర్ణుఁడు భీ
మానుజ్ఞాతుఁడయి చొచ్చె నాప్రోలు రథ
ధ్వానంబు మ్రోయు చుండగ
నానాదిఙ్ముఖములను ఘనధ్వని వోలెన్.

అర్థం. భీమానుజ్ఞాతుడయి = భీముని చేత అనుమతింపబడినవాడై, ఆ ప్రోలు = ఆ పట్టణము, రథ ధ్వానము = రథ ధ్వని, మ్రోయుచుండగా = ధ్వనించు చుండగ, నానాదిఙ్ముఖములు = అన్ని దిక్కుల యందును, ఘనధ్వని వోలెను = మేఘములయొక్క యుఱుములవలె.

తా. ఋతుపర్ణుడు భీముని యనుమతి పొంది మేఘము లుఱిమినట్లున్న రథ ధ్వనితో నా పట్టణములో ప్రవేశించెను.

సీ. దమయంతి యారథధ్వని విని యిది నలు
రథఘోషమని యనురాగమొంది
నలునిషధేశుఁబుణ్యశ్లోకు లోకోప
కారకుఁజూడగఁ గాంతునేఁడు
ఘనభుజుఁజూడంగఁ గాననినాఁడుఁ ద
ద్భుజపరిరంభణోద్భూత సుఖముఁ
వదయని నాఁడునుఁ బ్రాణముల్ విడుతు నే
నని తలంచుచుఁ గమలాయతాక్షి.

ఆ. యా రథాధిరూఢుఁడై వచ్చు ఋతుపర్ణుఁ
జూచి యప్పుడధిక శోకతప్త
యగుచునుండెనంతనా ఋతుపర్ణుండు
భీముఁగాన వచ్చెఁ బ్రియముతోడ.

అర్థం. ఘనభుజున్=గొప్ప భుజములు గలవానిని, తద్భుజపరిరంభణోద్భూత సుఖము = అతని బాహువులయొక్క కౌగిలింత వలన పుట్టిన సుఖము, పడయనినాడు=పొందనినాడు, కమలాయతాక్షి = తామర పూలవలె విశాలమైన నేత్రములు గలది. అధిరూఢుడు = ఎక్కినవాడు, అధిక శోకతప్త=మిక్కిలి దుఃఖముచేత క్రాగినది.

తా. దమయంతి యది నలుని రథఘోషమని తాను నలుని జూతునని నలుని చూడనినాడు ప్రాణములు విడుతుననియు భావించెను. రథము మీద ఆమెకు ఋతుపర్ణుడు కన్పించెను గాని నలుడు కన్పించలేదు. అందుల కామె దుఃఖించుచుండెను. ఋతుపర్ణుడు భీముని దర్శించెను.

వ. భీముండును వానిం బూజించి యొక్క రమ్యహర్మ్యంబున విడియించిన ఋతుపర్ణుండప్పురంబున స్వయంవరంబను శబ్దంబు మొదలుగా వినం గానక యాత్మ గతంబున-

అర్థం. రమ్యహర్మ్యంబున=రమణీయమైన భవనము నందు.

తా. భీముడు వానిని పూజించి ఒక రమణీయమైన భవనమును విడిదిగా నొసంగెను. ఋతుపర్ణునికా పురమున స్వయంవరమును మాట కూడ విన్పించలేదు. అతడు మనసులో-

క. ధరణిఁ గలరాజు లిట యె
వ్వరు వచ్చిన వారు లేరు వైదర్భి యొరున్
వరియింప నంత ధర్మే
తరచరితయె యనుచునుండెఁ దద్దయు లజ్జన్.

అర్థం. వైదర్భి=విదర్భరాజు కూతురు, దమయంతి, ఒరుని=ఇతరుని, ధర్మేతర చరితయె=అధర్మమైన నడవడిగలదియా !

తా. ఇచటి కెవ్వరును రాజులు వచ్చినట్లే లేదు. అయినను మరల మరియొకని వరించుటకు దమయంతి యంత యధర్మ చరిత్రయా యని సిగ్గుపడెను

వ. బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్ర మించి యుండెనంత దమయంతి బాహుకవార్ష్ణేయులతోడ వచ్చిన ఋతు పర్ణుంజూచి విఫల మనోరథయైయుండ నోపక కేశిని యను దానింబిలిచి ఋతుపర్ణు నయోధ్యాపతింగా వార్ష్ణేయు సూతపుత్రుంగా నెఱింగితి బాహుకుండను వాఁడెవ్వండో వానియందు నా హృదయంబు ముదితంబగు చున్నయది మన పర్ణాదునకుఁ బ్రతివచనం బిచ్చినవాఁడు వాఁడ కావలయు వాని కడకుంబోయి యెఱింగి రమ్మని పంచిన నదిపోయి బాహుకుంగని దమయంతి నీ కుశలంబడుగఁ బుత్తెంచె నిందులకేమి కారణంబున వచ్చి తనిన దానికి బాహుకుండిట్లనియె :

అర్థం. విఫల మనోరథ = ఫలించని కోరికగలది, ముదితంబు = సంతోష పడినది, పుత్తెంచెను=పంపెను.

తా. బాహుకుడు రథశాలలో రథమును గుఱ్ఱములను నిల్పి యచ్చట విశ్ర మించెను. దమయంతి కేశిని యను దాసినిఁ బిలిచి ఋతుపర్ణుని యయోధ్యరాజని వార్ష్ణేయుని సూతునిగను తెలిసికొంటిని. ఆ బాహుకు డెవ్వరో మన పర్ణాదుడు చెప్పినవాడు కావలెను. వానియందు నా మనస్సు సంతుష్టమగుచున్నది. అతని సంగతి తెలిసికొని రమ్మని పంపెను. కేశిని బాహుకుని చూచి దమయంతి నీ కుశలమెఱుగగోరి పంపినది. నీ విచ్చటకు వచ్చుటకు కారణమేమని యడిగెను. దానికి బాహుకుడిట్లనెను:

క. ప్రియమున దమయంతి పున
స్స్వయంవరము సేయఁ గడఁగి సకల క్షత్త్రా
న్వయ వీరుల రావించిన
నయనిధి ఋతుపర్ణుఁడొక్క నాఁటన వేడ్కన్.

క. వినవె శతయోజనంబులు
సనుదెంచె నయోధ్యనుండి సరినిందుల కా
తని రథ సారథినై యే
నును వచ్చితి నతనితో మనోవేగమునన్.

అర్థం. సుగమము.

తా. దమయంతి ద్వితీయ స్వయంవరమునకు నయోధ్యనుండి నూఱు యోజనములు ఋతుపర్ణు డొక్క దినమున వచ్చెను. అతనితోపాటతని సారథినై నేను వచ్చితిని.

వ. అయిన మూడవ వాడెవ్వడని యడిగిన నక్కేశినికి బాహుకుండిట్లనియె:

అర్థం. సుగమము.

కం. నలు రథచోదకుడతఁడ
త్యలఘుడు వార్ష్ణేయునాముఁ డనవుడు వాఁడ
న్నల భూపాలకు పోయిన
వల నొండెఱుఁగునొకో యనిన వాఁ డిట్లనియెన్.

అర్థం. అత్యలఘుడు = మిక్కిలి యున్నతుడు. చోదకుడు = తోలువాడు, సారథి, పోయిన వలను = పోయిన దిక్కు.

తా. అతడు నలుని రథసారథి. వార్ష్ణేయుడన్నవాడు. ఆ మాటలకు కేశిని మరల నిట్లనెను. అతడు నలుడు వెడలిన దిశయెఱుగునా యని.

వ. వార్ష్ణేయుండును నలుపుత్రుల విదర్భేశ్వరు నొద్ద బెట్టిపోయి నడుమ నలు రాజ్యభ్రంశంబు విని ఋతుపర్ణుం గొలిచియుండె నాతండును నలు నెఱుంగడు.

అర్థం. రాజ్యభ్రంశము = రాజ్యమునుండి తొలగుట.

తా. నలు డిట్లనెను: వార్ష్ణేయుడు నలుని కూతును కొడుకును విదర్భలో దించి మఱలిపోవుచు త్రోవలో నలుడు రాజ్యచ్యుతుడగుట విని ఋతుపర్ణు నొద్దకు పోయెను. నలు డెటుపోయెనో యతనికి తెలియదు.

క. నలుతో నొక్కట నరిగిన
నలినాయత నేత్ర భీమనందన యుండెన్
నలుఁడొండె నెఱుఁగుఁగాక
న్నలు నొరులకు నెఱుఁగఁ గారణము గలదె మహిన్.

అర్థం. నలునితో దమయంతి యొక్కతియే పోయినది. కావున నలుని సంగతి యామెకు తెలియవలెను. నలునికి తెలియవలెను. మఱియొకరి కెట్లు తెలియును.

వ. అనిన విని కేశి నిట్లనియె:

సీ. అడవిలో వస్త్రార్ధ హారియై దయలేక
ప్రాణేశ్వరుఁడుఁ దనుఁబాసి చనిన
నాటి వస్త్రార్ధంబు నలినాక్షి యిప్పుడుఁ
బరిధానముగఁ బాంసుపటల మలిన
మగుచున్నఁ దనువుతో ననయంబుఁ జడగొన్న
యలకావలులతో డనవని తలము
శయనంబుగా ధర్మచారిణి దమయంతి
యనఘ వ్రతంబిట్టు లాచరించు

ఆ. చున్నదనిన నవిరళోద్గత బాష్పపూ
ర్ణంబులైన లోచనంబు లెఱుక
వడక యుంత వదన పద్మంబు వాంచితా
నొండువలను చూచుచుండె నలుఁడు

అర్థం. వస్త్రార్ధ హారి=వస్త్రమునందు సగమును హరించినవాడు, పరిధానముగ= కట్టుబట్టగ, పాంసుపటల మలినమగుచున్న తనువుతో = దుమ్ముతో మలినమైన శరీరముతో, అనయంబు=ఎల్లప్పుడు జడగొన్న=జడకట్టిన, అలకావలులు=ముంగురుల సమూహము, అవనితలము శయనంబుగా= భూమి పడకగా, ధర్మచారిణి=ధర్మముతో నడచుకొనునది, అనఘ వ్రతము=పవిత్రమైన వ్రతము, (పాతివ్రత్యము) అవిరళోద్గత బాష్ప

పూర్ణంబులు=ఎడ తెగక వెడలుచున్న కన్నీటి చేత నిండినవి, లోచనములు=కన్నులు, ఎఱుక పడక యుండ=ఇతరులకు తెలియకుండ, వదనపద్మంబు=తామరపూవు వంటి ముఖము, వాంచి=వంచికొని, ఒండుదిక్కు=మఱి యొక వైపు.

తా॥ అడవిలో నలుడు దమయంతి వస్త్రార్థమును కోసికొని పోయెను. ఆ తక్కిన యర్ధ వస్త్రమునే యిప్పటికి గూడ కట్టికొనుచు నొడలంతయు దుమ్ము కొట్టుకొని జడలు కట్టిన ముంగురులతో నేల మీద పవళించుచు దమయంతి యప్పటి నుండి ధర్మచారిణియై పాతివ్రత్యవ్రతము నడుపు చున్నది. నలుడా మాటలు విని కంటివెంట నేకధారగా బాష్పములు కారుచుండ నితరులకు తెలియకుండ మొగము వంచి ప్రక్కకు త్రిప్పి కొనెను.

వ. కేశినియును బాహుకు పలుకులు నాకారంబును దమయంతి కెఱింగించిన నది యాతని నలుంగా శంకించి యింకను వాని కడ కేఁగుము వాఁడు ఋతు పర్ణు వంటలవాఁడై పచన సమయంబున వాని చరితం బిమ్ముగా నెఱింగి రమ్మని పంచిన నప్పుడ చని కేశినియు బాహుకునందు దైవ మానుష నిమిత్తాద్భుత క్రియలు సూచి వచ్చి దమయంతి కిట్లనియె.

అర్థం. పచన సమయమున = వంట చేయునపుడు, చరితము = నడవడి, యిమ్ముగా=లెస్సగా, దైవమానుషనిమిత్తాద్భుతక్రియలు= దేవశక్తి నిమిత్తముగను మనుష్య శక్తి నిమిత్తముగను నగు నాశ్చర్యకరమైన పనులు.

తా॥ కేశిని బాహుకు మాటలను ఆకార వైఖరిని దమయంతి కెఱింగించెను. ఆమె యతడు నలుడని పసిగట్టి వంటచేయు సమయమున వాని నడవడి బాగుగా పరిశీలించి రమ్మని యామెను మఱల పంపెను. కేశిని బాహుకుని యందు కొన్ని యాశ్చర్యమైన విశేషములు చూచి వచ్చి దమయంతి కిట్లనెను :

క. అతని చరితంబు సెప్పంగ
నతిమానుష మపగత ప్రయాస మదృష్ట
శ్రుత పూర్వము పరమార్థ మ
యతనిని వేల్పనఁగ వలయు నంబుజనేత్రా.

అర్థం. అతిమానుషము=మనుష్య శక్తికి మించినట్టిది, అపగతప్రయాసము=పోయిన యాయాసము గలది, అదృష్ట శ్రుత పూర్వము=పూర్వము చూచినది విన్నది కానట్టిది, పరమార్థము=సత్యము, వేల్పు=దేవత.

తా. అతని చరిత్రము మనుష్యుని శక్తి పరిధిలోనిది కాదు. అతనికి శ్రమ యన్నది లేదు. అట్టి నడవడి పూర్వము చూచినది విన్నదికాదు నిజముగా నతనిని దేవత యనవలయును.

సీ. వినవమ్మ తృణముష్టిఁ గొని వాఁడు పీచుడు
నందగ్ని యుదయించి నతనివంట
లమరునంత్కా నింధనముల పేక్షింపగ
యుడుగక మండుచు నుండు మఱియుఁ
గడకతోఁ సెంజుళ్ళఁ గడుగంగ సమకట్టి
జలమపేక్షించుడు సంభవిల్లి
కుంభముల్ నిండి దివ్యాంభః ప్రవాహము
క్షయమగుచుండుఁ తత్క్షణమఁ జూడ

ఆ. నతని కరతల ద్వయావ మర్దితములై
కందియును మహాసుగంధ కుసుమ
తతులుఁ దొంటి యట్లఁ దమ కంపు విడువక
యుండు నతని తేజమున్నతంబు.

అర్థం. తృణముష్టి=గడ్డి పిడికిలిని, పీచుడు=పీచగా, ఇంధనముల పేక్షింపక=కట్టెలు కోరక, ఉడుగక=వదలక, సంజుళ్ళ=మాంసముల, సంభవిల్లి=పుట్టి, దివ్యాంభః ప్రవాహము=దివ్యమైన జలప్రవాహము, అక్షయమగుచుండును = తరిగిపోక యుండును, అతని కరతల ద్వయావ మర్ది

తములై = అతని రెండు చేతులలోను నలుపబడినవైనప్పటికిని, కందియును=వాడియును, మహాసుగంధ కుసుమతతులు=గొప్పసువాసన గల పూల మొత్తములు, తొంటియట్ల=పూర్వమువలె, కంపు=సువాసన.

తా: అతడు పిడికిలితో గడ్డి పట్టికొని పీచినంతనయం దగ్ని పుట్టి యతని వంట పూర్తియగు వరకు కట్టెలక్కఱ లేకయే వదలకుండ మండుచుండును. అతడు మాంసము మొదలైన వానిని కడుగవలసి నీరు కోరగా నీరు కుండలు నిండి ప్రవహించును. మంచి సువాసన గల పువ్వుల నతడు చేతితో నలిపివైచినను పూర్వము వలెనే ఘుమ ఘుమ లాడుచుండును. అతని తేజస్సు గొప్పది.

వి: 'కంపు' శబ్దమునకు నన్నయ నాట నిప్పటివలె దుర్వాసన యన్న యర్థము లేదు.

వ. అనిన విని దమయంతి వెండియుఁ గేశినిం బంచి బాహుకు వండిన నంజుళ్ళు దెప్పించి యాస్వాదించి బాహుకునందు నలు లక్షణంబులు గలుగు టెఱింగియు నూఱడ నోపక వానిపాలికిఁ గొడుకును గూఁతునుం గేశిని తోడం బుచ్చిన నక్కుమారులం జూచి-

అర్థం. ఆస్వాదించి=రుచి చూచి, నూఱడ నోపక=ఓదార్పు నొందక, వాని పాలికి=వాని యొద్దకు.

తా. దమయంతి యా మాటలు విని కేశినిని పంపించి బాహుకుడు వండిన మాంసములు తెప్పించి రుచి చూచెను. అతని యందు నలుని లక్షణ ములు గుర్తించియు నింకను తెలియుటకై యతని యొద్దకు కొడుకును కూతురును కేశినితో పంపించెను.

ఆ. వశముగాక బాష్పవారి యొల్కుచునుండిఁ
గొడుకుఁ గూఁతు నెత్తికొని నలుండు
హర్ష పులకితంబులయిన నిజాంకంబు
లందు వారినునిచి యాదరమున.

అర్థం. వశముగాక = అపికొన రాక, బావ్పవారి = కన్నీళ్ళు, హర్షపులకితములు = సంతోషము చేత గగుర్పాటు చెందినవి, నిజాంకములు = తన యొక్క తొడలు.

తా. నలునికి పరవశమై కన్నుల వెంట నీరు కారుచుండ పిల్లల నిద్దఱ నెత్తి కొని గగుర్పొడిచిన తన తొడలపై కూర్చుండ పెట్టుకొనెను.

వ. అక్కేశినిం జూచి యిక్కుమారు లిద్దఱు నా కొడుకునుం గూఁతునుం బోలిన వీరి నెత్తికొని దుఃఖించితినని తన్నేర్పడకుండ బలికి దాని కిట్లనియె:

తా. నలుడు కేశినితో నీ పిల్ల లిద్దఱు నా కొడుకును కూతునువలె నున్నందున ఎత్తికొంటినని మఱుగుగా చెప్పి మఱల నిట్లనెను.

క. నీ విట పలుమఱు వచ్చుచుఁ
బోవుచునుక్కిఁగని చిత్తముల నొండుగ సం
భావింతురితర జనములు
గావున రావలవ దింకఁ గార్యార్థినివై.

అర్థం. పలుమఱు = అనేక పర్యాయములు, ఒండుగా = వేఱుగా, సంభావింతురు = ఊహింతురు, రావలదు = రావద్దు, కార్యార్థిని = పనికొఱకు.

తా. నీ విక్కడకు చాల తడవలు వచ్చుచు పోవుచునుండుట చూచి యితర జనులు వేఱుగా నూహింతురు. కావున పనియున్నను నీవిక రావద్దు.

వ. ఏము దేశాంతరంబుననుండి వచ్చిన యతిథులము నీకు మాతోడిదేమి యనినఁ గేశిని గ్రమ్మఱి వచ్చి బాహుకు మార్గంబంతయు దమయంతికిం జెప్పిన నది సంతసించి నిజ జనని కిట్లనియె:

అర్థం. దేశాంతరము = విదేశము, క్రమ్మఱి = తిరిగి, మరలివచ్చి, బాహుకు మార్గము = బాహుకుని నడవడి, నిజ జననికి = తన తల్లికి.

తా. మేము పరదేశము నుండి వచ్చిన యతిథులము. నీకు మాతో నేమి పని, యనెను. కేశిని తిరిగి వచ్చి దమయంతికి సంతయు చెప్పెను. ఆమె తల్లితో నిట్లనెను:

ఉ. సందియమేల సర్వగుణ సంపదఁ జూడఁగ బాహుకుండు భూ
వందితుఁడైన నైషధుఁ డవశ్యముఁ దానగు; నా మనంబు నా
నందముఁ బొందుచున్నది ఘనంబుగ వాఁడిట వచ్చువాఁ డొ యే
నందుల కేఁగు దాననొ రయంబున నాతని నిశ్చయింపగన్.

అర్థం. నైషధుడు=నలుఁడు, అవశ్యము=తప్పకుండ, ఆతని నిశ్చయింపగన్= అతడు నలుడేయని నిశ్చయించుటకు, రయంబున=వేగంబున.

తా. బాహుకుడు తప్పక యన్ని విధముల నలుడే సుమీ. సందేహము లేదు. నా మనస్సు సంతసించుచున్నది. అతడు నలుఁడే యని నిర్ణయించుటకు నతనినిచ్చటకు పిల్పింతువా లేక నేనచ్చటకు పోదునా యని-

వ. అనిన నది యప్పుడ భీము ననుమతంబున దమయంతి యొద్దకు బాహుకు రావించిన-

తా. అప్పుడామె భీమునకు చెప్పి బాహుకుని రావించెను.

క. చనుదెంచి యందు దీనా
నన నవిరళ పంకమలిన నతగాత్రఁ దప
స్విని నతి కృశ దమయంతిం
గనియె నలు డుదిత బాష్పకణ కలితముఖిన్.

అర్థం. దీనానన=దీనమైన ముఖముగలది, అవిరళ పంకమలిననతగాత్ర=దట్టమైనదుమ్ముచే మలినమైనట్టియు, వంగినట్టియు శరీరము గలది. తపస్విని=స్థిరమైన తపస్సు గలది, అతికృశ=బాగుగా చిక్కిపోయినది ఉదిత బాష్పకణ కలితముఖిన్=పుట్టిన కన్నీటిచుక్కలతో కూడిన ముఖము గలది.

తా. బాహుకుడు వచ్చి యచ్చట దుమ్ము కొట్టుకొని వాడి చిక్కిపోయిన శరీరముతో నేడ్చుచున్న దమయంతిని చూచెను.

క. దమయంతి నలు వికృతాం
గముఁ జూచియు నతని నన్యుఁగా వగవక నె
య్యమునను లజ్జను నలిసం
భ్రమమున వివశాత్మ యగుచుఁ బతికిట్లనియెన్.

అర్థం. వికృతాంగము=కురూపము, అన్యుఁగా=పరపురుషుడని, వగవక=చింతింపక, నెయ్యము=ప్రేమ, వివశాత్మ=ఒడలెఱుగనిది,

తా. దమయంతి కురూపముతోనున్న బాహుకుని చూచి పరపురుషుడని భావింపక ప్రేమతో మైమఱచి యిట్లనెను:

వ. విజనంబైన విపినంబు నందు నలసి నిద్రవోయిన దాని నబల నతిసాధ్వి ననువ్రత నగ్నిసన్నిధిఁ బాణిగ్రహణ విధి లబ్ధయైన దానిం బాసి నలునట్లొరులు నిర్దయులై యరిగిన వారు లేరు.

అర్థం. విజనంబు=జనులు లేనిది, విపినము=అడవి, అనువ్రత=అనురక్తి గలది, భర్త యొక్క వ్రతము వంటి వ్రతమునే పూనినది, పాణిగ్రహణ విధిలబ్ధ=వివాహ విధి చేత పొందబడినది.

తా. అగ్నిసాక్షిగా వివాహమై పతివ్రతయై తన్ననుసరించి వచ్చు భార్యను నిద్రపోవుచుండ నడవిలో వదలి నలునివలె దయలేక పోవువా రెవ్వరును లేరు.

క. సురవరులఁ దొఱఁగి తన్నున్
వరియించితి నన్నుఁ బుత్రవతి నేలొకో చె
చ్చెర విడిచె నాతనికి న
ష్కరుణున కేనేమి యెగ్గు గావించితినో.

అర్థం. సురవరులన్=దేవశ్రేష్ఠులను, తొఱగి=విడిచి, పుత్రవతి=సంతానవతి, నిష్కరుణుడు=దయలేనివాడు, ఎగ్గు=కీడు.

తా. దేవశ్రేష్ఠులను విడిచి నలుని వరించితిని. సంతానము కంటిని. అట్టి నన్ను దయమాలి వదలిపెట్టెను. నేనేమి దోషము జేసితిని?

వ. నిన్ను విడువనోడకుండుమని పలికిన యప్పలుకు లేల మఱచెనో యని శోకతప్తంబైన తన హృదయంబు దరుపుచున్నదియును బోలె బాష్ప

ధారలం గుచ మండలంబు దడుపుచున్న దమయంతిం గాంచి శోకాకులుండై నలుండిట్లనియె:

అర్థం. శోకతప్తము=దుఃఖము చేత క్రాగినది, కుచమండలము=స్తనప్రదేశము, శోకాకులుడు=దుఃఖముతో నిండినవాడు.

తా. నిన్ను విడువనని చెప్పెను. ఆ మాటలెట్లు మరచిపోయెనో యని కంటి వెంట ధారలుగా నేడువ దొడంగెను. నలుడు దమయంతిని జూచి దుఃఖించుచు నిట్లనెను:

తే. కలి సమావిష్టమతి కష్టవృత్తి
నట్టి యిడుమలఁబడితి నేనని మదీయ
తపముబలమున నీ దుఃఖదాహమునను
నష్టమైపోయెఁ గలియిప్డు నన్ను విడిచె.

అర్థం. కలిసమావిష్టమతిని=కలిచేత నావేశింపబడిన మనసు గల వాడనై, దుఃఖదాహము=దుఃఖాగ్ని, మదీయ తపము బలమున=నా యొక్క తపోబలము చేత, నష్టమైపోయె=నశించిపోయె.

తా॥ నను కలి యావేశించుట చేత నటువంటి కష్టములు పడితిని. ఆ కష్టము లన్నియు నా తపస్సు చేత, నీ దుఃఖము చేత కాలి నశించినవి. కలి నన్ని ప్పుడు వదలిపెట్టెను.

వ. ఏ నిందులకు నీ తదర్థంబు వచ్చితి నది యట్లుండె నన్ను ననురక్తు నన్నువ్రతుఁ దలంపక యన్యాపేక్షం బునస్స్వయంవరంబు రచియించుట యిది కుల స్త్రీ ధర్మంబు గాదు రాజులనెల్ల నీ స్వయంవరంబునకు రావించుటం జేసి కాదె ఋతుపర్ణుండు వచ్చెననిన వెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె:

అర్థం. ఇందులకు=ఇచ్చటకు, నీ తదర్థము=నీ కొఱకు, అనురక్తుడు=అను రాగము గలవాడు, అన్యాపేక్షన్=ఇతరుల యందలి కోరిక చేత, కుల స్త్రీ=మంచి కులమునందు పుట్టి మంచి కులమునుజొచ్చిన స్త్రీ, కృతాంజలి=నమస్కరించినది,

తా॥ సేవించుట నీ కొరకే వచ్చితిని. నీ యందు ప్రేమ గల నన్ను విడచి యితరులను కోరి ద్వితీయ స్వయంవరము ప్రకటించితివి. ఇది కుల స్త్రీలకు ధర్మము గాదు.

తా. స్వయంవరమునకు రాజులందఱిని పిలుచుట చేత గదా, ఆ ఋతుపర్ణుడు వచ్చెను. నలుడిట్లనగా దమయంతి నమస్కరించి యిట్లనెను:

తే. నిన్ను రోయంగ విప్రులు నెమ్మి నరిగి
పలికె రెల్లచోనాచేతఁ బలుకఁ బడియ
యందుఁ బర్ణాదుఁడను విప్రుఁ డయ్యయోధ్య
కేఁగి ప్రతివచనంబుల నెఱిఁగె నిన్ను.

అర్థం. రోయంగన్ = వెదుకుటకు.

తా. నిన్ను వెదుకుటకు విప్రులు దేశదేశములకు పోయి సభలయందు నేను చెప్పినట్లు పలికిరి. వారిలో పర్ణాదుడను వాడయోధ్యకు పోయి నీ సమాధానములు విని నిన్ను నలుడని యెఱింగెను.

వ. ఆ పర్ణాదువలన నిన్నెఱింగిన దాననై నిన్నిట రావించు నుపాయంబు దలంచి యెల్లి దమయంతీ ద్వితీయ స్వయంవరం బగునని ఋతుపర్ణునందుఁ బ్రకాశింప సుదేవుండను బ్రాహ్మణుం బుత్తెంచితి.

అర్థం. సుగమము.

తా. ఆ పర్ణాదుఁడు నా కెఱిగించెను. నిన్నిచ్చటకు రప్పించుటకు ద్వితీయ స్వయంవరము నుపాయంబు పన్నితిని. సుదేవుడను బ్రాహ్మణుని పంపి ఋతుపర్ణునకు చెప్పించితిమి.

క. నరవరుఁడు నలుఁడు గాకె
వ్వరు శత యోజనము లొక్క వాసరమున వ
త్తురు నరులొరులని దీనిం
బలికింపఁగఁ గడఁగి యిట్లు పంచితి నధిపా.

అర్థం. నరవరుడు=రాజు, ఒక్క వాసరమున=ఒక దినమున, పరికింపగా= తెలిసికొనగా, కడగి=ప్రయత్నించి, యిట్టు వంచితిని= ఈ విధముగా పంపించితిని, అధిపా=రాజా.

తా. నలుడు గాక మరియొకడొక రోజున నూరు యోజనముల దూరము రాలేడని, వొక్క రోజులో వచ్చిన నలుడని నిశ్చయించుటకు వీలుగా రేపే స్వయంవరమని సుదేవుని చేత చెప్పించితిని.

ఉ. ఏ నతి పాప భావమును నెగ్గుఁ దలంపక యుండునట్లుగా
నానత వైరి నీ యడుగు లంటఁగ నోపుదు నట్టిదైన న
న్నీ నలినాప్తుఁ డీయ నలుఁ డీ మృగ లాంఛనుఁ డీసురోత్తముల్
జాను సెడంగ నీ క్షణమ చంపరె కోప పరీతచిత్తులై.

అర్థం. ఎగ్గు=పాపపు పని, అనతవైరి=లొంగిన శత్రువులు గలవాడు, అట్టిదైన = అట్లు పాపపు పని తలచిన ఎడల, ఈ నలినాప్తుడు = ఈ సూర్యుడు, ఈ యనలుడు=ఈ యగ్ని, ఈ మృగ లాంఛనుడు=ఈ చంద్రుడు, ఈ సురోత్తముల్ = ఈ దేవశ్రేష్ఠులు, జాను సెడంగ = కాంతి నశింపగా, కోప పరీతచిత్తులై = కోపముతో యాక్రమింపబడిన మనస్సుగలవారై.

తా. నేను ద్వితీయ స్వయంవరము ప్రకటించినది నిజముగా మఱి యొకనిని పెండ్లాడుటకు గాదు. అట్లని నీ పాదములంటి చెప్పగలను. నా మనసులో నట్టి భావమున్న యెడల నీ సూర్యచంద్రులు, నీ యగ్ని, యీ దేవతలు కోపగించి నన్నిప్పుడు చంపివేయకుందురా.

వ. అనుచున్న యవసరంబున నఖిల భూతాంతర్గతుఁ డయిన వాయు భట్టారకుండెల్ల వారలు విన నాకాశంబున నుండి నలున కిట్లనియె :

అర్థం. అవసరమున=సమయమున, అఖిల భూతాంతర్గతుడు=సమస్త ప్రాణుల యందున్నవాడు, వాయు భట్టారకుడు=పూజ్యుడైన వాయుదేవుడు.

తా. దమయంతి యిట్లనగనె సమస్త ప్రాణుల లోన నుండు వాయుదేవుడు ఎల్లఱికి వినిపించునట్లు నలునితో నిట్లనెను :

చ. అమల చరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కెడే నృపో
త్తమ విను దీనియందు విదితంబగు శీలవిధిన్ సుధాంశుఁడుం
గమల హితుండు నేను నయి కాచితి మొక్కటి మూఁడు వర్షముల్
గొమరుగ దీనిఁ జేకొనుము కోమలి నీ కనురక్త నావుడున్.

అర్థం. అమల చరిత్రన్ = నిర్మలమైన నడవడి గలదానికి, విదితంబగు శీల విధిన్ = ప్రసిద్ధమైన మంచి నడవడి, సుధాంశుడు = చంద్రుడు, కమల హితుడు = సూర్యుడు, కాచితిమి = కాపాడితిమి, వర్షము = సంవత్సరము, కొమరుగ = చెలువుగ, నీ కనురక్త = నీ యందు యనురాగము కలది.

తా. రాజా ! దమయంతి నిర్మలమైన చరిత్రము గలది. పతివ్రత. ఈమె ననుమానింతువా. ఈమె శీలమును సూర్య చంద్రులు నేనును మూడు సంవత్సరములు చూచితిమి. ఈమె నీ యందునురాగము కలది యని.

వి. వయం సాక్షిణో రక్షిణః మేము సాక్షులుగా నుంటిమి. రక్షకులుగా నుంటిమని సంస్కృత భారతము ఆ రెండింటికి చూచుచుంటిమని, కాపాడితిమని చెప్పవచ్చును. నన్నయ గారి తెనుగు నేతకిది మచ్చుతునుక.

క. కురిసె మరుద్వచనా నం
తరమున సుర పుష్పవృష్టి దడయక మ్రోసెన్
సురదుందుభి నాదంబులు
గరము ప్రసన్నుండయి వీచె గంధవహుండున్.

అర్థం. మరుద్వచనానంతరమున = వాయుదేవుని మాటల తరువాత, సురపుష్ప వృష్టి = దేవతలు కురిపించిన పూలవాన, గంధవహుడు = వాయువు.

తా. వాయుదేవు డిట్లు చెప్పిన తరువాత దేవతలు పూలవాన కురిపించిరి. దేవ దుందుభులు మ్రోగెను. వాయువు ప్రసన్నమయి వీచెను.

వ. ఇట్లెల్ల వారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు దన్నెఱిగించి దమయంతి పతివ్రతా గుణంబులును బతి యందుల యకృత్రిమానురాగంబును జెప్పిన

విని నలుండు పరమ ప్రమోద పరిపూర్ణ హృదయుండై తత్క్షణంబ కర్కోటకుం దలంచి వాని యిచ్చిన పుట్టంబు పైఁ బెట్టికొని నిజరూపంబు దాల్చెన.

అర్థం. అకృత్రిమము=స్వాభావికము, నిష్కపటము, పరమప్రమోద పరిపూర్ణ హృదయుడు=మిక్కిలి సంతోషముతో నిండిన మనసు గలవాడు.

తా. ఈ విధముగా వాయుదేవుడు దమయంతి పతివ్రతా గుణమును నలుని యందామెకున్న సహజమైన యనురాగమును చెప్పిన నలుడు విని యానందపడి కర్కోటకుని తలచుకొనెను. వెంటనే యతనికి వస్త్రము వచ్చెను. అది పైన కప్పికొనినంతనే యతని సహజరూప మతనికి వచ్చెను.

ఆయత బాహుఁ దప్త కనకాంచిత వర్ణు మనోజరూపు నిం
ద్రాయితు సూర్యతేజు నిషధ ప్రభు నన్నలుఁ జూచి పద్మ ప
త్రాయత నేత్ర యప్డు దమయంతి గరంబు ముదంబు నొంది ల
క్ష్మీయుత యయ్యె బంధులకు మిత్రులకున్ హృదయ ప్రియంబుగన్.

అర్థం : ఆయత బాహు=విశాలమైన బాహువులు కలవానిని, తప్త కనకాంచిత వర్ణు=క్రాగిన బంగారువంటి సుందరమైన రంగు కలవానిని, మనోజ రూపు=మన్మధుని రూపము వంటి రూపము కలవానిని, ఇంద్రాయితు= ఇంద్రుడగుచున్న వానిని, సూర్యతేజు=సూర్యునియొక్క కాంతి వంటి కాంతి గలవానిని, నిషధ ప్రభున్=నిషధ దేశమునకు రాజైన వానిని, పద్మ పత్రాయతనేత్ర=తామర పూరేకులవలె విశాలమైన కన్నులు గలది, లక్ష్మీయుత యయ్యె=శోభతో కూడినదయ్యెను.

తా. నలుడు విశాలమైన బాహువులు కలవాడు. క్రాచిన బంగారు వంటి శరీర ఛాయగలవాడు, మన్మథుని వలె సుందరుడు. సూర్యుని కాంతి వంటి కాంతి గలవాడు. ఇంద్రునితో సమానుడునై ప్రకాశింప, దమయంతి కన్నులు విప్పార్చి యతనిని చూచి సంతసించినంత యామె మొగము కళకళలాడుచు వికసించెను.

వ. ఇట్లు సంగతులైన యయ్యిరువురకు విరహ పరితాపంబుతోడన శరీర మలినత్వంబు వాసెఁ బరస్పరాను రాగంబుతోడన విభూషణ శ్రీ విశేష విలేపన యోగంబులు విస్తరిల్లె నంత నంతయు విని భీముండు జాతసస్యయైన వసుధ తోయ సంప్రాప్తి నాప్యాయితయైన ట్లజ్ఞాత చర్యుండైన తన పతిం బడసి పరమ సంతుష్ట హృదయయై చంద్రుతోఁ గూడిన రాత్రి యుం బోలెఁ బతిం గూడి యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి తన పురంబునం దష్ట శోభనంబులు దేవ గృహంబులయందు విశేష పూజలు సేయించె నట్టి మహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు వచ్చి నీవు నిఖిల లోక పూజ్యుండవయ్యును నా యొద్ద బాహుకుం డనంగాఁ బ్రచ్ఛన్న వృత్తి నున్న నిన్ను నెఱుంగక నీచ కర్మంబులయందు నియోగించితి దీని క్షమియించునది యని నలుచేత సత్కృతుండై యశ్వ హృదయోప దేశంబు గొని యయోధ్యకుం జనియె నిట నలుండును విదర్భా పురంబున నొక్క మాసంబు నివాసంబు సేసి విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి నంద పెట్టి యొక్క రథంబును బదియా ఱేనుంగులును నేఁబది గుఱ్ఱంబులు నాఱు నూఱు కాల్బలంబులుఁ దనకుఁ దోడుగా నిషధ పురంబున కరిగి పుష్కరుం గని యిట్లనియె:

అర్థం. సంగతులు = కలిసికొన్నవారు, మలినత్వము = మురికి తనము, విభూషణ శ్రీ విశేష విలేపన యోగములు = ప్రత్యేకమైన యాభరణముల శోభలు గంధపు పూతలు, జాత సస్యయైన వసుధ = ధాన్యపు మొక్కలు మొలిచిన భూమి, తోయ సంప్రాప్తిన్ = నీటిని పొందుట చేత, ఆప్యాయిత = తృప్తి చెందినది, అజ్ఞాత చర్యుడు = ఎఱుక పడని నడవడి కలవాడు, పరమ సంతుష్ట హృదయ = బాగుగా తృప్తి చెందిన మనస్సు గలది, అష్ట శోభనములు = ఎనిమిది విధములైన మంగళములు, "మృగరాజో వృషో నాగః కలశో వ్యజనం తథా వైజయంతీ తథాభేరీ దీప యిత్యష్ట మంగళమ్" "లోకేస్మిన్ మంగళాన్యష్టౌ బ్రాహ్మణో గౌర్హుతాశనః హిరణ్యం సర్పిరాదిత్య ఆపోరాజా తథాష్టమః." సింహము, ఎద్దు, ఏనుగు, కలశము, విసన కఱ్ఱ (చామరము), పతాకము, ఢక్క, దీపము నీ యెనిమిది యొక లెక్క. మఱియొక లెక్కన బ్రాహ్మణుడు, గోవు, అగ్ని, బంగారము, నేయి, సూర్యుడు, లేక దేవత జలము రాజు

నివి యెనిమిది, వీని నలంకరించి యుంచుట యష్ట శోభనము, నిఖిల లోక పూజ్యుడు=అన్ని లోకములకు పూజింపదగినవాడు, ప్రచ్ఛన్న వృత్తి=మఱుగువడిన రీతితో, సత్కృతుడు = పూజింపబడినవాడు. కాల్బలములు = బంట్లు.

తా. ఇట్లు నల దమయంతులు కలిసికొనిరి. వారి విరహ తాపము తీరి పోయినది. వారు మంగళ స్నానములు చేసి యాభరణము లలంకరించు కొనిరి. కలపము ల లందికొనిరి. తన కూతురు భర్తతో కలిసికొన్నదని విని భీముడు పట్టణము నందష్ట మంగళములు చేయించెను. దేవాలయములలో నుత్సవములు చేయించెను. ఋతు పర్ణుడు నలు నొద్దకు వచ్చి నీవు నలుడవని యెఱుగక నిన్ను వంట వాడుగ గుఱ్ఱముల వాడుగ పనులు చేయించుకొంటిని. క్షమింపుమని వేడి నలుని వలన యశ్వ హృదయము పొంది తన పురమునకు పోయెను. నలుడు విదర్భా పురమున యొక నెల యుండి దమయంతి నక్కడ నుంచి యొక రథమును పదునాఱేనుగులను నేఁబది గుఱ్ఱముల ఆరువందల బంటుల తోడుగా తీసుకొని నిషధ పురమునకు పోయి పుష్కరునితో నిట్లనెను:

క. దమయంతి రోయిగా జూ
దము నీతో నాడఁ గడఁగెదను ధరణీ రా
జ్యము నీవు నాకు రోయిడు
మమరఁగ జూదంబు నీకు నభిమత మేనిన్.

అర్థం. రోయి=పణము, అభిమత మేని=ఇష్టమైన యెడల.

తా. నీకు జూదమాడుట యిష్టమైనచో దమయంతి పణముగా నీతో జూద మాడెదను. నీవు రాజ్యమును పణము పెట్టుము.

వి. నలుడిట్లు చెప్పుటవలన పూర్వము పుష్కరుడు దమయంతిని పణము పెట్టుమని నలునడిగి యుండెనని తెలియదగును. నలుడు సర్వస్వము నోడిపోయిన సందర్భమున పుష్కరుడిట్లడిగినట్లు సంస్కృత భారతము నందున్నది. దాని నా సందర్భమునుండి నన్నయగారు తొలగించెను.

ఇట్లు నలుడిప్పుడు చెప్పుటను బట్టి యీ విషయము నూహింపవచ్చును గదా.

మ.కో. వీరభోజ్యము సుమ్ము రాజ్యము వింటె నీవును నేను దు
ర్వారవృత్తి రథంబులెక్కి యవంధ్య విక్రమ మేర్పడన్
భూరి వీరరణం బొనర్తము పోర నోర్చిన వాఁడ యి
ద్ధారుణీతల రాజ్య సంపదఁ దాల్చు వీరగుణోన్నతిన్.

అర్థం. వీరభోజ్యము = వీరునిచేత ననుభవింప దగినది, దుర్వారవృత్తిన్ = వారింపరాని వ్యాపారముతో, అవంధ్య విక్రమము = మొక్కవోని పరాక్రమము, భూరి = పెద్దదైన, పోరన్ = యుద్ధము నందు.

తా. కానిచో రాజ్యము వీరుడైనవాడే యనుభవించుటకు యోగ్యుడు. కాబట్టి మనమిద్దఱము రథములెక్కి యుద్ధము చేయుదము. గెల్చినవారు రాజ్యమును పొందుదురు.

వ. ఈ రెంటిలో నీకెయ్యది యిష్టంబు దానిన కడంగు మనినం బుష్కరుండు రణంబు నందుఁ బరాజితుండు గావున నలుం డొల్లియు జూదంబున నోడిచినవాడై యింకను నోడిచి దమయంతి జేకొని కృతార్థుండ నగుదు నని సంతసిల్లి యే నోటు వడితినేని నఖిల మహీరాజ్యంబు నీ యది నీ వోటు వడితేని దమయంతి నా యది యని పలికి యొడ్డి నలుతో జూద మాడి యోటువడిన-

అర్థం. పరాజితుడు = ఓడిపోయినవాడు, ఒడిచినవాడు = ఓడించినవాడు, కృతార్థుడు = ధన్యుడు, ఒడ్డి = పణముపెట్టి, పందెము కాసి.

తా. నలుడిట్లనగా పుష్కరుడు పూర్వము తాను యుద్ధమున నలునిచేతిలో నోడిపోయెను కావునను, పూర్వము జూదములో గెల్చినట్లే గెలువవచ్చు నను తలంపుతోను జూదమాడుటకే యిష్టపడెను. వారిద్దఱును జూద మాడిరి. పుష్కరుడోడిపోయెను.

క. ఘనముగ జంబూ ద్వీపం
బునఁ గలవారెల్ల నెఱుఁగ బుష్కరు చేతం
గొనియెఁ బునర్ద్యూతంబున
ననఘుఁడు నలుఁడఖిల రాజ్య మత్యున్నతితోన్.

అర్థం. జంబూద్వీపము = నేరేడి దీవి, పునర్ద్యూతము = రెండవ జూదము, అఖిల రాజ్యము = రాజ్యమంతయు.

తా. లోకము నంతటికి ప్రకటముగ పుష్కరునోడించి నలుడు తన రాజ్యము తాను పొందెను:

వ. ఇట్లు జూదంబునఁ బుష్కరునోడించి సకల మహీ రాజ్యంబును చేకొని నలుడు వానికిట్లనియె.

అర్థం. సకల మహీరాజ్యము = సర్వ భూ మండల రాజ్యము.

తా. సుగమము.

క. కలి సంప్రాప్తుఁడనై కడు
బల మఱి నీ చేతఁ దొల్లి బలవద్ద్యూత
చ్ఛల జితుఁడ నైతి నది నీ
బలమని గర్వింపవలదు బలవంతుడవై.

అర్థం. కలి సంప్రాప్తుడు = కలిచేత పొందబడినవాడు, అనగా కలివశుడు, బలమఱి = బలము నశించి, బలవద్ద్యూతచ్ఛలజితుడు = బలవంతముగా నేర్పాటైన మాయ జూదమను మిషచే నోడింపబడినవాడు.

తా. నేను కలివశమున బలహీనుడనై నీవు పన్నిన మాయ జూదమునందు చిక్కి యోడిపోయితిని. అది నీ బలమని గర్వింపవలదు.

వ. నీవు నా పితృవ్య పుత్రుండవు. నిన్నెద్దియుఁ జేయనోపఁ బొమ్మని పుష్కరు విడిచి పుచ్చి పుష్కలంబైన రాజ్యంబుతో నలుండున్నంత-

అర్థం. పితృవ్యపుత్రుడు=పినతండ్రి కుమారుడు, పుష్కలము=సమృద్ధము.

తా. నీవు నా పినతండ్రి కొడుకవు. నిన్నేమియు చేయుటకు నాకిష్టము లేదు. పొమ్మని పుష్కరుని పంపించి నలుడుండెను.

వి. ఎద్దియుం జేయనోప యనుట చేత నలుడు పుష్కరున కున్న పూర్వ వైభవమంతయు నతనికే యప్పగించి యతని రాజ్యమునకు సగౌరవముగా పంపెనని యూహింపవచ్చును. సంస్కృత భారతమున పుష్కరుని ధన సంపద రాజ్యమునిచ్చుటయేగాక వేఱ యాభరణములను ధనమును గూడ నిచ్చి గౌరవించి యొక మాసము దినములు తనకడ నుంచుకొని వైభవముతో పంపినట్లున్నది.

క. భీమ ప్రస్థాపితయై
కోమలి దమయంతి పుత్రకులుఁ దానును ల
క్ష్మీ మహిమ వెలుగుచుండఁగఁ
దామరసదళాక్షి వచ్చెఁ దన పతి కడకున్.

అర్థం. భీమప్రస్థాపిత=భీముని చేత పంపబడినది, లక్ష్మీమహిమ వెలుగుచుండ= వైభవముతో, తామరసదళాక్షి=కమలములవంటి నేత్రములు గలది, దమయంతి.

తా. తరువాత తండ్రి పంపగా దమయంతి పిల్లలతో గూడ వైభవముతో తన పతి యొద్దకు వచ్చెను.

వ. అట్లు దన మనోవల్లభయైన దమయంతిం గూడి నలుండు విధి విహితా నేకాచరితమఖుండై శతమఖ విలాసంబుతో సకల రత్నయుతంబైన రత్నగర్భాధిరాజ్యంబు సేసెఁ గావున నక్షజితుండ నైతినని వగవ వలదు నీవును దైవమానుష సంపన్నుండవయి శత్రువుల జయించి సకల మహీ సామ్రాజ్యంబు వడయుదు వని బృహదశ్వుండు ధర్మజునకు నక్ష హృదయం బుపదేశించి—

అర్థం. మనోవల్లభ = ప్రియభార్య, విధివిహితానేకాచరితమఖుడు = శాస్త్రముచేత విధింపబడిన యనేక యజ్ఞములను చేసినవాడు, శతమఖవిలాసముతో = ఇంద్రవైభవముతో, సకలరత్నయుతము = అన్ని విధములైన రత్నములతో కూడుకొనినది, రత్నగర్భాధిరాజ్యము = సర్వభూరాజ్యమును, అక్షజితుడనైతిని = జూదములో నోడింపబడితిని, దైవమానుష సంపన్నుడు = దైవ బలము, మనుష్య బలము కలవాడు.

తా. ఈ విధముగా నలుడు దమయంతిని గూడి శాస్త్రీయమైన పెక్కు యజ్ఞములు చేయుచు నింద్ర వైభవముతో భూమి పరిపాలించుచు రత్నములు పండించెను. కావున నీవు జూదమునం దోడిపోయితివని విచారింపకుము. నీకు దైవ బలము మనుష్య బలము కూడ నున్నది. ఈ భూమండలమంతయు శత్రువులను జయించి సామ్రాజ్యముగా నేలగలవని బృహదశ్వుడు ధర్మరాజున కక్షహృదయ ముపదేశించి యాతనిచే పూజింపబడి వెడలిపోయెను.

సీ. ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావ
ధానులై వినువారుఁ దవిలిసభల
జదివెడువారును జగదీశ! గలిదోష
నిర్ముక్తులగుదురు నిఖిల పుణ్య
ఫలభాగులగుదురు బహుపుత్ర పౌత్రాయు
రారోగ్య ధనయుక్తు లగుదురెల్ల
విషములకు నదుష్ట విషయంబులకు దూరు
లగుదురు ధర్మాత్ములగుదు రుర్వి

ఆ. గడుఁ బ్రసిద్ధమిదియుఁ గర్కోటకుని దమ
యంతిఁ బుణ్యమూర్తియైన నలుని
నుత చరిత్రుఁడైన ఋతుపర్ణుఁ గీర్తింపఁ
గలి భయంబునెల్ల గ్రాఁగు నధిపఁ.

అర్థం. దత్తావధానులు = శ్రద్ధతో వినెడినవారు, జగదీశ = రాజా, కలిదోషనిర్ముక్తులగుదురు = కలిదోషముచేత విడువబడిన వారగుదురు, నిఖిల

పుణ్యఫలభాగులగుదురు = అన్ని పుణ్యములు చేసిన ఫలమును పొందువా రగుదురు, బహుపుత్ర...యుక్తులగుదురు = పలువురు కొడుకులు మనుమలు నాయువు యారోగ్యము ధనము వీని యన్నింటితో కూడుకొన్న వారగుదురు, దుష్టవిషయములు = వ్యసనములు, దూరులు = దూరము నందున్నవారు, నుతచరిత్రుడు = స్తుతింపబడిన నడవడిగలవాడు, క్రాగున్ = నశించును.

తా. ఈ నలోపాఖ్యానము శ్రద్ధగా వినువారు సభలలో చదివెడువారు కలి ప్రభావమునకు లోనుగారు. పుణ్యఫలములన్నియు పొందుదురు. కొడుకులు మనుమలు ఆయువు ఆరోగ్యము ధనము వీని యన్నింటితో సుఖపడుదురు. విషములు దుర్విషయములు వారి యొద్దకు రావు. వారు ధర్మనిష్ఠులుగా నుందురు. కర్కోటకుని దమయంతిని నలుని ఋతు పర్ణుని వీరిని నలుగురిని స్తుతించిన కలి నశించును.

వి. ఇది ఫలశ్రుతి. నలునికి పుణ్యశ్లోకుడని పేరు. కలి ప్రభావము తప్పించు కొనుటకు నల చరిత్రమును పఠింపవలెను. కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనమ్ కలి నాశనమ్. ఈ శ్లోకము సంస్కృతభారతమునందలిది. ఈ శ్లోకమునైనను జదివినచో నల చరిత్రము పారాయణము చేసిన ఫలితము వచ్చును. ఇప్పటికి గూడ యీ యాచారము నిలిచియున్నది.

# రురూపాఖ్యానము

## ఆదిపర్వము–ప్రథమాశ్వాసము

కం. చ్యవనునకు సుకన్యకు ను
ద్భవ మయ్యె ఘనుండు ప్రమతి; ప్రమతికి నమృతో
ద్భవ యగు ఘృతాచికిని భా
ర్గవముఖ్యుఁడు రురుఁడు పుట్టెఁ గాంతియుతుండై. 1

అమృతోద్భవ = అప్సరస, భార్గవ ముఖ్యుడు= భృగువంశీయులలో శ్రేష్ఠుడు.

పూర్వం చ్యవనుడనే మహర్షి ఉండేవాడు. ఆయన భృగుమహాముని కుమారుడు. ఆయన భార్య పేరు సుకన్య. ఆ పుణ్యదంపతులకు ప్రమతి అనే పుత్రుడు పుట్టాడు. గుణవంతుడైన ఆ ప్రమతికీ ''ఘృతాచి'' అనే అప్సరసకూ ''రురుడు'' జన్మించాడు. భృగువంశవరేణ్యుడైన రురుడు జగదేక సుందరుడు.

వ. అట్టి రురుండను మునివరుండు విశ్వావసుండను గంధర్వరాజునకు మేనకకుం బుట్టినదాని, స్థూలకేశుండను మునివరు నాశ్రమంబునఁ బెరుఁగుచున్నదాని, రూపలావణ్యగుణంబులఁ బ్రమదాజనంబుల యందెల్ల నుత్కృష్ట యగుటం జేసి ''ప్రమద్వర'' యన నొప్పుచున్న కన్యక నతిస్నేహంబున వివాహంబుగా నిశ్చయించి యున్నంత- 2

లావణ్యము = శరీరము మీది నిగనిగ, ప్రమదాజనములు = స్త్రీలు, ఉత్కృష్ట=ఉత్తమురాలు, అతిస్నేహము=అత్యంతమైన అనురాగము.

సుగుణరాశియైన రురుడు స్థూలకేశుడనే మునీశ్వరుని ఆశ్రమంలో పెరుగుతున్న ప్రమద్వరను చూచాడు. ఆ అన్నులమిన్న అందచందాలు అతని

హృదయాన్ని లోగొన్నాయి. ప్రమద్వర గంధర్వ రాజకుమారి. ఆమె తండ్రి పేరు విశ్వావసుడు. తల్లి పేరు మేనక. ప్రమదలందరిలో ఉత్తము రాలైనందువల్ల 'ప్రమద్వర' అనే సార్థకనామం ధరించింది. ఆ ప్రియ దర్శినిని ఆ లావణ్యలహరిని ప్రేమించాడు రురుడు. పెండ్లి ముహూర్తం నిశ్చయమయింది.

తే. కన్నియలతోఁ డ నాడుచునున్నదానిఁ
బాదమర్దితమై యొక్క పన్నగంబు
గఱచెఁ; గన్నియ లందఱు వెఱచి పఱచి
యఱచుచుండఁ బ్రమద్వర యవనిఁ ద్రెళ్లె. 3

పాదమర్దితము=కాలితో త్రొక్కబడినది, పన్నగము=పాము, వెఱచి= భయపడి, పఱచి=పరువెత్తి, అవనిఁద్రెళ్లె=నేలపై పడినది.

ఒకనాడు ఈడుజోడు ఆడపిల్లలతో ఆడుకొంటున్నది ప్రమద్వర. ఆట సందడిలో అటూఇటూ పరువెత్తుతూ ఆమె ఒక పామును త్రొక్కింది. వెంటనే ఆ కాలసర్పం "కస్సు"మని ఆ కన్యకామణిని కాటు వేసింది. పామును చూచి బాలిక లందరూ భయంతో కేకలు వేశారు. పాపం ప్రమద్వర నురుగులు గ్రక్కుతూ నేల మీద పడిపోయింది.

ఈ తేటగీతి మూడు నాలుగు పాదాలలో "కఱచు" "వెఱచు" "పఱచు" "అఱచు" అనే క్రియలలోని వృత్త్యనుప్రాసగతమైన శకటరేఫం పునః పునరావృత్తమై పాము విషంలోని క్రూరత్వాన్నీ, చెల్లాచెదరై పారిపోయిన బాలికల భీరుత్వాన్నీ వెల్లడిస్తూ భయానకరసాన్ని పోషిస్తున్నది. ఇందలి నన్నయగారి రచనారామణీయకం గమనింపదగినది.

వ. దాని నెఱింగి కరుణాకలితహృదయులై గౌతమ కణ్వకుత్స కౌశిక శంఖ మేఖల భరద్వాజ వాలఖిల్యోద్దాలక శ్వేతకేతు మైత్రేయ ప్రముఖులు, ప్రమతియు రురుండును స్థూలకేశాశ్రమంబునకు వచ్చి విషవ్యపగత ప్రాణయై పడియున్న యక్కన్యం జూచి దుఃఖితులై యుండ నచ్చోట నుండనోపక రురుండు శోకవ్యాకుల హృదయుండై యేకతంబు వనంబు నకుం జని-

విషవ్యపగతప్రాణ=విషముచే పోయిన ప్రాణము కలది (ప్రాణము పోయినది), ఉండనోపక=ఉండలేక, ఏకతంబ=ఒంటరిగా.

ఈ విషాదవార్త వినగానే కరుణార్ద్ర హృదయులై గౌతముడు, కణ్వ కుత్సుడు, కౌశికుడు, శంఖమేఖలుడు, భరద్వాజుడు, వాలఖిల్యుడు, ఉద్దాలకుడు, శ్వేతకేతుడు, మైత్రేయుడు మొదలైన మునులూ, ప్రమతీ రురుతూ అంతా స్థూలకేశుని ఆశ్రమానికి వచ్చారు. పాముకాటుకు ప్రాణాలు కోల్పోయి భూమిమీద పడిఉన్న ప్రమద్వరను చూచి చాలా విచారించారు. ఆ విషాద దృశ్యాన్ని వీక్షించలేక రురుడు శోకవ్యాకుల చిత్తంతో ఏకాకిగా అరణ్యంలోకి వెళ్ళిపోయి ఇలా ఆక్రోశించాడు:

చం. అలయక యేన దేవయజనాధ్యయన వ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని, యేన గురుసద్ద్విజభక్తుఁడనేని, యేన య
త్యలఘుతపస్వినేని దివిజాధిప భూసురులార ! మన్మనో
నిలయకు నీ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేఁడు మీ దయన్. 5

అలయక=విసుగు చెందక, ఏన = నేనే కనుక, అధ్యయనము=వేద పఠనము, సద్ద్విజులు=ఉత్తమ బ్రాహ్మణులు, అతి + అలఘు=మిక్కిలి గొప్పవైన, మత్ + మనోనిలయ=నా మనస్సులో నెలకొన్నది.

"ఓ మహేంద్రాది దిక్పాలకులారా ! ఓ మహీసురులారా ! అనుగ్రహిం చండి ! నేనే కనుక దేవపూజ, వేదాధ్యయనం, బ్రహ్మచర్యం మొదలైన పుణ్యకార్యాలు నిర్విరామంగా నిర్వర్తించేవాడినైతే, నేనే కనుక గురు భక్తి బ్రాహ్మణభక్తి కలవాడినైతే, నేనే కనుక అపార తపస్సంపన్నుడ నైతే నా మనస్సులో నెలకొని ఉన్న ఈ ప్రమద్వరకు విషం విరిగి పోవాలి."

చం. అపరిమితాజ్ఞఁ జేసియు మహాపురుషుల్ విషతత్త్వ సంహితా
నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికిన్ విష
వ్యపగతమైన జీవ మిది వచ్చు నుపాయము సేయరాక్కొ ! నా
తపము ఫలంబు నధ్యయన దాన ఫలంబులు నిత్తు వారికిన్. 6

సంహిత = ధర్మశాస్త్రము, నిపుణులు = సమర్థులు, విషవ్యపగతము = విషముచే తొలగి పోయినది, జీవము = ప్రాణము.

"ఓ మహానుభావులారా! పాము విషం పై కెక్కకుండా అరి కట్టండి. విషవైద్యంలో ఆరితేరిన మీరంతా మీ మీ మంత్రతంత్రాలు ప్రయోగించి మీ శక్తినంతా ఉపయోగించి ప్రమద్వర ప్రాణాలు నిల బెట్టండి. ఈ అమ్మాయిని బ్రతికిస్తే మీకు నా తపఃఫలం, నా అధ్యయన ఫలం, నా దానఫలం ధారపోస్తాను."

ఈ పద్యంలో దేవపూజలు యజ్ఞాలు వేదాలు వ్రతాలు గురువులు సద్బ్రాహ్మణులు తపస్సు మొదలైనవాని మీద నన్నయ గారికి ఉన్న ఆదరాభిమానాలు ధ్వనిస్తున్నాయి.

వ. అని దీనవదనుండై యాక్రోశించువానికి నాకాశంబున నుండి యొక్క దేదూతవ యిట్లనియె నయ్యా! కాలవశంబయిన నెవ్వరికిం దీర్పం దరంబుగా దొక్క యుపాయంబు గలదు. చేయనోపుదేనిం జెప్పెద వినుము. నీ యాయుష్యంబునం దర్ధం బిక్కన్య కిమ్మనిన రురుం డట్ల చేయుదు నని తన యాయుష్యంబునం దర్ధం బక్కన్యక కిచ్చిన నక్కో మలి దొల్లింటి కంటె నధిక శృంగార సమన్వితయై విషనిర్ముక్తయయ్యె నట్లు దేవదూత ధర్మరాజానుమతంబునం దన చెప్పిన యుపాయంబునం బ్రమద్వరను బంచత్వంబు వలనం బాపె. రురుండును దాని వివాహంబై యిష్టోపభోగంబుల ననుభవించుచు నుండి –

ఆక్రోశించు = పెద్దగా అఱచు, ఆయుష్యము = ఆయుస్సు, పంచత్వము = మరణము, ఇష్ట + ఉపభోగములు = ఇష్టములైన సౌఖ్యములు.

ఆ విధంగా అత్యంత దీనవదనంతో ఎలుగెత్తి విలపించుతున్న రురునితో ఆకాశంలో నుంచి ఒక దేవదూత ఈ విధంగా అన్నాడు – "నాయనా! విధివిధానం దాటరానిది. కాలానికి ఎదురీదటం ఎవరికీ సాధ్యం కాని పని. అయితే ఇక్కడ నీ విషయంలో ఒక్క ఉపాయం ఉంది. నీవు చేయగలిగినట్లయితే చెబుతాను విను. నీ ఆయుర్దాయంలో సగం ఈ

ప్రమద్వరకు సమర్పించు. అప్పుడు ఈమె తప్పకుండా బ్రతుకుతుంది.'' ఈ మాటలు విన్న రురుడు ''అట్లాగే'' అని పలికి తన ఆయుర్దాయంలో అర్ధభాగాన్ని ఆమెకు ధార పోశాడు. అప్పుడు ఆ సుకుమారి అంతకు ముందుకంటే విశేషలావణ్యంతో వినూత్న సౌందర్యంతో విరాజిల్లుతూ విషవిముక్తురాలై లేచి కూర్చుంది. ఆ విధంగా దేవదూత యమధర్మ రాజు అనుజ్ఞప్రకారం తాను ఉపదేశించిన ఉపాయంతో ప్రమద్వరను మృత్యుముఖంనుంచి రక్షించాడు. అనంతరం రురుడు ఆ తరుణీమణిని పరిణయమాడి అఖండ సుఖభోగాలు అనుభవింపసాగాడు.

కం. తన సతి కపకారము సే
సిన పాముల కలిగి బాధ సేయుదునని చి
క్కని దండము గొని పాములఁ
గనినప్పుడు యదువఁదొడఁగె గహనములోనన్. 8

చిక్కని దండము = గట్టికఱ్ఱ, గహనము = అరణ్యము, అడుచుట = కొట్టుట.

ఐతే రురుడు జరిగిన దానిని మరచిపోలేదు. అతనికి తన ప్రియురాలికి ఆపద కలిగించిన పాములపైన కోపం తగ్గలేదు. ఆ అపకారానికి ప్రతీకారంగా అతడు ఒక దుడ్డుకఱ్ఱ చేత పట్టుకొని కంటబడిన ప్రతి పామునూ వెంటబడి చావబాదటం మొదలుపెట్టాడు.

చం. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల రోసి రోసి ని
ష్ఠురతరదీర్ఘదండమున డొల్లఁగ వ్రేయుచు వచ్చివచ్చి య
య్యిరవున డుండుభం బను నహిం గని వ్రేయఁగ దండమెత్తుడున్
''హరి హరి'' యంచు డుండుభమహాహి భయంపడి పల్కె భార్గవున్. 9

త్రిమ్మరు = సంచరించు, రోసి రోసి = వెదకి వెదకి, నిష్ఠురతరము = మిక్కిలి కఠినమైనది, డొల్లగ = చచ్చునట్లు, అయ్యిరవున = ఆ చోటు నందు, అహి = పాము, డుండుభము = రెండు తలల పాము (విషము లేనిది.)

అరణ్యంలో అటూ ఇటూ తిరుగుతూ పుట్టలలో పొదలలో సంచరించే సర్పాలను వెదకి వెదకి సుదీర్ఘమైన దండంతో చిదుకపొడుస్తున్న రురునికి ఒకచోట రెండు తలల పాము ఒకటి కనిపించింది. ఆ డుండుభాన్ని చూచిన రురుడు దాన్ని మొత్తటానికి కఱ్ఱపైకెత్తాడు. అప్పుడు ఆ పాము భయకంపితమై "హరి హరీ" అని ఆక్రోశించి భృగు వంశీయుడైన అతనితో ఇట్లా పలికింది-

మ.కో. ఏమి కారణమయ్య ! పాముల కింత యల్గితి వీవు తే
జోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు నావుడుం
బాము లెగ్గొనరించె మత్ప్రియభామ కేను రురుండ ను
ద్దామసత్త్వుఁడ నిన్ను నిప్పుడ దండతాడితుఁ జేసెదన్. 10

తేజోమయుడు=కాంతితో నిండినవాడు, నావుడున్=అనగా, ఎగ్గు=అపకారము, తాడితుడు=కొట్టబడినవాడు, ఉద్దామసత్త్వుడు=అధికమైన బలము కలవాడు.

"అయ్యా! నీవు మహాతేజస్వివి ! మహీసురుడవు ! మంచి మంచి వ్రతాలు ఆచరించినవాడివి ! పాముల మీద ఇంతగా పగ పట్టడానికి కారణం ఏమిటి స్వామీ?" అని అడుగుతున్న డుండుభంతో రురుడు ఇలా అన్నాడు: "నేను అపార బల సంపన్నుణ్ణి. నా పేరు రురుడు. పాములు నా ప్రియకాంతకు ప్రాణహాని కలిగించాయి. అందుకు ప్రతీకారంగా ఈ పని తలపెట్టాను. ఇదుగో నిన్ను ఇప్పుడే ఇక్కడే ఈ దండంతో చావ బాదుతాను చూడు."

వ. అని రురుం డలిగి కృతాంతకరదండంబు వోని తన దండంబెత్తికొనుడుఁ దత్క్షణంబ డుండుభంబు మునియై యెదుర నిలిచినం జూచి రురుం డిట్లనియె : 11

కృతాంతకరదండంబు వోని=యముని చేతిలోని కాలదండముతో సమానమైన, ఎత్తికొనుడున్=ఎత్తగా

ఈ విధంగా పలికి రురుడు అగ్రహావేశంతో కాలదండం వంటి తన దండాన్ని పైకెత్తగానే ఆ డుండుభం మునిగా మారి అతని ఎదుట నిలబడింది. అది చూచి రురుడు ఇట్లా అన్నాడు-

కం. ఉరగమవై యుండి మునీ
శ్వర వేషము దాల్చి యున్న వడు వెంతయు న
చ్చెరు విది యెట్టులు నావుడు
రురునకు నిట్లనియె మునివరుం డనురక్తిన్. 12

ఉరగము = పాము, వడువు = రీతి, అచ్చెరువు = ఆశ్చర్యము, అనురక్తి = అనురాగము.

"ఇప్పటి దాకా ఫణిగా ఉన్న నీవు మునిగా మారటం చూస్తే నా కెంతో ఆశ్చర్యం వేస్తున్నది. ఈ విచిత్రం ఎట్లా సంభవించింది?" అనగానే ఆ మునిసత్తముడు అనురాగపురస్సరంగా రురునికి సమాధానం చెప్పాడు.

వ. ఏను "సహస్రపాదుం"డను ముని ముఖ్యుండ. నా సహాధ్యాయుండు "ఖగముం"డను మునిముఖ్యుం డగ్నిహోత్ర గృహంబున నున్న నే నపహాసార్థంబు తృణమయ సర్పం బమ్మునిపై వైచిన నతం డులికిపడి నా కలిగి నీవు నిర్వీర్యంబైన యురగంబ వగుమని శాపం బిచ్చిన నేను మేలంబు సేసిన నింత యలుగనేల క్షమియింపు మనినం బ్రసన్నుండై ఖగముండు నా వచనం బమోఘంబు గావునం గొండొక కాలంబు డుండుభంబవై యుండి భార్గవకుల వర్ధనుండైన రురుం గనిన యప్పుడు శాప విముక్తుండ వగుదు వనెనని సహస్రపాదుండు రురునకుం దన వృత్తాంతం బంతయుం జెప్పి వెండియు నిట్లనియె: 13

సహాధ్యాయుడు = కలిసి చదివిన వాడు, అపహాసార్థము = ఎగతాళి కోసము, తృణమయసర్పము = గడ్డితో చేసిన పాము, నిర్ + వీర్యము = సార హీనము, మేలము = పరిహాసము, అమోఘము = వ్యర్థము కానిది, కులవర్ధనుడు = వంశోద్ధారకుడు, వెండియున్ = మరల.

"నేను సహస్రపాదుడనే మునీంద్రుణ్ణి. నా సహాధ్యాయుడు ఖగముడనే మునీంద్రుడుఅతడు అగ్నిహోత్ర గృహంలోఉన్న సమయంలో నేను ఎగతాళికి ఒక గడ్డిపామును చేసి అతని మీద విసరివేశాను. అతడు ఆ పన్నగాన్ని చూచి ఉలిక్కిపడి ఆపై నాపై కోపం తెచ్చుకొని "నీవు సారం లేని సర్పానివి అవుతావు." అని శాపం పెట్టాడు. "పరిహాసానికి చేసిన పనికి ఇంత ఆగ్రహావేశం ఎందుకు? నన్ను మన్నించు" అని నేను వేడుకొన్నాను. అప్పుడు ఖగముడు ప్రసన్నుడై "నా పలుకు తిరుగులేనిది. అందుకని కొంతకాలం వరకు డుండుభంగా ఉండక తప్పదు. భృగువంశమందనుడైనరురుణ్ణి చూచినప్పుడు నా శాపం నుంచి విముక్తి పొందుతావు" అన్నాడు. ఈ విధంగా సహస్రపాదుడు తన వృత్తాంతమంతా వివరించి ఇంకా ఇట్లా అన్నాడు-

ఉ. భూనుతకీర్తి! బ్రాహ్మణుఁడు పుట్టుడుఁ దోడన పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసంహిత బుద్ధియుఁ జిత్తశాంతియున్
మానమదప్రహాణము సమత్వము సంతత వేదవిధ్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్. 14

పుట్టుడున్=పుట్టగానే, మానమద ప్రహాణము=నిరహంకారను, విధి+అనుష్ఠానము=శాస్త్రసమ్మతమైన సదాచారము.

"అశేషప్రజలూ ప్రశంసింపదగిన యశస్సు కలవాడా! ఉత్తమమైన ఆత్మజ్ఞానమూ, సమస్త జీవులకూ మేలు కలిగించే సద్బుద్ధీ, శాంతీ, సహనమూ, సత్యమూ, సమభావమూ, సదాచారమూ, నిరహంకారమూ, నిశ్చలదీక్షా, దయాదాక్షిణ్యాలూ- ఇవి బ్రాహ్మణుడైన వానికి పుట్టుకతోనే పుట్టుక వస్తాయని అంటారు."

వ. అయ్యా! నీవు బ్రాహ్మణుండవు. భృగువంశ సముత్పన్నుండవు. సర్వగుణ సంపన్నుండ విదియేమి దొడంగితిట్టి దారుణ క్రియారంభంబు క్షత్రియులకుం గాక బ్రాహ్మణులకుం జనునే? బ్రాహ్మణు లహింసాపరులొరులు సేయు హింసలు వారించు పరమ కారుణ్య పుణ్యమూర్తులు. "జనమేజయుం"డను జనపతి చేయు సర్పయాగంబు నందుఁ గద్రూ

శాపంబున నయ్యెడు సర్పకుల ప్రళయంబును భవత్పితృ శిష్యుండయిన
"యాస్తీకుం"డను బ్రాహ్మణుండ కాఁడె యుడిగించెనని చెప్పి సహస్ర
పాదుండు రురునకు సర్పఘాతంబునం దుపశమ బుద్ధి పుట్టించె. 15

ఇదియేమి దొడంగితి=ఎందుకని ఈ విధంగా మొదలు పెట్టితివి, దారుణ
క్రియారంభము=క్రూరకృత్యములు చేయుట, చనునే=తగునా, జన
పతి=రాజు, కద్రువ = నాగమాత (సర్పములను కన్నతల్లి), భవత్
పితృశిష్యుడు=మీ తండ్రిగారి శిష్యుడు, ఉడిగించు, సర్పఘాతము=
పాములను సంహరించుట, ఉపశమనబుద్ధి=శాంతించు భావన.

"నాయనా! రురూ! నీవు బ్రాహ్మణుడివి. పవిత్రమైన భృగువంశంతో
ఉదయించిన సదాచార సంపన్నుడివి. యశస్వివి. తపస్వివి. ఇదేమి
టయ్యా, ఇటువంటి కానిపనికి పూనుకున్నావు! ఈ విధమైన హింసామయ
కార్యక్రమం క్షత్రియులకు తగినది కాని బ్రాహ్మణులకు తగినది కాదే.
బ్రాహ్మణులైనవారు హింసలకు పాల్పడరు. అంతేకాదు, ఇతరులు అరం
భించిన దారుణ మారణ కృత్యాలను వారించే పరమ కారుణ్య పుణ్య
స్వరూపులు వారు. నీవు వినలేదేమో! "జనమేజయు"డనే మహారాజు
సాగించిన సర్పయాగంలో కద్రువ శాపకారణంగా భస్మమైపోతున్న
పన్నగజాతిని మీ నాన్నగారి ప్రియశిష్యుడైన "ఆస్తీకు"డనే బ్రాహ్మ
ణుడే కదా సంరక్షించి పుణ్యం కట్టుకొన్నాడు." అని హెచ్చరించి
సహస్రపాదుడు రురునికి సర్పసంహార సంకల్పాన్ని విరమించాలనే
సద్బుద్ధి పుట్టించాడు.

# ఆస్తీకోపాఖ్యానము

- సర్పయాగము -

వ్యాఖ్యా రచయిత

జంధ్యాల పాపయ్యశాస్త్రి

"కరుణశ్రీ"

# ఆ స్త్రీకోపాఖ్యానము

## ఆదిపర్వము-ప్రథమాశ్వాసము

వ. ఉదంకుండు తక్షకు చేసిన యపకారంబునకుం బ్రతీకారంబు సేయం జింతించి యొక్కనాఁడు జనమేజయ మహీపాలు పాలికిం బోయి యిట్లనియె. 1

చింతించి=ఆలోచించి, మహీపాలుడు=మహారాజు, పాలికి=వద్దకు.

గురుదక్షిణ కోసం తాను కష్టపడి పంపాదించిన కుండలాలు అపహరించి తక్షకుడు తనకు చేసిన ద్రోహానికి తగిన విధంగా బదులు తీర్చుకోవాలని ఆలోచించాడు ఉదంకుడు. ఒకరోజు జనమేజయ మహారాజు వద్దకు వెళ్లి అతడు ఇట్లా అన్నాడు:

చం. మితహిత సత్యవాక్య! జనమేజయ! భూజనవంద్య! యేను సు
స్థితి గురుదేవ కార్యములు సేయఁగఁబూను టెఱింగి వంచనో
న్నతమతియై యకారణమ నా కపకారము సేసెఁ దక్షకుం
డతి కుటిల స్వభావుఁడు పరాత్మ విశేష వివేక శూన్యుఁడై. 2

మితము=సంగ్రహమైనది, హితము=మేలు కలిగించునది, వంచన=మోసము, అకారణమ=కారణము లేకుండానే.

"జనమేజయ రాజేంద్రా! నీవు మితంగా హితంగా సత్య వాక్కులు పలికేవాడివి. సమస్త ప్రజలచేత ప్రశంసింపబడే వాడివి. మంచి భావంతో మా గురుదేవుని కార్యాన్ని నెరవేర్చటానికి నేను దీక్ష వహించాను. ఆ సంగతి ఎలా పసిగట్టాడో మోసగాడైన తక్షకుడు, అకారణంగా నాకు హాని కలిగించాడు. వాడు ఎంతో వక్ర స్వభావుడు.

ఎదుటివారికీ తనకూ ఉన్న అంతరాన్ని ఆకళించుకొనే తెలివితేటలు అణుమాత్రమూ లేనివాడు.

వ. అదియునుం గాక- 3

చం. అనవరతార్థ దానయజనాభిరతున్ భరతాన్వయాభి వ
ర్ధను సకల ప్రజాహిత విధాను ధనంజయ సన్నిభున్ భవ
జ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్మకుఁ డసహ్య విషోగ్రధూమకే
తనహతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంత నికేతనాతిథిన్. 4

అనవరతము = ఎల్లప్పుడు, యజనము = యజ్ఞము, అన్వవాయము = వంశము, ధనంజయుడు = అర్జునుడు-అగ్నిహోత్రుడు, భవత్ + జనకున్ = మీ తండ్రిని, భుజగజాల్మడు = సర్పాధముడు, అసహ్యము = సహింపరానిది, ధూమకేతనము = అగ్ని హోత్రము, కృతాంతుడు = యమధర్మరాజు, నికేతనము = మందిరము.

నాకు అపకారం చేయటమే కాదు, నిరంతరం తన సంపదను దాన ధర్మాలకూ యజ్ఞయాగాలకూ వెచ్చించటానికి కుతూహల పడేవాడూ, భరత వంశాన్ని వృద్ధి పరిచేవాడూ, ప్రజలందరికీ మేలు కలిగించే కార్యాలు చేపట్టేవాడూ, అర్జునునితో సమానమైనవాడూ, జితేంద్రియుడూ అయిన మీ తండ్రి పరీక్షిత్తును ఆ సర్పకులాధముడు కాటువేసి భరింపరాని భయంకర విషానల జ్వాలలతో యమ మందిరానికి అతిథిగా పంపించాడు.

ఉ. కాదన కిట్టిపాటి యపకారముఁ దక్షకుఁ డేకవిప్ర సం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ! నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కా
కోదర సంహతిన్ హుతవహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్. 5

కాదనక = సంకోచము లేకుండ, కాకోదర సంహతిన్ = సర్పముల సమూహమును, హుతవహుడు = అగ్ని, శిఖాచయము = జ్వాలల సమూహము.

రాజ కులావతంసా! ఇంతటి మహాపకారాన్ని వాడు - ఆ తక్షకుడు ఏమాత్రం సంకోచం లేకుండా ఒకానొక బ్రాహ్మణుని ప్రోత్సాహంతో నీకు కలిగించాడు. అందుకు ప్రతీకారంగా నీవు అనేక బ్రాహ్మణులచేత నిర్వర్తింపబడే సర్ప యజ్ఞంలో ఆ తక్షకునితోపాటు సమస్త సర్ప సమూహాన్నీ అగ్నిహోత్రుని చండ ప్రచండ జ్వాలామాలికలలో కాల్చి బూడిద చెయ్యి.

ఉ. ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసినదానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము! గావునన్ మహీ
వల్లభ! తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లఁగ సర్పయాగ మతిధీయుత! చేయుము విప్రసమ్మతిన్. 6

ప్రల్లదుడు=వదరుబోతు-దుష్టుడు, కులపాంసనుడు=కులమును చెరచువాడు, అపూర్వము=విశేషము, త్రెళ్లుట=నశించుట, ధీయుత= బుద్ధిమంతుడా !

జనమేజయ చక్రవర్తీ! నీవు మిక్కిలి బుద్ధిమంతుడివి. వాచాలుడైన ఒక నీచుడు, కులంలో చెడబుట్టినవాడు చేసిన అకార్యం వల్ల వాడి కులం అంతా ఆ కళంకాన్ని పంచుకోక తప్పదు. ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. కనుక నీచుడైన ఆ తక్షకుని మూలంగా సర్పాలన్నీ సవన కుండంలో పడి నాశనం అయ్యేటట్లు భూసురుల అంగీకారం అందుకొని సర్పయాగం ప్రారంభించు ''

ఈ చిన్న పద్యంలో నన్నయ్యగారు జరుగబోయే భారత కథనంతా సూచించారు. దుర్మార్గుడైన ఒక్క దుర్యోధనుని కారణంగా కౌరవ వంశమంతా కళంకితమై నశించిపోతుందని పరమార్థం.

వ. అని యిట్లయ్యుదంకుండు జనమేజయునకు సర్పయాగంబునందు బుద్ధి పుట్టించె. 7

ఈ విధంగా జనమేజయునికి ఉపదేశించి సర్పయాగం చేయాలనే ఉద్దేశాన్ని ఉద్భవింపజేశాడు ఉదంకుడు.

## ఆదిపర్వము - ద్వితీయాశ్వాసము

వ. జనమేజయుండు కోపోద్దీపిత చిత్తుండై సర్పయాగము సేయ సమకట్టి పురోహితులను ఋత్విజులను బిలువంబంచి వారల కిట్లనియె: 8

కోప + ఉద్దీపితచిత్తుడు = కోపముచే మండింపబడిన మనస్సు కలవాడు, సమకట్టి = పూనుకొని, ఋత్విజుడు (ఋత్విక్కులు) = యజ్ఞము చేయించు వారు.

జనమేజయ మహారాజు ఆగ్రహోదగ్రుడైనాడు. సర్పయాగం చేయటానికి నిశ్చయించుకొన్నాడు. వెంటనే పురోహితులనూ, ఋత్విక్కులనూ పిలిపించాడు. వారితో అతడు ఇట్లా పలికాడు:

చం. తన విషవహ్ని మజ్జనకుఁ దక్షకుఁ డెట్లు దహించె నట్ల యే
నును సహమిత్ర బాంధవజనుం డగు తక్షకు నుగ్రహవ్యవా
హన శిఖలన్ దహించి దివిజాధిపలోక నివాసుఁడైన మ
జ్జనకున కీ యుదంకునకు సాధుమతంబుగఁ బ్రీతిఁ జేసెదన్. 9

వహ్ని = అగ్ని, మత్ + జనకున్ = నా తండ్రిని, ఏనును = నేనుకూడా, హవ్యవాహనశిఖలు = అగ్నిహోత్రజ్వాలలు, దివిజ + అధిపలోకము = దేవేంద్రలోకము, సాధుమతంబుగ = సజ్జనసమ్మతముగా.

"తన విషాగ్నితో తక్షకుడు నా తండ్రిని ఏ విధంగా దహించివేశాడో అదే విధంగా బంధుమిత్రులతో కూడా తక్షకుణ్ణి అత్యంత భయంకరమైన అగ్నిజ్వాలలలో దహించివేస్తాను. అట్లాచేసి స్వర్గంలో ఉన్న నా పితృ దేవునికీ, ఈ ఉదంకునికీ సాధుసమ్మతంగా సంతోషాన్ని సమకూరుస్తాను.

వ. సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబు గలదేని చెప్పుండనిన ఋత్విజు లిట్లనిరి: 10

సీ తదర్థమ కాఁగ దేవ వినిర్మితం బిది యన్యు లు
ర్వీతలేశ్వర! దీనిఁ జేయరు వింటి మేము పురాణ వి

ఖ్యాత మాద్యము నావుడున్ విని కౌరవ ప్రవరుండు సం
జాతనిశ్చయుఁడయ్యె నప్పుడు సర్పయాగము సేయఁగన్. 11

శాస్త్ర విధానము = శాస్త్ర నిర్ణయము, నీ తదర్థమ = నీ కోసమే, ఉర్వీతల + ఈశ్వర = మహారాజా, ఆద్యము = మొదటిది, కౌరవ ప్రవరుడు = జనమేజయ మహారాజు.

సర్పయాగాన్ని చేసే విధానం శాస్త్రాలలో ఉన్నట్లైతే దయచేసి చెప్పండి'' అని జనమేజయ మహారాజు అనగానే ఋత్విక్కులు ఇట్లా సమాధానం ఇచ్చారు:

''మహారాజా! కేవలం మీ కోసమే ఈ సర్పయాగ ప్రక్రియను దేవతలు నిర్మించారేమో! ఇంతవరకూ ఇతరులెవ్వరూ ఈ యాగాన్ని ఆచరించ లేదు. పురాణాలలో ప్రసిద్ధమూ, ప్రథమమూ అయిన దీన్ని గురించి మాత్రం మేము విన్నాము.'' ఇట్లా పలికిన ఋత్విజుల మాటలు విని కురుకులశ్రేష్ఠుడైన జనమేజయుడు సర్పయాగం చేయటానికి స్థిరసంకల్పు డైనాడు.

వ. ఇట్లు కృతనిశ్చయుండై జనమేజయుండు కాశీరాజపుత్రియయిన ''వపుష్టమ'' యను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగదీక్షితుండయి శాస్త్రోపదిష్ట ప్రమాణ లక్షణనిపుణ శిల్పాచార్య వినిర్మితంబును యజ్ఞోపకరణానేక ద్రవ్యసంభార సంభృతంబును ప్రభూత ధనధాన్య సంపూర్ణంబును స్వస్వనియుక్త క్రియారంభసంభ్రమ పరిభ్రమద్బ్రాహ్మణ నివహంబును నయిన యజ్ఞాయతనంబున నున్న యా రాజునకు నొక్క వాస్తు విద్యా నిపుణుండైన పౌరాణికుం డిట్లనియె: 12

కృతనిశ్చయుడు = గట్టిగా నిర్ణయించుకొన్నవాడు, శాస్త్ర + ఉపదిష్టము = శాస్త్రములందు చెప్పబడినది, నిపుణులు = సమర్థులు, ద్రవ్యసంభారము = వస్తుసామగ్రి, సంభృతము = బాగుగా నిండినది, ప్రభూత = అధికమైన, స్వస్వనియుక్తములు = తమకు నియోగింపబడినవి, సంభ్రమము = తొట్రుపాటు, నివహము = సమూహము, యజ్ఞఆయతనము = యజ్ఞశాల, వాస్తువిద్య = గృహనిర్మాణశాస్త్రము.

ఈ విధంగా గట్టి పట్టుదలతో జనమేజయ చక్రవర్తి కాశీరాజకుమార్తె 'వపుష్టమ' అనే ధర్మపత్నితో కూడి సర్పయాగానికి దీక్ష వహించాడు. శాస్త్రంలో చెప్పబడిన ప్రమాణాలలో లక్షణాలలో ఆరితేరిన శిల్పాచార్యుల చేత నిర్మింపబడిందీ, యజ్ఞానికి అవసరమైన అనేక వస్తు సామగ్రితో కూడిందీ, అత్యధికమైన ధనధాన్యాలతో నిండివున్నదీ, తమకు తమకు నియమింపబడిన కార్యక్రమాలు నిర్వహించటానికి గబగబమని అటూ యిటూ తిరుగుతున్న బ్రాహ్మణసమూహం కలదీ అయిన యజ్ఞశాలలో ప్రవేశించాడు. ఆ సమయంలో వాస్తుశాస్త్రంలో సమర్థుడైన ఒక పండితుడు మహారాజుతో ఈ విధంగా అన్నాడు:

కం. అనఘా ! యీ యజ్ఞము విధి
సనాథ ఋత్విక్ప్రయోగ సంపూర్ణం బ
య్యెను గడచన నేరదు; నడు
మన యొకఁడు భూసురోత్తమ నిమిత్తమునన్. 18

అనఘా=పుణ్యాత్ముడా, విధిసనాథ=శాస్త్రవిధులతో కూడిన, కడచన నేరదు=ముగియబోదు, నిమిత్తము=కారణము.

"పుణ్యాత్ముడా! శాస్త్రనిపుణులైన ఋత్విక్కులచేత నిర్వహింపబడుతున్నప్పటికీ ఈ యజ్ఞం సంపూర్ణం కాదు. పూర్తి కాకుండానే ఒక బ్రాహ్మణోత్తముని కారణంవల్ల మధ్యలోనే ఆగిపోతుంది."

వ. అనిన వాని వచనం బవకర్ణించి రాజనియుక్తులయి చ్యవనకులం విఖ్యాతుండైన చండభార్గవుండు హోతఁగా, పింగళుం డధ్వర్యుండుగా, శార్ఙ్గరవుండు బ్రహ్మగాఁ, గౌత్సుం డుద్గాతగా, వ్యాస వైశంపాయన పైల జైమిని సుమంతు శుక శ్వేతకేతు మౌద్గల్యోద్దాలక మాండవ్య కౌశిక కౌండిన్య శాండిల్య క్రామఠక కోహలాసిత దేవల నారద పర్వత మైత్రేయాత్రేయ కుండజఠర కాలఘట వాత్స్య శ్రుతశ్రవో దేవశర్మ శర్మద రోమ శోదంక హరిత రురు పులోమ సోమశ్రవసు లాదిగాఁ గల మహామునులు సదస్యులుగా నీలాంబరపరిధానులును ధూమసంరక్తనయనులునునై యాజ్ఞికు లగ్నిముఖంబు సేసి వేల్వం దొడంగిన.

అపకర్ణించి=పెడచెవిన పెట్టి, హోత=ఋగ్వేదము తెలిసిన ఋత్విజుడు, అధ్వర్యువు=యజుర్వేద తంత్రము నడిపెడివాడు, ఉద్గాత = సామవేదతంత్రము నడిపెడివాడు, బ్రహ్మ=ఋత్విజుడు, సదస్యులు= సభ్యులు, నీలాంబర పరిధానులు = నల్లని వస్త్రములు ధరించినవారు, ధూమము=పొగ, సంరక్త=మిక్కిలి ఎఱ్ఱబడిన.

కాని ఆ పండితుని పలుకులను ఎవరూ పట్టించుకోలేదు. సర్పయాగం ఆరంభమయింది. చ్యవనవంశంలో జన్మించి పేరెన్నిక గన్న చండ భార్గవుడు హోతగా, పింగళుడు అధ్వర్యుడుగా, శార్ఙ్గరవుడు బ్రహ్మగా, కౌత్సుడు ఉద్గాతగా నియుక్తులైనారు. వ్యాసుడు, వైశంపాయనుడు, పైలుడు, జైమిని, సుమంతుడు, శుకుడు, శ్వేతకేతుడు, మౌద్గల్యుడు, ఉద్దాలకుడు, మాండవ్యుడు, కౌశికుడు, కౌండిన్యుడు, శాండిల్యుడు, క్రామఠకుడు, కోహలుడు, అసితుడు, దేవలుడు, నారదుడు, పర్వతుడు, మైత్రేయుడు, ఆత్రేయుడు, కుండజఠరుడు, కాలఘటుడు, వాత్స్యుడు, శ్రుతశ్రవుడు, దేవశర్మ, శర్మదుడు, రోమశుడు, ఉదంకుడు, హరితుడు, రురుడు, పులోముడు, సోమశ్రవసుడు మొదలైన మహర్షులు సభ్యులుగా విచ్చేశారు. యాజ్ఞికులు నల్లని వస్త్రాలు ధరించి పొగచేత ఎఱ్ఱబారిన కన్నులు కలవారై అగ్నిముఖంగా హోమం చెయ్యటం ఆరంభించారు.

కం. ధరణీసుర మంత్రహోమ
స్ఫురణను వివశులయి భూరి భుజగప్రభు లొం
డొరుఁ బిలుచుచు నధిక భయా
తురులై కుండాగ్నులందుఁ దొరఁగిరి పెలుచన్. 15

వివశులు=స్పృహ తప్పినవారు, తొరగిరి = కూలిరి, పెలుచన్ = అధికముగా.

అప్పుడు ఆ యాజ్ఞికుల అమోఘమైన మంత్రశక్తికి లొంగిపోయి గొప్ప గొప్ప సర్పరాజులు ఎందరో పరస్పరం పలుకరింపులతో, అమితమైన

భయాందోళనలతో యజ్ఞకుండంలో ప్రజ్వరిల్లుతున్న అగ్నిజ్వాలల్లో పడి మాడిపోతున్నారు.

వ. మఱియుఁ గోటిశ మానసపూర్ణ శల పాల హలీమక పిచ్ఛిల గౌణప చక్ర కాలవేగ ప్రకాలన హిరణ్యబాహు శరణ కక్షక కాలదంతకాదు లయిన వాసుకి కులసంభవులును, పుచ్ఛాండక మండలక పిండసేక్తృ రభేణక కోచ్ఛిఖ శరభభంగ బిల్వతేజో విరోహణ శిలి శలకర మూక సుకుమార ప్రవేపన ముద్గర శిశురోమ సురోమ మహాహన్వాదు లయిన తక్షక కుల సంభవులును, పారావత పారిజాతయాత్ర పాండర హరిణ కృశ విహంగ శరభ మోద ప్రమోద సంహతయానాదు లయిన యైరావత కులసంభవులును, నేరక కుండలవేణి వేణీస్కంధకుమారక బాహుక శృంగబేర ధూర్తక ప్రాతరాత కాదులయిన కౌరవ్య కులసంభవులును, శంకుకర్ణ పిఠరక కుఠార సుఖసేచక పూర్ణాంగద పూర్ణముఖ ప్రహాస శకుని దర్య మాహఠ కామఠక సుషేణ మానసావ్యయ భైరవ ముండ వేదాంగ పిశంగ చోద్రపారక వృషభ వేగవ త్పిండారక మహాహను రక్తాంగ సర్వసారంగ సమృద్ధ పఠవాసక వరాహక వీరణక సుచిత్ర, చిత్రవేగిక పరాశర తరుణక మణిస్కంధారుణ్యాదు లయిన ధృతరాష్ట్ర కులసంభవులును నయి యొక్కొక్క మొగి సహస్రాయుత సంఖ్యలు గలిగి-

సహస్రము=వేయి, అయుతము=పదివేలు.

ఈ విధంగా కోటిశుడు మానసపూర్ణుడు శలుడు పాలుడు హలీమకుడు పిచ్ఛిలుడు గౌణపుడు చక్రుడు కాలవేగుడు ప్రకాలనుడు హిరణ్యబాహుడు శరణుడు కక్షకుడు కాలదంతకుడు మొదలైన వాసుకి వంశీయులూ, పుచ్ఛాండకుడు మండలకుడు పిండసేక్తృడు రభేణకుడు ఉచ్ఛిఖుడు శరభభంగుడు బిల్వతేజుడు విరోహణుడు శిలి శలకరుడు మూకుడు సుకుమారుడు ప్రవేపనుడు ముద్గరుడు శిశురోముడు మహాహనుడు మొదలైన తక్షకుని వంశీయులూ, పారావతుడు పారిజాతయాత్రుడు పాండరుడు హరిణుడు కృశుడు విహంగుడు శరభుడు మోదుడు ప్రమోదుడు సంహతుడు యానుడు మొదలైన ఐరావతుని వంశీయులూ, ఏరకుడు కుండలవేణి వేణీస్కంధుడు కుమారకుడు బాహుకుడు శృంగబేరుడు

ధూర్తకుడు ప్రాతరాతకుడు మొదలైన కౌరవ్యుని వంశీయులూ, శంకు కర్ణుడు పితరకుడు కుఠారుడు సుఖసేచకుడు పూర్ణాంగదుడు పూర్ణ ముఖుడు ప్రహాసుడు శకుని, దరి, అమాహఠుడు కామఠకుడు సుషేణుడు మానసుడు అవ్యయుడు భైరవుడు ముండుడు వేదాంగుడు పిశంగుడు చోద్రపారకుడు వృషభుడు వేగవంతుడు పిండారకుడు మహాహనుడు రక్తాంగుడు సర్వసారంగుడు సమృద్ధుడు పఠవాసకుడు వరాహకుడు వీరణకుడు సుచిత్రుడు చిత్రవేగికుడు పరాశరుడు తరుణకుడు మణి స్కంధుడు ఆరుణి మొదలైన ధృతరాష్ట్రుని వంశీయులూ అయిన సర్పరాజులు ఒక్కొక్క తడవకు వేలు పదివేలు వంతున గుంపులు గుంపులుగా వచ్చి అగ్నిలో పడ్డారు.

మ. అతివేగాకులచిత్తులై పడి రుదాత్తాశీవిషాగ్నుల్ సితా
సితపీతారుణ వర్ణదేహులు నవాసృగ్రక్తనేత్రుల్ మహో
న్నతు లేక త్రిక పంచ సప్త నవ నానామస్తకుల్ పల్వురు
ద్ధత నాగేంద్రులు బ్రహ్మదండహతి నార్తధ్వానులై వహ్నిలోన్. 17

ఆశీవిష + అగ్నులు = కోరలయందు విషజ్వాలలు కలవారు, సిత = తెల్లని, అసిత = నల్లని, పీత = పచ్చని, అరుణ = ఎఱ్ఱని, నవ + అసృక్ = క్రొత్త నెత్తురు చేత, త్రిక = మూడు, నవ = తొమ్మిది, నాగేంద్రులు = నాగరాజులు.

అంతులేని తత్తరపాటుతో ఆకులమైన మనస్సులతో తెల్లని దేహాలవారూ, నల్లని దేహాలవారూ, పచ్చని దేహాలవారూ, ఎఱ్ఱని దేహాలవారూ, క్రొత్త నెత్తురుతో ఎఱ్ఱబడిన కన్నులవారూ, మిక్కిలి పొడవైనవారూ, మూడు తలలవారూ, ఐదు తలలవారూ, ఏడు తలలవారూ, తొమ్మిది తలల వారూ ఇంకా ఎన్నో తలలవారూ, గర్వోన్మత్తులూ అయిన నాగరాజులు అనేకులు బ్రాహ్మదండంచేత దెబ్బలు తింటూ ఆర్తనాదాలు చేస్తూ అగ్ని జ్వాలలలో పడి ఆహుతి కాసాగారు.

కం. తరతబడఁ బడియెడు రవమును
బిడి కాలెడు రవముఁ గాలి పలుదెఱఁగుల ప్ర

స్స్పేదు రవమును దిగ్వలయము
గడుకొని ప్రమోయించె నురగకాయోత్థితమై.

రవము=ధ్వని, ప్రస్ఫేదు=పగిలెడు, దిగ్వలయము=దిశా చక్రము, ఉరగకాయ+ఉత్థితమై=పాముల శరీరము నుండి బయలుదేరినదై.

తడబాటుతో పడిపోతున్నప్పటి చప్పుడూ, వడ్డాక కాలిపోతున్నప్పటి చప్పుడూ, కాలాక అనేక విధాలుగా ప్రేలిపోతున్నప్పటి చప్పుడూ సర్పాల శరీరాల నుంచి వెలువడి అన్ని దిక్కుల్లోనూ వ్యాపించి ప్రతిధ్వనింపసాగాయి.

వ. అంత- 19

కం. తక్షకుఁ డతిభీతుండై
యా క్షణమున నరిగె "సురగణాధిప! నన్నున్
రక్షింపుమ రక్షింపుమ
రక్షింపుమ" యనుచు నప్పురందరు కడకున్. 20

సురగణాధిప=దేవేంద్రా, పురందరుడు=దేవేంద్రుడు.

అప్పుడు భయకంపితుడైన తక్షకుడు వెంటనే "దేవతా చక్రవర్తీ! నన్ను కాపాడు-నన్ను కాపాడు-నన్ను కాపాడు" అంటూ దేవేంద్రుని వద్దకు పరుగు పరుగున పోయి మొరపెట్టుకొన్నాడు.

వ. పురందరుండును దొల్లి కమలజు వాక్యంబున వాసుకి ప్రముఖ సర్పకుల ముఖ్యులకు సర్పసత్ర భయంబు లేమి యెఱింగినవాఁడు గావున వాని నోడకుండు మని చేకొని యుండె నిట వాసుకియు జనమేజయ సమారబ్ధ సర్పసత్ర పరిత్రస్తుండై ద్వియోజన త్రియోజనాయామ స్థూలవ్యాళ నివహంబులు నిజవంశ భ్రాతృవంశ జనితంబు లయినవి జననీ వాగ్దండ పీడితంబులయి యగ్ని కుండంబున బడుటకు శోకించి తన చెలియలి జరత్కారువుం జూచి యిట్లనియె: 21

కమలజుడు = బ్రహ్మదేవుడు, సర్పసత్రము = సర్పయాగము, ఓడకుండుము = భయపడకుండుము, సమారబ్ధ = ఆరంభింపబడిన, పరిత్రస్తుడు = మిక్కిలి భయపడినవాడు. యోజనము = నాలుగు క్రోసులు, వ్యాళ నివహంబులు = పాముల గుంపులు, జననీ వాగ్దండము = కన్నతల్లి శాపము.

పూర్వం బ్రహ్మదేవుడు వాసుకి మొదలైన ప్రధానమైన సర్పరాజులకు సర్పయాగం వల్ల ఆపదలేదని ఆనతిచ్చాడు. ఆ విషయం తెలిసినవాడు అవటం వల్ల దేవేంద్రుడు భయపడవద్దని తక్షకునికి ఆశ్రయ మిచ్చాడు. ఇక ఇక్కడ జనమేజయుని సర్పయాగ ప్రయోగానికి భయపడిన వాసుకి తన వంశానికీ, తన సోదరుల వంశానికీ చెందిన రెండు యోజనాలూ, మూడు యోజనాలూ పొడవు వెడల్పులు గల సర్ప సమూహాలన్నీ తల్లి శాపానికి గురియై అగ్నికుండములో పడినందుకు చాలా దుఃఖించాడు. తన చెల్లెలైన జరత్కారువుతో అతడు ఈ విధంగా పలికాడు:

కం. ప్రస్తుత ఫణిసత్ర భయ
త్రస్తాత్ముల మైన యస్మదాదుల కెల్లన్
స్వస్తి యొనర్పఁగ నవసర
మాస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా!. 22

అస్మదాదులకు = నా వంటి వారికి, స్వస్తి = శుభము, క్షేమము.

"పద్మాక్షీ! ఇప్పటి ఈ సర్పయాగ భయంతో కొయ్యబారిపోయి ఉన్న మా కందరికీ శుభం చేకూర్చవలసిన బాధ్యత ఇప్పుడు నీ కుమారుడైన ఆస్తీకుని మీద పడింది.

కం. విమల తపో విభవంబున
గమలజు నట్టింద విగత కల్మషుఁ డాస్తీ
క మహాముని యీతని వచ
నమున మహాహికుల రక్షణం బగుఁ బేర్మిన్. 23

కమలజు నట్టిండ = బ్రహ్మదేవుని వంటివాడే, విగతకల్మషుకు = పాపరహితుడు, పేర్మిన్ = అనురాగముతో.

ఆ_స్తీకుడు స్వచ్ఛమైన తపస్సంపదలో బ్రహ్మవంటి వాడు. పాపరహితుడు. మహాముని. ఈతని మాట నేర్పువల్ల గొప్పదైన సర్పవంశం చక్కగా సంరక్షింపబడుతుంది.

వ. బ్రహ్మ వచనంబు నిట్టిది కా విని యేలాపుత్రుండు మాకుఁ జెప్పె. జరత్కారు మహామునికి నిన్ను వివాహంబు సేయుటయు నేతదర్థంబ. ఇంకొక్క నిమేషంబేని యుపేక్షించిన సకల సర్పప్రళయం బగుం గావున నా_స్తీకుండు జనమేజయ మహీపాలు పాలికిం బోయి సర్పయాగం బుడిగించి రక్షింపవలయు ననిన నయ్యగ్రజు వచనంబులు విని జరత్కారువు గొడుకు మొగంబు సూచి భవన్మాతుల నియోగంబు సేయు మనిన నా_స్తీకుం డిట్లనియె: 24

ఏలా పుత్రుడు = ఒకానొక సర్పకుమారుడు, ఏతదర్థంబ=ఇందు కోసమే, ఉపేక్షించిన = అలక్ష్యము చేసినచో, మాతులుదు = మేనమామ, నియోగము = ఆజ్ఞ.

బ్రహ్మదేవుని అనతి కూడా ఇదే అని ఏలా పుత్రుడు మాతో చెప్పాడు. నిన్ను జరత్కారు మహర్షికి ఇచ్చి పెండ్లి చేసింది కూడా ఇందుకోసమే. ఇక ఒక్క క్షణమైనా సరే ఆలస్యం చేస్తే సమస్త సర్పాలూ నాశనమౌతాయి. అందువల్ల వెంటనే ఆ స్తీకుడు జనమేజయ మహారాజు వద్దకు వెళ్ళాలి. సర్పయాగాన్ని మాన్పించాలి. నాగకులాన్ని కాపాడాలి." ఈ విధంగా అన్నగారు అన్నమాటలు ఆలకించిన అన్నుం మిన్న జరత్కారువు తన కొడుకైన ఆ_స్తీకుని ముఖం చూచి "మీ మామయ్య ఆజ్ఞను ఆచరించు" అన్నది. అందుకు ఆ_స్తీకుడు ఆమెతో ఇట్లా అన్నాడు-

కం. కదవఁబడి మున్ను వహ్నిం
గదుకొని పడినవియ కాని కద్రూసుతులం

బడనీ నింక నవశ్యము
నుడిగింతును సర్పయాగ మోడకుఁ డింకన్. 25

కడవబడి = అతిక్రమించి, కద్రూసుతులు = సర్పములు, అవశ్యము = తప్పకుండ, ఉడిగింతును = మాన్పింతును.

"కాలం చెల్లిపోవటం చేత కద్రువ సంతానమైన సర్పాలు కొన్ని అగ్నిలో పడిపోయాయి. పోయినవారు పోగా మిగిలిన వారిని ఒక్కరిని కూడా ఆ విధంగా అగ్నిలో పడనీయను. తప్పకుండా ఈ సర్పయాగాన్ని ఆపి వేయిస్తాను. భయపడకండి."

వ. అని యాస్తీకుండు వాసుకి ప్రముఖుల నాశ్వాసించి సకల వేదవేదాంగ పారగు లయిన విప్రవరులతో జనమేజయ సర్పసత్ర సదనంబునకుం జనుదెంచి స్వదేహకాంతి సభాంతరం బెల్ల వెలుంగుచుండ స్వస్తివచన పూర్వకంబుగా నిట్లని స్తుతియించె:

ఆశ్వాసించి = ఓదార్చి, పారగులు = పండితులు

ఈవిధంగా ఆస్తీకుడు తల్లితో పలికి వాసుకి మొదలైనవారిని ఓదార్చాడు. ఆనంతరం అన్ని వేదాలనూ వేదాంగాలనూ క్షుణ్ణంగా అభ్యసించిన బ్రాహ్మణోత్తములను వెంటబెట్టుకొని జనమేజయుని యాగశాలకు వచ్చాడు. తన శరీరకాంతులు సభామంటపం నలుమూలలా ప్రసరించి ప్రకాశిస్తూ ఉండగా ఆ మహీవిభునికి శుభం పలికి ఈ విధంగా ప్రశంసించాడు ఆస్తీకుడు.

మ. రజనీనాథకులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజ నెల్లన్ దయతోడ ధర్మచరితం బాలించుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత! పారీక్షితా! 27

రజనీనాథుడు = చంద్రుడు, విజయుడు = అర్జునుడు, పారీక్షితా = పరీక్షిన్మహారాజు కుమారుడా!

పరీక్షిన్నందనా! జనమేజయ రాజేంద్రా! నీవు చంద్రవంశానికి చక్కని అలంకారానివి. పూజనీయుడవైన రాజర్షివి. ప్రజల నందరినీ దయా దాక్షిణ్యాలతోనూ, ధర్మప్రవర్తనతోనూ పరిపాలించేవాడివి. మంచి గుణాలలో ఆనాటి ధర్మరాజునూ, నాభాగుణ్ణీ, భగీరథుణ్ణీ, దశరథుణ్ణీ, మాంధాతనూ, శ్రీరామచంద్రుణ్ణీ, రఘుమహారాజునూ, అర్జునుణ్ణీ పోలిన వాడివి. విశ్వవిఖ్యాతి గడించినవాడివి.

తరలము. కువలయంబున వారి కోరిన కోర్కికిం దగ నీవు పెం
దవ కులంబు వెలుంగఁ బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నవనిరాజ్యభరంబు దాల్చిన యంత నుండి మఖంబులం
దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్. 25

కువలయము=భూమండలము, నృపలక్ష్మి=రాజ్యలక్ష్మి. తివిరి= అన్వేషించి, తృప్తులు=సంతోషించినవారు.

భూమండలంలోని ప్రజలు కోరిన కోరికకు తగినట్లుగా నీవు పెంపొంద వంశాన్ని ప్రకాశింపజేస్తూ ప్రభవించావు. రాజ్యలక్ష్మితోపాటు నీవు భూభారాన్ని వహించినప్పటినుంచీ యజ్ఞాలలో అభీష్ట సంపదలు అందించటంచేత అవనీసురులందరూ అత్యంత సంతృప్తిని పొందారు.

ఉ. అమ్మనుజేంద్రుఁడైన నలు యజ్ఞము, ధర్మజు రాజసూయ య
జ్ఞమ్ముఁ, బ్రయాగఁ జేసిన ప్రజాపతి యజ్ఞముఁ, బాశపాణి య
జ్ఞమ్మును, గృష్ణుయజ్ఞము, నిశాకరు యజ్ఞము, నీ మఖోత్తమ య
జ్ఞమ్మును నొక్క రూప విలసన్మహిమం గురువంశవర్ధనా 26

ప్రజాపతి=బ్రహ్మ, పాశపాణి=వరుణుడు, నిశాకరుడు=చంద్రుడు, కురువంశవర్ధనా=కురుకులమును వృద్ధిపొందించువాడా

కురువంశవర్ధనా! పూర్వం నలమహారాజు చేసిన యజ్ఞమూ, ధర్మరాజు చేసిన రాజసూయ యజ్ఞమూ, ప్రజాపతి ప్రయాగలో చేసిన యజ్ఞమూ వరుణదేవుడు చేసిన యజ్ఞమూ, శ్రీకృష్ణుడు చేసిన యజ్ఞమూ, చంద్రుడు,

వేదవ్యాసమునీంద్రుడు కుమారునితోనూ శిష్యులతోనూ బ్రహ్మవేత్తల తోనూ విచ్చేసి నీ యజ్ఞంలో సదస్యుడుగా ఉన్నాడంటే నీ అదృష్టం వర్ణించటం ఎవరికి సాధ్యమవుతుంది! నీవు సాటి రాజులందరిలో సాక్షాత్తూ విష్ణుమూర్తివే! సందేహం లేదు.

ఉ. ఆర్తిహరక్రియాభిరతుఁడై కృతసన్నిధియై ప్రదక్షిణా
వర్తశిఖాగ్రహస్తముల వహ్ని మహోద్విజ దివ్యమంత్ర ని
ర్వర్తిత హవ్యముల్ గొనుచు వారిజవైరికులేశ! నీకు సం
పూర్తమనోరథంబులను బుణ్యఫలంబులు నిచ్చుచుండెడున్. 32

కృతసన్నిధి=ఎట్టయెదుట ఉన్నవాడు, హవ్యములు = హోమ ద్రవ్యములు, వారిజవైరి=చంద్రుడు.

శశికుల శిరోమణీ! అత్యంత సంతుష్టుడైన అగ్నిదేవుడు నీ కష్టాలను పోకారుస్తాడు. నీకు అండదండగా నిలిచి ఉంటాడు. ప్రదక్షిణములూ, ఆవర్తములూ అనే జ్వాలాహస్తాలు చాచి బ్రహ్మణోత్తములు పవిత్ర మంత్రాలతో సమర్పించే ఆహుతులను అందుకొంటూ నీకు సంపూర్ణ మనోవాంఛలను ప్రసాదిస్తూ పుణ్యఫలాలను అనుగ్రహిస్తాడు.''

వ. అని జనమేజయు నాతని యజ్ఞమహిమను బుత్విజులను సదస్యులను నగ్నిభట్టారకు నమరూపశుభవచనంబులఁ బ్రస్తుతించిన నాస్తీకున కంద ఱును బ్రీతులయిరంత జనమేజయుం డాస్తీకుం జూచి మునీంద్రా! నీకెద్ది యిష్టంబు దానిన యిత్తునడుగు మనినఁ గరంబు సంతసిల్లి యాస్తీకుం డిట్లనియె. 33

ఈ విధంగా జనమేజయుణ్ణీ, అతని యాగవైభవాన్నీ, యజ్ఞం చేయించే ఋత్విక్కులనీ, సమాసీనులైన సభ్యులనీ, అగ్నిదేవుణ్ణీ అనురూపమైన మంగళవచనాలతో అభినందించాడు ఆస్తీకుడు. అతని మధురోక్తులకు అందరూ ఆనందించారు. అప్పుడు జనమేజయుడు ఆస్తీకునితో ''మహా మునీ! నీకేం కావాలో కోరుకో. తప్పకుండా తీరుస్తాను'' అన్నాడు. అందుకు ఎంతో సంతోషించిన ఆస్తీకుడు ఇట్లా పలికాడు-

ఉ. మానిత సత్యవాక్య! యభిమన్యుకులోద్వహ! శాంతమన్యు సం
తానుఁడవై దయాభినిరత స్థితి నీవు మదీయబంధు సం
తాన మనోజ్వరం బుపరతంబుగ నాకుఁ బ్రియంబుగా మహో
ర్వీనుత! సర్పయాగ ముడిగింపుము కావుము సర్పసంహతిన్. 84

శాంతమన్యు సంతానుడు = కోపములను శాంతింప జేసినవాడు, మనో జ్వరము = మనోవ్యాధి (దుఃఖము), ఉపరతము = శాంతించినది, సర్ప సంహతిన్ = సర్పసమూహమును.

"మహారాజా! నీవు మాననీయుడవు! సత్య సంధుడవు! అభిమన్యుని అన్వయానికి అలంకారమైనవాడవు. సమస్త జగత్తుకూ వందనీయుడవైన నీవు నా బంధు సమూహం మనోవ్యథ మాని ఆనందించేటట్లూ, నా ప్రయత్నం సఫలమయ్యేటట్లూ ఈ సర్పయాగాన్ని నిలిపివేయి! సర్ప సమూహానికి ప్రాణదానం చేయి!" అన్నాడు ఆస్తీకుడు.

చం. అనిన సదస్యు లందఱుఁ బ్రియంబున నిట్టి విశిష్ట విప్ర ము
ఖ్యునకు మహాతపోధనునకుం దగు పాత్రున కెద్ది యిచ్చినన్
మనముగ నక్షయంబగును గావున నీ ద్విజనాథు కోర్కెఁ బెం
పున వృథ సేయఁగాఁ దగదు భూవలయేశ్వర! యిమ్ము నెమ్మితోన్. 85

పాత్రుడు = యోగ్యుడు, అక్షయము = నాశము లేనిది, ద్విజనాథుడు = బ్రాహ్మణ శ్రేష్ఠుడు, నెమ్మితోన్ = ప్రేమతో.

ఆస్తీకుని పలుకులు ఆలకించి సభలోని వారందరూ "మహారాజా! ఇటువంటి సద్బ్రాహ్మణ శ్రేష్ఠునికి, మహా తపస్సంపన్నునికి, అన్ని విధాలా యోగ్యుడైన ఈ ఆస్తీకునికి ఏది ఇచ్చినప్పటికీ నీకు అనంతమైన ఫలం లభిస్తుంది. అందువల్ల ఈ విప్రకుమారుని కోరిక తీర్చు. ఇతని అభీష్టాన్ని కాదనక నెరవేర్చు" అన్నారు.

వ. అనిన సర్వజనానుమతంబుగా జనమేజయుం డాస్తీక ప్రార్థనం జేసి సర్పయాగం బుడిగించె నయ్యవసరంబున. 86

మ. అతులోర్వీసుర ముఖ్య మంత్రహుత మాహాత్మ్యంబునన్ వాసవ
చ్యుతుఁడై ముందర తక్షకుం డురువిషార్చుల్ దూల వాత్యారయో
ద్ధతి నుద్ధూత వివర్ధితాయత బృహద్దావాగ్ని వోలెన్ విచే
ష్టితుఁడై మేఘపథంబులం దిగురుచుండెన్ విస్మితుల్ గా జనుల్. 37

అయ్యవసరంబున=ఆ సమయమున, వాసవచ్యుతుడు = దేవేంద్రుని నుండి విడివడినవాడు, ఉరువిష + అర్చుల్ =గొప్పవైన విషజ్వాలలు, వాత్య=సుడిగాలి, ఉద్ధూత=పైకి ఎగురగొట్టబడిన, విచేష్టితుడు= చేష్టలుడిగినవాడు, మేఘపథము = ఆకాశము, విస్మితులు = ఆశ్చర్య పడినవారు.

సభ్యుల మాటలు విని జనమేజయ రాజేంద్రుడు ఆస్తీకుని అభ్యర్థనను ఆదరించి సకల జనసమ్మతంగా సర్పయాగాన్ని ఉపసంహరించాడు.

ఆ సమయంలో బ్రాహ్మణోత్తముల మహా మంత్ర మహిమచేత ఇంద్రుని నుండి వేరు చేయబడిన తక్షకుడు ఝుంఝూ ప్రభంజనం చేత పై కెగురగొట్టబడి చెల్లాచెదరైన కార్చిచ్చులాగా సోలి సొమ్మసిల్లి ఆకాశంలో గిరగిర తిరుగ సాగాడు. అతణ్ణి చూచి అక్కడి వారందరూ ఆశ్చర్య చకితులైనారు.

కం. అతని నత్యుగ్రానల
పాతోన్ముఖుఁ డైనవానిఁ బడకుండగ నో
హో తక్షక! క్రమ్మఱు మని
యాతతభయుఁ గ్రమ్మఱించె నాస్తీకుఁ డెడన్. 38

క్రమ్మఱుము=వెనుదిరుగుము, ఆతతభయుడు=మిక్కిలి భయపడిన వాడు, ఎడన్=దూరముగా.

ఆ విధంగా అత్యంత దారుణమైన అగ్నిలో పడటానికి సిద్ధమై భయ కంపితుడైన ఆ తక్షకుణ్ణి వీక్షించి ఆస్తీకుడు అతణ్ణి పడకుండా ఆపి "ఓహో! తక్షకా! వెనక్కు వెళ్ళు" అని తిప్పి దూరంగా పంపించాడు.

మ. జననీశాపభయప్రపీడిత మహాసర్పేంద్రులన్ సర్పయా
గనిమిత్తోద్ధత మృత్యువక్త్రగతులం గాకుండఁగాఁ గాచె నం
చును నాస్తీకమునీంద్రు నందుల సదస్యుల్ సంతసంబంది బో
రనఁ గీర్తించిరి సంతతస్తుతి పదారావంబు రమ్యంబుగన్. 39

మృత్యు వక్త్రగతులు=మృత్యుదేవత ముఖములో ప్రవేశించినవారు, బోరనన్=ఒక్కమాటుగా, కీర్తించిరి=స్తుతించిరి.

కన్నతల్లి కద్రువ శాపభయం చేత మిక్కిలిగా బాధింపబడుతున్న సర్ప శ్రేష్ఠులందరినీ సర్పయాగ కారణంగా తెరచుకొన్న మృత్యుముఖంలో పడి రూపు మాసిపోకుండా కాపాడాడు'' అంటూ అక్కడి సభ్యులందరూ సంతోషంతో పొంగిపోయి రమణీయములైన ప్రశంసోక్తులతో ఆస్తీక మహామునిని కొనియాడారు.

కం. ఒనర జరత్కారు మునీం
ద్రునకు జరత్కారునకు సుతుండైన మహా
మునివరు నాస్తీకుని ముద
మున దలఁచిన నురగభయమ్ముఁ బొందదు జనులన్. 40

వ. మఱియు నయ్యాస్తీకు చరితంబు విన్నవారికి సర్వపాపక్షయంబగు. 41

ఉరగభయము=పాముల భయము, సర్వపాపక్షయము=సమస్త పాప హరము.

జరత్కారు మహర్షికీ ఆయన అర్ధాంగి అయిన "జరత్కారు"వనే కాంతా మణికీ కుమారుడై మహాముని శిఖామణి అయిన ఆస్తీకుణ్ణి ఒక్కమాటు తలచుకొంటే చాలు, జనులకు సర్పభయం ఉండదు.

ఇంతేకాదు, ఆస్తీక మునీంద్రుని పవిత్ర చరిత్రను ఆలకించిన వారి పాపాలన్నీ పటాపంచలవుతాయి.

# అజగరోపాఖ్యానము

వ్యాఖ్యా రచయిత

జంధ్యాల పాపయ్యశాస్త్రి

"కరుణశ్రీ"

# అజగరోపాఖ్యానము

## అరణ్యపర్వము - చతుర్థాశ్వాసము

కం. మృగయార్థ మరిగి హిమవ
న్నగభూములయందుఁ బవననందనుఁ డొక ప
న్నగుచేతఁ బట్టువడి యి
మ్మగ ధర్మతనూజుచేత మోక్షితుఁ డయ్యెను. 1

మృగయార్థము = వేటకోసము, పవన నందనుండు = భీమసేనుడు, పన్నగుడు = పాము, మోక్షితుడు = విడిపింపబడినవాడు.

"వేటకోసం వెళ్లిన భీమసేనుడు హిమవత్పర్వత ప్రాంతాలలో ఒక పాముకు పట్టుబడ్డాడు. తరువాత ధర్మరాజుచేత విడిపింపబడ్డాడు."

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె: 2

మధ్యా. పదివేల గజముల బలము గలవాడు పౌలస్త్యుతోడఁ
గదనంబుఁ జేసి యనేక యక్షరాక్షసుల నిర్జించి
యుదితశౌర్యోన్నతుండైనవాఁడు వృకోదరుఁ డేల
పదపడి నిగ్రహీతుఁ డయ్యెఁ దానొక్క పన్నగుచేత ? 3

పౌలస్త్యుడు = కుబేరుడు, కదనం = యుద్ధము, నిర్జించి = జయించి, వృకోదరుడు = భీమసేనుడు, పదపడి = అనంతరము, నిగ్రహీతుడు = పట్టుకోబడినవాడు.

అని చెప్పిన వైశంపాయన మునీంద్రుణ్ణి జనమేజయరాజేంద్రుడు ఇట్లా ప్రశ్నించాడు:

"భీమసేనుడేమిటి? పాముచేత పరాభవింపబడటం ఏమిటి? పదివేల ఏనుగుల బలం గలవాడే! సాక్షాత్తూ పులస్త్య బ్రహ్మపుత్రుడైన కుబేరునితో సమరం సాగించినవాడే! ఎందరో యక్షులనూ రాక్షసులనూ ఓడించిన అవక్రపరాక్రమవిరాజితుడే! అటువంటి భీముడు పాముకు లొంగిపోవటమా! ఇది ఎట్లా జరిగింది?"

వ. అనిన విని వైశంపాయనుం డిట్లని చెప్పె; నట్లు భీముండొక్కండ హిమవదుత్తుంగ శృంగోపాంతకాంతారంబుల మృగయాభ్రాంతిఁ బరిభ్రమించుచు నతిశ్రాంతుండయి తత్ప్రదేశంబున-

హిమవత్+ఉత్తుంగ శృంగ+ఉపాంత కాంతారములు=హిమవత్పర్వతము యొక్క ఎత్తైన శిఖరముల మీది అరణ్యములు, అతిశ్రాంతుడు=మిక్కిలి అలిసిపోయిన వాడు. 4

ఇట్లా అడిగిన జనమేజయునికి వైశంపాయనుడు ఈ విధంగా సమాధానమిచ్చాడు– "అట్లా ఏకాకిగా ఎత్తైన హిమవద్గిరి శిఖరాలకు చేరువలో ఉన్న అరణ్యాలలో వేటకోసం సంచరిస్తూ బాగా బడలిక చెందిన భీముడు ఆ ప్రాంతంలో లోకభీకరమైన ఆకారంగల ఒకానొక సర్పరాజును సందర్శించాడు.

మ. అశనాశావివృతాస్యగహ్వరుఁ, గృతాంతాకారు, నిశ్వాసధూ
మశిఖాధూసరితోగ్రదుర్గతరుగుల్మవ్రాతు, హారిద్రవ
ర్ణశరీరున్, భృశరూక్షదర్శను, మహానాగప్రభుం గాంచె న
ర్ధశశాంకద్యుతిహాసి దారుణచతుర్దంష్ట్రిన్, జగత్త్రాసకున్. 5

అశనాశ=ఆహారమునందలి కోరిక, కృతాంత+ఆకారుడు=యముని వంటి రూపము గలవాడు, హారిద్రవర్ణము=పసుపురంగు, భృశరూక్ష దర్శనుడు = మిక్కిలి భయంకరమైన ఆకారము గలవాడు, నాగప్రభుడు=సర్పరాజు.

ఆ సర్పరాజు పెద్ద గుహవంటి నోరు తెరచి ఆహారంకోసం ఆశతో అన్వేషిస్తున్నాడు. అర్ధచంద్రుని కాంతుల్ని అపహసించే నాలుగు కోరల

కోరలు కలిగి బుసలు కొడుతున్నాడు. అతడి నిట్టూర్పు పొగలసెగలచే చుట్టుప్రక్కల ఉన్న దుర్గాలూ పొదరిండ్లూ కమిలిపోయాయి. పసుపు పచ్చని మేనిరంగుతో, యమధర్మరాజు లాగా అతి కఠోరమైన ఆకారంతో ఎంతో భయంకరంగా ఉన్నాడు.

వ. ఆమ్మహాజగరం బామిషార్థియై భీము౦ బట్టికొని వాని భుజయుగళంబుఁ దన ముఖంబున, నంగంబులు నిజాంగంబున బంధించిన నాగాయుతబలుం డయ్యును దదంగ సంగంబున దుర్బలుం డయి మెలంగనేరక భీముం డప్పాము బలవీర్యంబులకు విస్మితుం డయి యిది ప్రకృతి సర్పంబుగా దెద్దేనియు నొక్క యద్భుతరూపం బని విచారించుచు దాని కిట్లనియె. 6
అజగరము = కొండచిలువ, ఆమిష + అర్థి = మాంసమును కోరునది, నాగ + అయుతబలుడు = పదివేల ఏనుగుల బలము కలవాడు, ప్రకృతి సర్పము = సహజమైన పాము.

మిక్కిలి పెద్దదైన ఆ కొండచిలువ మాంసాహారమును కోరునదై భీముణ్ణి పట్టుకొన్నది. అతని రెండు భుజాలను తన పడగతో కప్పివేసింది. అతని దేహాన్ని పొడవైన తన దేహంతో చుట్టివేసింది. పదివేల ఏనుగుల బలం కలవాడైనా ఆ భీముడు ఆ అజగరం పట్టుకోగానే బలహీనుడై పోయాడు. కాలు కదపలేకపోయాడు అప్పుడు భీముడు ఆ సర్పరాజు శక్తి సామర్థ్యాలకు ఆశ్చర్య చకితుడై "ఇది మామూలు పాము కాదు. ఇదేదో ఒకానొక అద్భుతమైన ఆకారం" అనుకొంటూ ఆ అజగరంతో ఇట్లా అన్నాడు-

మ.కో. ఏను భీముఁడఁ బాండవేయుఁడ నిద్ధతేజుఁడ ధర్మరా
జానుజుండఁ బిశాచపన్నగయక్షరాక్షసవీరులం
బూని పోరుల నోర్వ నోపెడు భూరివీరుఁడు నాగ పం
చాననాదులఁ బట్టి ప్రచ్చు ననంతబాహుబలాఢ్యుఁడన్. 7

ఇద్ధతేజుడు = ప్రసిద్ధమైన కాంతి కలవాడు, భూరివీరుడు = గొప్ప పరాక్రమవంతుడు, నాగపంచానన + ఆదులన్ = ఏనుగులు, సింహాలు మొదలైనవానిని.

"ఓ మహా సర్పమా! నన్ను 'భీముడు' అంటారు. పాండు మహారాజు కుమారుణ్ణి. అత్యంత తేజోవంతుణ్ణి. ధర్మరాజు సోదరుణ్ణి. భూత రాజులనూ సర్పరాజులనూ యక్షరాక్షస వీరులనూ ఎందరెందరినో ఎదు ర్కొని రణరంగంలో గెలిచిన దండి వీరుణ్ణి. అంతేకాదు. అఖండమైన నా భుజబలం చేత మదగజాలనూ మేటిసింహాలనూ పట్టి మట్టుపెట్టగల జగజెట్టిని.

ఆ. ఇట్టి నన్నుఁ బట్టి యిప్పాట బంధించు
నట్టి శక్తి యెట్టు లయ్యె నీకు?
నిది నిసర్గశక్తియే? వరదాన సం
సిద్ధి నైన యదియో? చెప్పు మనిన. 8

నిసర్గ శక్తి=సహజమైన బలము, ఇప్పాట=ఈ విధముగా.

ఇంత బలంగల నన్ను ఈ విధంగా బలవంతంగా పట్టి కదలకుండా మెదలకుండా బంధించే సామర్థ్యం నీ కెక్కడ నుంచి వచ్చింది? ఇది నీకు సహజమైన శౌర్యమా? లేక దేవతల వరదానం వల్ల ప్రాప్తించిన పరాక్రమమా? నాకు వివరించి చెప్పు" అన్నాడు భీమసేనుడు.

వ. అదియును దిర్యగ్జాతి యయ్యును దన పూర్వస్మృతి సెడకుండ వరంబుఁ గాంచుటం జేసి వాని కిట్లనియె : 9

తిర్యక్కులు=పశుపక్ష్యాదులు.

అప్పుడు తిర్యగ్జంతువైనా తన పూర్వజన్మస్మృతి చెదరిపోకుండా వరం పొందింది-కనుక ఆ మహాసర్పం భీమునితో ఇట్లా అన్నది :

కం. ఇది నా వరలాభంబున
నుదయించిన శక్తి, యెట్టి యున్నత బల సం
పదు లయిన జీవులును నా
యెదురన్ బలహీను లగుదు రివ్విపినమునన్. 10

ఇవ్విపినమునన్ = ఈ అరణ్యమునందు, ఉన్నత బలసంపదులు = మిక్కిలి గొప్పదైన పరాక్రమం గలవారు.

''ఓయీ ! చూశావు గదా నా శక్తిసామర్థ్యాలు ! ఈ మహాశక్తి నాకు ఒకానొక వరప్రసాదం వల్ల ప్రాప్తించింది. ఎటువంటి మహాపరాక్రమంతో కూడిన ప్రాణులు కూడా ఈ అరణ్యంలో నా ముందు నిర్వీర్యులై పోవలసిందే.

ఆ. ఎదురఁ బడినఁ దాకిఁ వదలక శార్దూల
శరభ సామజాది సత్వతతులఁ
బట్టి తినుచు నున్న యట్టి నా కిప్పుడు
భక్ష్యమైతి వీవు పాండుపుత్ర ! 11

శార్దూలములు = పెద్ద పులులు, సామజములు = ఏనుగులు, సత్వతతులు = జంతువుల గుంపులు.

ఓ పాండుకుమారా ! నేను నిత్యమూ ఏమి చేస్తుంటానో తెలుసా ! పెద్ద పులులు, శరభములు, మదగజములు మొదలైన అరణ్య జంతువులు నా యెదుటికి వస్తే చాలు వాటిపైకి విజృంభించి గట్టిగా చుట్టి పట్టి భక్షిస్తూ ఉంటాను. అటువంటి నాకు ఈనాడు నీవు భోజనమైనావు.

ఆ. శక్రపదవి బొంది సద్బ్రాహ్మణుల కవ
మాన మేను జేసి మదము పేర్మి
ననఘ ! యిట్టులైతి నం దొక్క మునివరు
శాపశక్తిఁ దొంటి శక్తి దఱిఁగి. 12

వ. అని దుఃఖించిన యజగరంబునకు భీముం డిట్లనియె : 13
శక్రపదవి = ఇంద్రపదము, తొంటి శక్తి = వెనుకటి సామర్థ్యము.

ఇక నా పూర్వ వృత్తాంతం చెబుతాను విను. నేను దేవేంద్ర పదవిని అధిష్ఠించాను. ఆ గర్వాతిశయంతో మహా తపస్సంపన్నులైన బ్రహ్మ

వేత్తలను అవమానించాను. నాయనా ! వారిలో ఒకానొక మునీశ్వరుడు నన్ను ఘోరంగా శపించాడు. ఆ శాప ప్రభావంవల్ల వెనుకటి శక్తి కోల్పోయి ఈ విధంగా కొండ చిలువనై ఇక్కడ పడి ఉన్నాను'' అని వాపోతున్న ఆ పెనుబాముతో భీముడు ఇట్లా అన్నాడు-

కం. కడుకొని కడు దుఃఖములై
నెడ నుచితమె యాత్మనింద ? యెయ్యెడల మనం
బడలక యేకాకృతి నె
ప్పుడు నుండుట సూవె పురుష పురుషార్థ మిలన్. 14

కడుకొని = అతిశయించి. ఆత్మనింద = తన్ను తాను నిందించు కొనుట, ఏకాకృతి = ఒకే విధముగా. పురుషార్థము = ధర్మము (కర్తవ్యము)

''అయ్యా ! ఎందుకు విచారిస్తావు ! కష్టాలు వచ్చినప్పుడు దుఃఖాన్ని ఆపుకోలేక ఆత్మనింద చేసుకోవటం తగిన పనికాదు. సుఖంలో కానీ, దుఃఖంలో కానీ ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండటమే సుమా మానవుని జీవిత పరమార్థం.

వ. కావున పురుషకారంబునం జేసి దైవంబు నివర్తింప నెవ్వ రోపుదు? రేను మహాబలుండ నయ్యును భవద్గృహీతుండనై యిట్టి యవస్థం బొందితి; నాత్మత్యాగంబునకు వగవ; నపహృత రాజ్యానుభోగులై మద్భ్రాతృవరులు దుర్గమంబైన యిప్పర్వతంబునం గ్రుమ్మరుచున్నవారు; నన్నుఁ గానక యెంత దుఃఖింతురో యని వగచెద ననుచున్నంత నట ధర్మతనయుండు దీప్తంబైన శివారుతంబువిని యతిశంకిత చిత్తుండయి యనంతరంబ తన దక్షిణభుజాస్పందనం బుపలక్షించి మీద లగ్గగునంచు ననుజ మధ్యంబున ననిలజుం గానక యర్జునుం గవలను గృష్ణారక్షణార్థంబుగా నియోగించి ధౌమ్య పురోగమ భూసుర వరులతో భీము రోయుచుం దదీయ పాదతలం లలితహలకులిశ కలశాది లక్షితంబైన పాంసు పథంబుపం బని చ్చుండట- 15

పురుషకారము = పౌరుషము, మత్ + భ్రాతృవరులు = ఉత్తములైన నా సోదరులు, దుర్గమము = ప్రవేశింపరానిది, శివారుతము = నక్క కూత, దక్షిణ భుజాస్పందనము = కుడిబుజము అదరుట, లగ్గు = మేలు అనుజ మధ్యమున = తమ్ముల నడుమ, అనిలజుని = భీముని, కవలు = నకుల సహదేవులు, కృష్ణా రక్షణార్థము = ద్రౌపదిని కాపాడుచుండు టకై, రోయుచు = వెదకుచు, పాంసుపథము = దుమ్ముతో నిండిన మార్గము.

అందువల్ల పౌరుషంతో విధిని ఎదిరించటం ఎవరికీ సాధ్యం కాని పని. నేను మహాపరాక్రమం కలవాడినే! అయితే ఏం లాభం! నీ చేత బంధింపబడి ఇటువంటి దురవస్థ పాలైనాను గదా! నా ప్రాణాలు పోతా యనే దిగులు నాకు ఏ మాత్రమూ లేదు. మహారాజ భోగాలకు దూర మైన నా అన్నదమ్ములు భయంకరమైన ఈ పర్వత ప్రదేశంలో సంచ రిస్తూ ఉన్నారు. వారంతా నేను కన్పించకపోతే నా కోసం ఎంత శోకి స్తుంటారో అనే నా దిగులంతా'' ఈ విధంగా భీముడు అజగరంతో అంటున్న సమయంలో అక్కడ ధర్మరాజుకు అపశకునాలు గోచరిం చాయి. గొంతు చించుకొని కూస్తున్న నక్కకూత వినపడగానే ఏదో అనర్థాన్ని శంకించిన అయన తన కుడిభుజం అదరటం గ్రహించి తర్వాత తప్పకుండా శుభం కలుగుతుందని భావించాడు. తన నలుగురు తమ్ముల్లో భీముడు లేకపోవటం గమనించిన ధర్మరాజు అర్జునుణ్ణి నకుల సహదేవులనూ ద్రౌపదికి తోడుగా అట్టిపెట్టి ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణోత్తములతో కూడినవాడై భీముణ్ణి వెతుక్కుంటూ బయలు దేరాడు. హలరేఖలతో అంకుశరేఖలతో కలశరేఖలతో నిండిన భీమ సేనుని పాద ముద్రలు స్పష్టంగా కన్పిస్తున్న నున్నని కాలిబాట వెంట ముందుకు సాగిపోయాడు.

కం. గిరిశిఖరాభోగ బృహ
త్తర భుజగశరీర వేష్టిత శరీరుండై
భరమునఁ గదలఁగ నేరక
పరమశ్రమ మదర నున్న పవనుజుఁ గనియెన్. 16

బృహత్తర=మిక్కిలి పెద్దదైన, పవనజుడు=భీమసేనుడు.

అక్కడ కొండ శిఖరంపైన ఒక పెద్ద చరియ మీద కొండ చిలువ శరీర మంతా చుట్టవేసి పట్టుకోగా కాలు కదపలేక గిజగిజలాడుతున్న భీమన్న ధర్మరాజుకు కనిపించాడు.

కం. కని యాత్మగతంబున ని
య్యనిలజుఁ డొక పాము చేత నదె వేష్టితుఁడై
తన లావు దఱిఁగి ప్రాకృత
జనుక్రియ నిట్లున్నవాఁడు సామాన్యముగన్. 17

వ. ఇది యేమి యాశ్చర్యంబొక్కొ! యనుచు ననిలజుం జూచి దుఃఖితుండై ధర్మజుం డయ్యజగరంబున కిట్లనియె, నయ్యా! నీవు సర్వరూపంబుఁ దాల్చిన దైత్యుండవో! దేవతవో! యేను యుధిష్ఠిరుండ; నిన్నడిగెద; నిమ్మహాభుజు నా యనుజు నామిషార్థివై పట్టితేని నీకు బుభుక్షానివృత్తి యగునట్లుగాఁ జాలినంత మృగమాంసంబుఁ బెట్టెద; వీని విడువు మనిన ధర్మజునకు నయ్యజగరం బిట్లనియె:

ఆత్మగతమున=తనలో తాను, అనిలజుడు=భీముడు, వేష్టితుడు=చుట్టబడినవాడు, లావు=శక్తి, బుభుక్షానివృత్తి=ఆకలి తీర్చుకొనుట, యుధిష్ఠిరుడు=ధర్మరాజు.

ఆ విధంగా బంధితుడై ఉన్న భీముణ్ణి చూచి "ఇదేమిటి? మా భీముడు ఒక పాము చుట్టుకోగా శక్తిసామర్థ్యాలు కోల్పోయి సామాన్య మానవుడు లాగా ఏమీ చేయలేక ఇట్లా ఉన్నాడేమిటి? ఆశ్చర్యంగా ఉన్నదే!" అని మనస్సులో అనుకొంటూ ధర్మరాజు సర్పరాజుతో ఇట్లా అన్నాడు- "అయ్యా! నీవెవరవు? సర్పాకారం ధరించి ఉన్న రాక్షసుడివా! లేక దేవతవా! నేను ధర్మరాజును. నిన్ను అర్థిస్తున్నాను. చెప్పు. పరాక్రమ సంపన్నుడైన నా తమ్ముణ్ణి మాంసం ఆశించి పట్టుకొన్నావా? అయితే నీకు ఆకలి తీరేటట్లు కడుపునిండా కావలసినంత అడవి మృగాల మాంసం

తెప్పించి పెడతాను. ఇదుగో మా వాణ్ణి వదిలిపెట్టు.'' ఈ విధంగా పలుకుతున్న ధర్మరాజుతో ఆ అజగరం ఇట్లా అన్నది-

సీ. వినవయ్య ! నహుషుఁడన్ జనపతి నేను; మీ
పూర్వజులకు నట పూర్వజుండ;
ననఘ ! సుత్రాముని కెన యగువాఁడ; నై
శ్వర్యగర్వంబున నార్యవృత్తి
విడిచి వివేకంబు సెడి సహస్రోత్తమ
బ్రాహ్మణకృతమైన బ్రహ్మరథము
బ్రాహ్మణులకు నక్కజం బగు నవ
మానంబు సేసినదాన నాకుఁ
గలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి
వగు మటంచు శాప మప్పు డిచ్చె;
మునివరేణ్యు శాపమునఁ జేసి యిప్పాట
నవయుచున్న వాఁడ నాఁటఁ గోలె. 19

జనపతి=రాజు, పూర్వజులు=మూలపురుషులు, సుత్రాముడు=దేవేంద్రుడు, ఎన=సాటి, ఆర్యవృత్తి=పెద్దతనము, అక్కజము=ఆశ్చర్యము, కలశజుడు = అగస్త్యుడు, అతి+ఉగ్ర+అహి = మిక్కిలి భయంకరమైన సర్పము, నాటగోలె=ఆ దినము మొదలుకొని.

''పుణ్యాత్ముడా! నా సంగతి విను. నేను నహుషుడనే మహారాజును. మీ వంశం వారికి మూలపురుషుణ్ణి. దేవేంద్రుడికి సాటి అయినవాణ్ణి. మహారాజుననే అహంకారముతో మానవత్వాన్ని మరచిపోయి వివేకాన్ని కోల్పోయి వెయ్యిమంది బ్రాహ్మణులచేత బ్రహ్మరథం పట్టించుకున్నాను. ఆ సందర్భంలో కన్నూమిన్నూ కన్పించక మిడిసిపడుతున్న నేను బ్రహ్మవేత్తలను అతిఘోరంగా అవమానించాను. నా అహంకారాన్ని సహింపలేక అగస్త్య మహర్షి ఆగ్రహోదగ్రుడైనాడు. ''భయంకరమైన పామువై పడియుండు'' మని ఆయన ధారుణంగా నన్ను శపించాడు,

ఆ మహాముసీంద్రుని శాపంవల్ల అప్పటినుంచి ఇప్పటిదాకా ఈ విధంగా ఈ కొండపై పామునై పడి ఉన్నాను.

వ. విధి విలసితంబు పేర్మి నీకేమని చెప్పుదు? 20

చం. చదివితి నెల్ల వేదములు, సద్విధిఁ జేసితి నూఱు యజ్ఞముల్
విదితముగా సురేంద్రపదవీ స్థితిఁ బొందితి, దుర్మదంబునం
దుదిఁ బెనుఁబామనై యధిక దుఃఖితుఁడైతి; సుఖంబు దుఃఖమున్
వదలక చేయుచోట బలవద్విధి కేమి భరంబు సెప్పుమా? 21

విధివిలసితము=దైవలీల, పెనుబాము = కొండచిలువ (అజగరము)
సురేంద్రపదవి=దేవేంద్రపదవి.

ధర్మరాజా ! విధివిధానం చాలా విచిత్రమైనది. నా సంగతి ఏమని చెప్పేది ? సమస్తవేదాలూ చదివాను. యథావిధిగా నూరు యజ్ఞాలు చేశాను. అందరి ముందూ దేవేంద్రుని సింహాసనం అధిష్ఠించాను. ఏమి చేసి ఏమి లాభం? చివరకు దురహంకారంతో కొండచిలువ రూపం ధరించి భరింపరాని దుఃఖంతో బాధపడుతున్నాను. అయ్యా! నీవే చెప్పు. మానవులకు సుఖదుఃఖాలు కలిగించే విషయంలో విధి చాలా బలవంత మైనది. అది చేయలేని పనంటూ ఏదీ లేదు.

వ. అయ్యగస్త్యు చేత నిట్లు శాపగ్రస్తుండనై శక్రాసనంబు వలనం బాసి యిట వచ్చుచు నుండి "మునీంద్రా! నాకుఁ బూర్వస్మృతి సెడకుండను, బలవంతంబులైన సత్త్వంబులు నన్ను ముట్టుచో బలహీనంబులై భక్ష్యం బులుంగాను, శాపవిమోక్షంబున కుపాయంబును బ్రసాదింపు" మని కృతాంజలినై యున్న నాకుం గరుణించి మునివరుండు నా వేఁడిన వరంబు లిచ్చి యిట్లనియె: 22

శక్ర + ఆసనము=ఇంద్రుని సింహాసనము, పూర్వస్మృతి = పూర్వ జన్మ జ్ఞానము, సత్త్వములు=జంతువులు, కృతాంజలి=దోసిలొగ్గినవాడు.

ఈ విధంగా అగస్త్య మహర్షిచేత శపింపబడినవాడినై ఇంద్రపదవీ భ్రష్టుడనై నేలమీదికి వచ్చి పడుతూ ఆ మహాముని ముందు చేతులు మోడ్చి "మునీంద్రా! నాకు గతజన్మంలోని జ్ఞాపకాలు చెదరిపోకుండా ఉండేటట్లూ, ఎంత బలం గల జంతువులైనా నన్ను తాకగానే బలం కోల్పోయి నాకు ఆహారమయేటట్లూ అనుగ్రహించండి. దయచేసి నాకు శాపమోక్షం అయ్యే ఉపాయం సెలవీయండి" అని ప్రార్థించాను. అంజలి ఘటించి వేడుకొంటున్న నా మీద ఆ మహర్షికి కనికరం కలిగింది. ఆయన నేను కోరిన వరాలన్నీ ప్రసాదించి ఈ విధంగా అన్నాడు:

కం. క్రమమున నీ యడిగిన ప్ర
శ్నములకుఁ బ్రత్యుత్తరంబు సన్మతి నత్యు
త్తముఁ డెవ్వఁ డిచ్చు నతని క
తమునను శాపాంతమగు బుధస్తుత! నీకున్. 23

అతి + ఉత్తముడు = మిక్కిలి యోగ్యుడు, కతమున = కారణమున, శాపాంతము = శాపవిమోచనము.

"విద్వాంసులచే వినుతింపబడిన నహుషుడా! నా మాట విను. నీవు అడిగిన ప్రశ్నలకు సరిగా సమాధానాలు చెప్పే మహానుభావునివల్ల నీకు శాప విముక్తి అవుతుంది.

వ. అది దీర్ఘకాలంబునకుం గాని కాదనియె; నేనును దద్వచనంబిచ్చ నమ్మి పెద్దకాలం బిప్పుడవి నున్నవాఁడ; నేఁడు నీ తమ్ముఁడు దుష్టకాల ప్రాప్తుండైన నాకు భక్ష్యంబయ్యె; నోపుదేని నా ప్రశ్నములకు బ్రత్యుత్తరం బిచ్చి వీని విడిపించుకొమ్మ" నిన ధర్మజుం డిట్లనియె: 24

ఇచ్చన్ = మనస్సులో, దుష్టకాలప్రాప్తుఁడు = చెడ్డకాలము దాపురించినవాడు.

అయితే నీవు శాపవిముక్తుడివి కావటానికి చాలాకాలం పడుతుంది" అన్నాడు అగస్త్యుడు. నేను ఆయన మాటమీది విశ్వాసంతో ఎన్నో

సంవత్సరాల నుంచీ ఈ అడవిలో ఈ కొండమీద ఈ విధంగా పడి ఉన్నాను. ఈనాడు నీ సోదరుడు చెడుకాలం దాపురించటంచేత నాకు ఆహారం అయినాడు. నీకు శక్తి ఉన్నట్లైతే నా ప్రశ్నలకు సమాధానం చెప్పి నీ తమ్ముణ్ణి నా బారినుండి వదలించుకో''అని పలికిన అజగరంతో ధర్మరాజు ఈ విధంగా అన్నాడు:

కం. నీ యడిగిన యర్థాభి
ప్రాయములకు నుత్తరంబు పరువడిఁ జెప్పన్
ధీయుత! బ్రాహ్మణులకుఁ గా
కాయతమతు లయ్యునొరులం కవి విషయములే? 25

నీ యడిగిన=నీవు అడిగిన, వరువడిన్=వెంటవెంటనే, ఆయతమతులు =వివేకవంతులు.

''ఓ బుద్ధిమంతుడా! నీవు అడిగిన ప్రశ్నలకు సూటిగా ప్రత్యుత్తరం చెప్పాలంటే బ్రహ్మవేత్తలైనవారికే సాధ్యమౌతుంది. ఎంతటి వివేకవంతులైనా ఇతరులు ఈ విషయంలో సమర్థులు కారు.

వ. అయినను నా నేర్చు విధంబునం జెప్పెద నడుగు మనిన నజగరం బిట్లనియె: 26

ఆ. ఘనుఁడ! యే గుణములు గలవాఁడు బ్రాహ్మణుం?
డతని కెఱుఁగఁదగిన యట్టి వస్తు
వెద్ది? దీని నాకు నెఱిఁగింపు మనిన ని
ట్లనియుఁ జెప్పెఁ బాండవాగ్రజుండు: 27

నేర్చువిధమున=తెలిసినట్లుగా.

అయినప్పటికీ నాకు తెలిసినంత వరకు సమాధానాలు చెబుతాను. నీ ప్రశ్నలేమిటో అడుగు. ''ఇట్లా ధర్మరాజు అనగానే అజగరం ప్రశ్నలు వెయ్యటం ఆరంభించింది. ''మహాత్మా! ఏ గుణములు కలవాణ్ణి

బ్రాహ్మణు డంటారు? అతడు తెలుసుకోదగిన విషయం ఏది? ఇవి నాకు చెప్పు'' అని అడిగిన అజగరం ప్రశ్నలకు ధర్మజుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు-

సీ. సత్యక్షమా దమ శౌచ దయా తపో
దానశీలంబు లెందేనిఁ గాన
నగు నట్టివాఁడు బ్రాహ్మణుడు, సుఖంబు దుః
ఖంబునై నెడ విమోహంబు నొంద
కునికియ వానికి నుత్తమంబగు విద్య,
యనిన నీ చెప్పిన గుణము లివియు
క్రియ శూద్రు నందఁ గల్గిన నతం డుత్తమ
ద్విజుఁడు గానేర్చునే? నిజము విడిచి

నట్టులయిన బ్రాహ్మణాది వర్ణవిభాగ
మెట్లు గలుగు నయ్య? హీను లధికు
లను వివేక మిది యపార్థకంబగుఁగాదె?
యనిన ననియె నంతకాత్మజుండు. 28

క్షమ=ఓర్పు. దమము=ఇంద్రియ నిగ్రహము, ఉత్తమ ద్విజుడు= బ్రాహ్మణ శ్రేష్ఠుడు.

''అయ్యా! సత్యం సహనం ఇంద్రియ నిగ్రహం శుచిత్వం దయ తపస్సు దానం శీలం-ఇవి కలవాడు బ్రాహ్మణుడు. సుఖంలోనూ దుఃఖంలోనూ ఏమాత్రమూ చలించకుండా ఉండటమనేదే అతడు తెలుసుకోదగిన ముఖ్య విషయం.'' ఆ మాటలు విని అజగరం ''అయ్యా! నీవు చెప్పిన సద్గుణాలు అన్నీ ఒక శూద్రుని యందు ఉన్నట్లైతే అతణ్ణి 'ఉత్తమ బ్రాహ్మణుడు' అనవచ్చునా? అటువంటప్పుడు బ్రాహ్మణాది వర్ణ విభాగం ఏవిధంగా కుదురుతుంది? తారతమ్యంతో కూడిన విచక్షణా జ్ఞానం అంత రించి పోతుంది కదా!'' అనగానే ధర్మరాజు దానికి ఈ విధంగా సమాధానమిచ్చాడు-

వ. ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు వర్ణ పరీక్షార్థంబుగా బ్రాహ్మ ణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువుండైన మనువు సెప్పె, సత్యాది గుణంబులు-శూద్రునందుఁ గలిగెనేని వాఁడు సచ్ఛూద్రుం డగుఁగాక బ్రాహ్మణుండు గానేర్చునే? యవియు బ్రాహ్మణునందు లేని నాఁడు శూద్రుండ యనంబడుం, గావున వృత్తంబుల యుత్తమంబులు. 29

స్వాయంభువుడు=బ్రహ్మదేవుని కుమారుడు, వృత్తములు=నడవడులు.
"ఒక్కొక్కప్పుడు ప్రమాద వశంవల్ల వర్ణాలన్నీ కలసిపోయినప్పుడు ఆయా వర్ణాలను మళ్లీ గుర్తించటం కోసం స్వాయంభువ మనువు వారికి వేరువేరైన ప్రవృత్తులు ఏర్పాటు చేశాడు. సత్యం మొదలైన సద్గుణాలు శూద్రునిలో ఉన్నట్లైతే అతడు 'సచ్ఛూద్రుడు' అని చెప్పబడతాడు. అటువంటి సద్గుణాలు లేని బ్రాహ్మణుడు 'శూద్రుడు' అని పిలువబడు తాడు. అందువల్ల వర్ణములకంటే మానవుల ప్రవృత్తులే ఉత్తమమైనవి.

తే. విత్తహీనుండు వెండియు వివిధ విధుల
విత్తవంతుడు గానేర్చు; వృత్తహీనుఁ
డైనవాఁడు విహీనుండ యండ్రు; గాన
విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష. 30

విత్తహీనుడు = ధనము కోల్పోయినవాడు, వృత్తహీనుడు = శీలము కోల్పోయినవాడు, విత్తవంతుడు=ధనవంతుడు.

అయ్యా! లోకంలో ధనం కోల్పోయినవాడు ఏదో విధంగా మళ్ళీ దాన్ని సంపాదించుకొని ధనవంతుడు కాగలుగువాడు. కాని శీలం కోల్పోయిన వాడు వెంటనే పతితుడై పోతాడు. మరి లేవడు. అందువల్ల విత్తరక్షణం కంటె వృత్త రక్షణం చాలా మేలైనది."

వ. అనిన నజగరం బిట్లనియె: 31

తే. అప్రియం బొగిఁ జేసియు ననృతవాది
యయ్యు హింస గావింపని యమ్మహాత్ముఁ
డేఁగు సుగతికినం దదది యెట్లు? సెప్పు
మయ్య యనఘ యహింస మేలైన తెఱఁగు. 82

అనృతవాది=అసత్యములు పలుకువాడు, ఒగిన్=క్రమముగా, సుగతి=పుణ్యలోకము.

ధర్మజుని మాటలు ఆలకించి అజగరం ఇట్లా అన్నది- "అయ్యా! ఇతరులకు అప్రియంగా ప్రవర్తించినా, అసత్యాలు పలికినా హింసకు విముఖుడైన మహాత్మునికి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయంటారు. అహింస ఉత్తమ ధర్మం అంటారు. అదేమిటో కొంచెం వివరించు."

వ. అనిన ధర్మతనయుం డిట్లనియె; దానంబును బ్రియంబు చేఁతయును సత్యంబును నహింసయు నను నివి నాలుగును సమానంబుల; యయినను నహింసయ విశేషం; బెట్లనిన దేవ మనుష్య తిర్యగ్యోను లనియెడు మూఁడు గతుల యందును మనుష్యుండు దానాది గుణంబులు గలిగి యహింసాపరుండయిన నాఁడు దేవగతి వడయు; విపరీత వర్తనుండయి తిర్యగ్యోనులం బొందు నని యిట్లు తన చేసిన ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబులు వలికిన ధర్మనందనున కతి ప్రీతుండయి భీమసేనుని విడిచి శాపవిముక్తుండయి దివ్యరూపంబు సేకొనియున్న నహుషువలన నధ్యాత్మ విద్యా రహస్యంబు లిమ్ముగా నెఱింగి యుధిష్ఠిరుండు వృకోదరుం దోడ్కొని నిజాశ్రమంబునకు వచ్చి యున్నంత-

ప్రియంబు చేత=ప్రియము చేయుట, తిర్యక్కులు = పశుపక్ష్యాదులు, అతిప్రీతుడు = మిక్కిలి సంతుష్టుడు, సంతసిల్లి = ఆనందించి, ఇమ్ముగా=చక్కగా, వృకోదరుడు=భీమసేనుడు.

పై విధంగా ప్రశ్నించిన సర్పరాజుతో ధర్మరాజు అంటున్నాడు-"ఆర్యా! దానం ప్రియవర్తనం సత్యం అహింస అనే ఈ నాలుగూ సమానమైనవే.

అయినప్పటికీ ఈ నాలుగు గుణాలలో అహింసదే అగ్రస్థానం. దేవతలూ, మనుష్యులూ, పశుపక్ష్యాదులూ అనే మూడు విధాలైన జన్మలయందూ మానవుడు దానం మొదలైన సద్గుణాలు కలిగి అహింసను అవలంబించి నట్లైతే దేవత్వాన్ని పొందుతాడు. ఆ విధంగా కాకపోతే వానికి పశు పక్ష్యాదుల జన్మం ప్రాప్తిస్తుంది.'' ఈ విధంగా తాను అడిగిన ప్రశ్న లన్నింటికీ సరైన సమాధానాలు చెప్పిన ధర్మరాజును చూచి సర్పరాజు ఎంతో సంతోషించాడు. తన అధీనంలో ఉన్న భీమసేనుణ్ణి వదలి పెట్టాడు. తాను శాపవిమోచనం పొంది దివ్యస్వరూపాన్ని తిరిగి ధరించాడు. అప్పుడు ఆ నహుషుణ్ణి చూచి ధర్మరాజుకు అపరిమితమైన ఆనందం కలిగింది. ఆయన్ని అడిగి ఎన్నో వేదాంత రహస్యాలు చక్కగా తెలుసుకొన్నాడు. అనంతరం ధర్మరాజు తమ్ముడైన భీముణ్ణి వెంట బెట్టుకొని తన ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

